# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 10 హైదరాబాద్ 183 అక్టోబర్ 2016 పేజీలు : 68 రూ. 20

- కశ్మీర్‌లో ఆందోళనలు - ఉడీ దాడి
- ఎపికి ప్రత్యేక హోదానా, ప్యాకేజా?
- జోనల్ పద్ధతి - న్యాయాన్యాయాలు
- దళిత సమస్యపై నాలుగు వ్యాసాలు
- సింగూరు భూసేకరణపై కోర్టు తీర్పు
- అమెరికాతో భారత్ రక్షణ బంధం
- బెలూచిస్తాన్ రక్తసిక్త చరిత్ర

# వీక్షణం రచయితల సమావేశం – రాయలసీమ

## అక్టోబర్ 23, 2016 ఆదివారం – పొద్దుటూరు

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక గత తొమ్మిది సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు జరిపి, వీక్షణం పనితీరు మీద సమీక్ష, భవిష్యత్తుకు సూచనలు చర్చిస్తున్న సంగతి మీకు తెలుసు. రాష్ట్ర విభజన తరువాత తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ లలో విడివిడిగా ఈ సమావేశాలు జరుగుతున్నాయి. గత సంవత్సరం గుంటూరులో ఆంధ్రప్రదేశ్ సమావేశం జరిగిన తర్వాత, దూరాభారాల దృష్ట్యా ఆంధ్రప్రదేశ్ సమావేశం ఒకేచోట జరపడం సముచితం కాదని, కోస్తాంధ్ర, రాయలసీమల్లో విడివిడిగా జరపడం హాజరు కాదలచుకున్నవారికి సౌకర్యంగా ఉంటుందని సూచన వచ్చింది. ఆ నేపథ్యంలో ఈ సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ – రాయలసీమ సమావేశం అక్టోబర్ 23 ఆదివారం పొద్దుటూరులో జరుగుతుంది. ఈ సమావేశంలో వీక్షణంలో అచ్చవుతున్న రచనలు, ఇంకా మెరుగుపడవలసిన అవసరం, రాయలసీమ ప్రజా ఆకాంక్షలు, సమస్యలు, పరిష్కారాలు వీక్షణంలో మరింత ఎక్కువగా చోటు చేసుకోవడం వంటి అనేక అంశాలు చర్చించడానికి రాయలసీమ నాలుగు జిల్లాల నుంచి వీక్షణం రచయితలు, పాఠకులు, శ్రేయోభిలాషులు అందరికీ ఆహ్వానం.

మీరు రాదలచుకుంటే **వై. రామచంద్రం** (9949391028) ను సంప్రదించండి





**పేజీలు : 272**
**వెల : రు. 150**




# చరిత్ర మార్చిన మనిషి

ఆది రుద్రాంధ్ర మహోద్యమంలో
బొజ్జా అప్పలస్వామి

**బొజ్జా తారకం**

ప్రతులకు :

**హైదరాబాద్ బుక్ ట్రస్ట్,** ప్లాట్ నం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్– 500 006, ఫోన్ :23521849,

**వీక్షణం,** ఫ్లాట్ నం. 301, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029; ఫోన్ : 66843495

# ఆర్ఎస్ రావు స్మారక సదస్సు 2016

## నవంబర్ 12, 2016 శనివారం – హైదరాబాద్

గత ఐదు సంవత్సరాలుగా నిరంతరాయంగా జరుగుతున్న ఆర్ఎస్ రావు స్మారక సదస్సు ఈ సంవత్సరానికి నవంబర్ 12, శనివారం హైదరాబాద్ లో జరుగుతుంది. ఎప్పట్లాగనే ఈ సారి సదస్సు కూడ అమరులు ఆర్ ఎస్ రావు గారు తీవ్రంగా కృషి చేసిన, సమాజం అత్యవసరంగా ఆలోచించవలసిన రాజకీయార్థిక విషయాల మీద పత్రాలు, ఉపన్యాసాలు, చర్చలు ఉంటాయి. **'భారతీయాంగ్ల సాహిత్యంలో సమాజ నిర్మితి: ఉత్పత్తి సంబంధాల చర్చ కొనసాగింపు'** అనే అంశం మీద ప్రొ. జి ఎన్ సాయిబాబా పత్రంతో సహా మరికొన్ని పత్రాలు, ఉపన్యాసాలు ఉంటాయి. అందరూ ఆహ్వానితులే.

183 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

అక్టోబర్ 2016
సంపుటి : 14
సంచిక : 10





'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై **'VEEKSHANAM'** అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

## బొజ్జా తారకం గారికి వీక్షణం నివాళి



**వీ**క్షణం శ్రేయోభిలాషి, కవి, వ్యాసకర్త, నవలా రచయిత, వక్త, న్యాయవాది, విప్లవ - దళిత ఉద్యమాల వారధి బొజ్జా తారకం గారి స్మృతికి వీక్షణం వినమ్రంగా జోహార్లు అర్పిస్తున్నది. కుటుంబ నేపథ్యం నుంచి సంఘ సంస్కరణ, దళిత ఉద్యమాల స్ఫూర్తిని, నిజామాబాద్, హైదరాబాద్ ప్రజా ఉద్యమాల నేపథ్యం నుంచి విప్లవోద్యమ స్ఫూర్తిని సమ్మిళితం చేసి ఐదు దశాబ్దాలకు పైగా విప్లవ, దళిత ఉద్యమాల స్నేహితుడిగా, సహచరుడిగా, నాయకుడిగా, పెద్ద దిక్కుగా ఉండిన తారకం గారి మరణం తెలుగు సమాజానికి తీరని లోటు. 'నది పుట్టిన గొంతుక', 'నాలాగే గోదారి' కవితా సంపుటాలు, 'భూమి-నాగలి-మూడెద్దులు' నవలిక, 'పంచతంత్రం' నవల, 'పోలీసులు అరెస్టు చేస్తే?', 'కులం-వర్గం' లాంటి సిద్ధాంత గ్రంథాలు రచించిన, డా. బి.ఆర్. అంబేద్కర్ రచనలను తెలుగులోకి అనువదించిన తారకం గారు పాల్గొనని ప్రజా ఉద్యమం లేదు. వీక్షణం తొలి సంచిక నుంచి పాఠకుడిగా, రచయితగా, శ్రేయోభిలాషిగా ఆయన వీక్షణం పట్ల ఎంతో ఆదరణ చూపారు. వీక్షణంను ఆదుకొమ్మని తెలుగు సమాజానికి చేసిన ప్రకటన మీద సంతకం చేశారు. ఆయన స్ఫూర్తిని కొనసాగిస్తామని వీక్షణం సంపాదకవర్గం సమాజానికి వాగ్దానం చేస్తున్నది.

## పాఠకుల వీక్షణం

**వీ**క్షణం సెప్టెంబర్ సంచికలో నయీం గురించిన వ్యాసం బాగుంది. నయీం ప్రభుత్వం తయారు చేసిన ముద్దుబిడ్డ అనే విషయాన్ని చాలా స్పష్టంగా చెప్పారు. నయీంతో అధికారులకు, పాలకులకు ఉన్న సంబంధాన్ని బహిర్గత పరిచారు. అతను చేసిన నేరాలపై కేసులు లేవు. ఇప్పుడు కూడా ముఖ్యమంత్రి బంధువుల భూముల కబ్జాకు పథక రచన చేసినందుకే నయీంను చంపారనే విషయాన్ని తేటతెల్లం చేశారు. ప్రైవేట్ సైన్యం ఉంటుంది. కొత్త నాయకుడిని ఎంపిక చేసే అవకాశం లేకపోలేదు. నయీంకు అండగా పోలీసు అధికారులను, రాజకీయ నాయకులను, మంత్రులను ఎవరిని అరెస్టు చేయలేదు. అతని గ్యాంగులో ఒక వర్గానికి చెందిన వారిని మాత్రమే అరెస్టు చేస్తున్నారు.

**- తుంపాల శ్రీరామమూర్తి**
విశాఖపట్నం

**వీ**క్షణం సెప్టెంబర్ సంచికలో విద్యాభూషణ్ రాసిన 'సెక్యులరిజం - టెర్రరిజం' వ్యాసం బాగుంది. హిందూ మతాన్ని నెత్తిన పెట్టుకొని, అన్ని కార్యక్రమాలకూ, హిందూ మత ఆచారాలూ పద్ధతులూ అనుసరిస్తూ పురోహితులతో యజ్ఞాలూ యాగాలూ పుష్కరాలూ జరిపిస్తూ ప్రజల్ని మరింత మతమౌఢ్యంలో తొక్కేసి తమ పబ్బం గడుపుకుంటూ అధికారంలో ఉన్న మంత్రులూ, రాష్ట్రపతులూ, అధికారులూ, విద్యావంతులూ కూడా బాబాల కాళ్లపై పడడం, గుళ్ల చుట్టూ ప్రదక్షిణలు చెయ్యడం సెక్యులరిజానికి పూర్తిగా వ్యతిరేకమని, కోట్ల మంది ప్రజలు, ఈ పెద్దల్నీ, రాజకీయ నాయకులను అనుసరించి మరింత మతం మత్తులో మునిగి పోతారని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పి, పాఠకులకు సెక్యులరిజం తాలూకా అసలు స్వరూప స్వభావాల్ని బట్టబయలు చేసిన విద్యాభూషణ్‌కు నా అభినందనలు.

**- బి.ఎ. నారాయణరావు**
విశాఖపట్నం

**'వీ**క్షణం' సెప్టెంబర్ సంచిక 31వ పేజీలో ప్రదీప్ అనే విద్యార్థి బాధకు చింతిస్తూ, ఆయన అయోమయం పోగొట్టేందుకు నాకు తెల్సిన రెండు మాటలు చెప్పదలిచాను. వీక్షణం పత్రిక చదివి తన ధనం, సమయం వృథా అయిందని వాపోయే కన్నా అసలు 69 సంవత్సరాల భారత స్వా(హా)తంత్రం (1947-అధికార మార్పిడి) మనకేమిచ్చిందని ఆలోచించుకొమ్మని మనవి చేస్తున్నాను. ఆ రోజుల్లోనే లక్షలాది దేశ భక్తులు బ్రిటీష్ వాడు లాఠీలతో బాదుతున్నా ఒకే ఒక్క నినాదంతో వందేమాతరం అంటూ లక్షల గొంతులెత్తి! అండమాన్ జైల్లో నిర్భంధించబడి అక్కడే ప్రాణాలర్పించిన వీర ధీర మూర్తులను ఒకసారి మననం చేసుకోమంటున్నాను.

**- ఎస్.పి. రామం**
విశాఖపట్నం

**వీ**క్షణం సెప్టెంబర్ సంచికలో గోల్డీ ఒసూరి రాసిన 'కశ్మీర్-పాలస్తీనా: రెండు ఆక్రమణల కథ' వ్యాసం ఎవరి కోసం, ఎందుకు ప్రచురించారో నాకైతే అర్థం కావడంలేదు. భారత్-కశ్మీర్‌ను ఇజ్రాయిల్-పాలస్తీనాతో పోల్చడమెందుకు, చైనా-టిబెట్, చైనా-తైవాన్లతో ఎందుకు పోల్చలేకపోయారు. మీరు వామపక్షమనే డ్రగ్స్‌కు గురైనారు అందుకే భారత్‌పై వ్యతిరేక కథనాలకు సపోర్టు చేస్తున్నారు. ఇకపోతే 1947కు ముందు భారత్ సంస్థానాలుగా ఉండేవి. అందులో కశ్మీర్, హైదరాబాదు భారత దేశంలో కలువలేదు. కశ్మీర్‌లో ప్రజాభిప్రాయ సేకరణ జరిపితే, అలాగే హైదరాబాద్‌లో జరిపితే స్వతంత్ర దేశంగా ఉంటామంటె ఒప్పుకుంటారా? ఇది నెహ్రూ అనాలోచిత, అనుభవ రాహిత్యం వల్ల జరిగింది. ఇలాంటి సమయంలో ఈ కథనాలు రావడం మనకు అంతమంచిది కాదు.

**- చరణ్ కుమార్**
(ఈమెయిల్ ద్వారా)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

*గమనిక : జూలై 2016 కొత్త పుస్తకాలు శీర్షికలో 'సిగ్గుపడుతున్న స్వార్థం'కు బదులుగా 'సిగ్గుపడుతున్న స్వర్గం' అని తప్పు పడింది. అచ్చు తప్పుకు చింతిస్తున్నాం. - సం*

వీక్షణం

# యుద్ధోన్మాదానికి 'ఉడీ దాడి' - ఆకర్షణకు 'ముక్త్ భారత్'

దేశమంతటా వేడెక్కుతున్న అసహన వాతావరణం, కమ్ముకుంటున్న యుద్ధ మేఘాలు సంఘ పరివార్ రాజకీయ దురుద్దేశ్యాలను, విద్వేష రాజకీయాలను, ద్వంద్వ ప్రవృత్తిని మరొకసారి రుజువు చేస్తున్నాయి. ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ నాయకత్వాన సంఘ పరివార్ శక్తులు ఒకవైపు యుద్ధోన్మాదాన్ని రెచ్చగొడుతూ ఉండగా, మరొకవైపు ఆ నరేంద్ర మోడీయే భారతదేశం విముక్తి కావలసిన దురాచారాల జాబితా ఇస్తూ, భారతదేశపు భవిష్యత్తు పట్ల తన కల్లబొల్లి ఆకాంక్షలు ప్రకటిస్తున్నాడు.

కపటత్వం నిండిన ఈ స్థితి నెలకొనడానికి స్పష్టమైన నేపథ్యం ఉంది. మతోన్మాదాన్ని రెచ్చగొట్టడం, మనువాదాన్ని బలోపేతం చేయడం, సామ్రాజ్యవాద ప్రభుత్వాల దుర్మార్గాలు కొనసాగించడం వంటి పనుల్లో పాలకవర్గ ముఠాలన్నిటిలోకీ నమ్మకమైన దళారీ ముఠా తనదేనని చూపుకోవడానికి మోడీ రెండున్నర సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నాడు. ఆ కారణాలవల్లనే విపరీతమైన ప్రజా వ్యతిరేకతను పోగు చేసుకుంటున్నాడు. ఎన్నికలకు ముందు మోడీ ఏదో చేస్తాడని భ్రమపడిన వాళ్లు కూడ నిజం తెలుసుకునేంత వేగంగా ఈ రెండున్నర సంవత్సరాల పాలన గడిచింది. ఇదే ధోరణి కొనసాగితే నరేంద్ర మోడీకి, సంఘ పరివారానికి మరొకసారి అధికారం రావడం కష్టమైన పరిస్థితి వచ్చింది. కనుక మళ్లీ ఎన్నికల సమయానికల్లా దేశభక్తిని, ముస్లింలపట్ల, పొరుగుదేశం పట్ల ద్వేషాన్ని, ప్రజల మధ్య విభజనను రెచ్చగొట్టకుండా, రక్తనదులు పారించకుండా వోట్ల పంట కోసుకోవడం అసాధ్యం. ఆ వోట్ల పంటకు దిష్టి బొమ్మ లాగ కొన్ని ఆకర్షణీయమైన పదాలు కావాలి. అందుకే అటు యుద్ధోన్మాదాన్ని, ఇటు ఆకర్షణీయ నినాదాలను ఏకకాలంలో ప్రకటించడమే మోడీ ఇవాళ అభినయిస్తున్న కళ.

రెండు నెలలకు పైగా భారత ప్రభుత్వ అణచివేత చర్యలతో, సైనిక దుర్మార్గాలతో అట్టుడుకుతున్న కశ్మీర్ లో ప్రజల ప్రతిఘటనను మరింతగా అణచడానికి, కశ్మీర్ మీదనే కాదు, దేశం మొత్తం మీద ఉక్కుపాదాన్ని మోపడానికి సంఘ పరివారానికి ఇప్పుడొక సాకు కావాలి. కశ్మీర్ సమస్యపై పాకిస్తాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ ఐక్యరాజ్యసమితిలో ప్రసంగించడానికి ఒక్కరోజు ముందుగా ఆ ప్రసంగాన్ని పలుచన చేసే సాకు ఒకటి భారత ప్రభుత్వానికి అవసరమయింది. అందులో భాగమే సెప్టెంబర్ 18 ఉదయం బారాముల్లా జిల్లాలోని ఉడీలో అత్యంత కట్టుదిట్టమైన సైనిక బ్రిగేడ్ కేంద్ర స్థావరం మీద జరిగిందని చెపుతున్న దాడి. ఈ దాడి గురించి రక్షణ మంత్రిత్వ శాఖ విడుదల చేసిన పత్రికా ప్రకటనలను యథాతథంగా రాయడం మినహా ఒక్క పత్రిక గాని, ఛానల్ గాని వాస్తవ సమాచార సేకరణ జరపలేదు. అర్ధరాత్రికీ తెల్లవారడానికీ మధ్య పెద్ద పేలుళ్లు వినిపించాయని స్థానిక ప్రజలు చెప్పారే తప్ప అవి పాకిస్తాన్ నుంచి వచ్చిన చొరబాటుదారులు జరిపిన కాల్పులు అవునో కాదో చెప్పే అవకాశం లేదు. విద్యుత్తు ప్రవహించే, అత్యంత సురక్షితమైన ఇనుప ముళ్ల కంచెలు దాటి, విదేశీ చొరబాటుదారులు ఎలా వచ్చారని, వారి రాకను నిఘా విభాగాలు ఎలా పసిగట్టలేకపోయాయని, అసలు చొరబాటుదారులు వచ్చినమాట నిజమేనా అని, భారత ప్రభుత్వ అవసరాల కోసమే ఆ గందరగోళం సృష్టించబడి, పదిహేడు మంది అమాయక జవాన్ల ప్రాణాలు బలి తీసుకోవడం జరిగి ఉండవచ్చునా అని ఏ దర్యాప్తూ, పరిశోధనా జరగలేదు. 'అదిగో పులి అంటె ఇదిగో తోక' అన్నట్టుగా వచ్చినవాళ్లు జైష్ ఎ మహమ్మద్ అనే పాకిస్తాన్ తీవ్రవాద సంస్థ సభ్యులని, కనుక పాకిస్తాన్ మీద యుద్ధం ప్రకటించాలని, పాకిస్తాన్ అనే దేశం లేకుండా తుడిచిపెట్టాలని, అటునుంచి అణ్వాయుధాలు ప్రయోగిస్తామని అన్నారు గనుక ఇటునుంచి కూడ అణ్వాయుధాలు ప్రయోగించాల్సిందేనని, చస్తే కొన్ని కోట్ల మంది చస్తారు, అంతే గదా అనీ యుద్ధోన్మాద ప్రలాపాలు చెలరేగుతున్నాయి. రాజకీయ నాయకులు, సామాజిక కార్యకర్తలు, మేధావులు, పత్రికా రచయితలు, మాజీ సైనికాధికారులు, యుద్ధ వ్యాపారులు నిస్సిగ్గుగా, బహిరంగంగా హింసోన్మత్త వికటాట్టహాసాలు చేస్తున్నారు. పాకిస్తాన్ మీద ఆంక్షలు విధించాలనీ, జలవనరుల పంపిణీ ఒప్పందాలు, సరుకుల రవాణా ఒప్పందాలు రద్దు చేసుకోవాలనీ, బెలూచిస్తాన్ స్వాతంత్ర్య పోరాటానికి సహకరించి పాకిస్తాన్ ను బలహీన పరచాలనీ, అంతర్జాతీయ వేదికల మీద పాకిస్తాన్ తీవ్రవాద దేశమని ఆరోపించాలనీ ద్వేషగీతాల బృందగానం సాగుతున్నది. సరిగ్గా భారత పాలకవర్గాలు ఎటువంటివో, పాకిస్తాన్ పాలకవర్గాలూ అటువంటివే గనుక అక్కడ కూడ ఇట్లాగే భారతదేశం మీద విద్వేషం రెచ్చగొట్టడం జరుగుతున్నది. రెండు దేశాల ప్రభుత్వాలూ తమ తమ ప్రజల కళ్లలో దుమ్ము చల్లడమే ప్రధాన కర్తవ్యంగా పని చేస్తున్నాయి.

ఒకవైపు ఇంతగా యుద్ధోన్మాద విద్వేష ప్రచారం సాగిస్తూనే ప్రధాని నరేంద్ర మోడీ కేరళలోని కోళికోడ్ లో జనసంఘ్ స్థాపకుడు దీన్ దయాళ్ ఉపాధ్యాయ శతజయంతి సభలో 'పరస్పర యుద్ధంలో కాదు, సామాజిక దురాచారాల మీద యుద్ధంలో పోటీ పడదాం రమ్మ'ని పాకిస్తాన్ కు సవాల్ విసిరాడు. ఆ యుద్ధం ఎవరిమీద చేయాల్సి ఉందో చెపుతూ, తాను ఆశించే భారతదేశం గురించి చెప్పాడు: గరీబీ సే ముక్త్ – సమృద్ధి సే యుక్త్, భేదభావ్ సే ముక్త్ – సమానతా సే యుక్త్, అన్యాయ్ సే ముక్త్ – న్యాయ్ సే యుక్త్, గందగీ సే ముక్త్ – స్వచ్ఛతా సే యుక్త్, భ్రష్టాచార్ సే ముక్త్ – పారదర్శితా సే యుక్త్, బేరోజ్ గారీ సే ముక్త్ – రోజ్ గారీ సే యుక్త్, మహిళా ఉత్పీడన్ సే ముక్త్ – స్త్రీ సమ్మాన్ సే యుక్త్, నిరాశా సే ముక్త్ – ఆశా సే యుక్త్ అని ఆకర్షణీయమైన నినాదాలు ఇచ్చాడు. సరిగ్గా ఆరు నెలల కింద దేశమంతా అట్టుడికిన విద్యార్థి ఆందోళనలో వెల్లువెత్తిన పూంజీవాద్ సే లేంగే ఆజాదీ, సామంత్ వాద్ సే లేంగే ఆజాదీ, మనువాద్ సే లేంగే ఆజాదీ, బ్రాహ్మణ్ వాద్ సే లేంగే ఆజాదీ, సంఘ్ వాద్ సే లేంగే ఆజాదీ, భ్రష్టాచార్ సే లేంగే ఆజాదీ, భూక్ మరీ సే లేంగే ఆజాదీ, హై హక్ హమారా ఆజాదీ, హమ్ లేకే రహేంగే ఆజాదీ అనే నినాదాలకు బలహీనమైన, చౌకబారు అనుకరణ తప్ప మోడీ నినాదాల్లో లోతూ లేదు, చిత్తశుద్ధీ లేదు. నిజంగానే ఈ దేశానికి, ఈ దేశప్రజలకు విముక్తి కావాలి. మోడీ కోరుతున్న ముక్తి కాదు, విద్యార్థులు కోరిన ఆజాదీలతో పాటు అన్ని పాలకవర్గ ముఠాల ఉక్కుపాదం నుంచీ, ఆకర్షణల నుంచీ విముక్తి కావాలి. ఆ యుద్ధం జరగవలసే ఉంది. వీ

*సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ*

# వానలూ వరదలూ లేవనెత్తుతున్న ప్రశ్నలు

**చా**ల సంవత్సరాల తర్వాత తెలంగాణ మాగాణంలో పుష్కలమైన వర్షాలు కురిశాయి. వర్షాకాలం ప్రారంభంలో, పంటలకు అవసరమైన సమయంలో కాకపోయినా, తాగునీటికీ, సాగునీటికీ ఇబ్బంది లేకుండా, బహుశా కావలసిన దానికన్న ఎక్కువగా కూడ కురిశాయి. వ్యవసాయ సమాజంలో వాన అంటే ఆనంద హేతువు. అందులోనూ వ్యవసాయం ఎక్కువగా వర్షాధారమైన చోట వర్షం ఎప్పుడైనా హర్షదాయకమే. కాని వానలతో పాటు వచ్చే వరదల్లో కావలసిన ఒండ్రుమట్టితో పాటు, చాల మురికి కూడ కొట్టుకొస్తుంది. కడుక్కోదలచుకున్నవాళ్లకు చాల పని. ఈసారి వరదల్లో కూడ పాలకవర్గాల, అధికారవర్గాల అవినీతి చరిత్ర మురికి చాల బైటపడుతున్నది. రియల్ ఎస్టేట్ అభివృద్ధి పేరుమీద రాష్ట్రమంతటా, ప్రత్యేకించి నగరాల్లో, హైదరాబాద్ నగరంలో ఎంతటి అవినీతి, అక్రమాలు, పర్యావరణ విధ్వంసం, ప్రకృతి వినాశనం జరిగిందో ఈ వానలు వేనోళ్లతో, వేయి కాలువల నీళ్లతో ప్రకటిస్తున్నాయి. గతంలో ఉత్తరాఖండ్‌లో, ముంబాయిలో, చెన్నైలో బైటపడిన అక్రమాల కంకాళాలు ఇప్పుడు హైదరాబాద్‌లో కూడ బైటపడుతున్నాయి. చెరువులనూ, నదులనూ, కాలువలనూ ఆక్రమించి, ఆ భూమిని ఆశ్రయంగా, భవనాలుగా, సంపదగా, ఆస్తిగా మార్చుకుని ప్రకృతి మీద విజయం సాధించామని విర్రవీగితే, ఆ క్రమంలో సమష్టి జీవనాన్నీ, తోటి మానవులనూ, సమాజాన్నీ అధిగమించామని అనుకుంటే, ఏదో ఒకరోజు ప్రకృతి తన జవాబు చెపుతుందని ఈ వానలు రుజువు చేశాయి. ఎప్పుడో నూట నలబై ఏళ్ల కింద 'డయలెక్టిక్స్ ఆఫ్ నేచర్' లో, వానరం మనిషిగా మారిన పరిణామ క్రమంలో శ్రమ పాత్ర అనే భాగంలో, "అయితే, ప్రకృతి మీద మనిషి సాధించిన విజయం గురించి మనను మనం ఉబ్బితబ్బిబ్బై పొగుడుకోవద్దు. అటువంటి ప్రతి ఒక్క విజయమూ మనమీద ప్రతీకారం తీర్చుకుంటుంది" అని ఎంగెల్స్ చేసిన వ్యాఖ్యను ఈ వానలు నిజం చేస్తున్నాయి. అలా తాత్విక అర్థంలో మాత్రమే కాక, నిర్దిష్ట రాజకీయార్థిక, పాలనా అర్థంలో కూడ ఈ వానలూ వరదలూ ఎన్నో విషయాలు చెపుతున్నాయి. పాలన, అధికారం, చట్టాలు, నిబంధనల పేరు మీద ఎన్నెన్ని అక్రమాలు జరిగిపోతున్నాయో, ఈ వ్యవస్థ ఎంత కుళ్లిపోయిందో, ఎంత అమానవీయంగా, అమానుషంగా మారిపోయిందో చూపుతున్నాయి. సంపదకోసం వెంపర్లాట ప్రకృతిని మాత్రమే కాదు, మనిషిని కూడ ఎలా ధ్వంసం చేసిందో, చేస్తున్నదో తెలుసుకోవాలంటే ఇటువంటి ప్రకృతి వైపరీత్యాల సమయంలోనే చూడాలి. ఈ వ్యవస్థ మారకతప్పని స్థితికి చేరిందని అనుక్షణం కనబడే నిదర్శనాలలో ఇది ఒకటి. అంతదూరం కూడ పోనక్కరలేదు. ఈ వ్యవస్థ బాగుందనీ, దీన్ని సంస్కరించి జీవనయోగ్యంగా మార్చవచ్చుననీ భావించే వారైనా ఈ వానల్లో, వరదల్లో బైటపడుతున్న అధికారవర్గ అలసత్వాన్నీ, అవినీతినీ, అక్రమాలనూ, చట్ట ఉల్లంఘనలనూ గురించి ఆలోచించాలి, ప్రశ్నించాలి, మార్చడానికి ప్రయత్నించాలి. వీ

*సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్*

# వంచనా శిల్పానికి మరో పేరు ప్రత్యేక ప్యాకేజీ

**ఎ**ట్టకేలకు సెప్టెంబర్ 7న కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక ఆర్థిక సహాయాన్ని ప్రకటించింది. ప్రత్యేక ప్యాకేజీ అని పిలుస్తున్న ఈ సహాయం, అంతవరకూ చర్చల్లో ఉన్న ప్రత్యేక హోదా కన్న ఎక్కువ ప్రయోజనకరమైనదని వెంకయ్య నాయుడుతో సహా ఎందరో ఇప్పుడు నమ్మబలుకుతున్నారు. ప్రత్యేక హోదా ఇచ్చి ఉంటే ఎక్కువ సంతోషించే వాడినని, కాని ఇదైనా మంచిదేనని, స్వాగతిస్తున్నానని చంద్రబాబు నాయుడు అన్నారు. ప్రజల పట్ల, ప్రజా ప్రయోజనాల పట్ల పాలకవర్గాల నిర్లక్ష్యాన్నీ, వంచననూ ఈ పరిణామాలు స్పష్టంగా చూపుతున్నాయి. ఈ ప్రత్యేక ఆర్థిక సహాయం గురించి కేంద్ర ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వ శాఖ వెబ్ సైట్ మీద ప్రకటించిన ఏడు పేజీల వివరణ పత్రం అబద్ధాల, అర్ధసత్యాల, వక్రీకరణల కుప్ప. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం, అప్పటి ప్రధాని 2014 ఫిబ్రవరి 20న పార్లమెంటులో చేసిన ప్రకటన, పద్నాలుగో ఆర్థిక సంఘం నివేదిక, నీతీ ఆయోగ్ 2015 నివేదికల ప్రకారం కేంద్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి సహాయం అందించవలసి ఉన్నదని, ఆ నాలుగు ప్రకటనల ప్రకారమే ఈ సహాయం ప్రకటిస్తున్నామనీ ఈ పత్రం చెపుతుంది. అప్పటి ప్రధాని ప్రకటన ఐదు సంవత్సరాల కొరకు ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా ఇస్తామని చెప్పగా, అప్పుడు సభలో ఉన్న వెంకయ్య నాయుడు అది పది సంవత్సరాల కొరకు కావాలని అడిగారు. పదిహేను సంవత్సరాలు కావాలని చంద్రబాబు నాయుడు కోరారు. పాత ప్రణాళికా సంఘం నిబంధనల మేరకు ప్రత్యేక హోదా అర్హతలు (కొండ ప్రాంతాలు, తక్కువ జనసాంద్రత, ఎక్కువ గిరిజన జనాభా, సరిహద్దు ప్రాంతం, ఆర్థిక, మౌలిక సౌకర్యాల వెనుకబాటుతనం) అవశేష ఆంధ్రప్రదేశ్‌కు లేవని హామీ ఇచ్చిన మన్మోహన్‌సింగ్‌కూ, ఎక్కువ హామీ కోరిన వెంకయ్య నాయుడుకూ, చంద్రబాబు నాయుడుకూ తెలుసు. కాని అప్పటికి ప్రజలను వంచించడానికి ఆ వాగ్దానం! ఆ తర్వాత ఆర్థిక సంఘం రాష్ట్రాలకు ప్రత్యేక హోదానే ఎత్తివేసింది. ప్రణాళికా సంఘమే రద్దయింది. అంటే ఒక అబద్ధ వాగ్దానం చేసి, ఆ వాగ్దానాన్ని అమలు చేసే స్థితిని కూడ లేకుండా చేసి అన్ని పాలకవర్గ ముఠాలూ ఆంధ్రప్రదేశ్‌ను వంచించాయి. ఇంతకూ ప్రత్యేక హోదా పేరుతో నిధులు, సౌకర్యాలు, రాయితీలు వచ్చినా ఆ వనరులను హక్కు భుక్తం చేసుకునేది అధికారంలో ఉన్నవారూ, వారి ఆశ్రితులూ మాత్రమే గాని ప్రజలకు దక్కేదేమీ ఉండదు. ఇప్పుడు రెండున్నరేళ్ల తర్వాత, ప్రత్యేక హోదా బదులు ప్రత్యేక ఆర్థిక సహాయం ప్రకటిస్తున్నారు. ఆదాయ వ్యయ లోటు భర్తీ, పోలవరం నిర్మాణానికి, పెట్రోలియం విశ్వవిద్యాలయం, ఐఐటి, ఐఐఎం, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్, ట్రిపుల్ ఐటి, కేంద్ర విశ్వ విద్యాలయం, ఎఐఐఎంఎస్ వంటి విద్యాసంస్థలకు, దుగరాజపట్నం ఓడరేవుకు, విమానాశ్రయాలకు నిధులు ఈ ప్రత్యేక సహాయంలో భాగం. ఇవన్నీ వచ్చినా ప్రజలకు వాస్తవంగా ఒరిగేదేమీ ఉండదని, ఈ వేలకోట్ల రూపాయల నిధులు కాంట్రాక్టర్ల, రాజకీయ నాయకుల బొక్కసాల్లోకి చేరేవేనని గత అనుభవాలు చూపుతున్నాయి. ఈ మొత్తం వ్యవహారంలో ప్రజలకు దక్కే ఫలం పాలకుల వంచనా శిల్పం గురించి మెరుగైన అవగాహన మాత్రమే. వీ

# పాకిస్తాన్ దురాక్రమణలోనే బెలూచిస్తాన్

బెలూచిస్తాన్ ఇప్పుడు పలునోళ్ల నలుగుతున్న పదం. దురాక్రమణకు, నిత్య అణచివేతకు గురై, శతాబ్దాల నుండి తన ఉనికిని, స్వతంత్రతను కాపాడుకునే సమరంలో తలమునకలై రక్తమోడుతున్నది బెలూచిస్తాన్. వలసవాద చరిత్ర గతిలో బ్రిటన్, ఇరాన్, పాకిస్తాన్ పాలక ముఠాల, సైన్యాల అంతులేని దురాగతాలకు నిత్యం బలైపోతున్న బెలూచీ ప్రజల విముక్తి ఓ గగన కుసుమమైంది. అయినా వారు పలుతీర్ల, పలువిధాల తమ స్వాతంత్ర ఆకాంక్ష బావుటాను ఎత్తిపట్టి పోరాడుతూనే ఉన్నారు. భారత ప్రధాని నరేంద్ర మోడీ ఆగస్టు 15న దేశ ప్రజలకు ఇచ్చే సందేశంలో పాకిస్తాన్‌కు గుర్తుచేశాడు, 'మీకు కూడా, మీ నుండి ఆజాదీ కోరుకుంటున్న బెలూచిస్తాన్ ఒకటుందని మరిచిపోకండి', అని. పాకిస్థాన్ సైనిక అణచివేతకు గురౌతున్న బెలూచీ ప్రజలపై సానుభూతి ప్రకటించాడు.

కశ్మీర్, రెండు ముక్కలుగా భారత్, పాకిస్తాన్‌ల ఆక్రమణలో విలవిల లాడుతుంటే, బెలూచిస్తాన్ మూడు ముక్కలుగా పాకిస్తాన్, ఇరాన్, అప్ఘనిస్తాన్ ఆక్రమణలో దయనీయ పరిస్థితుల్లో ఎప్పటి నుండో కొట్టుమిట్టాడుతోంది. బెలూచిస్థాన్‌కు ఎంతో పురాతన చరిత్ర ఉంది. ఇస్లాం మత ప్రవేశానికన్నా చాలా ముందుగానే బహు ఖనిజ సంపదలు కల్గిన భౌగోళిక భూభాగంలో బెలూచీ ప్రజలు తమ చరిత్రను సుస్థిరం చేసుకున్నారు. వారు స్వతంత్ర భావాలుగల ధైర్యవంతులైన ప్రజలు. స్వచ్ఛమనస్కులు, నిష్కల్మషులు. మానవీయత కలవారు. బెలూచిస్తాన్, కొన్ని కొండ జాతుల సమాహారం. బెలూచీలు, ఫక్తూన్లు ఇక్కడ నివసించే ప్రధాన సమూహాలు. బ్రిటిష్ వాళ్లు, కుట్రతో భారత్‌ను జాతి-మత ఆధారంగా విడగొట్టిన నాటికే బెలూచిస్థాన్ ఒక స్వతంత్ర దేశంగా ఉంది. పాకిస్థాన్ దుర్మార్గంగా వారిని పాదాక్రాంతం చేసుకుంది, తనలో కలిపేసుకుంది. అసలు, ఇప్పుడు పాకిస్తాన్‌గా పిలవబడు తున్న భూభాగంలో 42 శాతం బెలూచిస్తాన్‌దే. అయితే ఈ భూభాగంలో వారి జనాభా కేవలం ఒక కోటి ముప్పై లక్షలు మాత్రమే! విషాదమేమంటే, విలువైన సహజవాయువు, ఆయిల్, బొగ్గు, రాగి, గంధకం, ఫ్లోరైడ్, బంగారం.. ఇత్యాది ఖనిజ సంపదలు మెండుగా దండిగా కలిగి ఉన్న ఈ ప్రాంతం పాకిస్తాన్‌లో ఉన్న అన్ని రాష్ట్రాలలోకెల్లా పేదప్రాంతంగా ఉండి పోయింది.

1839లో బ్రిటన్ దాడిచేసి లోబరుచుకుని తన హయాంలోనికి తెచ్చుకునే ముందు వరకు బెలూచిస్తాన్ ఒక స్వతంత్ర భూభాగంగా ఉండేది. 1410 నాటికే, దక్షిణ దిశగా ఇరాన్ వైపు, ఉత్తర దిశగా అప్ఘనిస్తాన్ వైపు విస్తరించి ఉనికిలో ఉండేది. ఆ తదనంతరం బ్రిటిష్ వాళ్లు బెలూచీ ప్రజలను ఖాతరు చేయకుండా అస్తవ్యస్తంగా బెలూచిస్తాన్‌ను మూడు ముక్కలుగా విడగొట్టారు. 1871లో, గోల్డ్‌స్మిత్ లైన్ అనే పేరు మీదా, 1895లో డ్యూరాండ్ లైన్ అనే పేరు మీదా రెండు కృత్రిమ సరిహద్దు రేఖలు గీసి ఉత్తరపు భూభాగాన్ని ఇరాన్‌లోనూ, పశ్చిమ భూభాగాన్ని అప్ఘనిస్తాన్‌లోనూ కలిపేశారు. ఇప్పటి పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న బెలూచిస్తాన్ తూర్పు భూభాగం మూడో పెద్ద ముక్క. భారత్-పాకిస్తాన్ విభజనకు ముందు, బ్రిటిష్ వాళ్లతో ఒప్పందం కుదుర్చుకున్న స్వతంత్ర రాజ్యంగానే ఉండేది. బ్రిటిష్ వాళ్లు 1947 వరకు తూర్పు బెలూచిస్తాన్‌ను ఒక స్వతంత్ర ప్రతిపత్తి గల దేశంగానే గుర్తించి పాలించడమే గాక, విడిచి వెళ్లిపోతూ కూడా దాన్ని స్వతంత్ర దేశంగానే పరిగణించారు. మార్చ్ 1948లో పాకిస్తాన్ ప్రధాని మొహమ్మద్ ఆలీ జిన్నా సైనిక-చక్రం తిప్పి స్వతంత్ర బెలూచిస్తాన్‌ను బలవంతంగా పాకిస్తాన్ పాదాక్రాంతం చేసేశాడు. అప్పటి కలత్ ప్రభువు మీర్ అహ్మద్ యార్ ఖాన్ కుత్తుకపై కత్తి పెట్టి దొంగ ఒప్పందంపై సంతకం పెట్టించారు. అప్పటి నుండే పాకిస్తాన్ సైన్యంపై బెలూచీ స్వతంత్ర వీరుల పోరాటం అనేక రూపాల్లో ఆగక కొనసాగుతూనే ఉంది. ఎందరో బెలూచీ స్త్రీలు, పురుషులు పాకిస్తాన్ అమానుష సైనిక దమనకాండకు గురౌతూనే ఉన్నారు. కశ్మీరీ, బెలూచీ ప్రజలు ఆజాదీకై జరుపుతున్న పోరాటాలు అత్యంత న్యాయమైనవి, ప్రపంచ ప్రజలంతా సమర్ధించి, వారి గెలుపుకు పూర్తి మద్దతు తెలపవలసి ఉంది.

– బి.ఎస్.రాజు




నన్నడిగితే ప్రభుత్వమే
మేలంటాను.
వాళ్లనెప్పుడూ
జైలుకు పంపరు.



❖ **చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం - 1** - విరసం ప్రచురణ - 615 పేజీలు, 1/8 డెమీ, రు. 270, ప్రతులకు: డి.వి. రామక్రుష్ణారావు, ఎం.ఐ.జి - 14, ఎ.పి.ఐ.ఐ.సి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ - 500040;



❖ **దళితుల్నెవ్వరూ చంపలేదా?!** - మీనా కందసామి - మాతృక ప్రచురణలు - 80 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: న్యూడెమోక్రసీ కార్యాలయం, ఇ.నెం. 2-1-716 (బి-6, ఎఫ్-4), ఎస్‌విఇఎస్ స్కూలు ఎదురుగా, ఓ.యు రోడ్, విజ్ఞానపురి కాలనీ, విద్యానగర్, హైదరాబాద్ - 500044; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో;



❖ **ఎస్. శ్రీధర్,** 1958-2015 - పోట్రేట్ ఆఫ్ ది రెవల్యూషనరీ అజ్ ఎ వారియర్ ఇంటలెక్చువల్, ప్రచురణ శ్రీధర్ స్నేహితులు, 62 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు శ్రీధర్ స్నేహితులు, కేరాఫ్ మహరుక్ అడెన్‌వల్ల, రూమ్ నెం. 45బి, ఫోర్త్ ఫ్లోర్, ప్రాస్‌పెక్ట్ చాంబర్స్ అనెక్స్, 6 పితా స్ట్రీట్, ముంబై - 400 001



❖ **సంఘం మలిచిన మనిషి** - డా. కె.బి. చంద్రభాను - మంగయ్య మెమోరియల్ ట్రస్ట్ ప్రచురణ - 82 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: డా. కె.బి. చంద్రభాను, ఇ.నెం. 1-8-167-ఎ1, శ్రీ సాయి రెసిడెన్సీ, బాలసముద్రం, హన్మకొండ, వరంగల్ - 506001, తెలంగాణ; ఫోన్ నెం. 9849677467;



❖ **అక్షర శరధి - దాశరథి** - దాశరథి రంగాచార్య రచనలపై వ్యాస సంకలనం - అనిశెట్టి రజిత - రుద్రమ ప్రచురణలు వరంగల్ - 376 పేజీలు, 1/8 డెమీ, రు. 350, ప్రతులకు: అనిశెట్టి రజిత, ఇ.నెం. 3-12-60, కుమార్‌పల్లి, హన్మకొండ, వరంగల్ - 506001, ఫోన్: 9849482462;



❖ **ఉపాధ్యాయ కథలు - 2** - కథా సంకలనం - ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ ప్రచురణ - 133 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్, సింగరాజుభవన్, ఇ.నెం. 29-7-22, విష్ణువర్ధనరావు వీథి, సూర్యారావుపేట, విజయవాడ - 2;



❖ **చార్వాకుడు - నాటకం** - బి. రామకృష్ణ - చార్వాకాశ్రమ ప్రచురణ - 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: బి. సుధాకర్, చార్వాక విద్యాపీఠం, నిడమర్రు, మంగళగిరి, గుంటూరు - 522503, ఫోన్: 9290619550;



❖ **సామ్రాజ్యవాద పెనుభూతం** - (కా. గద్దం కోటారెడ్డి స్మారకోపన్యాసాల సంపుటి) - గద్దం కోటారెడ్డి స్మారక కమిటీ ప్రచురణ కావలి - 28 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు: గద్దం రామకృష్ణారెడ్డి, ఇ.నె. 4-13-3, గాజులవారి వీథి, పాతవూరు, కావలి - 524 201, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా, ఫోన్: 9492336711;



❖ **రైతు వ్యతిరేక కార్పొరేట్ ప్రభుత్వాల భూ సమీకరణ, భూ సేకరణ చట్టాలకు వ్యతిరేకంగా పోరాడుదాం** - పంట పొలాల్లో రాజధాని నిర్మాణ వ్యతిరేక పోరాట కమిటి ప్రచురణ - 38 పేజీలు, 1/8 డెమీ, రు. 5, ప్రతులకు: బి. కొండారెడ్డి, గ్రా: నులకపేట, పో: కృష్ణానగర్, మం: తాడేపల్లి, జిల్లా: గుంటూరు - 522501, ఫోన్: 9948868656



❖ **పోడు భూముల ఆక్రమణను ఆపాలి** - తెలంగాణ ప్రజాఫ్రంట్ ప్రచురణ - 28 పేజీలు, 1/8 డెమీ, రు. 5, ప్రతులకు: తెలంగాణ ప్రజాఫ్రంట్, హెచ్ఐజి బ్లాక్-4, ఫ్లాట్ నెం. 6, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 020, ఫో: 9849996300, 9640537725 అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **వానొస్తద?** - నారాయణస్వామి కవిత్వం - ఝరీ పోయెట్రీ సర్కిల్ ప్రచురణ - 186 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: ఝరీ పోయెట్రీ సర్కిల్, 16-2-740/75/40, వి.కె. ధగె నగర్, గడ్డి అన్నారం, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 500060, ఫోన్: 040-24064195



❖ **బొమ్మలబాయి** - సిద్ధార్థ - మట్టి ముద్రణలు ప్రచురణ - 208 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: పుట్ట - పుస్తక శిబిరం - ఆలగడప, మం: మిర్యాలగూడ, జిల్లా: నల్లగొండ - 508207, ఫోన్: 9848015364



❖ **మనం కలలు కన్న తెలంగాణ ఇదేనా కేసిఆర్?** -(ముఖ్యమంత్రికి బహిరంగ లేఖ) - గాదె ఇన్నయ్య - స్నేహ పబ్లికేషన్స్ ప్రచురణ - 24 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు: స్నేహ పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం. 78, సుభోదయ కాలనీ, పైప్‌లైన్ రోడ్, కూకట్‌పల్లి, హైదరాబాద్ - 500072, ఫోన్: 9030997371



❖ **మరో ఉదయం కోసం...** - భౌగోళిక తెలంగాణ నుండి... ప్రజాస్వామ్య తెలంగాణ దిశగా... - తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ - 168 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: తెలంగాణ విద్యావంతుల వేదిక, 5-9-22/4, హిల్‌ఫోర్ట్ రోడ్, ఆదర్శనగర్, హైదరాబాద్, ఫోన్: 9494306663



❖ **కాన్పుల దిబ్బ** - చింతకింది శ్రీనివాసరావు కథలు - శ్రీనిజ ప్రచురణలు - 124 పేజీలు, 1/8 డెమీ, రు. 110, ప్రతులకు: శ్రీనిజ ప్రచురణలు, 6-60/1, రవీంద్రనగర్, ఓల్డ్ డైరీ ఫాం, విశాఖపట్నం - 530040, ఫోన్: 8897147067



❖ **కాలం కన్నుల్లోంచి...** - ప్రొ. కట్టా ముత్యంరెడ్డి - రామయ్య విద్యాపీఠం ప్రచురణ - 175 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: ప్రొ. కట్టా ముత్యంరెడ్డి, ఫోన్: 8790321818, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో;

# తలవంచని కశ్మీర్

***కశ్మీర్ సమస్య ఒక రాజకీయ సమస్య అనీ, అది ప్రజామోదంతో పరిష్కరించాలి కాని దమనకాండతో కాదనీ, కశ్మీరీ ప్రజలు తమ అస్తిత్వం కోసం, ఆత్మగౌరవం కోసం ప్రాణాలొడ్డి పోరాడుతున్న విషయాన్ని సమాజం గుర్తించాలనీ అంటున్నారు రాజేంద్రబాబు అర్విణి***

*వేత- అది ఎప్పుడూ ప్రాణాంతకమే / మనదైనను మరియెవ్వరిదైనను*
*ఏడ్పులు అర్పులు ఎదదమంటలు / ఇటులైనను మనవే అటులైనను మనవే*
*– కాళోజీ ('నెత్తుటి వరద' గీతంలో)*

సుందర కశ్మీర్ ఇప్పుడు నెత్తురోడుతోంది. మంచు పొరల మధ్య మౌన సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ కళాత్మకంగా పరుచుకొని ఉన్న ప్రకృతి ఇప్పుడు ఎడతెగని కర్ఫ్యూ నీడలో వెలవెలబోతూ ఉంది. ఈ వ్యాసం రాస్తున్న సమయానికి వరుసగా 74 రోజులు కశ్మీర్ లోయలో కర్ఫ్యూ రాజ్యం చేస్తోంది. ఈ చీకటి తొలగిపోయే రోజు కనుచూపు మేరలో కనిపించడం లేదు. కశ్మీర్ అస్తిత్వం కోసం, ఆత్మగౌరవం కోసం కశ్మీరీలు చేస్తున్న ఈ పోరాటానికి ప్రపంచంలో మానవత్వం ఉన్న ప్రతి పౌరుడు స్పందించాలి. కాని, భారతదేశంలోని మధ్యతరగతి, మేధావివర్గం ఉదాసీనంగా ఉండడం విషాదాల్లోకెల్లా అతి విషాదం.

దేశంలో పెల్లుబుకుతున్న హిందూ మతవాదం వెల్లువలో మొద్దుబారిన హృదయాలకు కశ్మీరీల వెతలు వినిపించడం లేదు, కనిపించడంలేదు. దేశంలో ఏ ప్రాంతంలోనైనా ఏ కారణం కోసం ఉద్యమం జరిగినా 144వ సెక్షన్ విధించడం పరిపాటి. 144వ సెక్షన్ ప్రకటించి నిషేధాజ్ఞలు అమలు పరిస్తే అక్కడి ప్రజలు ఎన్నో ఇబ్బందులకు గురవుతారు. ఆత్మగౌరవం దెబ్బతిని వాటి ఉల్లంఘనకు కూడా పూనుకోవడం మనం చూస్తూనే ఉన్నాం. అలాంటిది, ఏకబిగిన నిరవధికంగా 73 రోజులపాటు కర్ఫ్యూ ఉందంటే, అది ఇప్పట్లో సడలించే సూచన కనపడడం లేదంటే కశ్మీర్ ప్రజలు ఎన్ని ఇబ్బందులు పడుతున్నారో ఊహించుకోవచ్చు. అయినా ఇన్ని ఇక్కట్లు ఎదుర్కొంటున్నా కశ్మీర్ ప్రజలు ఎంత దృఢ నిశ్చయంతో ఉన్నారో, ఇన్ని ఇబ్బందులను తట్టుకొని నిలడబగలిగే మానసిక స్థైర్యంతో ఉన్నారో అర్థం అవుతుంది.

ఈసారి కశ్మీరీలు కశ్మీర్ ప్రతిష్ట కోసం, కశ్మీర్ అస్తిత్వం కోసం పోరాడుతున్నారు. రెండు సంవత్సరాల క్రితం పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ–బిజెపిలు తమ పార్టీల సిద్ధాంతాలను పక్కనబెట్టి అధికారం కోసం చేతులు కలిపాయి. పిడిపికి, బిజెపికి సిద్ధాంత విభేదాలు తీవ్రంగానే ఉన్నాయి. హిందుత్వ భావన, ముస్లిం వ్యతిరేకత బిజెపికి ముఖ్య పార్శ్వాలయితే, కశ్మీర్ ముస్లింల ప్రయోజనాలే ముఖ్య ఉద్దేశ్యాలుగా పిడిపి ఏర్పడింది. పరస్పర విరుద్ధమైన అంశాలతో పనిచేస్తున్న ఈ రెండు రాజకీయ పార్టీల అపవిత్ర కలయికతో కశ్మీర్ ప్రజలు తీవ్రమైన అభద్రతా భావానికి గురయ్యారు. ఆర్టికల్ 370 ఇక ఎంతమాత్రం సమర్థనీయం కాదన్న బిజెపి అభిప్రాయంలో దాపరికం ఏమీలేదు. భారత రాజ్యాంగంలో ఈ అధికరణం కశ్మీర్ అస్తిత్వానికి సంబంధించినది. కేంద్ర హోంశాఖ మంత్రి రాజ్‌నాథ్ సింగ్ జూలై 18 నాడు పార్లమెంట్‌లో ఒక ప్రకటన చేస్తూ 'ప్రజాభిప్రాయ సేకరణ (రెఫరెండం) కాలం చెల్లిపోయిన అభిప్రాయం' అని కశ్మీరీ ప్రజల మనోభావాలను మరీ గాయపరిచాడు.

ఈ మధ్యకాలంలో కశ్మీర్ ప్రభుత్వం తీసుకున్న విధాన నిర్ణయాలు స్థానికేతరుల జనాభాను ఇబ్బడి ముబ్బడిగా పెంచే దురుద్దేశంతో తీసుకున్నవిగా అక్కడి ప్రజలు భావిస్తూ ఉన్నారు. సైనిక కాలనీల ఏర్పాటుకు భారీగా భూసేకరణ జరపడం, కశ్మీర్ ప్రాంతానికి వలస వచ్చిన ప్రజల కోసం విడిగా పట్టణాల ఏర్పాటుకు పూనుకోవడం, పశ్చిమ పాకిస్థాన్ నుండి వచ్చిన కాందిశీకుల స్థిరనివాసం కోసం ఏర్పాట్లు ప్రారంభించడం, రాష్ట్రం బయటి నుంచి వచ్చిన గుడిసెవాసులకై భూమిని కేటాయించడం, వివాదాస్పదమైన పారిశ్రామిక విధానం, కశ్మీర్ భాషకు పాత వర్ణమాల స్థానంలో సంస్కృత అక్షరాలను ప్రవేశపెట్టడం లాంటి చర్యలు ఈ ప్రాంత భౌతిక, సాంస్కృతిక రంగాలలో కశ్మీర్ అస్తిత్వానికి ఎసరుపెట్టే కుతంత్రాలుగా ప్రజలకు అర్థమయ్యాయి. అభివృద్ధి పేరుతో మాత్రమే కాకుండా, జమ్మూ కశ్మీర్‌లో ప్రజలపై యుద్ధం చేస్తున్న ఆరు లక్షల మంది సైన్యం కోసం కూడా పెద్దయెత్తున భూసేకరణ చేయడం మొదలు పెట్టారు.

ఈ విధానాలను అత్యంత వేగంగా అమలుచేసి త్వరితగతిన కశ్మీర్ స్వరూపాన్ని మార్చి, కశ్మీరేతరులను ఎక్కువ సంఖ్యలో పెంచి కశ్మీరీలకు కశ్మీర్‌ను కాకుండా చెయ్యాలనే ఒక తప్పుడు విధానాన్ని ఆచరణలోకి తీసుకొని వచ్చే భారత ప్రభుత్వ ప్రయత్నాన్ని ప్రజలు పసిగట్టారు. బిజెపి, ఆర్ఎస్ఎస్‌లకు కశ్మీర్ పట్ల ఉన్న అవగాహన ఏమిటో కశ్మీరీలకు బాగా తెలుసు. అది ఏదో ప్రమాదకర రూపం తీసుకుంటుందన్న విషయంలో వారికి ఎలాంటి సందేహం లేదు. దానికి తోడు ముఫ్తీ మహబూబా నాయకత్వంలోని పిడిపి ప్రభుత్వం కేంద్రంలోని బిజెపి ప్రభుత్వానికి రబ్బర్ స్టాంప్‌లా పనిచేసింది కాని తన అస్తిత్వాన్ని నిలుపుకోలేకపోయింది. ఈ మానసిక ఆందోళనతో, అశాంతితో ఉన్న ప్రజలకు బుర్హాన్ వనీ ఎన్‌కౌంటర్ ఒక అగ్గిపుల్లలా పనిచేసింది. గూడుకట్టుకున్న అశాంతి అగ్నిగోళంలా భగ్గుమంది.

22 ఏళ్ల బుర్హాన్ వనీ అంత్యక్రియలు భయంకరమైన నిశ్శబ్దం మధ్య, భద్రతా దళాలుగాని, పోలీసుల జాడగాని లేకుండా ఆయన స్వస్థలం ట్రాల్ అన్న చిన్న పట్టణంలో జరిగాయి. తండోప తండాలుగా ప్రజలు – ఒక లక్ష నుండి మూడు లక్షల మందిదాకా శోకతప్తమైన ప్రజలు – లెక్కలేనంత మంది ప్రజలు అశ్రునయనాలతో బుర్హాన్ వనీ అంత్యక్రియ లకు హాజరయ్యారు. కశ్మీరులోయ అంతటా ప్రజలు రోడ్ల మీదకు వచ్చి,

వివిధ రకాలుగా ఎన్‌కౌంటర్ పట్ల తమ నిరసనను తెలియచేశారు. చాలా మంది గాంధేయ పద్ధతులలో తమ ఆక్రోశాన్ని వెళ్లగక్కారు. మరికొంతమంది తమ చేతికి దొరికిన రాళ్లతో, ఇతర పరికరాలతో పోలీస్ స్టేషన్లపై దాడిచేశారు. సెక్యూరిటీ క్యాంపులను దగ్ధం చేశారు. మిలిటరీ అంతా శత్రుదేశంతో యుద్ధానికి దిగిన చందంగా అధునాతన ఆయుధాలతో ప్రజలపై విరుచుకుపడ్డది. శాంతియుతంగా ప్రదర్శన జరుపుతున్న వారిపై, హింసాత్మక చర్యలు జరుపుతున్న వారిపై ఒకేరకంగా సైనికులు దాడి ప్రారంభించారు.

మొదటి మూడు రోజుల్లోనే 30 మంది పౌరులు మరణించారు. పది రోజులు గడిచేసరికి మృతుల సంఖ్య 46కు పెరిగింది. ఆ సంఖ్య రోజురోజుకు పెరుగుతూ ఉంది. పత్రికలలో వచ్చిన వార్తల ప్రకారం అది ఇటీవల 82కు చేరింది. జూలై నెల మాసాంతానికి 2,200 మంది పౌరులు తీవ్ర గాయాలపాలయ్యారు. 140 మంది పెల్లెట్ల వలన గుడ్డివాళ్లయ్యారు. కేంద్ర హోం శాఖా మంత్రి ప్రకటన ప్రకారమే కేవలం 16 రోజుల్లో 2,228 మంది రాష్ట్ర పోలీసులు, 1,100 మంది కేంద్ర భద్రతా దళాలకు చెందిన సిబ్బంది తీవ్రంగా గాయపడ్డారు.

కొన్ని దశాబ్దాలుగా కొనసాగుతున్న కశ్మీర్ ప్రజల పోరాటం ఇప్పుడొక కొత్త అధ్యాయంలోకి ప్రవేశించింది. 'చావోరేవో తేల్చుకోవాలె' (డూఆర్ డై సిచువేషన్) అన్న స్థితికి చేరింది. భారతదేశం నుండి స్వాతంత్రం కావాలన్న నినాదం ఇంతకు ముందు కంటే ఎప్పుడూ లేనంత బలంగా వినిపిస్తోంది. స్థానిక రాజకీయ నాయకత్వం – అది ఏ పార్టీ అయినా కానివ్వండి, చివరికి వేర్పాటువాద నాయకత్వంతో సహా – ఘోరంగా విఫలం చెందింది. స్థానిక రాజకీయ నాయకత్వానికి కేంద్ర ప్రభుత్వ కశ్మీర్ వ్యతిరేక విధానాలను ఎదుర్కొనే శక్తిలేదనీ, స్థానిక రాజకీయ పార్టీలకు వేటికీ ఆర్ఎస్ఎస్ భావజాలానికి అడ్డుకట్టవేసే వ్యూహాలు లేవనీ అక్కడి ప్రజలు భావిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వంలో ప్రధాన భాగస్వామి అయిన పిడిపిని 'కశ్మీర్‌లను ఊచకోతకోసే మృత్యు యంత్రం'లో భాగంగా వారు భావిస్తున్నారు. భారతదేశమంటే తుపాకీ గొట్టం రూపంలో ఉంటుందని, స్థానిక రాజకీయ నాయకులు మోసానికి ప్రతిరూపాలని అక్కడి ప్రజలు భావిస్తున్నారు. 1990ల తర్వాత పుట్టిన కశ్మీర్ యువతరం భారతదేశంతో పూర్తిగా సంబంధాలు తెగిపోయిన స్థితిలో ఉన్నారు. కశ్మీర్ లోయలో నూనూగు మీసాల ప్రాయంలో ఉన్న ఏ యువకుణ్ణి కదిలించినా '1556లో అక్బర్, మా దేశపు స్వతంత్ర పరిపాలకుడు యుసుఫ్ షాహ్ చక్‌ను సింహాసనం నుండి తొలగించి అతణ్ణి బందీగా పట్టుకొన్నప్పుడే మొట్ట మొదటి దురాక్రమణ జరిగింది. ఆ దురాక్రమణల పరంపర ఇంకా కొనసాగుతూనే ఉంది' అని కశ్మీర్ చరిత్రనంతా పూసగుచ్చినట్టు చెప్పడానికి ఉద్యుక్తుడవుతాడు.

ఫ్రంట్‌లైన్ పత్రికలో కశ్మీర్ సమస్య గురించి సుదీర్ఘ వ్యాసం రాసిన సుజ్జత్ బుఖారీతో ఓ 20 ఏళ్ల కశ్మీర్ యువకుడు తమ దాడిలో దెబ్బతిన్న భారత భద్రతా దళ శిబిరాన్ని చూపిస్తూ 'వాళ్లను లోబరుచుకొనే సత్తా మాకుంది. వాళ్లను ఈ పరిసర ప్రాంతాల నుంచి తరిమివేశాం. వాళ్లు మళ్లీ తిరిగి రాగలరా? వచ్చే శక్తి వాళ్లకు ఉందా? వస్తే మా శవాల మీంచే వాళ్లు మా గ్రామంలో అడుగు పెట్టాలి' అన్నాడు. కళ్లల్లో క్రోధం ఉప్పొంగుతుండగా 'మేం ఈ త్యాగాలు తమాషా కోసం చేయడం లేదు. మా స్వాతంత్ర్యం కోసం. భారతదేశం తప్పకుండా సమాధానం చెప్పాలి. ఉమర్ కాదు; మహబూబా కాదు (ఒకరు ప్రస్తుత రాజ్యాధినేత, మరొకరు మాజీ రాజ్యాధినేత) ఆజాద్ కాదు (గులాం నబీ అజాద్); వీళ్లెవ్వరూ బుల్లెట్లతో పెల్లెట్లతో మమ్మల్ని ఆపలేరు' అన్నాడు. ఆయన విప్పారిన కళ్లతో ఇంకా ఇలా అన్నాడు: 'మేం భారతదేశానికి వ్యతిరేకులం కాదు. కాని, ఇండియాను మేం ద్వేషిస్తాం. ఎందుకంటే మమ్మల్ని భారత్‌లో భాగంగా వాళ్ల ప్రజలలో ఒకరిగా చూడడంలేదు. ఏం చెప్తున్నామో, ఏం చేస్తున్నామో, ఎందుకు చెప్తున్నామో పట్టించుకోవడం లేదు. పైగా భారత సైన్యాలు మమ్మల్ని శత్రువుల్లాగా చూస్తూ చంపేస్తున్నాయి.' కేంద్ర రిజర్వు పోలీసు బలగాలు కూడా పరిస్థితి క్లిష్టంగా ఉందని ఒప్పుకుంటున్నాయి. ఒక కేంద్ర రిజర్వు పోలీస్ హెడ్ కానిస్టేబుల్ మాటల్లో చెప్పాలంటే 'ఈ యుద్ధం క్లిష్టతరంగా ఉంది. ఈ ప్రజలు మన ప్రజల్లాగా కాదు. వీళ్లు దేనికయినా సరే మానసికంగా సిద్ధపడ్డారు.'

హిజ్బ్ – ఉల్ – ముజాహిద్దీన్ కమాండర్ బుర్హాన్ వనీ ఒకవ్యక్తి కాదు. కశ్మీర్ ప్రజల్లో గూడు కట్టుకొని ఉన్న ఆక్రోశానికి ప్రతీక. ఆయన మీద ఉగ్రవాద చర్యల్లో పాల్గొన్నట్టుగాని, హింసాత్మక చర్యల్లో పాలుపంచు కున్నట్టు గాని ఆరోపణలు, కోర్టు కేసులు ఏమీలేవు. ఆయన చేసిందల్లా సామాజిక మాధ్యమం ద్వారా ప్రజలను ఉద్వేగ పరచడం. సోషల్ మీడియాలో కశ్మీర్ ఆజాదీని గురించి సందేశాత్మక మెసేజ్‌లు పంపడం. దానికి ఆయన ఎప్పుడూ మతంను ఒక సాధనంగా వాడుకోలేదు. జిహాద్ అన్న మాటలు ఎప్పుడూ వాడలేదు. 'ఆక్రమణ' 'అణిచివేత'లకు వ్యతిరేకంగా ప్రజలను అవసరమైతే సాయుధులను కమ్మన్నాడు. బుర్హాన్ వనీ కథ కశ్మీర్ లోయలోని వేలాది, లక్షలాది మంది యువకుల కథ. చాలా చిన్నప్పుడే ఆయన, ఆయన సోదరుడు 2010లో భద్రతా దళాల చేతిలో పరాభవం పాలయ్యారు. అవమానాన్ని తట్టుకోలేక ఆయన ఆలోచనలు ఆయుధ ధారణవైపు మళ్లాయి. ఓ సంవత్సరం తర్వాత భద్రతా దళాల చేతిలోనే ఆయన సోదరుడు మరణించడం ఆయన నిర్ణయాన్ని దృఢతరం చేసింది.

ఆ యువకుని మరణం ఎందుకు ఇంత సంక్షోభం సృష్టించిందో రాజకీయ ప్రయోజనాలు పక్కకు పెట్టి భారత ప్రభుత్వం, భావోద్వేగాలు విస్మరించి భారత ప్రజలు ఆలోచించాలి. ఆరేళ్లుగా ఉద్యమంలో ఉన్న ఒక 22 ఏళ్ల యువకుడు సైన్యంచే చంపివేయబడితే లక్షల మంది నిషేధాజ్ఞలు ధిక్కరించి, తుపాకులకు అడ్డంగా ప్రాణాలు కోల్పోవడానికైనా సిద్ధంగా ముందుకు వచ్చారంటే వారు తమ జీవితాలకంటే మిన్న అయినదేదో కోల్పోతున్నారన్న మాట. దాని కోసమే బుర్హాన్ వనీ పోరాడాడన్న మాట. అదేమిటో ప్రజాస్వామ్యప్రియులు, మానవతా వాదులు ఆలోచించాలి.

రచయిత, మానవహక్కుల పోరాట యోధురాలు, ప్రముఖ న్యాయవాది, కశ్మీరుపై విమర్శనాత్మక గ్రంథం రాసిన నందితా హక్సర్ ఈ సమస్యలో అంతర్జాతీయ కోణం దాగి ఉందని భావిస్తున్నది. నిజానికి కశ్మీర్ భూభాగం మొత్తం మూడు దేశాల ఆధీనంలో ఉంది. 20 శాతం చైనా ఆధీనంలో, 35 శాతం పాకిస్తాన్ ఆక్రమణలో, 45 శాతం భారత్‌లో భాగంగా ఉంది. ఐక్యరాజ్య సమితి కశ్మీర్‌ను 'వివాస్పద' భూభాగంగా గుర్తించింది. అమెరికా, బ్రిటన్‌లు రెండూ సమస్యలో భాగం కాకుండా,

# ఉడీ దాడి - పాలకుల వ్యూహాత్మక అవసరం

*పాకిస్తాన్ మీద దాడి చేయాలా లేదా అనే అంశంపై నిర్ణయం తీసుకోవడంలో భారత ప్రభుత్వం సైనిక నిపుణుల సలహాల మీద ఆధారపడడం లేదని అంటున్నారు* **మేజర్ జనరల్ ఎస్.జి. వొంబట్కెరె**

ఉడీ సైనిక శిబిరంపై పాకిస్తాన్ తరపున ఫిదాయీలు సెప్టెంబర్ 18న దాడి చేసి, పెద్ద ఎత్తున ప్రాణ నష్టానికి దారి తీసినప్పటి నుంచీ, భారతదేశంలో మితవాద పక్షాల యుద్ధోత్సాహులు, కొందరు మాజీ సైనికులు, పాకిస్తాన్‌కు తక్షణమే 'అదే రకంగా' జవాబివ్వాలని కోరుతున్నారు.

పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్ భూభాగంలోనూ, పాకిస్తాన్‌లోనూ లక్ష్యాలను ఛేదించడానికి భారత సైన్యానికి స్వేచ్ఛ ఇవ్వాలని, బెలూచిస్తాన్ లో క్రియాశీలంగా లోపాయికారీ చర్యలు చేపట్టాలని, ఇజ్రాయిల్ తరహాలో 'కచ్చితమైన లక్ష్యాలపై దాడులు' సాగించాలని, వగైరా ప్రచారాలు సాగిస్తున్నారు. అలా పాకిస్తాన్ మీద ప్రతీకార చర్య తీసుకోవాలని ప్రధాని నరేంద్ర మోడీ మీద నానాటికీ ఒత్తిడి పెంచుతున్నారు.

భారతదేశం దాడి చేస్తే, తాము ఎత్తుగడల పరమైన అణ్వాయుధాలను వాడడానికి ఎంతమాత్రం సందేహించబోమని పాకిస్తాన్ రక్షణ మంత్రి చేసిన ప్రకటన పరిస్థితి ఎంతగా దిగజారిందో చూపుతున్నది. అలాగే, ఒక అణ్వాయుధ దేశాన్ని తాము సుదూరంగానైనా సమర్థిస్తున్నామనే మాట రాకుండా ఉండడం కోసం రష్యా త్వరలో జరగవలసి ఉండిన రష్యా-పాకిస్తాన్ సంయుక్త సైనిక విన్యాసాలను వెంటనే రద్దు చేసింది.

అయితే, వెంటనే యుద్ధానికి దిగమని యుద్ధోత్సాహులు తెస్తున్న ఒత్తిడికి ప్రధాని మోడీ ఇప్పటివరకూ లొంగకుండా ఉన్నారు. బాధ్యతా రహితమైన పాకిస్తానీ సైన్యం (అక్కడ సైన్యమే ప్రభుత్వాన్ని నడుపుతుంది) ప్రారంభించదలచిన వినాశకర అణ్వాయుధ సంవాదానికి సిద్ధపడలేదు. దాని బదులు భారతదేశం ముందు ఉన్న వ్యూహాత్మక మార్గాలేమిటో అన్వేషించడం ప్రారంభించారు. నిజానికి అది జాతీయ భద్రతా మండలి చేయవలసిన పని.

పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా ఎన్నో రకాల రాజకీయ-దౌత్య పరమైన దాడులను సాగించడానికీ, ఆర్థిక పరమైన చర్యలు తీసుకోవడానికీ భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నదని పత్రికా వార్తలు చెపుతున్నాయి. తగిన సమయం వస్తే సైనిక చర్య తీసుకునే అవకాశాలను కూడ కాదనడం లేదు. ఈ చర్యలను ఎంతో ఆలోచించి తీసుకుంటున్నారనడంలో సందేహం లేదు. కాని ఈ చర్యలకు ప్రణాళికలు వేయడంలో ఆందోళన కలిగించే అంశం ఒకటుంది. అది ప్రధానమంత్రి రక్షణ బలగాలతో సంప్రదింపులు జరపకపోవడం. నేనొక మాజీ సైనికాధికారిని గనుక ఈ విమర్శ చేయడం లేదు. సైనిక నేపథ్యం ఉన్న, విషయ పరిజ్ఞానం ఉన్న, దేశం పట్ల పట్టింపు ఉన్న ఒక పౌరుడిగా ఈ మాట చెపుతున్నాను.

ది హిందూ దినపత్రికలో సెప్టెంబర్ 20న, 'దౌత్యపరమైన దాడికి పరిమితమవుతున్న భారత్' అనే శీర్షికతో వచ్చిన ఒక వార్తలో, "సోమవారం నాడు జరిగిన అనేక సమావేశాలలో ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ ఉన్న అన్ని అవకాశాలనూ చర్చించారు. హోం మంత్రి రాజనాథ్ సింగ్‌తో జరిపిన సమీక్షా సమావేశంతో రోజు ప్రారంభమయింది. ఆ తర్వాత జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్‌తో సమావేశం జరిగింది. ఆ తర్వాత రక్షణ మంత్రి మనోహర్ పరికర్‌ను కలుసుకున్నారు" అని ఉంది.

ఉడీ దాడి ఒక సైనిక శిబిరం మీద జరిగింది. పాకిస్తాన్ మీద ప్రతిచర్య అనేది ఒక విదేశీ భద్రతా వ్యవహారాలకు సంబంధించిన సమస్య.

ఏపక్షం వైపు మొగ్గు చూపకుండా తటస్థంగా ఉన్నట్టు ప్రపంచానికి, భారత, పాకిస్తాన్ ప్రజలకు ఒక అభిప్రాయం కలగజేసే ప్రయత్నం చేస్తాయి. కాని అది పూర్తిగా వాస్తవ విరుద్ధం.

ఇంగ్లిష్ వారు భారతదేశాన్ని పరిపాలిస్తున్న కాలంలో ఫ్రాన్సిస్ టక్కర్ అనే అతను బ్రిటిష్ ఆర్మీలో చాలా ఉన్నతమైన స్థానంలో ఉండేవాడు. ఆయన రాసిన ఒక పుస్తకంలో దిగ్భ్రాంతికరమైన ఒక విషయాన్ని బయట పెట్టాడు. పాకిస్థాన్ ఒకదేశంగా ఆవిర్భవించక ముందే బ్రిటిష్, అమెరికాలు కలిసి దూరాలోచనతో 'హిందూస్తాన్‌కు, రష్యా కమ్యూనిజానికి మధ్య ఒక ఇస్లాం రాజ్యం' ఉండాలనుకున్నాయి. ఏ ఉద్దేశ్యంతో అమెరికా, ఇంగ్లాండ్‌లు ఆ ఆలోచన చేశాయో దానికి అనుగుణంగా భారత్ లాంటి పెద్దదేశం కమ్యూనిజం వైపు ఆకర్షించ బడకుండా ముస్లింలను ద్వేషించే భావోద్వేగానికిలోనై ఎప్పుడూ, పాకిస్తాన్‌ను ముస్లిం దేశంగా చూస్తూ, అదే విధంగా పాకిస్థాన్ ప్రజలు కూడా భారత్‌ను హిందూ రాజ్యంగా ద్వేషం పెంచుకొని రెండు దేశాలు పరస్పర ప్రగతిని అడ్డుకొంటున్నాయి. ప్రపంచ సామ్రాజ్యవాదుల 'ప్రజలను ఎప్పుడూ విభజించి ఉంచు' అన్న కుట్రలో బలై భారత్, పాక్ రెండూ వెనకబడిన దేశాలుగా మిగిలిపోయాయి.

కశ్మీర్ సమస్య ఒక రాజకీయ సమస్య. దీన్ని రాజకీయ దృష్టితోనే పరిష్కరించాలి. అందుకు విరుద్ధంగా భారత ప్రభుత్వం వ్యవహరిస్తోంది. ఇంతవరకు కశ్మీర్ ప్రజలు న్యాయం కోసం పోరాడేవారు. భద్రతా దళాల అకృత్యాలు, భారత ప్రభుత్వ ముస్లిం వ్యతిరేక ధోరణితో ఆవేశంగా ఉన్న కశ్మీర్ ప్రజలు ఇప్పుడు భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు. శక్తివంతమైన, అతి శక్తివంతమైన భారత ప్రభుత్వంతో ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు. ఈ పోరాటం ఎన్నాళ్లో? ఈ మారణహోమం ఇంకా ఎన్నాళ్లు కొనసాగాలో?

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్)*

# అసలు దాడి జరిగిందా?

పాకిస్తాన్ ప్రేరేపిత ఫిదాయీలు ఉడీలోని సైనిక శిబిరం మీద దాడి చేశారని, ప్రతీకార దాడిగా యుద్ధమే చేయాలని ఒకవైపు యుద్ధోత్సాహులు వాదిస్తుండగానే, అసలు ఉడీ దాడి నిజంగా జరిగిందా, అది భారత ప్రభుత్వమే యుద్ధ సన్నాహాల్లో భాగంగా కల్పించిన నాటకమా అని సందేహాలు చెలరేగుతున్నాయి. పదవీ విరమణ పొందిన అత్యున్నత పోలీసు అధికారి సంజీవ్ భట్ తన ఫేస్ బుక్ పేజి మీద ఉడీ దాడి తర్వాత ఈ వ్యాఖ్య రాశారు:

"దాదాపు 7,00,000 మంది సైనిక బలగాలు, 7,00,000 మంది అర్ధసైనిక బలగాలు జమ్ము కశ్మీర్‌లో మోహరించి ఉన్నారు. అంటే పద్నాలుగు లక్షల మంది, మన మొత్తం సాయుధ బలగాలలో 30 శాతం అక్కడే ఉన్నారు.

భారత భూభాగం వైపు నుంచి, 1972లో నిర్ణయమైన 550 కి.మీ. పొడవైన వాస్తవాధీన రేఖ (యుద్ధ విరమణ రేఖ) పొడవునా ముళ్లకంచె ఉంది. ఆ కంచెను భారత ప్రభుత్వమే నిర్మించింది. అది సాధారణంగా భారత్ అధీనంలోని భూభాగంలో 150 అడుగుల ఇవతలికే ఉంటుంది. ఆ కంచె నిర్మించడంలో ప్రకటిత ఉద్దేశ్యం పాకిస్తాన్ స్థావరంగా ఉన్న వేర్పాటువాద మిలిటెంట్లు ఆయుధాలను తరలించడానికీ, జొరబడడానికీ ఆటంకంగా ఉండడమే.

ఆ ముళ్ల కంచె రెండువరుసలుగా ఇనుప ముళ్ల తీగల చుట్టలతో, ఎనిమిది నుంచి పన్నెండు అడుగుల ఎత్తున గోడలాగ ఉంటుంది. ఆ ఇనుప తీగల్లో విద్యుత్తు ప్రవహిస్తుంటుంది. ఆ తీగల దగ్గర కదలికలను వెంటనే గుర్తించడానికి మోషన్ సెన్సర్లు, థర్మల్ ఇమేజింగ్ పరికరాలు, కంచె పొడవునా దేదీప్యమానమైన లైట్ల వ్యవస్థ, హెచ్చరిక గంటలు వంటి ఏర్పాట్లున్నాయి. అక్కడ ఏ కదలిక జరిగినా క్షణాల్లో భారత బలగాలకు అత్యంత వేగంగా హెచ్చరికలు అందుతాయి. వెంటనే మెలుకొని, చొరబాటుకు ప్రయత్నించేవారిని అడ్డుకోవడానికి అవకాశం ఉంటుంది. అంతేకాదు, రెండు వరుసల ఇనుప ముళ్ల కంచెల మధ్య ఉండే సన్నని భూభాగంలో వేలాది మందు పాతరలు అమర్చబడి ఉంటాయి.

అయినా, నలుగురు తీవ్రవాదులు పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్ నుంచి ఇవతలికి చొరబడి, శత్రు దుర్భేద్యమైన బ్రిగేడ్ కేంద్ర కార్యాలయపు సైనిక శిబిరం మీద విజయవంతంగా దాడి జరిపారట.

అమాయకులైన జవాన్ల, నిరాశాభరితులైన కశ్మీరీల ప్రాణాల పట్ల ఎంత మాత్రం గౌరవం లేని ఈ అధికార మదోన్మత్తులైన భూతాలు చెప్పే అబద్ధాల మాయలలో ఇంకా ఎంతకాలం పడుతూనే ఉంటాం మనం?" వీ

దాన్ని సైనిక-దౌత్య సాధనాల ద్వారానే సాధించాలి. కాని రక్షణ మంత్రితో సమావేశం చిట్టచివరికి, తర్వాత వచ్చిన ఆలోచనలాగ జరిగింది. విదేశీ వ్యవహారాల మంత్రితో సమావేశం ఊసే లేదు. ఇదంతా అంగీకరించడానికి వీలులేని పద్ధతి. బహుశా రక్షణ బలగాల పాత్ర, భారత దౌత్యవ్యవహారాల బలగాలు రెండో స్థాయి ప్రాధాన్యతతో ఉన్నట్టున్నాయి. ఏ ఆదేశం ఇస్తే అది పాటించడమే తప్ప వారికి నిర్ణయంలో భాగస్వామ్యం లేనట్టుంది.

ఇది బహుశా జాతీయ భద్రతా వ్యవహారాల సలహాదారు అజిత్ దోవల్ ప్రభావానికీ, మనస్తత్వానికీ నిదర్శనం. ఆయన భద్రతా వ్యవహారాలలో భారత సైన్యం పాత్రను పక్కకు తోసేయదలిచారు. జనవరిలో పాకిస్తాన్ ప్రోత్సాహంతో పఠాన్ కోట్ వైమానికదళ స్థావరం మీద దాడి జరిగినప్పుడు కూడ ఆయన ఇలాగే ప్రవర్తించారు.

ప్రధాని నరేంద్ర మోడీ ప్రభుత్వం అంతిమంగా నిర్ణయించే రాజకీయ-ఆర్థిక-దౌత్య-సైనిక చర్యామార్గం ఏదైనా, భారత రక్షణ బలగాల అధిపతుల సవివరమైన భాగస్వామ్యం లేకుండా అమలు చేయడం సాధ్యం కాదు. ప్రత్యేకంగా ఇప్పుడున్న పరిస్థితులలో పాకిస్తాన్ మీద చర్య సమర్థంగా ఉండాలన్నా, తగినంతగా ఉండాలన్నా భారత సైనిక బలగాల భాగస్వామ్యం లేకుండా అసాధ్యం.

సైనిక సంక్షేమాన్ని నిర్లక్ష్యం చేసినందువల్ల ఎటువంటి ప్రతికూల ఫలితాలున్నాయో గత అనుభవాలను బట్టి, జాతీయ భద్రతా వ్యూహానికి సంబంధించిన వ్యవహారాలలో సైనిక నైపుణ్యాన్ని, అనుభవాన్ని నిర్లక్ష్యం చేయడం తప్పనిసరిగా జాతీయంగా ఆమోదించడానికి వీలులేని పర్యవసానాలకు దారితీస్తుంది.

అప్పటి ప్రధానమంత్రి సైనిక నిపుణుల సలహాలను పెడచెవిన పెట్టడం వల్లనే 1962 యుద్ధంలో సైనిక-రాజకీయ పరాజయం సంభవించింది. అప్పటికి జాతీయ భద్రతా మండలి ఉండేది కాదు. ఇవాళ ప్రధాన మంత్రి అధ్యక్షతన ఉండే జాతీయ భద్రతా మండలి రాజకీయ, ఆర్థిక, శక్తివనరుల, వ్యూహాత్మక విషయాలలో అత్యున్నత సంస్థ. అటువంటి జాతీయ భద్రతా మండలి గనుక సైనిక నిపుణుల అభిప్రాయాలను నిర్లక్ష్యం చేస్తే పరాజయం అనివార్యమైనట్టే. ప్రస్తుత స్థితిలో అధికారవర్గాల వ్యతిరేకతను కూడ అధిగమించి ఒక సైనికాధిపతిని జాతీయ భద్రతా మండలిలో సభ్యులుగా తీసుకోవడం అవసరం.

*(మేజర్ జనరల్ ఎస్ జి వొంబట్కెరె సైనిక ప్రధాన కార్యాలయంలో అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ పొందారు.)*

*http://www.thecitizen.in/index.php/NewsDetail/index/1/8772/Uri-Attack-The-Strategic-Need-of-The-Hour* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.*

*మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# బెలూచిస్తాన్ రక్తసిక్త చరిత్ర

***బెలూచిస్తాన్ చరిత్ర అంతా పోరాటాల చరిత్రేననీ, బ్రిటీష్ వలసవాదుల నుంచి నేటి పాకిస్తాన్ వరకూ అక్కడి సహజ వనరులను కొల్లగొట్టడానికి ప్రజలపై తీవ్ర నిర్బంధాన్ని అమలు చేస్తున్నారనీ అంటున్నారు* బైరెడ్డి సతీష్**

గత ఆగస్టు 15న ఎర్రకోట మీద ప్రధాని నరేంద్ర మోడీ చేసిన ప్రసంగంలో బెలూచిస్తాన్ ప్రస్తావన తీసుకురావడంతో కశ్మీర్‌లో పాకిస్తాన్ జోక్యాన్ని తిప్పికొట్టడం కంటే పరోక్షంగా కశ్మీర్‌లో భారత సైన్యం చేస్తున్న అకృత్యాలను, మానవ హక్కుల ఉల్లంఘనలను ఒప్పుకున్నట్లయింది. జూలై 8 న హిజ్బుల్ ముజాహిద్దిన్ కమాండర్‌గా గుర్తించబడిన బుర్‌హన్ వనీని భారత సైన్యం కాల్చివేయడంతో కశ్మీర్ లోయ మరోసారి అట్టుడికి పోయింది. 50వేల మందికి పైగా వనీ అంత్యక్రియలకు తరలివచ్చిన కశ్మీర్ ప్రజానీకం ఇచ్చిన ఇండియా వ్యతిరేక నినాదాలతో లోయంతా ప్రతిధ్వనించింది. ఆనాడు మొదలైన హింస, కాల్పులు, కర్ఫ్యూలతో కశ్మీరీ జనజీవనమంతా అస్తవ్యస్తమయింది. తొంబై మందికి పైగా ఆర్మీ చేతిలో ప్రాణాలు కోల్పోయారు. వందలాది మంది ఆర్మీ ఉపయోగించిన పెల్లెట్స్ తగిలి శాశ్వతంగా కంటి చూపును కోల్పోయారు. ఢిల్లీ ప్రభుత్వం, జమ్మూకశ్మీర్ పిడిపి, బిజెపి ప్రభుత్వాలకు కశ్మీరీ ప్రజల ఆగ్రహం, ఆకాంక్ష అర్థమయినప్పటికి అణచివేతను నమ్ముకోవడమే కాకుండా పెల్లెట్స్ బదులు మిర్చి పొడిని దట్టించిన మందు గుండును మాత్రమే వాడాలనే హాస్యాస్పద నిర్ణయాన్ని తీసుకోవడమే కాకుండా లోయలోని కల్లోలానికి పాకిస్తాన్ ప్రేరేపిత ఉగ్రవాదమే కారణమని పదేపదే ప్రచారం చేస్తున్నది. అఖిల పక్షాన్ని కశ్మీర్‌లోయకి పంపినప్పటికి కశ్మీర్ ప్రజల ఆవేశం, ఆగ్రహం చల్లారకపోగా మరింత ఉధృతంగా కొనసాగుతూనే ఉంది. హురియత్ కాన్ఫరెన్స్ నాయకులైతే అసలు అఖిల పక్షాన్ని కలవడానికే నిరాకరించారు. కశ్మీర్ కల్లోలానికి పాకిస్తాన్ కారణమని అంతర్జాతీయ సమాజం దృష్టిలో దోషిగా నిలబెట్టాలని, బెలూచిస్తాన్‌లో ఏం జరుగుతుందంటూ పంద్రాగస్టు ప్రసంగంలో ప్రధాని ప్రస్తావించారు. మీరు కశ్మీర్‌లో ఏం చేస్తున్నారో బెలూచిస్తాన్‌లో మేం అదే చేస్తాం అనే అర్థంవచ్చేలా మాట్లాడారు. దీనితో అంతర్జాతీయ దృష్టితోపాటు ప్రధానంగా భారతదేశంలో బెలూచిస్తాన్‌కు సంబంధించిన చర్చ చాలా విస్తృతంగా జరుగుతున్నది. ఇంతకు కశ్మీర్ అంశానికి బెలూచిస్తాన్‌కి ఏంటి సంబంధం అనే కోణంలో అనేకమంది ఆసక్తిపరులు, అధ్యయన శీలురు బ్రిటిష్ వలసపాలనా చరిత్రను, బెలూచిస్తాన్ మూలాలను తవ్వే పనికి పూనుకున్నారు. నిజానికి కశ్మీర్ ప్రజల ఉద్యమం, వారిపై సైన్యం చేస్తున్న అకృత్యాలు, హక్కుల ఉల్లంఘణలు, అణచివేతల నుండి కొంతమేరకు ప్రపంచ ప్రజల దృష్టిని మళ్లించేందుకు ఈ ప్రస్తావన ఉపయోగపడుతుందేమో గానీ కశ్మీరీల ఆగ్రహ జ్వాలలను చల్లార్చేందుకు ఉద్దేశించబడింది కాదనేది స్పష్టం.

పాకిస్తాన్ మొత్తం భూభాగంలో సగం బెలూచిస్తాన్ ప్రాంతమే విస్తరించి ఉంటుంది. పాకిస్తాన్ నైరుతి భాగమైన బెలూచ్ పాక్‌కు పశ్చిమాన ఇరాన్, ఉత్తరాన ఆఫ్ఘనిస్తాన్, దక్షిణాన అరేబియా సముద్ర ప్రాంతాల మధ్య నెలకొని ఉన్నది. ప్రధానంగా బెలూచ్ తెగ ప్రజలతో పాటు అనేక గిరిజన తెగలతో కూడిన జనాభా పాకిస్తాన్ బెలూచిస్తాన్‌తో పాటు ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్ దేశాల్లో కూడా వీరు నివసిస్తున్నారు. అరబ్ పాలన తర్వాత తొలిసారిగా 1839లో బెలూచిస్తాన్ పాలకులతో బ్రిటిష్ పాలకులకు ఆఫ్ఘాన్‌తో జరుగుతున్న యుద్ధం సృష్టించిన అనివార్య పరిస్థితులలో ఓ ఒప్పందం చేసుకోవడం ద్వారా కలట్‌గా ఆనాడు పిలవబడిన నేటి బెలూచిస్తాన్ ఆధునిక చరిత్రలో వెలుగులోకి వచ్చింది.

ఇవాళ భారతదేశంలో కొంతమంది భావిస్తున్నట్టుగా బెలూచిస్తాన్ బ్రిటిష్ పాలిత భారత దేశ సంస్థానాలల్లో ఒకటిగా కాకుండా స్వతంత్ర అస్తిత్వం కలిగిన రాజ్యంగా చరిత్రలో నిలిచింది. ఆఫ్ఘాన్ యుద్ధ నేపథ్యం, ఆ యుద్ధం కోసం అనివార్యమైన మార్గం, యుద్ధ అవసరాల కోసం బ్రిటిష్ కలట్‌తో మొదటి ఒప్పందం 1839 లో మొదలై 1876 వరకు మొత్తం 5 ఒప్పందాలను కుదుర్చుకోవడంతోపాటు 1876 నాటి ఒప్పందమైతే ఖాన్‌ల పాలనను స్వతంత్ర్య రాజ్యంగా గుర్తించింది. బ్రిటిష్ ఆధిపత్య స్వభావంతో ఈ అన్ని ఒప్పందాల ఫలితంగా ఆ రాజ్యం తన ప్రాభవాన్ని కోల్పోతూ వచ్చింది. ప్రాభవాన్ని, పట్టును కోల్పోయినప్పటికీ 1947 వరకు స్వతంత్ర స్థితిని అనుభవిస్తూ వచ్చింది. ఈ ప్రాతిపదికనే ఏరోజు కూడా ఖాన్ (కలట్ పాలకుడు) ఢిల్లీలోని చాంబర్ ఆఫ్ ప్రిన్సెస్‌లో కలవకుండా, తాము బ్రిటిష్ పాలిత భారత సామ్రాజ్యంలో భాగం కాదని బహిరంగంగానే ప్రకటిస్తూ వచ్చాడు. దీనికి తోడు నేపాల్, భూటాన్, సిక్కింలతో పాటు కలట్‌ను కూడా బ్రిటిష్ ఇండియా విదేశాంగ శాఖే అనేక వ్యవహారాలను నెరుపుతూ వచ్చింది.

అయితే 1935 భారత ప్రభుత్వ చట్టం ఏ కారణంగానో ఖాన్‌ల (కలట్) ప్రాంతాన్ని ఇండియాలో భాగంగా భావించింది. దీనిని నిరసిస్తూ ఆనాటి కలట్ పాలకుడు 1876 ఒప్పందాన్ని గౌరవించాలని, స్వతంత్ర్య రాజ్యంగా గుర్తించాలని ఆనాటి బ్రిటిష్ పాలకులను డిమాండ్ చేయడంతో దానికి బదులు చెపుతూ ఆ ఒప్పందం అంశాలను యథాతథంగా గుర్తిస్తున్నట్టు బ్రిటిష్ పాలకులు సమాచారం పంపడంతో ఆ ఒప్పంద ప్రాతిపదికనే బ్రిటిష్‌కి కలట్‌కి సంబంధాలున్నాయని స్పష్టమైంది. 1946 మార్చిలో తన లాయరైన మహ్మద్ అలీ జిన్నా ద్వారా కేబినెట్ మిషన్‌కి సమర్పించిన పత్రంలో సైతం ఇండియాకు అధికార బదలాయింపు తరువాత బ్రిటిష్‌తో ఉన్న అన్ని ఒప్పందాలు రద్దవడమే కాకుండా వాటి ఫలితంగా విధించబడిన ఏ షరతులకు బద్ధునిగా ఉండాల్సిన అవసరం లేదని సంపూర్ణ సార్వభౌమాధికార రాజ్యంగా ఉంటామని తెలిపింది. ఇదే అంశంపై 1947 ఆగస్టు 4న జరిగిన రౌండ్ టేబల్ సమావేశాలలో లార్డ్ మౌంట్ బాటన్, ఖాన్ ఆఫ్ కలట్, మహ్మద్ అలీ జిన్నాకు మధ్య ఒప్పందం కుదరడమే కాకుండా బ్రిటిష్ వారితో కుదిరిన మొదటి ఒప్పందం 1939కి ముందు ఏ స్థితి ఉండిందో ఆ స్థితిని కలట్ అనుభవిస్తుందని స్పష్టంగా పేర్కొన్నారు. కలట్-పాకిస్తాన్ యథాతథ

ఒప్పందంపై జిన్నా సంతకం చేసి కలట్ సార్వభౌమాధికారాన్ని గుర్తిస్తున్నట్లు ప్రకటించాడు. దాని ఫలితంగా 1947 ఆగస్టునే పాకిస్తాన్ ఏర్పడడానికి రెండురోజుల ముందే కలట్ స్వతంత్రాన్ని ప్రకటించుకున్నది. కాని మహ్మద్ అలీ జిన్నా కొద్ది కాలంలోనే ఈ ఒప్పందాన్ని ఉల్లంఘించే చర్యలకు పూనుకున్నాడు. 1947 అక్టోబర్‌లో పంపిన ఒక నోట్‌లో కలట్‌ను స్వతంత్ర రాజ్యంగా గుర్తించినప్పటికి పాకిస్తాన్‌లో కలిసిన ఇతర సంస్థానాల మాదిరిగానే కలట్‌ను కూడా కలుపుకోవాలనే తలంపుతో ఉన్నట్టు ఆ నోట్‌లో పేర్కొన్నాడు.

దీనికి తక్షణ చారిత్రక, భౌగోళిక నేపథ్యమూ లేకపోలేదు. బ్రిటిష్ పాలన కంటే ముందు బెలూచిస్తాన్ నాల్గు సంస్థానాలతో కూడి ఉన్నది. కలట్, లాస్బెలా, ఖారన్, మెక్రాన్. కలట్‌లో మెక్రాన్ జిల్లాగా ఉంటూ మిగతా ప్రాంతాలు ఒప్పందంలో భాగంగా కలట్ రాజ్యంలో విలీనమైనవి. ఈ స్థితిని జిన్నా కూడా గుర్తించాడు. ఆ ప్రాంత భౌగోళిక ప్రాధాన్యత వల్లనో, భవిష్యత్తులో తలెత్తే పరిణామాలను దృష్టిలో ఉంచుకొని జిన్నా మనసు మార్చుకోవడమే కాకుండా మొత్తం కలట్ (బెలూచిస్తాన్) రాజ్యాన్ని పాక్‌లో విలీనం చేయాలనే ప్రతిపాదనను బలంగా కలట్ పాలకుల ముందు పెట్టాడు. ఈ ప్రతిపాదనను యార్‌ఖాన్ (కలట్ పాలకుడు) ఒప్పుకోకపోవడంతో అటునుంచి నరుక్కొచ్చే పనిని ప్రారంభించి 1948 మార్చి 18న ఖారన్, లాస్బెలా, మెక్రాన్‌లు పాక్‌లో విలీనమౌతున్నట్టు అమెరికా రాయబారి ద్వారా ఖాన్‌కి సమాచారం అందించాడు. ఈ ప్రతిపాదనను ఖాన్ తిరస్కరించడంతో పాక్ ఆర్మీ 1948 మార్చి 26న బెలూచిస్తాన్‌లోకి తీర ప్రాంతం నుండి ప్రవేశించి ఏప్రిల్ 1న కలట్‌ను స్వాధీన పర్చుకున్నది. సరిగ్గా ఇది ఇండియన్ ఆర్మీ సెప్టెంబర్ 17న హైద్రాబాద్ రాజ్యాన్ని ఇండియాలో 'పోలీస్ చర్య' పేరుతో కలిపేసు కున్నట్టు. కలట్‌ను సైన్యం చర్యతో పాక్‌లో కలిపేసుకొనే నాటికి కలట్ రాజ్య రాయబారి కరాచిలో ఉండడం, కలట్ జెండా రాయబారి కార్యాలయంపై ఎగరడం వంటిది బెలూచిస్తాన్ స్వతంత్ర అస్తిత్వాన్ని తెలుపుతాయి. దేశ విభజన సందర్భంలో కశ్మీర్, జునాగడ్, హైద్రాబాద్ రాజ్యాలకు సంబంధించిన చరిత్ర తెలిసినంతగా పాక్ ఆక్రమిత బెలూచిస్తాన్ చరిత్ర ప్రపంచానికి ప్రధానంగా భారత ప్రజలకు తెలిసే అవకాశం లేకుండా పోయింది. ఇంచుమించుగా కశ్మీర్ చరిత్ర కూడా బెలూచిస్తాన్ చరిత్రలాంటిదే.

పాక్ బెలూచిస్తాన్‌ను సైనిక చర్యతో విలీనం చేసుకోవడంతో అక్కడి ప్రజలు బానిసత్వంలోకి నెట్టివేయబడ్డారు. ఆ ప్రాంతం సముద్ర తీరాన్ని కలిగి గల్ఫ్ దేశాలకు ముఖద్వారంగా ఉండి వ్యూహాత్మక ప్రాధాన్యతను సంతరించుకున్నది. పాకిస్తాన్ ఆర్థికాభివృద్ధిలో తన సహజ వనరులతో అత్యంత కీలకమైన పాత్రను పోషిస్తున్నది. సహజ వాయువు, బొగ్గు, కాపర్, బంగారం వంటి అనేక ఖనిజ నిక్షేపాలతో కూడిన సంపద్వంతమైన ప్రాంతం బెలూచ్. కానీ ఆ ప్రాంత అభివృద్ధికి ఆ సహజ వనరులేవి ఉపయోగపడకపోగా బయట ప్రాంతాలకు తరలించబడి బయటివాళ్ళను సంపన్నులుగా చేసి తమ ప్రాంతం మీదనే ఆధిపత్యం చేసేలా చారిత్రక పరిణామాలు దారితీసినాయి.

స్థానిక ప్రజలు, కటిక దారిద్ర్యం, నిరక్షరాస్యతలో మగ్గుతూ బానిసత్వంలోకి నెట్టివేయబడడంతో తిరగబడాల్సిన ఆఘాత్యం ఏర్పడింది. అప్పటికే బెలూచ్ ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా జరిగిన విలీనంతో ఆగ్రహంతో ఉన్న ప్రజలు 1958, 1962-63, 1973-77 ల్లో బెలూచ్ జాతి విముక్తి పోరాటాన్ని సాయుధం చేశారు. సహజంగానే పాక్‌లో పౌర ప్రభుత్వం కంటే సైనిక ప్రభుత్వాలు, సైన్యం ఆధిపత్యం ఎక్కువ కావడంతో బెలూచ్ ప్రజల జాతి విముక్తి పోరాటాన్ని, స్వరాజ్య కాంక్షను తీవ్రంగా అణచివేస్తూ వస్తున్నాయి. కనీసమైన ప్రజాస్వామిక, చారిత్రక దృష్టి కూడా లేకుండా బెలూచ్ పోరాట ప్రజలపై ఉక్కుపాదం మోపి రక్తపాతం సృష్టిస్తూ తీవ్రమైన హక్కుల ఉల్లంఘణకు పాల్పడుతున్నాయి. బెలూచిస్తాన్ లిబరేషన్ ఆర్మీ (బిఎల్ఎ), బెలూచిస్తాన్ రిపబ్లికన్ ఆర్మీ (బిఆర్ఎ), బెలూచిస్తాన్ లిబరేషన్ ఫ్రంట్ (బిఎల్ఎఫ్) తో పాటు అనేక సంస్థలు ఈ పోరాటంలో ఉన్నాయి. ఇప్పటికే వేలాది మంది పాక్ సైన్యం చేతిలో చనిపోయినట్లు దాదాపు 21 వేల మంది కనిపించకుండా పోయారని, 6 వేలకు పైగా ఛిద్రమైన ఉద్యమకారుల మృతదేహాలు దొరికినట్లు, బలవంతంగా మనుషుల్ని అదృశ్యం చేయడం నిత్యకృత్య మైందని పాకిస్తాన్ హక్కుల సంస్థలతో పాటు అనేక అంతర్జాతీయ హక్కుల సంస్థలు తమ నివేదికల్లో తెలియపర్చాయి. గ్రామాల మీద పడి విచ్చలవిడిగా కాల్చివేతలకు, బాంబుదాడులకు పాల్పడుతూ గ్రామీణ జీవితాన్ని ఛిద్రం చేస్తున్నారని కూడా చెబుతున్నాయి. బహుశా బెలూచ్ ప్రాంతం సహజ వనరులతో సంపన్నమైంది కాకుండా ఉండి ఉంటే ఇలా జరిగేది కాదేమో! అసలు పాక్ ఆక్రమించుకొనేదీ కాదేమో! వారి వనరులే వారి చారిత్రక అస్తిత్వం కనుమరుగవ్వడానికి కారణమవ్వటం చారిత్రక విషాదం.

బెలూచిస్తాన్ ప్రాంతంలో 22 శాతం కూడా అక్షరాస్యత లేదు. దేశ వ్యాప్తంగా 80 శాతానికి పైగా రక్షిత మంచి నీరు అందుతుంటే బెలూచిస్తాన్‌లో 20 శాతం కూడా అందని దయనీయ పరిస్థితి. 5వేల మంది పిల్లలు ఇప్పటివరకు ఈ తిరుగుబాటుపై జరుగుతున్న అణచివేతలో ప్రాణాలు కోల్పోయారు. ఈ ప్రాంతంలోకి విదేశీ జర్నలిస్టులు రాకుండా అడ్డుకోవడమే కాకుండా స్థానికంగా తిరుగుబాటు కు, విముక్తి పోరాటానికి మద్దతు తెలుపుతూ వార్తలు రాసే విలేకరులను సైతం సైన్యం చంపివేస్తున్నది. పాకిస్తాన్‌కు ఈ ప్రాంతం రక్షణపరంగా కీలకమైనదే కాకుండా గల్ఫ్ దేశాలతో వ్యాపార పరంగా ఇక్కడ తీర ప్రాంతం ఎంతో ఉపయోగపడుతుంది. బెలూచిస్తాన్‌లోని గవదర్‌లో పోర్టు నిర్మాణం, చైనా పాకిస్తాన్ ఆర్థిక సహకారం (సిపిఇసి)లో బాగంగా 46 బిలియన్ డాలర్లతో కూడిన పెట్టుబడుల ద్వారా, చైనాలోని జిన్ జియాంగ్ ప్రాంతం కష్గర్ వరకు రహదారి నిర్మాణంతో చైనా అరేబియన్ సముద్ర ప్రాంతంలో తన పట్టును పెంచుకొనే ప్రయత్నం చేస్తున్నది.

పాకిస్తాన్ చాలా కాలం నుండే ఇండియా పైన బెలూచ్ తిరుగుబాటు దారులకు సహకారం అందిస్తున్నట్టు, రీసెర్చ్ అనాలసిస్ వింగ్ (ఆర్ఎడబ్ల్యూ) శిక్షణా కేంద్రాలను నడుపుతున్నట్టు ఆరోపిస్తున్నది. ఈ ఆరోపణలకు బలం చేకూర్చేలాగ ప్రధాని మోడీ మాట్లాడడమే కాకుండా ఆ తిరుగుబాటు నాయకులకు ఆశ్రయం కూడా ఇవ్వబోతున్నారు. సరిగ్గా కశ్మీర్‌లో కూడా పాకిస్తాన్ చేస్తున్నది ఇదే. ఇండియన్ ఆర్మీ కశ్మీర్‌లో ఎటువంటి అఘాయిత్యాలకు, హత్యలు, విచ్చలవిడి హింస, మానవ హక్కుల ఉల్లంఘనలకు పాల్పడుతుందో బెలూచిస్తాన్‌లో కూడా పాకిస్తాన్ ఆర్మీ చర్యల వల్ల అదే జరుగుతున్నది. సరిగ్గా రెండు రాజ్యాలు అక్కడి ప్రజల స్వయం నిర్ణయాధికార కాంక్షను అణిచివేస్తూ మానవ హననానికి పాల్పడుతున్నాయి. బెలూచ్ తిరుగుబాటుదారులు పాకిస్తాన్‌కు టెర్రరిస్టు లు, కశ్మీర్ తిరుగుబాటుదారులు ఇండియాకు టెర్రరిస్టులు. కశ్మీర్ ప్రజల పోరాటం భారత ప్రభుత్వానికి వేర్పాటువాదంగా అనిపిస్తే బెలూచ్ తిరుగుబాటును పాకిస్తాన్ వేర్పాటువాదంగా చూస్తూ ఎవరి ప్రమాణాలల్లో వారు, ఎవరి ప్రయోజనాల కోసం వారు ఆలోచిస్తూ మారణకాండకు పాల్పడుతున్నారే కానీ ఆయా ప్రజల పోరాటాల్లోని ఆకాంక్షలను గుర్తించ

# అమెరికాతో భారత్ రక్షణ బంధం

*ప్రపంచ దేశాలపై ఆధిపత్యం నెరపాలనే కుట్రలో భాగంగానే అమెరికా భారత పాలకులతో కుదుర్చుకున్న రక్షణ రంగ ఒప్పందాన్ని అర్థం చేసుకోవాలని అంటున్నారు* **సంతోష్**

భౌగోళిక రాజకీయ వ్యూహంలో భాగంగా రక్షణ రంగంలో భారత్‌తో సాన్నిహిత్యం ఏర్పరచుకోవాలని గత పన్నేండేళ్ల నుంచి తపనపడుతున్న అమెరికా కోరిక ఆగస్టు 29న ఈడేరింది. అమెరికా తన ప్రపంచాధిపత్యపు వ్యూహంలో భారత్‌ను పావుగా మార్చుకోవడంలో విజయం సాధించినట్లు పేర్కొనవచ్చు. అమెరికా యుద్ధ విమానాలకూ, యుద్ధ నౌకలకూ, వెంట తరలివచ్చే సిబ్బందికి, సైనిక వసతులు, సామాగ్రి సరఫరా, సేవలు పరస్పరం వినియోగించుకోవడానికి వీలు కల్పించే కీలక ద్వైపాక్షిక ఒప్పందం 'లాజిస్టిక్స్ ఎక్స్‌చేంజ్ మెమోరాండం ఆఫ్ అగ్రిమెంటు (లెమోవా) పై భారత రక్షణ మంత్రి మనోహర్ పారీకర్, అమెరికా రక్షణ మంత్రి ఆష్టన్ కార్టన్‌లు ఆగస్టు 29న వాషింగ్టన్‌లో సంతకాలు చేశారు. నిజానికి ఇందుకు సంబంధించి నాలుగు నెలల క్రితమే మోడీ అమెరికా పర్యటించినప్పుడు ఇరు దేశాల మధ్య సూత్రపాయంగా అవగాహన కుదిరింది. ఇప్పుడు జరిగింది లాంచన ప్రాయమే.

ఈ ఒప్పందంతో రెండు దేశాల సైనిక, నావికా దళాలకు ఆహారం, ఆయుధాలు, మరమ్మతులు, ఇంధన అవసరాలు, స్థావరాల వినియోగం, వైద్యసేవలు, నిర్వహణ, శిక్షణ లాంటి అనేక అంశాల్లో పరస్పరం సహకరించుకునే అవకాశం ఏర్పడింది. దీంతో భారత్ అమెరికాకు జూనియర్ భాగస్వామిగా మారింది. ఆసియా పసిఫిక్, పశ్చిమాసియా ప్రాంతాల్లో ఇప్పుడు అమెరికాకు ఉన్న తగువుల్లో మనకిష్టం లేకపోయినా తల దూర్చక తప్పని స్థితి ఏర్పడవచ్చు. ఆసియా పసిఫిక్ ప్రాంతంలో భారత్ ఉనికి ప్రాధాన్యత సంతరించుకుంటుందని, ఇది ప్రపంచానికి మంచి చేస్తుందని ఆగస్టు 31న వాషింగ్టన్‌లో అమెరికా విదేశాంగ శాఖ ప్రతినిధి జాన్ కిర్బీ అనడాన్ని బట్టి అమెరికా మననుంచి చాలానే ఆశిస్తున్నదని భావించాల్సి వస్తుంది. భారతదేశ విశాల ప్రయోజనాలను, ప్రజల భద్రతను పణంగా పెట్టడానికి మోడీ ప్రభుత్వం తెగబడుతుండడం ఆందోళనకరం. దేశ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెట్టి, స్వాతంత్రతకు సంబంధించిన అంశాన్ని విస్మరించి, పార్లమెంటులో చర్చించకుండా, ప్రజాభిప్రాయం లేకుండా మోడీ ప్రభుత్వం లెమోవా ఒప్పందం కుదుర్చుకోవడం దిగ్భ్రాంతికరం. ఇది మోడీ ప్రభుత్వ దివాళాకోరు తనానికి నిదర్శనం. ఈ ఒప్పందం సంప్రదాయ విధానమైన మనదేశ వ్యూహాత్మక సైనిక స్వాతంత్రతకు విఘాతం కలిగించనుంది.

లెమోవా ఒప్పందంతో దేశానికి, సైన్యానికి అనూహ్యమైన ప్రయోజనాలేవో కలుగుతాయంటూ కేంద్ర ప్రభుత్వం, బిజెపి పెద్దలు చేస్తున్న ప్రచారం అసత్యాలు, అతిశయాలతో కూడుకున్నదే తప్ప మరొకటి కాదు. నిజానికి ఈ ఒప్పందంతో భారత్‌లో సైనిక స్థావరాలను వినియోగించుకునే అవకాశం, తన యుద్ధ వ్యూహానికి మరింత పదును పెట్టుకునే సౌలభ్యం అమెరికాకు లభించింది. మరో మాటలో చెప్పాలంటే అమెరికా యుద్ధ తంత్రానికి భారత్ వేదికగా మారనుంది. ఒప్పందం ప్రకారం భారత్ కూడా అమెరికా సైనిక స్థావరాలను వినియోగించుకునే అవకాశం ఉందని, కొత్త మౌలిక వసతులు అందుబాటులోకి వస్తాయని, ఆధునిక ఆయుధ సంపత్తిని, పరిజ్ఞానాన్ని పరిశీలించడంతో పాటు, వినియోగించడానికి అవకాశం లభిస్తుందంటూ ప్రభుత్వం చేస్తున్న వాదన తిమ్మిని బమ్మి చేసి చూపే ప్రయత్నమే! యుద్ధ సమయంలో సైనిక స్థావరాలను, అక్కడి మౌలిక వసతులను, ఇంధనం తదితర సౌకర్యాలను వినియోగించుకోవడమన్నదే ఒప్పందంలోని కీలకాంశం. దీనికి భిన్నంగా సాధారణ సైనిక విన్యాసాల స్థాయికి ఒప్పందాన్ని తగ్గించి చూపే ప్రయత్నం కేంద్ర ప్రభుత్వం చేస్తుండటం దారుణం.

ఈ ఒప్పందం మనదేశంలో అమెరికా సైనిక స్థావరాలు నెలకొల్పడానికి వీలు కల్పించేది కాదని, అందువలన ఆందోళన చెందాల్సినదేమి లేదని మన రక్షణ మంత్రి పారికర్ అంటున్నారు, అయితే ఈ ఒప్పందం వల్ల మన దేశానికి ఏమైనా ప్రయోజనం ఉన్నదా అంటే అదేమి లేదన్నది తేటతెల్లం. అమెరికాకు ప్రపంచమంతటా 130 దేశాల్లో 900 పైగా సైనిక స్థావరాలు ఉన్నాయి. ఆ దేశ బలగాలు ఒకచోటి నుంచి మరోచోటికి నౌకలు, విమానాల్లో ప్రయాణిస్తుంటాయి. వాటికి ఇంధనం నింపుకోవడానికీ, మరమ్మత్తులకూ, మందూమాకూ సమకూర్చుకోవడానికి మన దేశంలోని వసతులను అమెరికా వాడుకుంటుంది. కానీ మన సైన్యం తిరిగేది హిందు మహా సముద్రంలోనూ, ఆ చుట్టుపక్కల మాత్రమే. మన దేశం ప్రపంచాధిపత్యం కోసం పాకులాడటం లేదు. ఖండాంతరాలకు వెళ్లి దాడులు చేయడంలేదు. మనకు అమెరికా స్థావరాలను ఉపయోగించుకునే అవకాశమే రాదు. కాబట్టి ఈ ఒప్పందం అమెరికాకు తప్ప మనకు ఏవిధంగాను ఉపయోగ పడదు. అందువల్ల అమెరికా సైనిక అవసరాలను మన దేశం తీర్చడానికి ఒప్పందం కుదిరిందనడంలో సందేహం లేదు.

భారత్‌తో రక్షణ సంబంధాలను బలోపేతం చేసుకోవడానికి చాల ఏళ్లుగా అమెరికా ఒత్తిడి తెస్తున్నది. అమెరికా నాటో కూటమిలోని తన మిత్ర దేశాలతో రక్షణ రంగ సహకారానికి సంబంధించి నాలుగు

నిరాకరిస్తున్నారు. అరేబియా సముద్ర ప్రాంతంలో చైనా ప్రాభవాన్ని అడ్డుకోవడానికైనా, కశ్మీర్ వేర్పాటు ఉద్యమానికి మద్దతు తెలుపుతున్న దానికి విరుగుడుగా బెలూచ్‌కు మద్దతు తెలిపేలా, బెలూచ్ అంశాన్ని అంతర్జాతీయం చేయాలని భారత్ ప్రయత్నించినా ప్రయోజనం శూన్యం.

ఆయా ప్రాంతాల ప్రజల స్వయం నిర్ణయాధికార అస్తిత్వ పోరాటాలను గుర్తించకుండా, గౌరవించకుండా అణచివేస్తున్నంత కాలం, తాత్కాలిక ఎత్తుగడలకు పాల్పడుతున్నంత కాలం మిగిలేది మానవ హననమే.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

వీ

ప్రాథమిక ఒప్పందాలను కుదుర్చుకుంది. ఆ నాలుగు ఒప్పందాలలో మొదటిది 2002లో వాజ్‌పేయి ప్రధానిగా ఉన్నప్పుడు 'సైనిక సహకార భద్రత' ఒప్పందం కుదిరింది. 2005లో పౌర అణు ఒప్పందం కుదిరింది. మోడీ ప్రభుత్వం 'లెమోవా' పై తాజాగా రెండవ ఒప్పందంపై సంతకం చేసింది. ఇక 'కమ్యూనికేషన్లు సమాచార భద్రత అవసరాలు' ఒప్పందం (సిస్మోవా), ప్రాథమిక పరస్పర మార్పిడి ఒప్పందం (బెకా) పై త్వరలో ఒప్పందాలు జరుగనున్నాయి. ఇప్పటికే అమెరికా రక్షణ శాఖ మంత్రి నాటో సైనిక కూటమిలోని దేశాలతో భారత్‌కు సమానస్థాయి కల్పించినట్లు చెబుతున్నారంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. అలయెన్స్ అనే పదం లేకుండా కేవలం సహకారం పేరిట ఇది కొనసాగుతుంది. ఆసియా పసిఫిక్ ప్రాంతంలో అపారమైన వ్యూహాత్మక అవసరాలు గల అమెరికా లెమోవా ద్వారా వాటిని నెరవేర్చుకోవచ్చని ఆశిస్తున్నది. అమెరికా రక్షణమంత్రి ఆష్టన్ కార్టన్ త్వరలో ఢిల్లీ వచ్చి రక్షణ ఛత్రాన్ని విస్తరించబోతున్నారు. బరాక్ ఒబామా డిసెంబర్‌లో దిగిపోయేలోగా అనుకున్నవన్నీ కొలిక్కితెచ్చే పని ఇప్పుడు వేగంగా జరుగుతున్నది. రాబోయే కాలంలో ఈ వరుసలో మిగతా రెండు కీలకమైన ఒప్పందాలూ కుదిరిపోతే, అమెరికా భౌగోళిక రాజకీయ వ్యూహంలో భారత్ పావుగా మారక తప్పదు.

ప్రచ్ఛన్న యుద్ధ కాలంలో ఆసియా, ఆఫ్రికా దేశాలకు ఆదర్శ ప్రాయమైన దేశంగా భారత్ ఎంతో పేరు పొందింది. అలీనోద్యమ స్థాపక దేశంగా ప్రపంచవ్యాప్తంగా మన్ననలు పొందింది. ఇంతటి గౌరవ ప్రతిష్ఠలు పొందిన మన దేశం, అలీన విధానాన్ని ఆవిష్కరించిన దేశం అమెరికా శిబిరం వైపుగా అడుగులు వేయడం సిగ్గుచేటు. ఈ సెప్టెంబర్ 17–18 తేదీలలో వెనిజులాలో జరిగే అలీనోద్యమ శిఖరాగ్ర సమావేశానికి ప్రధాని మోడీ హాజరుకావడం లేదనే వార్త సంచలనం సృష్టిస్తున్నది. అలీనోద్యమ సదస్సులకు భారత ప్రధాని హాజరు కాకపోవడమనేది అనూహ్యం. అమెరికా, సోవియట్ శిబిరాలకు వెలుపల మూడవ ప్రపంచ దేశాలు స్వతంత్రంగా ఉండాలంటూ అలీనోద్యమాన్ని స్థాపించిన దేశాలలో మనదేశం కీలకమైనది. అలీనోద్యమం అంటే బడుగుదేశాలు అస్తిత్వాన్ని చాటుకోవడం. 1979లో చరణ్‌సింగ్ ప్రధానిగా ఉన్నప్పుడు అప్పటి రాజకీయ పరిణామాల నేపథ్యంలో అలీనోద్యమ సమావేశాలకు ఆయన హాజరుకాలేకపోయారు. ఆనాటి రాజకీయ పరిస్థితుల వల్ల అనుకోకుండా జరిగింది. కానీ ఇప్పుడు ప్రధాని మోడీ అలీనోద్యమ శిఖరాగ్ర సదస్సుకు ఉద్దేశపూర్వకంగా వెళ్లకపోవడం భారత విదేశీ విధానంలో విధానపరమైన మార్పును సూచిస్తున్నది.

ప్రచ్ఛన్న యుద్ధం ముగిసిన తరువాత అమెరికా ఒత్తిళ్లకు భారత్ తలొగ్గడం మొదలైంది. 1991లో ఫిలిపీన్స్‌లోని సైనిక స్థావరం నుంచి అమెరికా విమానాలు ఇరాక్‌పై దాడి చేసినప్పుడు, ముంబయి విమానాశ్రయంలో ఇంధనం నింపుకోవడానికి భారత్ అనుమతించింది. ఇరాన్‌ను తప్పుపడుతూ ఐక్యరాజ్యసమితి చేత అమెరికా తీర్మానం చేయించినప్పుడు భారత్ అమెరికాకు వంత పాడింది. ఆనాడు అంతర్జాతీయంగా అమెరికా ఆర్థికంగా ఇప్పటికన్నా బలంగా ఉన్నది. కానీ ఇప్పుడు అమెరికా బలహీనపడి భిన్న ధ్రువాలు ఏర్పడుతున్నాయి. అనేక దేశాలు తమ స్వీయ విదేశాంగ విధానాన్ని అమలు చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ఈ పరిస్థితులలో భారత్ అనుసరిస్తున్న అమెరికా అనుకూల వైఖరి సామ్రాజ్యవాద ఆధిపత్య విస్తరణ వాద కాంక్షకు అనుకూలంగా ఉంది. మన ప్రయోజనాల కోసం అమెరికాతో సన్నిహితంగా ఉండటంలో తప్పులేదు. కానీ అమెరికా ప్రయోజనాల కోసం మన విధానాలను మార్చుకోవడమే దివాళాకోరుతనం. అలీనోద్యమ బాట వీడటం అంటే మనలను మనం నైతికంగా బలహీనపరచుకోవడమే. విదేశాంగ విధానంలో మౌలిక మార్పులను తేవడం దీర్ఘకాలికంగా శ్రేయస్కరం కాదని, అమెరికా యుద్ధోన్మాదానికి భారత్ జతకావడం తప్ప మరొటి కాదని ప్రధాని మోడీ గుర్తించాలి.

ప్రచ్ఛన్న యుద్ధ కాలంలో రష్యాతో భారత్ సత్సంబంధాలు కొనసాగిస్తే, అమెరికా పాకిస్తాన్‌కు అండగా నిలిచింది. అఫ్ఘనిస్తాన్‌పై దాడి నేపథ్యంలో పాక్ అవసరం కాబట్టి అమెరికా ఆ దేశానికి దగ్గరైంది. ఇప్పుడు అఫ్ఘాన్ నుంచి సైన్యాలు వైదొలుగుతున్నాయి. అమెరికాకు పాక్ అవసరం తగ్గిపోయింది. ఇప్పుడు పాకిస్తాన్ చైనాకు దగ్గరవుతోంది. దీంతో భారత్ అమెరికాకు లొంగుబాటు ప్రదర్శిస్తోంది. మరోవైపు చైనా గత కొంతకాలంగా ఆర్థికంగా, సైనికంగా బలపడుతోంది. అమెరికా ప్రపంచ ఆధిపత్యానికి సవాలుగా మారింది. రష్యా తిరిగి ఆర్థికంగా పుంజుకుంటోంది. ప్రపంచ వ్యూహాత్మక భౌగోళిక రాజకీయాల్లో భాగంగా చైనాతో సన్నిహితమవుతోంది. ఈ నేపథ్యంలో భారత్ – అమెరికా మధ్య సంబంధాలు కొత్తపుంతలు తొక్కుతున్నాయి. రక్షణ రంగంలో మైత్రీబంధం విస్తరిస్తోంది. ప్రచ్ఛన్న యుద్ధ కాలంలో రష్యాకు అత్యంత సన్నిహిత భాగస్వామిగా ఉన్న భారతదేశం, ఇప్పుడు అమెరికా వైపు మొగ్గుచూపటం అంతర్జాతీయ పరిణామాల్లో అత్యంత ఆసక్తికరమైన మలుపు.

సోవియట్ రష్యా విచ్ఛిన్నం అనంతరం 1990 దశకంలో సామ్రాజ్యవాద దేశాల నాయకునిగా అమెరికా తిరుగు లేని శక్తి. దీన్ని ఎదిరించే దమ్ము ఆనాడు ఏదేశానికీ లేదు. కొన్నేళ్లుగా చైనా శరవేగంగా విస్తరిస్తూ అంతర్జాతీయ వేదికల మీద అమెరికా ఆధిపత్యాన్ని సవాలు చేసేందుకు ప్రయత్నాలు చేస్తోంది. మనదేశానికి పొరుగున ఉన్న పాకిస్థాన్‌కు చైనా ఆర్థిక సైనిక సహకారాన్ని అందిస్తోంది. ఈ పరిస్థితి చైనాకు పొరుగున ఉన్న భారత్‌కు ఇబ్బందికరంగా మారింది. అందువల్ల భారత్ వ్యూహం మార్చింది. నిజానికి భారత్ పాకిస్థాన్‌ల మధ్య ఘర్షణ పెంచి పోషించింది అమెరికానే నన్నది చారిత్రక సత్యం. ఇప్పుడు భారత్ రక్షణ అవసరాల కోసం అమెరికాకు దగ్గర కావటం ప్రారంభించింది. లెమోవా ఈ కోవలోనిదే. నాలుగేళ్ల కిందట రక్షణ సాంకేతిక పరిజ్ఞాన భాగస్వామ్యం (డిఫెన్స్ టెక్నాలజీ ఇనిషియేటివ్) కుదిరిన నాటి నుంచి రక్షణ రంగంలో ఇరు దేశాల మధ్య సహకారం పెరుగుతోంది.

లెమోవా ఒప్పందం ఎంతో తెలివైన పదజాలంతో, పైకి సాధారణ సేవలుగా కనిపిస్తున్నప్పటికీ, ఇది పొరుగుదేశాలను కలవరపెడుతూ, ప్రతిపక్షాలను ఎందుకంత ఆగ్రహానికి గురిచేస్తున్నదన్నదే అసలు ప్రశ్న. తమ సైనిక స్థావరాలను వాడుకోవచ్చునన్న అద్భుతమైన అవకాశం ఎవరు అధికంగా అందుకుంటారన్నది అసలు లెక్క. సరిహద్దులను కాపలా కాసుకోవడం, దురాక్రమణలను నిలువరించడం చాలనుకున్నప్పుడు, అమెరికా స్థావరాలతోనూ వాటి సేవలతోనూ మనకు వచ్చిపడే అవసరం ఏమిటో తెలియదు. అమెరికాతో కలిసి యుద్ధాలు చేయదల్చుకున్నప్పుడు తప్ప. అమెరికాతో రక్షణ సంబంధిత ఒప్పందాలను కుదుర్చుకోవలసిన అవసరమే ఏర్పడదు. అంటే ఈ ఒప్పందం మోడీ యుద్ధ కాంక్షకు సంకేతంగా నిలువనుందా? అన్న సందేహం కలుగుతుంది.

చైనా కట్టడికి అమెరికా వ్యూహాత్మకంగా అడుగులు వేస్తుంటే భారత్ అమెరికా ఉచ్చులో చిక్కుకోవడం ఆందోళనకరం. ఇక్కడ చైనాతో ఘర్షణకు దిగవల్సిన అవసరాలు, ప్రయోజనాలు ఎవరికి అవసరం అన్నది ప్రధానాంశం. చైనా దూకుడుకు కళ్లెం వేయడమూ, దానితో యుద్ధం చేయడమూ ఎవరికి అవసరమో, ఎవరు యుద్ధం చేస్తే ఎవరు సహకరిస్తారో ప్రధానం. చైనాకు ధీటుగా కనిపించాలనుకోవడంలో తప్పేమీ లేదు కానీ, ఆ వెంపర్లాటలలో క్షేత్రస్థాయి వాస్తవాలను విస్మరించి

తలతాకట్టు పెట్టడమే అభ్యంతరకరం. ఒక దేశంగా చైనాతో భారత్‌కు యుద్ధ అవసరం లేదు. భారత ప్రజలు పొరుగు దేశాలతో పరస్పర అవగాహనతో కూడిన శాంతి, సౌభ్రాతృత్వాలను కోరుకుంటున్నారు తప్ప ప్రాణ నష్టం, ఆస్తి నష్టం కలిగించే నెత్తుటి ధారల యుద్ధాన్ని కోరుకోవడం లేదు. ఇప్పుడు కేంద్రంలోని నరేంద్రమోడీ ప్రభుత్వం దీనికి పూర్తిగా భిన్నమైన మార్గం తొక్కింది. రణ కాంక్షేలేని దేశానికి యుద్ధ సమయాల్లో వినియోగించుకోవడానికి స్థావరాలను సిద్ధం చేశామని ఘనంగా చెబుకోవడం సిగ్గుచేటు. దేశ రక్షణ కోసం సైన్యాన్ని సిద్ధంగా ఉంచుకోవడం, అవసరమైన ఆయుధ సంపత్తిని సమకూర్చుకోవడం, సౌకర్యాలు కల్పించడం వేరు కానీ, మనకు సంబంధం లేని, దేశ ప్రజలకు ఏమాత్రం క్షేమకరం కాని, అమెరికా సామ్రాజ్యవాద యుద్ధ వ్యూహంలోకి భారత సైన్యాన్ని లాగడం వేరు. మోడీ సర్కారు చేస్తున్నది ఇదే.

దౌత్యరంగంలో ప్రతి అంశమూ కీలకమైనదే. రెండు దేశాలు ఒప్పందాలు కుదుర్చుకోవడం మాత్రమే కాదు.... అందుకు ఎంచుకున్న సమయమూ, సందర్భమూ కూడా పరిగణనలోకి వస్తాయి. హేగ్‌లోని అంతర్జాతీయ సాగర జలాల వివాద పరిష్కార ట్రిబ్యునల్ మూడేళ్లనాటి ఫిలిప్పీన్స్ ఫిర్యాదుపై గత జూలైలో తీర్పు వెలువరిస్తూ దక్షిణ చైనా సముద్ర వివాదంలో చైనా వాదన చెల్లదని తీర్పునిచ్చింది. ఆ తీర్పును చైనా తిరస్కరించగా, మన దేశం స్వాగతించడంతో పాటు అన్ని పక్షాలూ దాన్ని గౌరవించాలని హితవు పలికింది. ఈ నేపథ్యంలో భారత్, అమెరికాల సమావేశాన్ని, ఒప్పందం కుదరడాన్ని అర్థం చేసుకోవాలి. ఇరు దేశాల సంబంధాలూ తామిద్దరికి మాత్రమే కాదు... ప్రపంచానికే మంచిదని కిర్బీ ఎందుకన్నారో అర్థమవుతుంది.

దక్షిణ చైనా సముద్రంలో చైనాతో తగాదా ఉన్న మరో దేశం వియత్నాంలో సెప్టెంబర్ 3న ప్రధాని నరేంద్ర మోడీ పర్యటించారు. చైనాలో జరగబోయే జీ-20 దేశాల శిఖరాగ్ర సమావేశాల్లో పాల్గొనడానికి వెళ్తూ మోడీ వియత్నాంను సందర్శిస్తారు. ఏ అంశంపైన అభిప్రాయం వ్యక్తం చేయని చైనా ప్రభుత్వ అధ్వర్యంలో నడిచే 'గ్లోబల్ టైమ్స్' భారత్-అమెరికాల బంధం చైనా, పాకిస్తాన్‌లకు మాత్రమే కాదు... రష్యాకు కూడా ఆగ్రహం తెప్పిస్తుందని వ్యాఖ్యానించడం గమనార్హం. దక్షిణ చైనా సముద్ర ప్రాంతంలో అమెరికా-చైనాల మధ్య ఉద్రిక్తతలు పెచ్చరిల్లుతున్న ప్రస్తుత తరుణంలో ఈ ఒప్పందం అందులో అనవసరంగా మన ప్రమేయాన్ని పెంచుతుందన్నది విపక్షాల ఆందోళన. మన ప్రయోజనాలు, అవసరాలు గీటురాయిగా దేన్నయినా నిర్ణయించుకునే స్వేచ్ఛకు ఇలాంటి ఒప్పందాలు పరిమితులు విధిస్తాయని అవి ఆందోళనపడుతున్నాయి.

అనేక దేశాలు తమ స్వీయ విదేశాంగ విధానం కోసం ప్రయత్నిస్తుంటే, తనకున్న అలీన విధానాన్ని భారత్ వదులుకోవడంలో ఏ మాత్రం అర్థంలేదు. మన ప్రయోజనాల కోసం అమెరికాతో సన్నిహితంగా ఉండవచ్చుగానీ, దాని ఆధిపత్యపు ఆకాంక్షలు నెరవేర్చుకోవడం కోసం మన విదేశీ విధానాన్ని మార్చుకోవడం, కొత్తగా శత్రువులను తయారుచేసుకోవడం మూర్ఖత్వమే అవుతుంది. హిందు మహాసముద్ర ప్రాంతంలోని డీగో గార్షియా, ఒమాన్ తీరంలోని భారీ నావికా కేంద్రం కలిగి ఉన్న అమెరికాకు ఇప్పుడు భారత్ అవసరం ఎంతో ఉంది. ఇరాన్ సహా అనేక లక్ష్యాలను సునాయాసంగా అమెరికా సాధించుకోవడానికి ఇది ఉపకరిస్తుంది. అయితే ఛబహార్ పోర్టు అభివృద్ధిలో ఇరాన్‌ను అత్యంత కీలక స్నేహదేశంగా భారత్ భావిస్తున్నది. భవిష్యత్తులో అమెరికా, ఇరాన్‌పై దాడికి దిగితే భారత్ ఇరకాటంలో పడడం ఖాయం. అంటే ఎంతటి ప్రమాదకర ఆటకు భారత్ దిగిందో అర్థం చేసుకోవచ్చు.

లెమోవా ఖరారవుతున్న సమయంలోనే న్యూఢిల్లీలో అమెరికా విదేశాంగ మంత్రి కెర్రీ భారత విదేశాంగ మంత్రి సుష్మాస్వరాజ్‌ల మధ్య వాణిజ్యం, వ్యూహాత్మక సంభాషణ (స్ట్రాటెజిక్ అండ్ కమర్షియల్ డైలాగ్) ఒప్పందం జరిగింది. ఈ సందర్భంగా సుష్మా ప్రస్తావించిన ఏ అంశంపైనా కెర్రీ సూటిగా సమాధానం ఇవ్వకుండా దాటవేతధోరణి ప్రదర్శించింది. పాకిస్థాన్‌లో పర్యటించినప్పుడు ఈ అంశాలను ప్రస్తావిస్తానని పేర్కొందే తప్ప ఆ దేశ వైఖరిని ఏ మాత్రం వెల్లడించలేదు. అమెరికా చర్యలు భారత పారిశ్రామికరంగానికి వ్యతిరేకంగా ఉన్నాయని మరోమంత్రి చెబితే కెర్రీ నుంచి స్పందనే లేదు. ప్రచ్ఛన్న యుద్ధం దర్మిలా మన పాలకులు అమెరికాకు క్రమంగా లొంగిపోయే ధోరణి ప్రదర్శిస్తూ వచ్చారు. మోడీ ప్రభుత్వం ఇప్పుడు పూర్తి సాష్టాంగ ప్రమాణం చేసేలా వ్యవహరిస్తోంది. ఈ ఒప్పందం పరస్పర అవగాహనగా చెబుతున్నా ఆచరణలో అమెరికాకు తల తాకట్టు పెట్టడమే. అంటే అమెరికా ఉచ్చులో భారత్ చిక్కుకోవడమే.

ప్రపంచ సామ్రాజ్యవాద అగ్ర దేశపు యుద్ధ కుతంత్రాలకు మన సైనిక స్థావరాలు వేదికలుగా మారనున్నాయి. ఇప్పటికే ఆసియా, పశ్చిమ పసిఫిక్ సముద్రంపై ఆధిపత్యం కోసం అర్రులు చాస్తున్న అమెరికాకు ఇది అందివచ్చిన అవకాశం. భారత్‌లోని సైనిక స్థావరాలను ఆధారంగా చేసుకుని ఆసియాలో అమెరికా తన విధ్వంస వ్యూహానికి మరింతగా పదును పెడుతుంది. ఉప ఖండంతో పాటు పశ్చిమ పసిఫిక్ సముద్రమంతా యుద్ధ జ్వాలలను రగిలిస్తుంది. ఈ ప్రమాదాన్ని దృష్టిలో ఉంచుకునే భారత ప్రజలు మొదటి నుంచి అమెరికాతో సంబంధాల పట్ల హెచ్చరికలు చేస్తున్నారు. అయితే, భారత పాలకవర్గాలు మాత్రం ఈ హెచ్చరికలను పెడచెవిన పెట్టాయి.

2005లో కుదిరిన వివాదాస్పద అణు ఒప్పందం తరువాత, అమెరికా చైనాకు వ్యతిరేకంగా ఏర్పాటు చేస్తున్న కూటమిలోకి భారత్‌ను సులభంగానే లాగింది. అమెరికా ప్రయోజనాలకు అనుగుణంగా వ్యవహరించే దేశంగా వివిధ రకాలైన సైనిక ఒప్పందాలను భారత్ ముందు ఉంచింది. పెరుగుతున్న చైనా ఆర్థిక సైనిక శక్తిని ఎదుర్కొనడానికి అమెరికాతో సైనిక ఒప్పందాలు చేసుకుంటున్నట్లు రక్షణ మంత్రి పరీకర్ పేర్కొనడం గమనార్హం. లెమోవా ఒప్పందంతో భారత్ అమెరికాకు కీలక సైనిక భాగస్వామి దేశంగా మారింది. తాజా ఒప్పందం మరింత ప్రమాదకరంగా అమెరికా యుద్ధ వ్యూహాలలో భారత్‌ను భాగస్వామిని చేసింది. ఈ ఒప్పందం ద్వారా దేశ సార్వభౌమాధికారాన్ని కేంద్ర ప్రభుత్వం దిగజార్చింది. స్వయం ప్రతిపత్తిని అమెరికా ప్రయోజనాలకు తాకట్టు పెట్టింది. దేశాన్ని అమెరికా విష కౌగిలిలోకి నెట్టేసింది.

అమెరికాతో కుదిరిన సైనిక ఒప్పందాల అమలు ప్రారంభమైతే వాటి వల్ల మన దేశానికి జరిగే నష్టమేమిటో తెలుస్తుంది. ఈ లోగా పాకిస్థాన్ చైనాలు మనకు శత్రువులని ప్రజలను నమ్మించగలిగితే అమెరికాకు దాస్యం చేయడానికి, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలను యథేచ్ఛగా అమలు చేయడానికి ఏ అడ్డు ఉండదు. ప్రజా ఉద్యమాలను అభ్యుదయ శక్తులను దేశ ద్రోహులుగా ముద్ర వేసి అణిచి వేయవచ్చు. ఆ లక్ష్యంతో మోడీ ప్రభుత్వం అమెరికాకు దేశ ప్రయోజనాలను తాకట్టు పెట్టడానికి, దాస్యం చేయడానికి సిద్ధపడింది. ఇంతగా అమెరికా ముందు అవమానకరంగా సాగిలపడిన ఈ తీరును పూర్తి స్థాయిలో వ్యతిరేకించడమే నిజమైన దేశభక్తుల తక్షణ కర్తవ్యం. గత రెండు దశాబ్దాలుగా అమెరికాతో కుదుర్చుకున్న ఒప్పందాలన్నింటిని దేశ ప్రయోజనాల రీత్యా రద్దు చేసుకోవాలని బుద్ధిజీవులు, ప్రజాస్వామికవాదులు డిమాండ్ చేయాల్సిన సందర్భం ఇది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# హరితహారం పేరుతో భూ ఆక్రమణ

***హరితహారం పేరిట రైతుల నుంచి భూములు లాక్కొంటూ వాటిని దేశీ, విదేశీ పెట్టుబడిదారులకు అప్పగిస్తున్నారనీ, అడ్డుకుంటున్న ప్రజలను తీవ్ర నిర్బంధాలకు గురిచేస్తున్నారనీ అంటున్నారు* పద్మ**

జీవవైవిధ్యం, పర్యావరణం, టూరిజం, ఉద్యోగాలు, ఉపాధి మధ్య తరగతిని మైమరిపించే ఈ పదాల వెనుక ప్రభుత్వ ఉద్దేశాన్ని గ్రహించక పోతే అది నేడు చేస్తున్న విధ్వంసాన్ని అర్థం చేసుకోలేం. పేరు ఏదైతేనేం అడవుల నుండి, పంట భూముల నుండి, నివాసాల నుండి రైతాంగాన్ని వెల్లగొట్టడమే ప్రభుత్వ కర్తవ్యం. దేశవ్యాప్తంగా జరుగుతున్న ఈ 'అభివృద్ధి' లక్ష్యం అశేష రైతాంగం జీవితాలను పిడికెడు మంది పెట్టుబడిదారులకు బలి ఇవ్వడమే. ఇది కొత్త ముఖ్యమంత్రి బుర్రలో పుట్టిన సరికొత్త ఆలోచనేమీకాదు. గత ప్రభుత్వాలతో అమలు చేయించిన ప్రపంచబ్యాంకు పాతవ్యూహమే. భూముల స్వాధీనం హరితహారం కోసం కాదు. హరితహరణం కోసమే. అడవిని, భూములను హోల్‌సేల్‌గా బడాపెట్టుబడి దారులకు బహుళజాతి కంపెనీలకు అమ్మేయడానికే. ఖమ్మం, వరంగల్ సరిహద్దు ఏజెన్సీ ప్రాంతంలో తెలంగాణ ప్రజాఫ్రంట్ బస్సు యాత్ర ఆధారంగా మేము జరిపిన పరిశీలనలోని అంశాలను చూద్దాం.

### చెత్తకుప్పలోకి అటవీ హక్కుల చట్టం

సాగుచేసుకుంటున్న భూములకు పట్టాలివ్వాలని అనేక దశాబ్దాలుగా ఆదివాసులు చేసిన పోరాటం ఫలితంగా అటవీ హక్కుల చట్టం 2005లో వచ్చింది. దీని ప్రకారం అప్పటి వరకు ఆదివాసులు సాగుచేసుకుంటున్న భూములకు పట్టాలివ్వాలి. రైతులు పెద్దఎత్తున దరఖాస్తులు చేసుకున్నారు. అయితే అనేక కారణాలతో దరఖాస్తులను పెండింగ్‌లో పెట్టారు. వరంగల్ జిల్లా గూడూరు మండలంలోని కొమురంభీంగూడలో 70 దరఖాస్తులకు కేవలం ఒకటే దరఖాస్తును ఆమోదించి నాలుగు ఎకరాలకు హక్కుపత్రం ఇచ్చారు. అదే జిల్లా ఖానాపురం మండలం చిలుకమ్మనగర్‌లో 350 దరఖాస్తులకుగాను 36 దరఖాస్తులకే హక్కు పత్రాలు ఇచ్చారు. ఖమ్మం జిల్లా ఇల్లెందు మండలంలోని పోలారం గ్రామంలో 50 మందికి చెందిన 200 ఎకరాలలో సర్వేచేశారు కాని ఒక్క ఎకరంపై కూడా హక్కు కల్పించ లేదు. అదే జిల్లాలోని కొత్తగూడెం మండలం బాబాజితండలో 400 ఎకరాలకుగాను వంద ఎకరాలకే పట్టాలిచ్చారు. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. పట్టాలకోసం తిరిగి తిరిగి మేమే అలిసిపోయాం కాని ప్రభుత్వం కనికరించలేదని ఇల్లెందు మండలం మిట్టపల్లి రైతులు అన్నారు.

### పోడు భూములు కావవి పట్టాభూములు

ప్రభుత్వం చెప్పుతున్నట్టు 'మావి 2006 తరువాత సాగుచేసినవి కావు. 2006లో పట్టాలిచ్చారు. వాటిని చూపించడానికి తీసుకెళ్తే అధికారులు తీసుకొని చింపివేశారు' అని మట్వాడ గ్రామ ప్రజలు చెప్పారు. ఈ విధంగా ఈ గ్రామ పంచాయితీ పరిధిలోని 1800 ఎకరాల భూమిని స్వాధీనం చేసుకున్నారు. ఈ పంచాయితిలోని హనుమాన్ తండలో ప్రారంభంలో భాగంగా పట్టాలు ఇచ్చి మళ్లీ ఇస్తామని తిరిగి తీసుకున్నారు. కాని ఇవ్వలేదు. టేకులపల్లి మండలంలోని కొప్పురాయి పంచాయితీలో ఒడ్డుగూడెంలో 120 ఎకరాలకు సంబంధించిన పట్టాలను టిఆర్ఎస్ నాయకులు ఎన్నికల ముందు కొన్నింటిని ప్రజలకు చూపించి తమని గెలిపిస్తే ఇస్తామని ప్రచారం చేసుకున్నారు. కొందరి భూములను 'మీ భూములు ఇక్కడ లేవు. కంప్యూటర్‌లో వేరే పంచాయితి పరిధిలో చూపిస్తుంది' అని, 'మీరు 2006 తరువాత సాగుచేసి అంతకు ముందే సాగు చేసినట్టు స్థానిక అధికారులకు లంచాలు ఇచ్చి పట్టా చేయించుకున్నారు' అని ఫారెస్టు అధికారులు పట్టాలు రద్దు చేయించారు. పట్టాలు ఇవ్వడానికి 2006లో ప్రభుత్వం ఏర్పాటు చేసిన గ్రామ కమిటీ వారు తాము గుర్తించిన భూమి, సర్వే వివరాలను మాకు చూపించారు. అన్నింటికన్నా దారుణం ఏమిటంటే 2005 కన్నా ముందే ఎప్పుడో పట్టాలిచ్చిన భూములను కూడా అధికారులు స్వాధీనం చేసుకున్నారు. కొమురారం, బాబాజితండ గ్రామాల్లో తీసుకున్న భూములపై ప్రజలు కోర్టుకెళ్లి స్టే తెచ్చుకున్నారు. కాని అధికారులు వారికి భూములు స్వాధీనం చేయలేదు. నేడు ప్రభుత్వం తీసుకున్న భూమిలో 2006 తరువాత సాగులోకి తెచ్చిన భూమి 5 శాతం కూడా ఉండదు.

### అడవిని రక్షిస్తున్నది మేమే

'చుట్టు పక్కల వాళ్లు మా అడవిని నరకడానికి వస్తే మేము చాలాసార్లు కొట్టనీయలేదు. వాళ్లతో మాకు చాలా కొట్లాటలైనాయి. అయినా అడవిని కాపాడినం' అని కొమురంభీంగూడ ప్రజలు అన్నారు. గుండాల మండలం మామకన్ను గ్రామంలో 'వన సంరక్షణ సమితి ద్వారా మేమే అడవిని కాపాడుకుంటూ వస్తున్నం. ఫారెస్టోళ్లు మా భూములే తీసుకోవడం ఎందుకో అర్థం కావడం లేదు' అని అన్నారు. వాస్తవానికి వన సంరక్షణ సమితీలు ఏర్పడ్డ తరువాతనే అడవి పెంపొందించబడుతున్నదని ప్రభుత్వ అధ్యయనాలే తెలిపాయి. ఆదివాసులకు అడవి జీవనాధారం. ఈ యాత్ర సందర్భంగా కొమురారంలో జరిగిన సభలో విప్లవకవి వరవరరావు చెప్పినట్టు 'అందరికంటే ఎక్కువ అడవిని నమ్ముకున్న ఆదివాసులకే దానిని కాపాడుకునే బాధ్యత ఉంటుంది' ఈ వాస్తవం వాళ్లకు వాళ్ల జీవిత అనుభవం నుండి తెలుసు.

### దారుణ దమనకాండ

ఆదివాసులను ఫారెస్టు అధికారులు అనేక రకాలుగా వేధిన్నారు. ఇదివారికి కొత్తకాదు. కాని ఇప్పుడు వారి భూములు తీసుకుంటున్నది ఫారెస్టువాళ్లు కాదు. పోలీసులు. చట్టం ప్రకారం వారికి ఇందులో ఎలాంటి ప్రమేయం లేదు. ప్రజల ప్రతిఘటన వల్ల భూములు ప్రభుత్వ స్వాధీనం కాకపోవడంతో ప్రభుత్వమే పోలీసులను రంగంలోకి దించింది. భూములు తీసుకునే గ్రామంలో 144 సెక్షన్ విధిస్తున్నారు. పోరాటంలో ముందున్న

నాయకులను ముందస్తుగా అరెస్టు చేస్తున్నారు. తీసుకోవల్సిన భూముల చుట్టూ తాడుతో పోలీసు వలయాన్ని ఏర్పాటు చేస్తున్నారు. తరువాత ఫారెస్టు అధికారులకు సమాచారం ఇస్తే వారు ట్రాక్టర్లు, ప్రొక్లయిన్లు తీసుకొనివచ్చి పంట చేన్లను దున్నేసి, చుట్టూ (ఎవరు ప్రవేశించకుండా) లోతైన గుంతను తవ్వుతున్నారు. మొక్కలు నాటడానికి ఇక్కడి కూలీలు నిరాకరిస్తుండడంతో ఛత్తీస్‌గడ్, మహారాష్ట్రల నుండి కూలీలను తెప్పించుకొని పనులు చేయిస్తున్నారు. ప్రజలు తీవ్రంగా ప్రతిఘటిస్తున్న చోట్ల భారీగా పోలీసులు వస్తున్నారు. ఒడ్డుగూడెంలో 120 ఎకరాలు స్వాధీనం చేసుకోవడానికి గుండాల, కాంచనపల్లి, బోడు, కొత్తగూడెం, ఇల్లెందు, ఆలెపల్లి, టేకులపల్లి నుండి 200 మంది పోలీసులు దిగారు. ప్రజల కాళ్లు, చేతులు విరగ్గొట్టారు. తలలు పగిలాయి. ప్రజలు కేసుల నుండి బెయిల్‌పై బయటకు వస్తుంటే మళ్లీ కేసులు బనాయిస్తున్నారు. ప్రజాప్రతినిధులను కూడా కేసుల్లో ఇరికిస్తున్నారు. పోలారం సర్పంచ్ సరోజనపై రెండు, ర్యాగాల ఎంపిటిసి కోబాల్‌పై 6, బయ్యారం, ఇల్లెందు జడ్‌పిటిసిలపై కూడా కేసులు పెట్టారు. చంద్రుగొండ మండలంలోని మద్రిగూడెంలో ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న ఔఆ నాయకుడు ఉమర్‌పై పిడి యాక్టు కింద కేసు నమోదు చేశారు. అందరి మీదా పెడతామని బెదిరిస్తున్నారు.

**అధికారాన్ని పెంచుకోవడానికి టిఆర్ఎస్ ఎత్తులు**

ఈ ప్రాంతమంతా వామపక్ష ఉద్యమానికి బలమైన కోట. సిపిఎం, ఎన్‌డిటిపిఎఫ్ ఆదివాసీ సంఘాలు తమ శక్తి మేరకు ఈ పోరాటంలో పాల్గొంటున్నాయి. ఇక్కడ బలంగా ఉన్న ఎన్.డి పార్టీని టిఆర్ఎస్, పోలీసులు టార్గెట్‌గా చేసుకున్నారు. ఆ పార్టీ రాష్ట్ర కార్యదర్శి సాధినేని వెంకటేశ్వరరావుపై గత ఏడాది రాజద్రోహం కింద కేసుపెట్టారు. కార్యకర్తలను నాయకులను బయభ్రాంతులకు గురిచేస్తున్నారు. సభ్యులను, సానుభూతిపరులను ఆ పార్టీని వీడి టిఆర్ఎస్‌లో చేరితేనే మీ భూములు దక్కుతాయని లేకపోతే స్వాధీనం చేసుకుంటామని బెదిరిస్తున్నారు. చంద్రుగొండ మండలం మద్రిగూడెం గ్రామంలో ఈ పార్టీ నాయకత్వంలో సాధించుకొని 20 ఏండ్లుగా సాగు చేసుకుంటున్న 300 ఎకరాల ప్లాట్‌ని టిఆర్ఎస్ నాయకుడు జలగం వెంకట్రావు రాజకీయంగా తనది పైచేయి కావడానికే ప్రభుత్వానికి స్వాధీనం చేయించాడు. తమ భూముల పరిరక్షణ కోసం ఐక్యంగా పోరాడుతున్న గిరిజన గిరిజనేతరుల మధ్య ప్రభుత్వం చిచ్చు పెట్టింది. గిరిజనేతరుల భూములు మాత్రమే తీసుకుంటున్నామని గిరిజనులతో చెపుతోంది. గిరిజనుల భూములు తీసుకుంటున్నప్పుడు 2006 తరువాత భూములే తీసుకుంటున్నామని మభ్యపెడుతుంది. ఈ సమస్యను మేము బస్సు యాత్రకన్నా ముందు అంత సీరియస్‌గా పరిగణించలేదు. కాని ఇది చాలా ముఖ్యమైన సమస్యగానే ఉంది. ఏజెన్సీలో సర్వహక్కులు ఆదివాసులకే. వేరొకరికి ఏ హక్కులేదు. కాని సమస్య తీవ్రం కావడానికి ఎవరివంతు ఎంత అనేది సెకండరి. ప్రభుత్వ పాత్రే ప్రధానం. దీనిని గమనించని కొందరు పోరాడేవారిని విమర్శిస్తున్నారు. ఇది ఉద్యమాన్ని బలహీనపర్చడానికే దోహదపడుతుంది.

**పోరులో ముందున్న మహిళా రైతాంగం**

మా యాత్రలో జరిపిన మీటింగ్‌లకు హాజరైన వారిలో, సమస్యపై మాతో చర్చించిన వారిలో అత్యధికులు మహిళలే. స్థానిక నాయకులు చెప్పిన దాని ప్రకారం మహిళలే పోరాటంలో ఎక్కువగా భాగమౌతున్నారు. ప్రతిఘటించడంలోను ముందుంటున్నారు. మహిళలు పోలీసుల కండ్లల్లో కారంచల్లారని విన్నాం. అదేవిధంగా బాబాజితండ మహిళలు ఇసుకచల్లి ప్రతిఘటించారు. కాబట్టే పోలీసులు వీరిని లక్ష్యంగా చేసుకొంటున్నారు. ఈ తండాలో మహిళల పట్ల పోలీసులు ప్రవర్తించిన తీరు రాయడానికి వీలుకానిది. మాతో పురుషులు (వ్యవహారిక భాషలో) చెప్పుతుంటే వినలేక పోయాం. అక్కడ జరిగిన సభలో దాదాపు 200 మంది మహిళలు పాల్గొన్నారు. వారిలో అవమానభావం కనిపించలేదు. ఈ అవమాన పరిధులు దాటి తమ భూములను రక్షించుకోవడం, కోల్పోయిన భూములను తిరిగి సాధించుకోవడంపై వారి ఆలోచనలు సాగుతున్నట్లు గమనించాం. ఇతర చోట్ల కూడా కేసులను ఎదుర్కొంటున్నది మహిళా రైతాంగమే. మిట్టపల్లిలో 30 మందిపై కేసులు పెడితే అందులో 24 మంది మహిళలే. బాబాజితండలో 22 మందిలో 15 మంది, ఒడ్డుగూడెంలో 24 మందికిగాను 23 మంది మహిళలపైనే కేసులు పెట్టారు. ఆరుగురు మహిళలు 14 రోజులు జైలులో ఉండి బెయిల్‌పై బయటకు వస్తున్న క్రమంలో మళ్లీ వారిపై ఫారెస్టు అధికారులు కేసులు పెట్టారు.

**కోల్పోయిన భూములను తిరిగి సాధించుకోవడం సాధ్యమేనా?**

భూములు కోల్పోయిన ప్రజలు తీవ్ర మనోవేదనలో ఉన్నారు. ఎవరు ఏమి చెప్పినా పోయిన భూములు తిరిగిరావు అనే ఆలోచనలో ఉన్నారు. ఒకటి రెండు చోట్ల మాత్రమే ఏది ఏమైనా భూమిని తిరిగి స్వాధీనం చేసుకోవాలనే పట్టుదల కనిపించింది. నాయకత్వంలో కూడా ఆ విశ్వాసం కనిపించలేదు. ప్రజలు అంత సులభంగా భూములు వదులుకోలేదు. చాలాచోట్ల మాకు తెలిసిన దాని ప్రకారం ప్రజలు సిద్ధంగా లేని సమయంలో (పనులకు, మీటింగ్‌లకు వెళ్లిన సందర్భాలను చూసి) భూములు తీసుకున్నారు. కొన్నిచోట్ల రెండు మూడుసార్లు కూడా ఫారెస్టు, పోలీసు అధికారులు వెనుతిరగవల్సి వచ్చింది. చేతికి ఏది దొరికితే దానితో ప్రతిఘటించారు. పోరాటంలో వైఫల్యాల నుండి గుణపాఠం తీసుకోవల్సిన అవసరం ఉంది.

**ఉద్యమ సంస్థల ముందున్న కర్తవ్యం**

ప్రభుత్వం ఇంతటితో ఆగే అవకాశం లేదు. ఈ విషయాన్ని అధికారులు బహిరంగంగానే చెపుతున్నారు. ప్రజలు సంఘటితం కాకపోతే మరిన్ని భూములు కోల్పోయే అవకాశం ఉంది. ప్రజలు ఈ భూములన్నింటిని పోరాడే సాధించుకున్నారు. ఈ క్రమంలో అనేక కేసులెదుర్కొన్నారు. జైలుకెళ్లారు. ప్రజలు సిద్ధంగా లేరనే వాదన వస్తుంది. ఇది పాక్షికమే. ప్రజలకు సరియైన చైతన్యాన్ని అందించి నమ్మకాన్ని కలిగించగలగాలి. కొన్నిచోట్ల బాధితులు మాత్రమే కొట్లాడినట్లు తెలిసింది. ఐక్యంగా ఊరుమ్మడి కదిలే విధంగా చూడాలి. మరికొన్ని చోట్ల చిన్న చిన్న గూడాలలో వారి శక్తి సరిపోలేదు. కాబట్టి ఒక గ్రామానికి మద్దతుగా మరికొన్ని గ్రామాల ప్రజలు వచ్చే విధంగా కృషి చేయాలి. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో ఈ రూపం ఎక్కువ కనబడుతుంది. రాజకీయంగా దీనిని స్థానిక సమస్యగా మారుస్తున్న పాలకపార్టీల కుట్రలను తిప్పికొట్టాలి. దీని వెనుక ఉన్న ప్రభుత్వ ఉద్దేశాలను అర్థం చేయించాలి. అప్పుడు ప్రజలు తప్పక మరింత ఐక్యంగా పోరాటంలోకి వస్తారు. భూములను రక్షించుకోవడమే కాదు, వీలయిన చోట్ల తిరిగి సాధించుకోవడమూ సాధ్యపడుతుంది. ఇందు కోసం ఉద్యమ సంస్థలు ఎవరి శక్తి మేరకు వారు కృషి చేయాలి.

*(రచయిత రాష్ట్ర కోకన్వీనర్, తెలంగాణ రైతాంగ కళా సమితి)* వీ

# జోనల్ పద్ధతి - న్యాయాన్యాయాలు

*రాష్ట్రపతి ఉత్తర్వులను అమలు చేసినా అన్ని జిల్లాల వారికి న్యాయం జరిగేలా లేదనీ, వీలయిన మేరకు అన్ని ప్రాంతాల వారికి సమాన అవకాశాలు అందేలా చూడాలనీ అంటున్నారు* **బి. రామకృష్ణ**

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం అంతా కూడా నీళ్లు, నిధులు, నియామకాల్లో జరిగిన అన్యాయాలకు వ్యతిరేకంగా జరిగిందే. ఒక ప్రాంతంపై మరో ప్రాంత పెత్తనం, ఆధిపత్యాలను ఈ ఉద్యమం వ్యతిరేకించింది. సమన్యాయం కోసం, తమ ప్రాంత వనరులపై తమ హక్కును సాధించడం కోసం జరిగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం స్వరాష్ట్రాన్ని సాధించుకున్నాక అవే పరిస్థితులు ఉత్పన్నం కాకుండా తెలంగాణ రాష్ట్రంలో అన్ని ప్రాంతాల ప్రజలకు వనరులు నిధులు, నియామకాల్లో, విద్యా ఉపాధుల్లో సమన్యాయం జరగేలా చూడాలి. ఇది సమానత్వం కోసం జరిగే ఏ ఉద్యమమైన కాంక్షించేదే.

ఈ సందర్భంలో నిజాం కాలం నుండి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడే వరకు స్థానికులకు ఉద్యోగ నియామకాల్లో జరిగిన అన్యాయాల క్రమాన్ని గుర్తుకు తెచ్చుకుంటే వాటిని అధిగమించడానికి ఏమి చేయాలో తెలుస్తుంది. హైదరాబాద్ సంస్థానాన్ని పరిపాలించిన నిజాం కాలంలో ఇక్కడి ఉన్నత ఉద్యోగాల్లో అప్పటి మద్రాస్, బొంబాయి, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌ల నుండి అధికారులను నియమించారు. దీని ద్వారా స్థానికులకు ఉద్యోగావకాశాల్లో అన్యాయం జరిగింది. దీనికి వ్యతిరేకంగా 1916లోనే ముల్కీ ఉద్యమం వచ్చింది. ఈ నిరసనల నేపథ్యంలో ముల్కీ నియమాలు ముందుకు వచ్చాయి. ముల్కీ అంటే స్థానికులు, స్థానికత అని అర్థం. వీటి ప్రకారం కనీసం 15 సంవత్సరాలు ఈ ప్రాంతంలో నివసించిన వారికే ఉద్యోగాల్లో అవకాశం లభిస్తుంది. అలా చట్టం చేసిన నిజాం కూడా ఆ చట్టాన్ని అతి క్రమించడం జరిగింది.

హైదరాబాద్ రాజ్యం భారత యూనియన్‌లో కలుపబడ్డాక ముల్కీ నిబంధనలు అమలులో ఉన్నాయి. కాని అవి ఉల్లంఘించబడుతూనే ఉన్నాయి. మిలిటరీ జనరల్ జె.యన్.చౌదరి పాలనలో అలాగే ఆ తరువాత వచ్చిన యం.కె. వెల్లోడి పౌర ప్రభుత్వ పాలనలో కూడా పక్క రాష్ట్రాల నుండి అధికారులను నియమిస్తూపోయారు. నాన్ ముల్కీలను(స్థానికేతరులను) నియమించడం వల్ల స్థానికులైన విద్యావంతులకు ఉద్యోగాలు రావనే ఆందోళనలు ఇక్కడి ప్రజలకు, విద్యార్థులకు సహజంగానే ఏర్పడ్డాయి. 1952లో బూర్గుల రామకృష్ణరావు ముఖ్యమంత్రిగా ప్రభుత్వం ఏర్పడ్డాక కూడా ఇది అరికట్టబడలేదు. దొంగ సర్టిఫికెట్లను సృష్టించి ముల్కీలుగా(స్థానికులు) ఉద్యోగాలు పొందడం జరుగుతూనే ఉన్నది. దీంతో విద్యార్థులు వేలాదిగా 'నాన్ ముల్కీ గోబ్యాక్', 'గైర్ ముల్కీ గోబ్యాక్', 'ఇడ్లీ సాంబార్ గోబ్యాక్' అంటూ 1952లో పెద్దఎత్తున ఉద్యమించారు. ఆ ఉద్యమంపై తూటాలు ఎక్కుపెట్టబడ్డాయి. పదుల సంఖ్యలో మరణించారు. వందలల్లో తీవ్రంగా గాయపడ్డారు. ఈ ఉద్యమంలో విద్యార్థులే కాకుండా సాధారణ ప్రజానీకం అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఓ వైపు స్థానికులకు న్యాయం జరగాలనే ఉద్యమం నడుస్తుండగానే 1953లో ఫజల్ అలీ కమిషన్ ఏర్పాటు జరిగింది. ఈ కమిటీ సూచనలకు విరుద్ధంగా హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణ ప్రాంతం మద్రాస్ నుండి విడివడిన ఆంధ్రతో కలిసి 1956 నవంబర్ 1న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటైంది. తెలంగాణ ప్రాంత ప్రజలు ఆంధ్రతో కలవడాన్ని వ్యతిరేకించారు. కలవడం ద్వారా తరువాత జరిగే అన్యాయాలపై, ఆందోళనలు వెలిబుచ్చారు. దీనికి స్పందనగా తెలంగాణకు రక్షణల కోసమని పెద్దమనుషుల ఒప్పందం 1956 ఫిబ్రవరి 20న ముందుకొచ్చింది. పెద్దమనుషుల ఒప్పందం ప్రకారం మున్ముందు రాబోయే ఉద్యోగాలు రెండు ప్రాంతాల జనాభా ప్రాతిపదికపై ఉండాలి. తెలంగాణలో నిష్పత్తి ప్రకారం నిర్ణయించిన ఉద్యోగాల్లో చేరడానికి అభ్యర్థులు ఆ ప్రాంతంలో 12 సంవత్సరాలు నివాసం ఉండి ఉండాలి. కాలగమనంలో ఇవి ఉల్లంఘించబడ్డాయి. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తరువాత క్రమంగా తెలంగాణ ప్రాంత ఉద్యోగాల్లో, ఉపాధుల్లో, తెలంగాణేతరుల ఆధిపత్యం పెరుగుతూ వచ్చింది. దీన్ని వ్యతిరేకిస్తూ 1968–69లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉవ్వెత్తున లేచింది. ఈ క్రమంలో 1969 జనవరి 18,19న అఖిలపక్ష ఒప్పందం జరిగింది. ముల్కీ నిబంధనలను ప్రభుత్వ విభాగాలకే కాక స్వయం ప్రతిపత్తిగల సంస్థలకు వర్తింపచేయాలని, తప్పుడు ముల్కీ సర్టిఫికెట్ల ద్వారా ఉద్యోగాలు సంపాదించిన వారి విషయంలో విచారణ జరిపించాలి, ముల్కీ నిబంధనలకు వ్యతిరేకంగా తెలంగాణ ప్రాంతంలో నియమించిన ఉద్యోగులందరినీ వెనక్కు పంపి వారి స్థానంలో స్థానికులను నియమించాలి అనే నిర్ణయంతో పాటు మరికొన్ని నిర్ణయాలు తీసుకోబడ్డాయి. దీన్ని అమలు చేయడానికి 1969 జనవరి 21న జి.ఓ 36 జారీ అయ్యింది. దీన్ని ఆంధ్ర ఉద్యోగులు సవాల్ చేశారు. 1969 ఫిబ్రవరి 3న హైకోర్టు సింగిల్ జడ్జ్ చిన్నపరెడ్డి ముల్కీరూల్స్ చెల్లవని జి.ఓ 36ను కొట్టేసారు. అయితే ఆవుల సాంబశివరావు, జగన్ మోహన్ రెడ్డిలతో కూడిన డివిజన్ బెంచ్ 1969 ఫిబ్రవరి 20న ముల్కీరూల్స్ సక్రమమేనని తీర్పు చెప్పింది.

1969 ఉద్యమ ప్రభావం ఢిల్లీని తాకడంతో 1969 ఏప్రిల్ 11న ప్రధానమంత్రి లోక్ సభలో సమస్య పరిష్కారానికి అష్టసూత్ర పథకాన్ని సూచించారు. దీంట్లో ఒక అంశం తెలంగాణ ప్రాంతంలోని ఉద్యోగాలను స్థానికులకే ఇవ్వడానికి కావల్సిన రాజ్యాంగ పరమైన కట్టుదిట్టాలను చేయడం. ఇది ముల్కీ నిబంధనల సమస్యకు ఖచ్చితమైన పరిష్కారం చూపలేకపోయింది. అష్ట సూత్ర పథకంతో తెలంగాణ ప్రజలు సంతృప్తి చెందకపోవడంతో 1971లో పంచసూత్ర పథకాన్ని ప్రకటించారు. దీని ప్రకారం ముల్కీ నియమాలు తెలంగాణ ప్రాంతంలో నాన్ గెజిటెడ్, తహసిల్దార్, అసిస్టెంట్ సర్జన్, జూనియర్ ఇంజనీర్ పదవులకు వర్తిస్తాయి. సచివాలయం, శాఖాధిపతుల కార్యాలయాలు మిగితా ఉమ్మడి

కార్యాలయాల్లో ప్రతి మూడు ఉద్యోగాల్లో ఒక ఉద్యోగానికి కూడా వర్తిస్తాయి. 1972 ఫిబ్రవరి 14న ఐదుగురు న్యాయమూర్తులతో కూడిన ఆంధ్రప్రదేశ్ ఫుల్ బెంచ్ ముల్కీ నియమాలు రాజ్యాంగబద్ధం కావని తీర్పునిచ్చింది. దీంతో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర డిమాండ్ మరింతగా బలపడింది. 1972 అక్టోబర్ 3న తెలంగాణలో కొనసాగుతున్న ముల్కీ నిబంధనలు రాజ్యాంగంలోని 35(బి) కింద చట్టబద్ధమేనని సుప్రీంకోర్టు చెప్పింది. దీంతో తెలంగాణకు ప్రత్యేక రక్షణలను, ముల్కీ నిబంధనలను వ్యతిరేకిస్తూ జై ఆంధ్ర ఉద్యమం వచ్చింది. ఈ క్రమంలోనే 1973 సెప్టెంబర్ 21న ఆరు సూత్రాల పథకాన్ని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది.

ఈ పథకంలోని 3,4 అంశాలు ఉద్యోగ నియామకాలు, ప్రమోషన్ల గురించి చెప్పాయి. ఒక నిర్ణీతస్థాయి వరకు ప్రభుత్వ ఉద్యోగ నియామకాల్లో స్థానికులకే ప్రాధాన్యతనివ్వాలి. ప్రమోషన్ల విషయంలో కూడా ఒక నిర్ణీత స్థాయివరకు ఈ నిబంధనలు పాటించాలి. ఈ పథకంలోని వాటిని పాటిస్తే ముల్కీ నిబంధనలు, తెలంగాణ ప్రాంతీయ కమిటీ కొనసాగింపు అవసరముండదని ఇందులోని 6వ అంశం స్పష్టం చేసింది. 1972లో వచ్చిన జై ఆంధ్ర ఉద్యమం తరువాత 1956, 1969లో తెలంగాణ ప్రాంతానికి కల్పించిన రక్షణలన్నింటిని తోసిపుచ్చుతూ ఆరు సూత్రాల పథకం వచ్చింది. దీంతో ముల్కీ నిబందనలు రద్దయ్యాయి. ఆరు సూత్రాల పథకానికి చట్టబద్ధత కల్పించడం కోసం 1974 మే 3న 32వ రాజ్యాంగ సవరణ ముందుకొచ్చింది. ఈ రాజ్యాంగ సవరణ ద్వారా 371-డి, 371-ఇ ఆర్టికల్స్ రాజ్యాంగంలో చేర్చబడ్డాయి. 371-డిలోని 9వ క్లాజ్ ప్రకారం 32వ రాజ్యాంగ సవరణ చట్టం 1973 కంటె ముందు నిబంధనలను అతిక్రమించి జరిగిన నియామకాలన్నీ సక్రమమే అవుతాయి. 371-ఇ ప్రకారం 1976లో హైద్రాబాద్‌లో కేంద్రీయ విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఇందులో తెలంగాణకు ప్రత్యేక రిజర్వేషన్‌లంటూ ఏమీలేవు. అన్ని జాతీయ విశ్వవిద్యాలయాల్లాగే దీనిలో ప్రవేశాలు, నియామకాలు జరుగుతాయి.

ఆర్టికల్ 371-డి ఆధారంగా 1975 అక్టోబర్ 18న జి.ఎస్.ఆర్. 524(ఇ) రాష్ట్రపతి ఉత్తర్వు (ప్రెసిడెన్సియల్ ఆర్డర్) ఇచ్చారు. దీని ప్రకారం రాష్ట్ర ప్రభుత్వ ఆధీనంలో ఉండే ఉద్యోగాలను వివిధ స్థానిక క్యాడర్లుగా విభజించారు. విద్య ఉద్యోగాలకు సంబంధించి వివిధ ప్రాంతాలను లోకల్ ఏరియాలుగా విభజించారు. ఈ రాష్ట్రపతి ఉత్తర్వునే ఉన్నదున్నట్లుగా 1975 అక్టోబర్ 20న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం గవర్నర్ పేరుమీద జి.ఓ.674ను విడుదల చేసింది. దీని ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఆరు జోన్‌లుగా విభజించారు. ఒక జిల్లాలోని లోయర్ డివిజన్ క్లర్క్ (ఎల్.డి.సి.) స్థాయి లేదా అంతకంటే తక్కువస్థాయి ఉద్యోగాలు జిల్లా స్థాయి కేడర్లుగా గుర్తించబడ్డాయి. వీటి నియామకాలకు ప్రతి జిల్లా ఒక లోకల్ ఏరియా అవుతుంది. ఇక్కడ స్థానికులకు 80 శాతం రిజర్వేషన్ ఉంటుంది. 20 శాతం ఓపెన్ పోటీ ద్వారా నియామకాలు జరుగుతాయి. ఎల్.డి.సి. స్థాయి కంటే ఎక్కువస్థాయి నాన్ గెజిటెడ్ ఉద్యోగాలు కొన్ని గెజిటెడ్ ఉద్యోగాలు జోన్ స్థాయి కేడర్లుగా గుర్తించబడ్డాయి. ఈ నియామకాలకు ప్రతిజోన్ ఒక లోకల్ ఏరియా అవుతుంది. వీటిలో స్థానికులకు 70 శాతం రిజర్వేషన్ ఉంటుంది. మిగతా 30 శాతం ఓపెన్. పోటీ ద్వారా నియామకాలు జరుగుతాయి. కొన్ని సందర్భాలలో జిల్లా స్థాయి కేడర్‌ను ఒకటికంటే ఎక్కువ జిల్లాలకు విస్తరించవచ్చు. అట్లే ఒక జోన్ స్థాయి కేడర్‌ను ఒకటికంటే ఎక్కువ జోన్లకు విస్తరింపచేయొచ్చు. వీటిని మల్టీ జోన్ కేడర్లు అంటారు. రాష్ట్ర సచివాలయం, రాష్ట్రస్థాయి ప్రత్యేక కార్యాలయాలు, పోలీసు శాఖలోని కొన్ని ఉద్యోగాలు తదితరాలకు రాష్ట్రపతి ఉత్తర్వులు వర్తింపచేయలేదు. స్థానికంగా నాలుగు సంవత్సరాలు నివాసముండే ప్రతివ్యక్తి ఆ ప్రాంతంలో స్థానిక అభ్యర్థిగా గుర్తించబడతారు. తహసిల్దార్లు, అసిస్టెంట్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లు, అసిస్టెంట్ అగ్రికల్చర్ ఆఫీసర్లు, ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్, మోటార్ వెహికిల్ ఇన్‌స్పెక్టర్లు, సివిల్, అసిస్టెంట్ సర్జన్లు, ప్రత్యక్ష నియామకంలో 60 శాతం స్థానికులకు రిజర్వేషన్ ఉంటుంది. మిగతా 40 శాతం ఓపెన్ పోటీ ద్వారా నియమించబడతారు. ఓపెన్ పోటీ అన్నప్పుడు అందులో స్థానికులు, స్థానికేతరులు ఎవరైనా ఉండవచ్చు. కాని చాలా సందర్భాల్లో ఓపెన్ పోటీ వాటిని కేవలం స్థానికేతరుల ద్వారానే నింపడం జరిగింది. తద్వారా చాలా ఉద్యోగాలలో స్థానికులకు అన్యాయం జరిగింది. ఓపెన్ కోటాలో స్థానికులకు దక్కాల్సినవి దక్కకుండా అవి స్థానికేతరులకు రిజర్వు చేయబడినట్లుగా మారాయి. ఈ అన్యాయాలను సరిచేయమని, రాష్ట్రపతి ఉత్తర్వులను సక్రమంగా అమలు చేయమని వచ్చిన ఒత్తిళ్ల నేపథ్యంలో అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు, 1984లో ఐఎఎస్ అధికారి జయభారత్ రెడ్డి నేతృత్వంలో కమిటీ వేయడం జరిగింది. రాష్ట్రపతి ఉత్తర్వులకు విరుద్ధంగా 58,962 మంది స్థానికేతరులు ఆంధ్ర ప్రాంతం వారు తెలంగాణలో ఉద్యోగాలు పొందారని ఈ కమిటీ నిర్ధారించింది. దీనిపై ఎలాంటి చర్యలు తీసుకోలేదు. ఆ తరువాత సుందరేషన్ కమిటీని వేశారు. ఈ రెండు కమిటీల సూచనల ఆధారంగా 1985 డిసెంబర్ 30న జి.ఓ.610ను జారీ చేశారు. దీని ప్రకారం రాష్ట్రపతి ఉత్తర్వులకు విరుద్ధంగా, స్థానికతను ఉల్లంఘిస్తూ వివిధ స్థాయిల్లో జరిగిన అక్రమ నియామకాలను ఖాళీ చేయించాలి జి.ఓ. 610ను అమలు చేయాలని ఒత్తిడి పెరగడంతో చంద్రబాబునాయుడు ప్రభుత్వం 2001 జూన్ 25న గిర్‌గ్లాని ఏకసభ్య కమిషన్‌ను నియమించింది. కమిటీ మధ్యంతర నివేదికను 2001 అక్టోబర్ 6న, తుది నివేదికను 2004 సెప్టెంబర్‌లో ఇచ్చింది. స్థానిక రిజర్వేషన్ల అమలును పర్యవేక్షించే యంత్రాంగం లేకపోవడంతో 18 రకాల ఉల్లంఘనలు జరిగాయని ఈ నివేదిక తెలిపింది. స్థానిక రిజర్వేషన్ల అమలులో లోపాలను సరిదిద్దేవరకు నియామకాలు ఆపేయాలని, కార్పొరేషన్లకు, రాష్ట్రస్థాయి కార్యాలయాలకు, స్థానిక రిజర్వేషన్లు అమలు చేయాలని చెప్పింది. కాని ఇవేవి పాటించలేదు. ఆ నేపథ్యంలో తేలిన మరో విషయమేమిటంటే తెలంగాణ జిల్లాలో జరిగిన నియామకాల్లో ఒక జిల్లాలోని స్థానికతకు వ్యతిరేకంగా మరోజిల్లా వారు నియమించబడ్డారు. వెనుకబడిన జిల్లాలో ఆ జిల్లా వారికే దక్కాల్సిన నియామకాల్లో విద్యావకాశాల్లో మెరుగ్గా ఉన్న ఇతర జిల్లాల వారు చేరిపోయారు. ఇలా తెలంగాణలోని ఒక ప్రాంతం వారికి అదే తెలంగాణాలోని మరో ప్రాంతం వారిచే నష్టం కలిగింది.

రాష్ట్రపతి ఉత్తర్వుల్లోనే అనేక లొసుగులు ఉన్నాయి. అన్ని ప్రాంతాల వారికి సమాన అవకాశాలు అన్న ప్రాతిపదిక మీద ఇవి తయారైనట్లు చెప్పబడుతున్నప్పటికీ ఆచరణలో అన్ని ప్రాంతాలకు సమాన వాటా దక్కలేదు. ఇవే విషయాలను జయభారత్ రెడ్డి, సుందరేశన్, గిర్‌గ్లానీ కమిటీలు తేల్చి చెప్పాయి. ఒకవేళ రాష్ట్రపతి ఉత్తర్వులను సక్రమంగా అమలు చేసినప్పటికీ కూడా విద్యాపరంగా ఆర్థికంగా, సాంఘికంగా మరితర సానుకూల అంశాలున్న ప్రాంతాల వారికే విద్యా, ఉద్యోగవకాశాలు దక్కుతున్నాయి. అందువల్లనే జోనల్, రాష్ట్రస్థాయి ఉద్యోగాల్లో కొన్ని జిల్లాల వారి ఆధిక్యత కొనసాగుతున్నది. ఈ

వ్యత్యాసాలను తగ్గించి సాధ్యమైనంత ఎక్కువగా అన్ని ప్రాంతాల వారికి సమాన అవకాశాలు వచ్చేలా విధానాలు చేపట్టవల్సి ఉన్నది. ప్రస్తుతం తెలంగాణలో కొత్తగా జిల్లాలను ఏర్పాటు చేయబోతున్నారు. హైదరాబాద్ తప్పించి ప్రతి జిల్లాను మరిన్ని జిల్లాలుగా విడగొడుతున్నారు. మొత్తం 27 జిల్లాలని ప్రకటనలు వచ్చాయి. ఈ నేపథ్యంలో ఉద్యోగ నియామకాలు జోనల్ వ్యవస్థను కొనసాగించాలని, వద్దని భిన్న వాదనలు వస్తున్నాయి.

లోకల్ యూనిట్ ఎంత చిన్నదిగా ఉంటే ఆ ప్రాంతంలో ఉండే వారికి ఉద్యోగావకాశాల్లో అంత ఎక్కువగా వాటా దక్కుతుంది. లోకల్ యూనిట్ పరిమాణం, విస్తృతి పెరుగుతున్న కొద్ది ఎక్కువ ప్రాంతాలు పోటీ పడతాయి. అప్పుడు ఆ లోకల్ పరిధిలోని మెరుగైన పరిస్థితుల్లో ఉన్న ప్రాంతాల నుండే ఎక్కువ మంది ఎంపికయ్యే పరిస్థితి ఉంటుంది. విద్యా, సామాజిక, ఆర్థిక, ఇతర విషయాల్లో వెనుకబడిన ప్రాంతాలు, జిల్లాలవారు ఉద్యోగ నియామకాల్లో పోటీపడడం కష్టంగా మారుతుంది. ఫలితంగా కొన్ని ప్రాంతాలు, జిల్లాల వారే అధికంగా ఉద్యోగాల్లో చేరే అవకాశాలు సహజంగానే ఉంటాయి. దీనిని కొంత వరకైనా అధిగమించడం కోసం, రాష్ట్ర స్థాయిల్లో మాత్రమే కాకుండా మధ్యంతర మెట్టుగా జోనల్ వ్యవస్థ ఉండడం వల్ల లోకల్ యూనిట్ పరిమాణం తగ్గుతుంది. అలా నియమించబడే ఉద్యోగులకు దూరాభారాలు తప్పుతాయి. ఇలా జోనల్ నియామకాల్లో కూడా ఆ జోన్‌లో మెరుగ్గా ఉండే జిల్లాలకే అధిక ప్రయోజనం కలగడాన్ని త్రోసిపుచ్చలేం. జోనల్ వ్యవస్థను కొనసాగించడం, వాటి సంఖ్యను పెంచడం ద్వారా ఒక్కో జోన్‌లో మూడు జిల్లాల కంటే ఎక్కువ ఉండవు. ఈ పరిమిత జిల్లాల అభ్యర్థుల మధ్యనే పోటీ ఉంటుంది. జోన్‌లలో కాకుండా రాష్ట్రస్థాయిలో నియామకాలు జరిపినప్పుడు రాష్ట్రంలోని మొత్తం జిల్లాల నుండి పోటీ ఉంటుంది. అప్పుడు వెనుకబడిన జిల్లాల నుండి తక్కువ మంది, సానుకూల వాతావరణమున్న జిల్లాల నుండి ఎక్కువ మంది ఉద్యోగాలు పొందుతారు. ఆ పరిస్థితుల్లో వెనుకబడిన జిల్లాల వారు నష్టపోతారు. ఈ విధానం ద్వారా గతంలో జరిగిన తప్పులే పునరావృతం అవుతాయి. అన్ని జిల్లాల వారికి సమాన అవకాశాలు లభించవు. ఏపి పునర్విభజన చట్టం 2014 ప్రకారం ఆర్టికల్ 371-డి ఆంధ్రప్రదేశ్, తెలంగాణలకు వర్తిస్తాయని అన్నారు. ఆర్టికల్ 371-డి అనేది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందిన ప్రత్యేక అంశాలను చెబుతుంది. 371-డి(1) ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి సంబంధించి ఆ రాష్ట్రంలో వివిధ ప్రాంతాల్లో ఉండే ప్రజలకు ప్రభుత్వ ఉద్యోగాల్లోనూ, విద్యావకాశాల్లోనూ సమతుల్యంగా న్యాయమైన ఏర్పాట్లు చేసే నిమిత్తం రాష్ట్రావసరాలను దృష్టిలో ఉంచుకొని రాష్ట్రపతి ఆదేశాలను ఇవ్వవచ్చు. ఆ ఆదేశాల్లోని నిబంధనలు రాష్ట్రమంతటికీ వర్తించు విధంగా లేక వివిధ ప్రాంతాలకు వేరు వేరు విధంగా వర్తించేలా ఉండవచ్చు. అయితే కొత్త జిల్లాలు ఏర్పడుతున్న సందర్భంలో అన్ని జిల్లాలకు, ప్రాంతాలకు సమాన విద్యా, ఉద్యోగ అవకాశాలు కల్పించడానికి రాష్ట్రపతి ఉత్తర్వును రద్దుచేస్తూ లేదా సవరిస్తూ కొత్త నిబంధనలను ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం తయారుచేయవల్సిన అవసరం ఉన్నది.

జిల్లా, జోనల్, రాష్ట్ర క్యాడర్‌లను స్పష్టంగా నిర్వచించాల్సి ఉన్నది. కొత్త జిల్లాలను ఏర్పాటు చేయడంలో ఉద్దేశ్యం పరిపాలన సౌలభ్యం, ప్రజలకు పాలనా వ్యవస్థలు, సంస్థలు అందుబాటులో ఉండడం అలాగే నిర్లక్ష్యానికి గురవుతున్న మారుమూల ప్రాంతాలను గుర్తించి అభివృద్ధి పరచడం, దీనిద్వారా ఆయా ప్రాంతాల అన్నిరకాల అవసరాలను గుర్తించి వాటిని మెరుగుపరచడానికి ఫోకస్‌డ్‌గా పనిచేసే వీలు కలుగడమే అని అనుకుంటే గనుక ఆయా ప్రాంతాల ప్రజలకు విద్యా, ఉద్యోగ, ఉపాధి అవకాశాల్లో సమానవాటాను అందించడం కూడా జరగాల్సి ఉంటుంది. ఎస్‌సిలలో వర్గీకరణకొరకు మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎంఆర్‌పిఎస్) ఉద్యమ రూపంలో ముందుకొచ్చింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కొంతకాలం వర్గీకరణ అమలు కూడా అయ్యింది. నేడు ఈ ఉద్యమం దేశవ్యాప్తంగా కూడా మెజారిటీ సమ్మతిని పొందింది. ఎస్‌సిల కొచ్చే రిజర్వేషన్ ఫలాలు అందులో కొన్ని కులాలకే చెందడం అనేది కాకుండా ఎస్‌సిల్లో ఉండే ఇంకా కిందిస్థాయి కులాలకు అందాలనే ప్రజాస్వామిక డిమాండ్‌తో ఎంఆర్‌పిఎస్ ఉద్యమిస్తూ ఉన్నది. అలాగే ప్రాంతాల/జిల్లాల వారీగా కూడా అభివృద్ధి ఫలాలు ప్రజలందరికి అందాల్సి ఉన్నది. అందులో భాగంగానే జోనల్ వ్యవస్థను చూడాల్సి ఉన్నది.

అన్ని ప్రాంతాల వారికి సమాన అవకాశాలు అనే సహజ న్యాయ సూత్రం ఆచరణలో సాధ్యం కావడానికి జిల్లా స్థాయి ఉద్యోగాల్లో ఆ జిల్లాలోని ప్రతి మండలానికి, జోనల్ స్థాయి ఉద్యోగాల్లో ఆ జోన్‌లోని ప్రతి జిల్లాకు రాష్ట్రస్థాయి నియామకాల్లో ప్రతి జిల్లా వారికి వారి జనాభా ప్రాతిపదికన సమన్యాయం జరగేలా వాటా ఇవ్వాలి. రాష్ట్రస్థాయి కార్యాలయాలు ఎక్కువగా రాజధానిలోనే ఉంటాయి. వివిధ శాఖలకు చెందిన రాష్ట్రస్థాయి ఉన్నత కార్యాలయాల్లో(హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్స్), సెక్రటేరియల్‌లు మొదలైన వాటిలోని నియామకాల్లో ప్రతి జిల్లాకు జనాభా ప్రాతిపదికన వాటా ఉండేలా చర్యలు తీసుకోవాలి. వీటిల్లో జిల్లా, జోనల్ స్థాయిల నుండి వివిధ కేడర్‌లలోని నియామకాలను బదిలీలు, పదోన్నతుల ద్వారా చేపట్టడం ద్వారా రాష్ట్రస్థాయి అన్ని కేడర్‌లలో ప్రతి జిల్లాకు సముచిత స్థానం లభిస్తుంది.

హైదరాబాద్‌లో ఆ జిల్లాకు సంబంధించిన వివిధ ప్రభుత్వ శాఖల్లో అన్ని జిల్లాల్లో జరిగినట్లుగానే నియామకాలు నిర్వహించడం ద్వారా ఆ జిల్లాలోని ప్రజలు వారి, ఉద్యోగ అవకాశాలు వారే పొందగల్గుతారు. రాష్ట్రస్థాయి ఉద్యోగాల్లో ప్రతిజిల్లాకు, జోనల్ స్థాయిలో ఆ జోన్‌లో ఉండే ప్రతి జిల్లాకు వాటా ఇవ్వాలనుకున్నప్పుడు తక్కువ ఉద్యోగాలుంటే ఎలా అనే సమస్య ముందుకు వచ్చే పరిస్థితుల్లో రొటేషన్ పద్ధతిలో అన్ని జిల్లాల వారికి అవకాశాలు పంచబడిన తరువాతనే తదుపరి రౌండ్‌లోకి వెళ్లాలి. ఇలా చేయడం ద్వారా కొంత ఆలస్యమైనా గాని ప్రతి ప్రాంతం వారికి అవకాశాలు అందే వీలుంటుంది. అలా చేసినప్పటికి ఆయా జిల్లాల్లోని అట్టడుగు వర్గాలకు న్యాయం లభిస్తుందనేది చెప్పడం అంత తేలికైనదేమీకాదు. ఉద్యోగ అవకాశాలనేవి వారికి అందించబడిన విద్యా నాణ్యత, వారి సామాజిక, ఆర్థిక వెసులుబాట్లు అనేవి నిర్ణయిస్తాయి. కాబట్టి అంతిమంగా ప్రతి ప్రాంతం, గ్రామ స్థాయి నుండి అన్ని దశల్లో ప్రజలందరికీ నాణ్యమైన, సమాన, ఉన్నత ప్రమాణాలున్న విద్యావకాశాలు కల్పించడం ప్రధానమైనది. దీంతో పాటుగా ప్రతి కుటుంబ సామాజిక, ఆర్థిక స్థాయిలను మెరుగు పరచడం మరో ముఖ్యమైన విషయం.

సామ్రాజ్యవాద, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ నేపథ్యంలో ప్రభుత్వ పరంగా విద్యా, ఉద్యోగావకాశాలు తగ్గిపోతున్నాయి. ఉద్యోగాలు తక్కువ, పోటీ ఎక్కువ తద్వారా ఉద్యోగాలు చాట్ల తవుడు పోసి కుక్కలకు కొట్లాట పెట్టినట్లుగా తయారయ్యాయి. ఈ అవకాశాలను మెరుగు పరచడానికి ప్రభుత్వంపై ఒత్తిడి పెంచవల్సి ఉన్నది. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# దళితులకు ప్రాణాంతకమైన గోరక్షణ

*గోసంరక్షణ పేరుతో హిందూ మతోన్మాదులు చేస్తున్న దాడుల వల్ల దళిత, ముస్లిం మైనారిటీల ప్రాణాలకు రక్షణ లేకుండా పోయిందని సూదాపాలెం ఘటన నేపథ్యంలో వివరిస్తున్నారు* **నామాడి శ్రీధర్**

సూదాపాలెం సంఘటనలో బాధితుల దేహాల మీది దెబ్బలు దాదాపు మానిపోయాయి. ఆనవాలుగా మిగిలిన మచ్చలు మాత్రం అనేక ప్రశ్నలని సంధిస్తున్నాయి. ఆ దళితుల గుండెలకి తగిలిన అవమానపు గాయాలు నేటికీ పచ్చి గానే సలుపుతున్నాయి.

తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలోని జానకీపేట వాసి మోకాటి ఎలీషా (57) మాదిగ కులస్థుడు. వంశపారం పర్యంగా చర్మకారవృత్తిలో కొనసాగుతున్నాడు. స్థానిక టింబర్ డిపో యజమాని బూరగాయల అరవింద్‌కు చెందిన చూడి ఆవు 2016 ఆగస్టు 8 మధ్యాహ్నం విద్యుద్ఘాతంతో చనిపోయింది. ఆ కళేబరాన్ని తీసుకువెళ్లమని ఎలీషాను అరవింద్ కోరాడు.

**దురాగతం జరిగిన తీరు**

అదే రోజు రాత్రి ఎలీషా సమీప గ్రామం సూదాపాలెం (ఉప్పలగుప్తం మండలం) శ్మశానవాటికకు ఆవుని ట్రక్‌లో తరలించాడు. అప్పటికే అక్కడ గుమికూడిన కొందరు వ్యక్తులు ఆవు గురించి ఆరా తీశారు. మొబైల్ ఫోన్‌తో ఫొటోలు తీసుకున్నారు. యథావిధిగా ఎలీషా తన సోదరుడు వెంకటేశ్వరరావు (50)తో కలిసి ఆవు చర్మం ఒలవడం మొదలుపెట్టాడు. ట్రక్ డ్రైవర్ సవరపు లక్ష్మణ్‌కుమార్ (23), అతని తమ్ముడు సవరపు ప్రేమ్‌కుమార్ (15)లు కూడ పనిలో పాలుపంచు కొన్నారు. అంతలో ఆకస్మికంగా అనేకమంది వ్యక్తులు వారి మీదికి దండెత్తుకొచ్చారు. బతికున్న ఆవుని చంపుతున్నారని ఆరోపించారు. యథార్థంగా చనిపోయిన ఆవునే తీసుకువచ్చామని, తమ మాట నమ్మమని అన్నదమ్ములిద్దరూ వారిని బతిమిలాడారు. అప్పటికప్పుడు ఆవు యజమానితో ఫోన్‌లో మాట్లాడించారు. అయినాసరే వారు లెక్కచేయలేదు. కులపరమైన దూషణలతో మూకుమ్మడిగా దాడికి పూనుకొన్నారు. అన్నదమ్ముల్ని, ట్రక్ డ్రైవర్‌ని చెట్లకు కట్టివేశారు. రాళ్లు, కర్రలు, ఇనుప ఊచలతో చావగొట్టారు.

ఎంతసేపటికీ ఎలీషా, వెంకటేశ్వరావులు ఇంటికి తిరిగి రాకపోవడంతో వారి కుమారులు సూదాపాలెం వెళ్లారు. అంతకు ముందుగానే అక్కడికి చేరిన పోలీసులు కడలి ఏడుకొండలు, చాగంటి ప్రసాద్‌లు వీరిపట్ల కూడ అమానుషంగా ప్రవర్తించారు. బతికున్న ఆవుని చంపి చర్మం వలుస్తున్నారని చెప్పినట్టయితే మీ అన్నదమ్ములిద్దరినీ వదిలివేస్తామని లేదా చంపుతామని సవరపు ప్రేమ్‌కుమార్‌ని పోలీసులు బెదిరించారు. అయినా అతను అబద్ధం చెప్పలేదు. క్షతగాత్రులను అంబులెన్స్‌లో ఆసుపత్రికి తీసుకువెళ్లలేదు సరికదా ఆవు కళేబరం తెచ్చిన ట్రక్‌లోనే ఎక్కించారు. అమలాపురం పోలీసు స్టేషన్‌కు తరలించారు. ఆఖరికి మధ్యరాత్రివేళ ఎంఆర్‌పిఎస్ కార్యకర్తల పూచీకత్తుతో మోకాటి ఎలీషా, మోకాటి వెంకటేశ్వరరావు, సవరపు లక్ష్మణ్‌కుమార్‌లను ప్రభుత్వాసుపత్రిలో చేర్చారు.

**మూడు ఆవుల కథ**

ఈ సంఘటనలో చనిపోయిన ఆవుకంటే బతికున్న మూడు ఆవులు కీలకపాత్ర పోషించాయి. దానికి సూత్రధారుడు అమలాపురం మండలం కామనగరువు గ్రామస్తుడు వీరిన శ్రీనివాసరావు. అతను గౌడ కులస్థుడు, చిన్నకారు రైతు, టెంట్‌హౌస్ నిర్వాహకుడు. మానవ హక్కుల కార్యకర్తలకు అతను చెప్పిన కథనం ఈ కింది విధంగా ఉంది.

కొన్నాళ్ల నుంచి తన తోటలో మామిడి మొక్కల్ని ఇరుగు పొరుగు రైతులకు చెందిన ఆవులు నాశనం చేస్తున్నాయి. అందుకని ఆగస్టు 8 సాయంత్రం తన పాలేరు గోవిందుతో కలిసి వాటిని సూదాపాలెం గ్రామానికి తోలుకొని పోయాడు. (కామనగురువు నుంచి సూదాపాలెం 8 కిలోమీటర్లు) అక్కడి శ్మశాన వాటికకు కిలోమీటరు దూరంలోని పులిదిండి చంటికి ఒక ఆవుని అప్పగించాడు. గంధంవారి పాలెంలోని చవ్వాకుల సాయిబాబు అధీనంలో రెండు ఆవుల్ని ఉంచాడు. చీటీ మీద తన పేరు, ఊరు, ఫోన్ నెంబర్ రాసి వారికిచ్చాడు. ఆవుల కోసం ఎవరొచ్చినప్పటికీ తనని సంప్రదించమని పురమాయించాడు. ఆ రాత్రివేళ ఆవుల యజమానులు మరికొందరితో కలిసి వాటిని వెదకడం ప్రారంభించారు. సూదాపాలెంలో తొలుత రెండు ఆవులు దొరికాయి. మూడో ఆవు కోసం గాలిస్తున్నప్పుడు శ్మశానంలో మాదిగలు తారస పడ్డారు. దానితో తమ ఆవునే వారు దొంగిలించారనుకున్నారు. బతికున్న ఆవుని వధిస్తున్నారనుకున్నారు. దొంగలు దొరికారు కాబట్టి చుట్టుపక్కల జనం కూడ తలొక చెయ్యి వేశారు. దళితులు, రాజకీయ నాయకులు స్వప్రయోజనాల కోసం గోరంత సమస్యని కొండంత చేశారని శ్రీనివాసరావు తన వేపు నుంచి పూర్వాపరాలను వివరించాడు.

**దారులన్నీ సూదాపాలెమే చేరతాయా?**

మామిడి మొక్కల్ని పాడుచేస్తున్న ఆవుల్లో ఒకటి అతని బంధువు ఉర్రింకి నారాయణరావుది. రెండో ఆవు రాజులపూడి గంగాధరరావుది, మూడో ఆవు భూపతిరాజు వెంకటసుబ్బరాజుది. మొదటి ఇద్దరూ అదే గ్రామస్తులు. మూడో ఆసామిది సమీప గ్రామం వన్నెచింతలపూడి. పంట పొలాల్లోకి మేతకోసం పశువులు చొరబడటం కొత్తేమీ కాదు. అటువంటి

సందర్భాల్లో రైతులు ఆయా పశువుల యజమానులకి ఒక మాట చెప్పి చూస్తారు. అయినా కట్టడి చేయకపోతే తమ తోటలోనో, మకాంలోనో, ఇంటి దగ్గరో ఆవుల్ని కట్టివేస్తారు. అంతే తప్ప ఊరుకాని ఊరుకి కిలోమీటర్ల దూరం తరలించుకొని వెళ్లరు. ఒకవేళ పశువు కనిపించకపోతే, ఏ యజమాని అయినా గ్రామంలోని నలుగురినీ వాకబు చేస్తాడు. అంతేగాని మూడు ఆవుల్ని వెదకడానికి ముప్పయి మంది రాత్రిపూట బయలుదేరరు. అన్ని దారులూ నేరుగా సూదాపాలేనికి మాత్రమే చేరవు. దారిలో కంటపడిన ప్రతి ఆవూ తమదేనని అపోహపడరు. అప్పటికప్పుడు అక్కడికక్కడ వందమంది పోగుపడరు. నలుగురి మీద మూకుమ్మడిగా కన్నూమిన్నూ కానక దాడికి పాల్పడరు.

### చర్మకార వృత్తి నేరమవుతుందా?

మాదిగలు కాబట్టి దొంగలుగా జమకట్టారు. చర్మకారవృత్తిని నేరంగా పరిగణించారు. అందుకనే పశువు కళేబరం నుంచి చర్మం వలుస్తుంటే చావగొట్టారు. నీ అధీనంలోకి మా ఆవులు ఎలా వచ్చాయని చవ్వాకుల సాయిబాబుని ప్రశ్నించినప్పుడే వాస్తవం తెలుస్తుంది కదా. రెండు ఆవులు దొరికిన తర్వాత మూడో ఆవు ఆచూకీ కనుగొనడం అసాధ్యమవుతుందా? అసలు అప్పటివరకు వీరిన శ్రీనివాసరావు వారితో ఫోన్‌లో మాట్లాడ కుండానే ఉన్నాడా? జరిగిన సంగతి మొత్తం అతను వివరించకుండా ఊరుకున్నాడా? ఆ కొద్దిపాటి సమయంలోనే వారికి అనుమానం ముంచుకొచ్చిందా? అపోహపడినంత మాత్రాన అమాయకుల మీద అమానుషంగా దాడికి దిగుతారా?

ఆవు కళేబరం నుంచి అప్పటికి కొంతమేరకు మాత్రమే చర్మం వలిచారు. కాబట్టి ఆ ఆవు ఎవరిదో యజమానులు సులభంగానే పోల్చుకో గలరు. ఆవు యజమాని అరవింద్ కూడ ఫోన్‌లో స్పష్టంగా చెప్పి ఉన్నాడు. ఆలస్యమైతే ఆవు కుళ్లిపోతుంది. అందుకని ఉన్నపళంగా రాత్రివేళ తరలించామన్నారు. ఇంకా సందేహం ఏమిటి? ఆ ఊరికి, ఆ పనికి మోకాటి ఎలీషా కొత్తవాడు కాదు. అక్కడే అతని బావమరిది యార్లగడ్డ ఏసుబాబు ఉంటాడు. అతను ఆటోడ్రైవర్. అవసరం మేరకు కులవృత్తిలో కొనసాగుతున్నాడు. ఆవేళ అతను ఆసుపత్రికి వెళ్లడం వల్ల పనిలో భాగస్వామి కాలేదు. అదే శ్మశానవాటికలో కొన్నేళ్లుగా చనిపోయిన పశువుల చర్మాన్ని వారిద్దరూ వలుస్తున్నారు. ఈ సంగతి ఊరంతటికీ విధితమే. ఏ చర్మకారుడూ మాంసం కోసమో, చర్మం కోసమో బతికున్న పశువుని వధించడు. ఆ మాత్రం కనీసజ్ఞానం లేని రైతు ఉండడు. అయినా అపోహ ఏమిటి?

### రైతు తన ఆవుని గుర్తించలేడా?

ఆ శ్మశానవాటికలో చీకటివేళ వారి కళ్లకి మాదిగలు కనిపించారు. ఆవు కనిపించింది. చెట్లు కనిపించాయి. కట్టడానికి తాళ్లు కనిపించాయి. కొట్టడానికి రాళ్లు, కర్రలు కనిపించాయి. కాని ఆ ఆవు తమదో కాదో గుర్తించలేకపోయారా? ఆవు తమది కానప్పుడు వెనుదిరిగి వెళ్లిపోవాలి కదా. లేగదూడ ముట్టె కట్టి ఆవు నుంచి సంవత్సరాల తరబడి పాలు పితుకుకొంటారు. అదే ఆవు చనిపోతే ముక్కు మూసుకొంటారు. ఎన్నేళ్ల పాటు దానిని వాడుకున్నప్పటికీ ఏ ఒక్కరూ ఆ దరిదాపులకి రారు. కళేబరాన్ని చర్మకారులకి అప్పగించేంత వరకు నిద్రపోరు. అటువంటి పరిస్థితుల్లో ఏ దురుద్దేశం లేకుండానే ఇతరులు శ్మశాన వాటికకు పరుగు పరుగున చేరుకున్నారా? ఇంతకు మునుపు ఈ ప్రాంతంలో ఆవులు అపహరణకు గురైన ఘటనలు లేవు. అటువంటి ఫిర్యాదులేవీ పోలీసు స్టేషన్లలో నమోదైన దాఖలాలు లేవు. మోకాటి ఎలీషా, అతని కుటుంబ సభ్యుల మీద ఏ విధమైన ఆరోపణలు లేవు. అయితే ఆగస్టు 8 రాత్రి ఒంటి గంటకి బాధితులు పోలీసుస్టేషన్‌లో ఉన్న సమయంలోనే కామనగరువు నుంచి కొందరు వ్యక్తులు వచ్చారు. ఎవరో తమ ఆవుల్ని దొంగిలించారని ఫిర్యాదు చేశారు. తెల్లవారటంతోనే ఈ 'మూడు ఆవుల కథ' ప్రచారంలోకి వచ్చింది.

### యాదృచ్ఛిక సంఘటనగా ప్రచారం

ఈ సంఘటన యాదృచ్ఛికంగా జరిగింది తప్ప బిజెపి, ఆర్ఎస్ఎస్, విహెచ్‌పి, గోసంరక్షణ సమితి ఇత్యాది సంస్థలతో నిందితులకు సంబంధం లేదని పోలీసు యంత్రాంగం పదేపదే ప్రకటించింది. అపహరించబడిన తమ ఆవుల్ని చర్మకారులు వధిస్తున్నారనే అపోహతో వారిపై రైతులు దాడి చేశారని ప్రచారం చేసింది. దీనికి స్థానిక పాత్రికేయులు కొందరు వంతపలికారు. సహజంగా ప్రజలు కూడ అదే నిజమనుకున్నారు. హక్కుల సంఘాలు, దళిత, ప్రజా సంఘాలు చేపట్టిన నిరసన కార్యక్రమాలతో వాస్తవం నెమ్మదిగా అవగతమైంది. అయినా పౌర సమాజం మౌనంగానే ఉండిపోయింది. తొలుత ఈ సంఘటన పట్ల మాలలు త్వరితగతిన స్పందించలేదు. దేశవ్యాప్తంగా చర్చనీయమైన అనివార్య పరిస్థితిలోనే కదిలి వచ్చారు. అంతేతప్ప మాదిగల సమస్యని మాలలు తీవ్రంగా పరిగణించలేదు. పాకీ పనివారి దుర్భరమైన జీవన పరిస్థితులు దళితులకు పట్టనట్టుగానే ఈ సందర్భంలోనూ వ్యవహరించారు. మాల మాదిగల మధ్య వర్గీకరణ పేరిట పాలకులు రాజేసిన విభజన ఆఖరికి కష్టకాలంలో సైతం అనైక్యతతో ఉండేందుకు దోహదపడింది.

### చుక్కలు కలిపితే వికృత చిత్రం

ఆగస్టు 8 సాయంత్రం కామనగరువు నుంచి సూదాపాలెం గ్రామానికి ఆవుల్ని తోలుకువెళ్లిన వీరిన శ్రీనివాసరావు తిరిగి వెంటనే అమలాపురం చేరాడు. అక్కడ బూరగాయల అరవింద్ టింబర్ డిపో దగ్గర చనిపోయిన ఆవుని చర్మకారులు ట్రక్‌లోకి చేర్చడం తను చూశానని చెప్పాడు. అలాగే సమీపంలోని మద్యం దుకాణంలో పనిచేసే పలివెల బుజ్జి, లక్ష్మణ్‌లు కూడ చూశారని, ఆ రాత్రి జరిగిన దాడిలో ఇద్దరూ పాల్గొన్నారని, పోలీసులు వారిని నిందితులుగా చూపలేదని బాధితులు పేర్కొన్నారు. కామనగరువు గ్రామస్తులైన ఈ ముగ్గురికీ, ఆవు కళేబరాన్ని ఎలీషా సూదాపాలెం శ్మశానవాటికకు తరలిస్తాడనే సంగతి ముందుగా తెలుసునని వారు అన్నారు. చుక్కలన్నీ కలిపితే ఒక వికృత చిత్రం ఏర్పడినట్టు, ఈ విడివిడి చర్యలన్నిటినీ క్రోడీకరిస్తే సూదాపాలెం ఘటన ఒక పథకం ప్రకారమే జరిగిందని అర్థమవుతుంది.

ఈ సంఘటనలో ఎనిమిది మంది నిందితుల్ని పోలీసులు అరెస్ట్ చేశారు. వీరిపై ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టంతోపాటు భారత

నేరస్మృతి ప్రకారం తీవ్రంగా కొట్టి గాయపరిచి, హత్యాయత్నానికి పాల్పడినట్టుగా నేరారోపణ మోపారు. వీరిలో ఏడుగురు గౌడ కులానికి, ఒకరు కాపు కులానికి చెందినవారు. అయిదుగురు కామనగరువు, ముగ్గురు సమనస గ్రామస్తులు. అయితే దాడి జరిగిన చోట, పోలీసుస్టేషన్ లోను పోలీసులు వెంకన్న, కడలి ఏడుకొండలు తమ పట్ల అమానుషంగా ప్రవర్తించారు కాబట్టి వారిని ఉద్యోగం నుంచి సస్పెండ్ చేయాలని; ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం మేరకు వారిపై కేసు నమోదు చేయాలని బాధితులు డిమాండ్ చేశారు. దాడిలో పాల్గొన్న పలివెల బుజ్జి, లక్ష్మణ్‌లు సహా దాడికి పథకం రూపొందించిన మంచెం రామారావుని అరెస్ట్ చేయాలని అన్నారు. ఎ1 ముద్దాయి అయిన మామిడిపల్లి నారాయణమూర్తి (యెరుబండి అబ్బులు)ని ఎ7 నుంచి ఎ1 కు చేర్చాలని కోరారు. అసలు నేరస్తుల కోసం సక్రమమైన పద్ధతిలో విచారణ చేపట్టడం లేదని, సంబంధిత సమాచారం మీడియాకు తెలియ పరచడం లేదని వారు ఆందోళన వ్యక్తం చేశారు.

**తప్పుడు చైతన్యం**

ఆగస్టు 9న ఆసుపత్రిలో బాధితులతో మేము మాట్లాడుతూ, 'మీ తరతరాల కులవృత్తిలో ఇటువంటి సంఘటన ఎన్నడైనా ఎదుర్కొన్నారా' అని అడిగాం. 'లేదు' అని ఎలీషా బదులిచ్చాడు. 'ఇప్పుడెందుకు జరిగిందనుకుంటున్నారు' అనగానే; అతని కొడుకు, ఉపాధ్యాయుడు అయిన చంటిబాబు కల్పించుకొని చెప్పాడు కదా 'మోడీ గోసంరక్షణ నినాదం ఇటువంటి మతోన్మాదాన్ని, తప్పుడు చైతన్యాన్ని నూరిపోస్తుంది' అని. అందుకు నిరసనగా ఏ పశువు కళేబరం జోలికీ చర్మకారులు వెళ్లకపోతే ఏమవుతుంది? బహుశా అప్పుడు జీవనిర్జీవాల సందేహం నివృత్తి అవుతుంది. ఈ సందర్భంలోనే కరుణకుమార రాసిన 'కొత్త చెప్పులు' కథ గుర్తుకొస్తుంది. 1936నాటి ఆ కథలో ఎద్దు కళేబరాన్ని ముట్టకుండా మాదిగలు నిరసన వ్యక్తం చేసిన తీరుని ఆయన గొప్పగా చిత్రించారు. డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ పాకీపని వారిని ఉద్దేశించి 'సామాజిక నిర్మాణంలో అపరిశుభ్రమైన పనుల్ని బానిసలతోనే చేయిస్తారు' అన్నారు. అందుకనే దళితులు అపరిశుభ్ర వృత్తుల్ని వదిలిపెట్టాలని ఆయన స్వయంగా పట్టుపట్టారు. నిజంగానే మోకాటి ఎలీషా వంటివారు అపరిశుభ్రమైన కులవృత్తిని వదిలిపెట్టినట్టయితే బూరగాయల అరవింద్ ఎవరికి ఫోన్ చేసివుండేవాడు?

**మాదిగల జన్మహక్కు**

గత కొన్ని దశాబ్దాలుగా వ్యవసాయరంగంలో పశువుల వినియోగం తగ్గుముఖం పట్టింది. చిన్న, సన్నకారు రైతులకు వాటి పోషణ భారంగా తయారైంది. దీనితో పలువురు మాదిగలు ఇతరేతర పనుల్లో కుదురుకొన్నారు. అలాగని అరుదుగా దొరికే కులవృత్తిని వారు వదులుకోవటం లేదు. ఇప్పటి ధరలను బట్టి ఆవు లేదా గేదె కళేబరం నుంచి చర్మం వలిచి అమ్మితే ఆరు వందల రూపాయలు వస్తాయి. సకాలంలో సేకరించిన మాంసాన్ని నాలుగు కుటుంబాల వారు కూర వండుకొంటారు. కొంతభాగం ఎండబెట్టి భద్రపరచుకొంటారు. ఇందు కోసం నలుగురు వ్యక్తులు ఒక రోజు పాటుపడతారు. ఈ మొత్తం ప్రక్రియని చర్మకారులు తమ జన్మహక్కుగాను, కర్తవ్యంగాను భావిస్తారే తప్ప లాభాపేక్షతో చూడరు.

**ఆవులంటే ప్రాణం, దళితులంటే ద్వేషం**

కామనగరువులో వీరిన శ్రీనివాసరావు తదితరుల నుంచి మేము సమాచారం సేకరించే సమయంలో కూడ వారి ప్రతి మాటలోను దళితులంటే చులకన చూపు వ్యక్తమైంది. మాదిగలు తెల్లబట్టలు తొడుక్కోవడం సైతం సహించలేని వారి ద్వేషభావానికి ఆశ్చర్యం వేసింది. ఆవు అంటే తమకి పిచ్చి, ప్రాణమనే అంధవిశ్వాసానికి మూలమేమిటో తెలిసింది. కాని ఆవు కళేబరం నుంచి చర్మం ఒలవడం, ఆ మాంసం తినడం నేరంగా పరిగణించే వారి అవివేకానికి మా నోట మాట రాకుండా పోయింది.

బాధితులకు తక్షణసాయం, నష్టపరిహారం, ఉద్యోగం, భూమి ప్రభుత్వం ప్రకటించింది. ఇంతవరకు తక్షణసాయంతో పాటు 25 శాతం మేరకు నష్టపరిహారం అందింది. ఇవేవీ బాధితులను ఓదార్చలేదు, నిజాన్ని ఏనాటికీ ఏమార్చలేరు. మాలమాదిగలు కలిసి పశువు కళేబరాన్ని తరుము పట్టిన కాలం నాటి వాడు ఎలీషా. దొరికినప్పుడు ఆ మాంసంతోను, లేనప్పుడు తాటిపళ్లతోను కడుపు నింపుకున్నవాడు. చర్మకార వృత్తితో కుటుంబాన్ని ఈదుకొచ్చినవాడు. చెమటోడ్చి కొడుకుల్ని చదివించిన వాడు. ఒక పథకం ప్రకారం జరిగిన ఈ దాడి ఆయనని నిలువెల్లా కలచివేసింది.

**'దళితుల ఐక్యత వర్ధిల్లాలి'**

దేశంలో హిందూత్వవాదుల దురాగతాలకు కొనసాగింపుగానే ఈ సంఘటన జరిగిందని బోధపడుతుంది. ఉత్తరప్రదేశ్‌లోని దాదరీ నుంచి గుజరాత్‌లోని ఉనా మీదుగా ఆంధ్రప్రదేశ్‌లోని సూదాపాలెం వరకు మతోన్మాదం చొచ్చుకువచ్చింది. అయితే ఇక్కడి కుల దురహంకారానికి మెజారిటీ మతోన్మాదం తోడయింది. గొడ్డు మాంసం తింటున్నాడనే అనుమానంతో మనిషిని హతమార్చే స్థితి నుంచి పశువు కళేబరం నుంచి చర్మం ఒలిచే కులవృత్తిని నేరంగా పరిగణించే దశకి ఎగబాకింది. ఇటీవలి పరిణామాలను తెలుసుకొనేందుకు మిత్రులం జానకీపేటకు వెళ్లినప్పుడు, ఆనాటి అవమానం తను కనుమూసేంత వరకు గుర్తుండిపోతుందని ఎలీషా కన్నీళ్లు పెట్టుకొన్నాడు. మా తిరుగు ప్రయాణంలో ఆయన గుడిసె చూరుకి గుచ్చిన 'దళితుల ఐక్యత వర్ధిల్లాలి' అనే ప్లకార్డ్ వేపు ఆశగా కొంతసేపు చూస్తుండిపోయాం.

*(రచయిత మానవ హక్కుల కార్యకర్త)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# హక్కుల సాధనలో బొజ్జా తారకం

***పీడిత, దళిత వర్గాల న్యాయం కోసం జరిగిన ప్రజా ఉద్యమాల్లో వారికి అండగా ఉంటూ బొజ్జా తారకం నిర్వహించిన పోరాటాలను, 'నలుపు' పత్రిక స్థాపనలో ఆయన అనుభవాలను వివరిస్తున్నారు* సజయ**

**బొ**జ్జా తారకం, విజయభారతి ఇద్దరితో నాకు ఇరవై ఐదు సంవత్సరాల స్నేహానుబంధం. ఆ చనువుతోనే 'నలుపు' పత్రిక సంపాదకులుగా ఆ పత్రిక గమనం గురించి ఆయన్ని ఇంటర్వ్యూ చేస్తానని చెప్పినప్పుడు ఆయన సంతోషపడ్డారు. ఇంతవరకూ 'నలుపు' పత్రిక గురించి తాను ఎవ్వరికీ ఇంటర్వ్యూ ఇవ్వలేదని, ఇదే మొదటిదని చెప్పారు. తనకు ట్రీట్‌మెంట్ లేని రోజుల్లో ఫోన్‌చేసి రమ్మని చెప్పారు. మూడేళ్ల క్రితం బ్రెయిన్ క్యాన్సర్ రావడంతో ఆపరేషన్ అయింది. రేడియేషన్, కీమో ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నారు. ట్రీట్‌మెంట్ తీసుకునే ముందు మూడురోజులు, ట్రీట్‌మెంట్ అయిన తర్వాత నాలుగైదురోజులు శారీరకపరంగా విపరీతమైన ఒత్తిడికి గురయ్యేవారు. ఆ సమయంలో తట్టుకోలేనంత తలనొప్పిగా ఉంటుందని, చాలా నిస్సత్తువగా ఉంటుందని చెప్పారు మాటల సందర్భంలో. దానివల్ల ఏదైనా మాట్లాడుతున్నప్పుడు సడెన్‌గా కొన్ని విషయాలు మర్చిపోతున్నానని, అందుకే కొంచెం బాగున్నప్పుడే రమ్మని చెప్పారు. అలా 2015 జూలై 18న ఆయనతో దాదాపు రెండుమూడు గంటలు మాట్లాడడం జరిగింది.

ఆయన చెప్పినట్లుగానే మాట్లాడుతూ మాట్లాడుతూ 'నేను దేనిగురించి చెప్తున్నాను' అని అడిగి మళ్లీ కొంత సమయం తీసుకుని కొనసాగించే వారు. మాన్యువల్ స్కావెంజర్స్ జీవితాల మీద భాషాసింగ్ రాసిన 'అన్‌సీన్' పుస్తకాన్ని తెలుగులోకి అనువాదం చేస్తున్నానని తెలిసి చాలా సంతోష పడ్డారు. ఆదే నేను చివరిసారి ఆయనతో కలిసి మాట్లాడడం. ఆ తర్వాత ప్రతిసారీ వెళ్లాలనుకోవడం, ఆయన ట్రీట్‌మెంట్‌లో ఉన్నారని ఆగిపోవడం... సెప్టెంబరు 16 రాత్రి 11.30గంటల ప్రాంతంలో తారకం సార్ ఇకలేరు అనే సమాచారం మిరపమాధవి నుంచి. ఆ వెంటనే వసుధ, భీమ్‌రావ్‌ల నుంచి. మర్నాడు ఉదయాన్నే వెళితే, శారీరక బాధలన్నీ వదుల్చుకుని ప్రశాంతంగా ఆయన అలా ఐస్‌బాక్స్‌లో పడుకుని ఉండగా చూడాల్సి వచ్చింది. పక్కనే నిశ్శబ్దంగా కూర్చుని ఉన్న విజయభారతి గారు. 'నెప్పితో చాలాబాధపడ్డారు, ఆయనకు ఇదంతా లేకుండా ఉంటే బాగుండేది, ఇంతమంది ఆయన కోసమే వస్తున్నారు. అయినా ఇప్పుడు ఆయనకేమీ తెలియదు కదా, ఎవరన్నా ఇంటికి వస్తే చాలా సంతోషపడేవారు' అని ఆవిడ పదే పదే తల్చుకున్నారు.

'వాళ్ల నాన్నగారి జీవితచరిత్రను పూర్తిచేయగలిగారు. పుస్తకం ప్రచురణ నుంచి వచ్చిన తర్వాత చూశారు కానీ, అప్పటికే ఆయన దాదాపు ఆపస్మారకస్థితిలోకి వెళ్లిపోయారు. ఆయన ప్రతిరోజూ ప్రశాంతంగా నిద్రపోగలిగితే చాలు అనుకున్నాను. అంత నెప్పి భరించారు ఆయన. రామాయణ, మహాభారతాలను ఒక కొత్త దృక్కోణం నుంచీ పరిశోధించాలని చాలా నోట్స్ రాసిపెట్టుకున్నారు. అలానే ఆయనకు చిన్నప్పటి నుంచీ డైరీ రాయడం అలవాటు. వాటిలో చాలా విషయాలను నోట్ చేసి ఉంచారు. ఆరోగ్యం పాడయేంతవరకూ డైరీ రాశారు. వాటిని ఒక ఆర్డర్‌లో పెట్టడం సాధ్యమయ్యేపనేనా, అవన్నీ మా స్వంత ఇంట్లో ఉండిపోయాయి' అని చెప్పారు. ఆపరేషన్ అయిన తర్వాత చిన్నపాటి శబ్దాన్ని కూడా భరించలేకపోవడంతో నిత్యం ట్రాఫిక్ అలజడి వినిపించే టోలీచౌక్ ఇంటి నుంచి అశోక్‌నగర్‌లోని ఒక అద్దె ఇంట్లోకి వచ్చారు. స్వంత ఇల్లు పెట్టుకుని చివరికి అద్దె ఇంట్లోనే చనిపోయారు అని ఆవిడ బాధపడ్డారు. ఆయనకి సంబంధించిన విషయాలను తల్చుకుంటూ ఆవిడ వ్యక్తం చేస్తున్న అభిమానాన్ని వింటూ నిశ్శబ్దంగా ఆయనకి నివాళులర్పిస్తూ ఉండిపోయాను.

ఎనభై దశకంలో ప్రజా ఉద్యమాల్లోకి వచ్చిన నాలాంటి అనేకమందికి బొజ్జాతారకం గారంటే మొదటి పరిచయం 'పోలీసులు అరెస్టు చేస్తే' అనే పుస్తకం ద్వారానే. మనిషిని చూడకపోయినప్పటికీ ఆ పేరంటే చాలా గౌరవం. అత్యంత ముఖ్యమైన విషయాన్ని ఎంతో సులభమైన భాషలో ప్రజలకు అందించడం, ఆ పుస్తకం ఇప్పటికీ అనేక ముద్రణలు పొందటం ఆ విషయం సామాన్య ప్రజల జీవితాల్లో ఎంత ముఖ్యమైందో అర్థం చేసుకోవచ్చు. ఆ పుస్తకం తర్వాత ఆయన అనేక పుస్తకాలు రాశారు. కవిత్వం, నవల, సైద్ధాంతిక వ్యాసాలు... పత్రికా సంపాదకత్వం అంబేద్కరిజం... ఇలా ఎన్నో రకాలుగా ఆయన సాహిత్య ప్రయాణం ఉన్నప్పటికీ, అనేకమంది గుర్తుపెట్టుకున్నది మాత్రం ఆ పుస్తకాన్నే. ప్రతి ఒక్కరికీ అలా పరిచయమైన ఆయన అనేకమందికి ఆప్తుడు, రాజకీయ గురువు, స్నేహితుడు, ఆదుకునే న్యాయవాది, ఉద్యమకారుడు. అలాంటి అనుబంధమే నాకూ ఆయనతో ఉంది. ఆయన చివరి పుస్తకం తన తండ్రి బొజ్జా అప్పలస్వామి గారి జీవితచరిత్ర.

ఆయన్ని మొట్టమొదటిసారి 1985లో విజయవాడ ఒన్‌టౌన్ మున్సిపల్ హైస్కూల్‌లో కారంచేడు మారణకాండకు వ్యతిరేకంగా జరిగిన సభలో వక్తగా చూశాను. అనర్గళమైన ఆయన ప్రసంగం సామాజిక రాజకీయరంగాల్లో విస్మరించిన ఒక ముఖ్యమైన కోణాన్ని పరిచయం చేసింది. అప్పుడు ఆయన్ని వినడమే తప్ప పరిచయం అవలేదు. 'నలుపు' పత్రిక ఆవిర్భావం, మండల్ కమిషన్ సిఫార్సుల అమలు కోసం జరిగిన పోరాటంలో హైదరాబాద్‌లో ఏర్పాటు చేసిన సమతా సంఘటన, చుండూరు మారణకాండ, మతకల్లోలాలు...ఇలా అనేక అంశాల్లో హైదరాబాద్ కేంద్రంగా ఆయనతో సన్నిహితంగా పనిచేసే అవకాశం కలిగింది. ఉరిశిక్షలకు వ్యతిరేకంగా 1995-97 ప్రాంతంలో ఆంధ్రప్రదేశ్ లో జరిగిన ఒక ప్రజాస్వామిక ఉద్యమంలో ఆయన బలంగా తన గొంతు వినిపించారు. ఆ విషయమై మేము నిర్మించిన ఒక డాక్యుమెంటరీ లో దళిత హక్కుల న్యాయవాదిగా ఆయన అభిప్రాయాన్ని రికార్డు చేశాం నేనూ, హసన్, అంబిక.

'నలుపు-ప్రజాపక్షపత్రిక' ఒక చారిత్రిక సందర్భంలో తారకం గారి సంపాదకత్వంలో 1989లో ప్రారంభమయింది. సమాజంలో ఒక ముఖ్యమైన సామాజిక విషయం చర్చకు వచ్చినపుడు దాని గురించి చర్చించడానికి, ప్రచారం చేయడానికి అనేక ప్రయత్నాలు జరుగు తుంటాయి. ఆ ప్రయత్నంలో కొంత సఫలీకృతమవ్వచ్చు, కొంత నిరాశ కూడా వస్తుంది. ఒక్కోసారి విఫలమౌతుంది కూడా. ఇదంతా జరిగేటపుడు ఆ తీవ్రతను వెంటనే నమోదు చేయగలిగితే చాలా ఉపయోగముంటుంది. అలా అనేక సమస్యల పరిష్కారం కోసం వెతుకుతున్నప్పుడు వాటిని వెంటనే అక్షరరూపంలోకి తీసుకురాగలిగిన వేదిక, మీ తరఫున మేమున్నాం అనే బలమైన గొంతు అవసరం అవుతుంది. అలాంటప్పుడే సమస్యకు అవసరమైన సిద్ధాంతాలు వస్తాయి. అది మార్క్సిజమైనా, అంబేద్కరిజమైనా, దళితవాదమైనా, స్త్రీవాదమైనా... అయితే సమస్యలు ఒకటి తర్వాత మరోటి వస్తూనే ఉంటాయి. అలా సమస్య వచ్చినపుడే పరిష్కారమార్గం వెతుక్కోవడం, పరిష్కారాన్ని చూపించడం కాకుండా, ప్రజల సమస్యలన్నింటికీ పరిష్కార మార్గాలను సూచించే విధంగా, సైద్ధాంతిక దిశనందిస్తూ చర్చించే విధంగా ఒక వేదిక పనిచేయాలి. ఆ సమాచారం పదిమంది దగ్గరికీ వెళ్లాలి. సమస్య తీవ్రతను బట్టి పరిష్కార మార్గం ఉంటుంది. సరిగ్గా ఈ నేపథ్యంతోనే ప్రజల పక్షాన నలుపు పత్రిక ఆవిర్భావాన్ని చూడాలి. దినపత్రికలలో కనీసం వార్తలుగా కూడా రాని అనేక సామాజిక, రాజకీయ కోణాలను, అంశాలను తెలుగు ప్రపంచానికి పరిచయం చేసిన పత్రికగా అస్తిత్వ ఉద్యమాల చరిత్రలో దీనికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. ఆరు సంవత్సరాలపాటు ఆయన సంపాదకత్వంలో నడిచిన ఈ పత్రికను ఆర్థిక భారంతో ఆపివేయాల్సి వచ్చింది. సైద్ధాంతిక, రాజకీయ అభిప్రాయాలతో పాటు పత్రిక నిర్వహణలో ఎదుర్కొన్న అనేక ఒత్తిళ్ల గురించి ఆయన ప్రత్యేకంగా ఇచ్చిన ఇంటర్వ్యూ ఆయన మాటల్లో...

'నిజానికి ఒక పత్రికను తేవాలని నాకెప్పటి నుంచో ఉండేది. నేను చిన్నప్పుడు హైస్కూల్‌లో ఉన్నప్పుడు ఒక లిఖితపత్రికను తెచ్చేవాడిని. దానిని చేతితోనే కార్బన్‌పేపర్లు పెట్టి రాసేవాడిని. ఒక్కోసారి రెండు, మూడు, నాలుగు కాపులు కూడా వచ్చేది. నేనే రాసి మా ఊర్లో అమ్మేవాణ్ణి. అలా నాకు చిన్నప్పటి నుంచీ ఒక పత్రిక నడపటం అనే ఆలోచన బలంగా ఉండేది. మా నాన్న బొజ్జా అప్పలస్వామి కూడా ఒక మాసపత్రిక నడిపేవారు. దానిపేరు 'జ్యోతి'. అప్పటికి ఆంధ్రజ్యోతి పత్రిక ఇంకా పుట్టలేదు. ఆయన ఎంఎల్‌ఏగా రాజకీయాల్లో బాగా నిమగ్నమయి ఉండేవారు. సమయం ఉండేదికాదు. ఎవర్నో పత్రిక చూడమని చెప్పారు. కానీ, వాళ్లు సరిగ్గా చూడకపోవడంతో అది ఆగిపోయింది. అలాగ పత్రికను తిరిగి తీసుకురావడం గురించి ఆలోచించేవాడిని. ఆర్థిక వనరులు లేకపోవడంతో అది సాధ్యం కాలేదు. ఆ కోరిక అప్పటి నుంచి అలాగే ఉండిపోయింది. నాకు స్ఫూర్తి బ్లాక్ మూమెంట్. 1964లో మార్టిన్ లూథర్‌కింగ్ బ్రహ్మాండమైన ఉద్యమం నడిపారు. అది ఉధృతంగా నడిచినకాలం. మన భారత సమాజంలో అంటరాని సమాజంగా ఉన్నవారికీ ఈ ఉద్యమానికీ చాలా దగ్గర పోలికలున్నాయి. ఆ తర్వాత నేను మమేకమైన ఉద్యమాలలో, మిత్రులతో ఒక పత్రిక తేవడం గురించి ఎక్కువగా చర్చించలేదు గానీ, ఆ కోరిక మాత్రం అలానే ఉండిపోయింది. 1985లో కారంచేడు గ్రామ దళితులపై అమానుషమైన మారణకాండ జరిగింది. అనేకమంది దళితులు చంపబడ్డారు. కారంచేడులో దళితులపై జరిగిన మారణకాండ ప్రజాజీవితాన్ని కుదిపేసింది. అప్పటివరకూ కులాన్ని, దాని మూలాల్ని పట్టించుకోనివాళ్లు కూడా అగ్రకుల వికృతరూపాన్ని చూసి ఒక విచక్షణలోకి వెళ్లారు.

కేవలం ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా దేశవ్యాపితంగా ఈ సంఘటన చాలా ప్రభావాన్ని చూపించింది. ఒక సంఘటిత దళిత ఉద్యమానికి నాంది పలికింది. సభలు, రాస్తారోకోలు, ప్రదర్శనలు, పోరాటాలు ఇవన్నీ పెద్ద సంచలనాన్ని కలిగించాయి. అవన్నీ కూడా ఎప్పటికప్పుడు అయిపోతూ ఉండేవి. అప్పటికప్పుడు రికార్డు చేయలేకపోతే ఇంక వాటి గురించి మనకు ఎక్కడా దొరికేది కాదు. మిగిలిన పత్రికలు మా ఆలోచనలను, ఉద్యమాన్ని పూర్తిగా రికార్డు చేయలేదు. దళిత ప్రజల ఆలోచనలను, సంఘర్షణలను, వాస్తవాలను రికార్డు చేయలేదు. పైగా వర్గపోరాటంలో ఇలాంటి అంశాలకు తావులేదన్నవాళ్లు కూడా ఉన్నారు. మాలాంటివాళ్లం ఎంతోమందిమి పూర్తిగా కారంచేడు మారణకాండ వ్యతిరేక ఉద్యమంలో మునిగిపోయాం. ఇంకోపని లేదు మాకు. మీటింగులు పెట్టడం, సభలు పెట్టడం, కేసులు నడిపించడం, కోర్టులకు వెళ్లటం, సాక్ష్యాలను సేకరించడం, సాక్షులను నిలబెట్టడం, వాళ్లకి ధైర్యం చెప్పడం, వారి జీవనాధారాల గురించి పనిచేయడం...

దీనివల్ల పత్రిక ప్రారంభించడం అనేది ఆ తర్వాత నాలుగు సంవత్సరాలకు గానీ మాకు సాధ్యం కాలేదు. నిజానికి ఆ సంఘటన తర్వాతే ఈ ఆలోచన మరింత బలపడింది. 80ల ప్రారంభంలో ప్రత్యామ్నాయ అభ్యుదయ, రాజకీయ సాహిత్యం అందించాలనే లక్ష్యంతో హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ఏర్పడింది. ఈ క్రమంలో సిరిల్‌తో పరిచయమైన తర్వాత, నేనూ తనూ ఇద్దరం కలిసి నడుస్తున్న రాజకీయాల మీద ముఖ్యంగా దళిత రాజకీయాలు, ఉద్యమాలు వాటికి సంబంధించిన అంశాల గురించి చర్చించుకునేవాళ్లం. అలానే కంచ ఐలయ్య, బాలగోపాల్ లాంటి మిత్రులతో చర్చిస్తున్నపుడు మా ఆలోచనలకు అనుగుణంగా పత్రిక తీసుకురావాలని ఒక నిర్ణయానికి వచ్చాం. అప్పటికే ఒక ప్రత్యామ్నాయ ప్రజాఉద్యమాల ప్రచురణకర్తలుగా హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ కి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. 1989 నాటికి మాకు కొంత సమయం దొరికింది. ఈ ఉద్యమాలను, ఆలోచనలను పంచుకోవడానికి కచ్చితంగా పత్రికగా ఒక వేదిక ఉండాలని భావించాం అందరం. నిజానికి ఈ ఆలోచనకు మూలప్రేరణ సిరిల్. మీరు ముందుండండి, నేను మిగతా పనులన్నీ ప్రచురణకర్తగా చూసుకుంటానని చెప్పాడు. ఆయన ప్రోత్సాహం, చొరవతోనే పత్రిక ప్రారంభమైంది. ఆ తర్వాత నేను సంపాదకునిగా, సిరిల్ ప్రచురణకర్తగా సంపాదకవర్గంగా పౌరహక్కుల ఉద్యమ నాయకుడు బాలగోపాల్, కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గా ఉన్న డి.నరసింహారెడ్డి, ఉస్మానియా యూనివర్సిటీ పొలిటికల్‌సైన్స్ ప్రొఫెసర్ కంచ ఐలయ్య, ఉస్మానియా యూనివర్సిటీ జర్నలిజం ప్రొఫెసర్ పి.ఎల్.విశ్వేశ్వరరావు, జర్నలిస్ట్ ఆర్. అఖిలేశ్వరిలతో 'నలుపు'ని ప్రారంభించాం.

'నలుపు-ప్రజాపక్షపత్రిక' అనే పేరుతో ఒక పత్రిక హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ఆధ్వర్యంలో రాబోతోందని విన్నప్పుడు 'అదేం పేరు ఇంకేం పేరు దొరకలేదా' అని వ్యంగ్యంగా అన్నవాళ్లు చాలామంది ఉన్నారు. ప్రజాపక్షపత్రిక అని చెబుతూ కేవలం ఒక దళిత సమూహానికి అర్థం వచ్చేట్లు ఎట్లా పెడతారు అని అన్నవాళ్లు కూడా ఉన్నారు. నలుపు అప్రెషన్‌కి సింబాలిక్‌గా ఉంది. నలుపు అంటే అప్రెషన్, డిస్‌క్రిమినేషన్. నలుపు అంటరానితనానికి కూడా సింబల్ గా మారింది. అత్యాచారాలకు, హింసకు గురయ్యేదంతా నలుపుకి సంబంధించిన వాళ్లే. నలుపు

పేరుపెట్టడం సమంజసం కాదేమో అని మొదట్లో నేను కొద్దిగా సంశయించాను. పత్రిక అన్నివర్గాల వారికీ చేరువలోకి వెళ్లలేదేమో అనిపించింది. ఉద్యమం వేరు, పత్రిక వేరు. ఇది ప్రజల పత్రికగా తీసుకురావాలనుకున్నాం. ప్రజల్లో అందరూ ఉంటారు. అణ్రెషన్‌కి అన్ని కులాలవారూ, వర్గాల వారూ గురవుతారు. వాళ్లందరినీ దూరం చేసుకుంటామేమోననే సంశయం ఎక్కడో నాకుండేది.

రెండు, 'నలుపు' అంటే వెంటనే ఆదరించరేమో అనిపించింది. ఈ పేరుని విశాల ప్రజానీకం అంగీకరిస్తుందా అని చాలా తర్జనభర్జనలు పడ్డాం. బహుశా ప్రజలంటే అన్ని సమూహాల వారూ ఇమిడి ఉంటారనే స్పృహ చాలామందికి ఉండకపోవడమే కారణం. ప్రజలతో సంబంధం లేనివాళ్లు దళితులు అనే అవగాహనలోంచి వచ్చిన ఆలోచన అది. అంటే వారి దృష్టిలో ప్రజలు వేరు, దళితులు వేరు. కానీ, దళితులు ప్రజల్లో భాగం, ప్రజల్లో దళితులున్నారు. ప్రజా ఉద్యమాలు పోరాటం చేసేవారందరినీ కలుపుకోవాలి.

కానీ, అది జరగలేదు. ప్రజల్లో సాధారణంగా అందరూ ఉంటారు. దోపిడీ చేసేవారూ ప్రజల్లో ఉంటారు, దోపిడీకి గురయ్యేవాళ్లూ ప్రజల్లో ఉంటారు. కానీ, సాధారణంగా ప్రజలు అనేసరికి దోపిడీకి గురవుతున్న వారు, బాధలు పడుతున్నవారు, హింసను అనుభవిస్తున్నవారు – ఈ వ్యత్యాసాలను అనుభవిస్తున్నవారందరినీ ప్రజలుగా ప్రస్తావిస్తూ, దోపిడీ చేసేవారూ ప్రజల్లో భాగమయినప్పటికీ, వాళ్లని ప్రజలు అనడానికి వీల్లేదనేది మా ఉద్దేశం. ప్రత్యేకంగా దళితుల కోసం ఒక పత్రిక పెట్టటం కానీ, వ్యాసం రాయడం గానీ దానిని మార్చే క్రమంలో భాగంగా వచ్చిందే. అణగారిన ప్రజల కోసం, దోపిడీకి గురవుతున్న సమూహాలను వివిధ కోణాల నుంచీ చైతన్యవంతం చేసేదిగా ఒక ప్రత్యేకత కల్గినదిగా రూపొందించడమే 'నలుపు' ఉద్దేశం. ఎక్కువశాతం బాధలకు గురవుతున్న వాళ్లు, దోపిడీకి గురవుతున్నవాళ్లు, హింసకు గురవుతున్నవాళ్లు, హక్కులు కోల్పోతున్న వారందరూ ప్రజలనే ఉద్దేశాన్ని స్పష్టంగా ప్రకటించింది 'నలుపు'. మా సంపాదకవర్గమంతా కూడా ప్రజా ఉద్యమాల్లో ఉన్నవాళ్లు, ప్రజాసమస్యల గురించి పోరాటం చేస్తున్న వాళ్లు, వాటి పరిష్కారం గురించి పలుకోణాల్లో వెతుకుతున్నవాళ్లు.

పత్రిక ప్రారంభమైన తర్వాత అంతకుముందు నేను పడిన సంశయాలు, అనుమానాలన్నీ పోయాయి. మొదటి సంచికతోనే అద్భుతమైన ఆదరణ వచ్చింది. ఎంతోమంది పత్రికను స్వంతం చేసుకున్నారు. అప్పటికే కొన్ని పత్రికలు ప్రజా ఉద్యమాలలో ఉన్న సంఘాల ద్వారా నడుస్తున్నాయి. మరో పత్రిక ఎందుకు మా పత్రికలనే వేదికలుగా చేసుకోవచ్చు కదా, మళ్లీ వేరే పత్రిక ఎందుకు అని కొంతమంది అభిప్రాయపడ్డారు. నాతో ప్రస్తావించారు కూడా. వాటి పాత్రను తక్కువ చేయలేము కానీ, మా ఆలోచనలకు వేదికగా, అట్టడుగు వర్గ సమూహాల అభివ్యక్తి వేదికగా పత్రిక తీసుకురావాలనుకున్నాం. కేవలం కులసమస్యకు పరిమితమైతే ఎట్లా, వర్గ సమస్యను చూడరా అన్నవాళ్లూ ఉన్నారు. నేను మొదటినుంచీ చెప్తున్నది ఈ రెండూ విడివిడిగా లేవు. ఒకదానికొకటి అవినాభావ సంబంధం ఉంది. ఈ రెండే కాకుండా జండర్ అంశం కూడా. ఇంకా అనేక అంశాలు ఉన్నాయి. వీటన్నిటి మధ్య ఒక సుహృద్భావపూరిత వాతావరణంలో ఒక డైలాగ్ నడవాలి. ఆ అవకాశాల్ని బలంగా ముందుకు తీసుకురావాలి. అందుకోసమే ఈ పత్రిక అని వివరించాం.

నలుపు పత్రిక ఐదేళ్లపాటు 1989 నుంచీ దాదాపు 1995 వరకూ చాలా సక్సెస్‌ఫుల్‌గా నడిచింది. ప్రతి సంచికకు పని ఒక యుద్ధంలానే ఉండేది. ఇప్పుడు వెనక్కి తిరిగి ఆలోచిస్తే ఎలా చేశామో ఆ పనంతా అనిపిస్తుంది. పత్రికను దళిత సెక్షన్స్ బాగా రిసీవ్ చేసుకున్నాయి. ఇంకా ఇతర అస్తిత్వ ఉద్యమాలు కూడా పత్రికతో ఐడెంటిఫై అయ్యాయి. కొత్త కొత్త రచయితలు వచ్చారు.

వాస్తవానికి అప్పటికున్న రాజకీయ పరిస్థితుల్లో లెఫ్ట్ ఉద్యమాలు ఈ వర్గాలకి ఒక భరోసా అందించలేక పోయాయి. దళిత సమూహాల్లో లెఫ్ట్ పట్ల చాలా అనుమానాలుండేవి. దానికి కారణం ఉంది. కమ్యూనిస్టు నాయకత్వంలో ప్రధానంగా ఉన్నది అగ్రకులస్థులు కావటం... సమానత్వం అనే అంశం మాటలకే తప్పించి వారి రోజువారీ ఆచరణలో కనిపించకపోవటం. ఇది చాలా ప్రధాన సమస్య. ఒకప్పుడు ఈ అంశం చాలా బలంగా ఉండేది. ఇప్పుడు పరిస్థితి కొంచెం మారింది. సైద్ధాంతిక పరమైన చర్చలు ముందుకు వెళుతున్నాయి. కొంత అలయెన్సెస్ నడుస్తున్నాయి. ఇవి బలపడాల్సిన అవసరం ఉంది. అలానే దళిత సెక్షన్లలో కూడా ఒకరిపట్ల ఒకరికి నమ్మకం లేదు. విభేదాలు ఉన్నాయి. కారంచేడు, చుండూరు సంఘటనలు జరిగిన తర్వాత దళిత వర్గాలు తమలో తామే చాలా విమర్శలు చేసుకున్నారు. ఆ విభేదాలు తారాస్థాయికి చేరాయి ఇప్పుడు.

ఈ పరిస్థితి కూడా మారాల్సిన అవసరం ఎంతో ఉంది. మన అనైక్యతే ఎదుటివాడి బలం అవుతుంది. ఈ ఇద్దరి మధ్యా సయోధ్య కుదర్చడానికి ఎస్.ఆర్. శంకరన్ లాంటివాళ్లు ఎంతో ప్రయత్నం చేశారు. కారంచేడు సంఘటన తర్వాత అక్కడి దళితులు గ్రామాన్ని వదిలి చీరాల పట్టణానికి దగ్గరలో విజయనగర్ కాలనీ ఏర్పాటు చేసుకున్నారు. అదంతా ఇసకపర్ర. నిజానికి మనుషులు ఉండడానికి పనికివచ్చే స్థలం కాదది. అయినా ఇంక వేరే మార్గం లేదు. వారందరికీ ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాల కోసం ట్రెయినింగ్ కోసం చిన్న పరిశ్రమలు పెట్టటం జరిగింది కానీ అవి ముందుకు సాగలేదు. దానికి కారణం అందరి అనుభవం, వృత్తి వ్యవసాయ సంబంధంగా ఉండడం. అందుకే ప్రతి కుటుంబానికీ భూమి ఇవ్వాలనే డిమాండ్ ముందుకు పెట్టాం. అది కొంతవరకు అమలులోకి వచ్చింది. పత్రికా పరంగా మేము కాస్ట్‌ని క్లాస్‌ని సమన్వయపరిచే పని ఒకటి చేశాము. వీటికి సంబంధించిన చర్చలను విస్తృతంగా ప్రచురించేవాళ్లం. మేమనుకున్న ఉద్యమాల నుంచీ చాలా ప్రోత్సాహం ఉంది. రాయడంలో, సమాచారం అందించడంలో మేము చాలావరకు విజయవంతం అయ్యామనే అనుకుంటున్నాను.

తెలంగాణ ప్రాంతంలో విప్లవ పార్టీల ప్రాబల్యం ఉన్నచోట పత్రిక మీద ఒక అప్రకటిత నిర్బంధం ఉండేది. పుస్తకాల దుకాణాల్లో పత్రికను అమ్మనివ్వకపోయేవారు. పెట్టిన పుస్తకాలను పోలీసులు తీసుకెళ్లి పోయేవారు. మాకు తర్వాత సమాచారం వచ్చేది. ఒక్కోసారి వెనక్కి ఇచ్చేసేవారు, ఒక్కోసారి ఇవ్వకపోయేది. గద్వాల, కరీంనగర్, వరంగల్, ఆదిలాబాద్ ఇలా చాలా ప్రాంతాల్లో పత్రికను అందజేయడం కత్తి మీద సాములాగా ఉండేది. 'నలుపు' చందాదారుల మీద ఒక నిఘా ఉండేది. విప్లవ రాజకీయాల మీద ప్రత్యక్ష నిర్బంధం అమలైతే, ప్రజా సమస్యలపట్ల గళమెత్తుతున్న వ్యక్తులు, సమూహాలు, వేదికల మీద ఈ విధమైన అప్రకటిత నిర్బంధం అమలయ్యేది. నిజానికి 'నలుపు' ప్రచురణ కోసం ప్రభుత్వ పరంగా తీసుకోవాల్సిన అన్నిరకాల అనుమతులు ఉన్నప్పటికీ పంపిణీలో ఈ సమస్యలు ఎదుర్కొన్నాం. ప్రత్యక్షంగా ఎప్పుడూ మా సంపాదకవర్గంతో పోలీసులు మాట్లాడలేదు. ప్రశ్నించే కలాలను, గళాలను

# దళితుల సామూహిక ఆత్మకథ 'మా బతుకులు'

*పితృస్వామ్య సమాజంలో మహిళగా ఎదుర్కొన్న సమస్యలను, దళిత ఉద్యమంలో పొందిన అనుభవాలను జోడించిన బేబీ కాంబ్లే ఆత్మకథను సమీక్షిస్తున్నారు* **బి. అనూరాధ**

**డా.** బి.ఆర్.అంబేద్కర్ పిలుపుతో ఎంతో ప్రభావితమైన దళితులు తాము చదువుకోడానికి ప్రయత్నించడమే కాదు అందులో తాము విజయం సాధించినా, సాధించకున్నా చాలా పట్టుదలతో తమ పిల్లల్ని విద్యావంతులను చేయడానికి ప్రయత్నించారు. అందులో అనేకమంది స్త్రీలు ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొని చదువుకొన్నారు. అంతేకాదు తమ జీవితాలను కాగితాల మీదకు ఎక్కించారు. అప్పటివరకూ అగ్రకులాలకు మాత్రమే పరిమితమైన ఈ పరిస్థితిని బద్దలుకొడుతూ మహారాష్ట్రలోనుండి అనేక రచనలు వచ్చాయి. దళిత స్త్రీల ఆత్మకథల్లో బహుశా మొట్టమొదటిది బేబీ కాంబ్లే రాసిన 'మా బతుకులు'. 'జీనా అమూచా' పేరుతో ఆమె తన ఆత్మకథను మరాఠీలో రాశారు. అయితే దానిని రహస్యంగా రాసి ఇరవై ఏళ్లపాటు అటక మీదే దాచి ఉంచారు. అది వెలుగు చూసిన వైనం కూడా చాలా చిత్రమైనది.

చాలా చిన్న వయసు నుండే బేబీ కాంబ్లే అంబేద్కర్‌తో ఉద్యమంలో పాల్గొన్నది. అందువల్ల చాలా మంది కార్యకర్తలకు, పరిశోధకులకు ఆమె పేరు సుపరిచితం. ఒకసారి సామాజిక శాస్త్రవేత్త మాక్సిన్ బెర్న్‌స్టెన్ షెడ్యూల్డ్ కులాల మీద పరిశోధన చేయడానికి బేబీ స్వగ్రామమైన ఫల్టన్‌కు వచ్చింది. ఆమె క్షేత్ర పరిశోధనలో సహాయం చేయడానికి బేబీ ఆమెతో పాటు వెళ్లింది. ఆ క్రమంలో బేబీ చెప్పిన విషయాలన్నీ వింటూన్న మాక్సీన్ ఈ విషయాలన్నీ అసలు నువ్వే రాస్తే చాలా బాగుంటుంది కదా అనేసరికి అప్పుడు బేబీ తాను రాసిన ఆత్మకథ గురించి ఆమెకు చెప్పింది. అలా ఆ విదేశీ పరిశోధకురాలి ద్వారా బేబీ కథ వెలుగు చూసింది. అప్పట్లో (1982) ఆ రచన 'స్త్రీ' అనే పత్రికలో ధారావాహికంగా ప్రచురితమైంది. 1986లో మరాఠీలో పుస్తకంగా వెలువడింది.

దళితులుగా తమ జీవితంలో అనుభవించిన అంటరానితనం, పేదరికం, మూఢవిశ్వాసాలలో అణిగిపోయి ఉండాల్సి రావటం మొదలైన అన్నిటి గురించీ బేబీ అందులో రాశారు. తమ రోజువారీ జీవితంలోని ఘట్టాలు – పొయ్యి వెలిగించడం, స్నానం చేయడం, బట్టలుతుక్కోవడం వంటి రోజువారీ పనులు కూడా ఎలాంటి పరిస్థితుల్లో చేయవలిసి వస్తుంది అనేవిషయాల దగ్గరనుంచీ పూజలూ, పూనకాలూ, పెళ్లిళ్ల, ప్రసవాలూ అన్నిటి గురించీ వర్ణించారు. డా.అంబేద్కర్ ప్రభావం తమ గ్రామం మీద ఎలా పడిందో ఎట్లా తమ జీవితాలు మారాయో ఆ సందర్భంగా వృద్ధతరానికీ యువతరానికీ మధ్య ఎంత భావసంఘర్షణలు జరిగాయో వివరించారు.

ఈ మొత్తం క్రమంలో ఇది బేబీ ఆత్మకథలా ఏమాత్రం అనిపించదు. మొత్తం మహర్ జాతి గురించిన కథనం ఇది. నిజానికి ప్రతి ఒక్కరికీ వేరువేరుగా ఉండే జీవితాలు కావవి. అందరిదీ ఒకేలాంటి పరిస్థితి. ఏం రాసినా అది అందరికీ వర్తించేదే. దానిగురించి రాసేటపుడు బేబీ తన హాస్య దృష్టిని కూడా జోడించి రాస్తూనే ఎంత శక్తివంతమైన పద్ధతిలో చెప్తారో ఒక ఉదాహరణ ద్వారా చెప్పొచ్చు.

ఒక యువతి ప్రసవ సమయంలో ఎంత కష్టపడుతుందో చెప్తూ ఆ ప్రసవం చుట్టూ ఉండే ఆచారాల గురించి రాస్తూ బిడ్డ పుట్టిన అయిదోరోజున 'పాంచ్వీ' జరిపే కార్యక్రమం గురించి వర్ణించారు. ఆ కర్మకాండ గురించి చెప్పి... 'తరవాత బాలింత, ఆమె తల్లి ఆ రాత్రంతా రెప్పవేయకుండా జాగారం చేయాలి. పొరపాటున కూడా ఇంట్లోకి పిల్లి

---

రాజ్యం ఎప్పుడూ ఒక అనుమానంతోనే చూస్తుంది. వీలయితే అణిచి వేయాలనే చూస్తుంది. ఇది నలుపు విషయంలో మాకు ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చింది.'

మామూలు పరిస్థితుల్లో అయితే ఎంతో అనర్గళంగా ఉపన్యాసం ఇవ్వగలిగే తారకం గారు, గత కొద్దికాలంగా సభలకు హాజరయినాగానీ క్లుప్తంగా మాట్లాడేవారు. తెలంగాణ ఉద్యమం జరుగుతున్నప్పుడు ఉస్మానియా యూనివర్సిటీ హాస్టళ్లను మూసివేసి విద్యార్థులను పంపించి వేయాలని చూసినప్పుడు హైకోర్టులో విద్యార్థుల హక్కుల మీద సాధికారికంగా వాదించి హాస్టళ్లను తెరిపించేలా చేశారు. ప్రజాస్వామిక ఆకాంక్షగా తెలంగాణ ఉద్యమాన్ని ఎంతగా బలపరచారో, అంతే బలంగా తెలంగాణ ప్రభుత్వం వికారుద్దీన్ ఎన్‌కౌంటర్‌లో అనుసరించిన విధానాన్ని, అలాగే శృతి, సాగర్‌ల ఎన్‌కౌంటర్‌లను ఖండించారు. ఆరోగ్యం సహకరించకపోయినప్పటికీ వీటి మీద జరిగిన సభలకు హాజరై ప్రసంగించారు. ఆంధ్రప్రదేశ్ రాజధాని పేరుమీద అడ్డగోలుగా చేస్తున్న భూసమీకరణను వ్యతిరేకిస్తూ అక్కడ జరిగిన సభల్లో పాల్గొన్నారు.

తారకం గారిని గుర్తుచేసుకోవడమంటే ఆంధ్రప్రదేశ్‌లోనూ, ప్రస్తుత తెలంగాణలోనూ, దేశంలోనూ గత ముప్ఫై సంవత్సరాలుగా జరుగుతున్న అనేక సామాజిక రాజకీయ సైద్ధాంతిక అంశాల ప్రాముఖ్యతను గుర్తుచేసుకోవడం. అణగారిన వర్గాల హక్కుల ఆవశ్యకతను మరింత బలంగా గుర్తించడం. ఇంత సుదీర్ఘ ప్రయాణంలో ఆయన అందించి వెళ్లిపోయిన మానవీయ, రాజకీయ విలువలను అందిపుచ్చుకోవడం. అత్యంత క్లిష్టమైన రాజకీయ సందర్భాలలోనూ, అనారోగ్య పరిస్థితుల్లోనూ నిబ్బరంగా ఉండగలగడం. సామాజిక నేపథ్యాలతో కాకుండా మనిషిని మనిషిగా గుర్తించగలగడం, వయసు, వర్గ, కుల, జండర్ తారతమ్యం లేకుండా ప్రతి ఒక్కరితో గౌరవంగా, ఆప్యాయంగా ఉండడం. న్యాయమని నమ్మినదాని కోసం అధికార రాజకీయ, న్యాయవ్యవస్థలతో తలపడడం. తారకం గారూ, వుయ్ మిస్ యు....

*(రచయిత సామాజిక కార్యకర్త)*

దూరకూడదు. ఆ రాత్రి సత్వాయి, బ్రహ్మ అర్థరాత్రి ప్రవేశించి బిడ్డ నొసటన రాత రాస్తారని విశ్వాసం. బ్రహ్మ వాక్కునూ, సత్వాయి రాతనూ ఎవ్వరూ తుడిపేయలేరని విశ్వసిస్తారు... మహార్‌వాడలోని పిల్లలందరి ఖర్మా ఒకేలా ఉంటుంది కదా, మరి ఒక్కో బిడ్డ నొసటా ప్రత్యేకంగా రాయడానికి ఏముంటుంది? బహుశా బ్రహ్మ, సత్వాయి మహార్‌వాడకు రావడం ఎగ్గొడతారు కావొచ్చు. లేదా వాళ్లందరికీ కలిపి ఒకే స్టాంపు తయారు చేసి పెట్టి ఉంటారు... అసలీ రోజు బ్రహ్మ సత్వాయి కనిపిస్తే ఇద్దరినీ బాగా చితక్కొట్టి ఇలా చేయడానికి మతం మీ ఇద్దరికీ బాగా లంచం ఇచ్చినట్టుంది. ఎందుకు మా నుదుటి రాతలు ఇట్లా నాశనం చేశారు? అని అడగాలని ఉంది' అంటారు. అదే ఊపులో వాళ్లకి సమాధానం కూడా చెప్తారు. 'నువ్వు పదింతలు దౌర్భాగ్యాన్ని రాస్తే మేం వెయ్యింతలు దౌర్భాగ్యాన్ని అనుభవించాం... ఇప్పుడిక నిన్ను ఓడించాం... మా దగ్గరిప్పుడు... శీలం, సత్యం... నీతి ఉన్నాయి!' అని ప్రకటిస్తారు.

బేబీ కథనంలో ఆమె బలమైన వ్యక్తిత్వం అడుగడుగునా కనిపిస్తుంది. దుర్భర పరిస్థితులను గురించి రాస్తూ కూడా ఎక్కడా లేశమంతైనా ఆత్మన్యూనత కనపడదు. పైగా ఎంతో హాస్యం కూడా జోడించి ఆ పరిస్థితులను వర్ణిస్తారు. ఆ రాసే క్రమంలో ఆ అక్షరాల వెనుక వాళ్లందరి పైనా ఆమెకు గల ప్రేమ స్పష్టంగా కనిపిస్తుంది. చాలా ఆత్మవిశ్వాసంతో జీవించారామె. దళితులను తీవ్రంగా అణచిపెట్టి మూఢ విశ్వాసాలలో మునిగితేలే పరిస్థితుల్లోనే వాళ్లని ఉంచిన అగ్రకులాల మీద ఆగ్రహం గానూ ధిక్కారంగానూ ఆమె స్వరం మనకు వినిపిస్తుంటుంది.

'మాకు నాలుగు కాళ్లు కాక రెండే కాళ్లు ఉండటం వల్ల మాత్రమే మమ్మల్ని మనుషులు అనవలిసి వస్తోంది. లేకపోతే మాకూ జంతువులకూ ఏం తేడా లేదు', అని చెప్తూ '...ఎడ్లకీ దళితులకీ ఉన్న తేడా అంతా అవి యాజమానుల ఇంట్లో గడ్డితిని వాళ్ల పెరట్లోనే ఉంటాయి. మేము వాళ్లు విసిరేసే ఎంగిలి మెతుకులు తిని ఊరికి దూరంగా పెంటకుప్పల మీద బతుకుతుంటాం', '...అగ్రకులాలు పెంటకుప్పల మీదికి విసిరేసే చచ్చిన జంతువులకి మాత్రమే మేము యజమానులం. ఆ జంతువుల చర్మాలని ఒలిచే హక్కుని నిలబెట్టుకోవడానికి మేము కుక్కలతోటీ, పిల్లులతోటీ, గెద్దలతోటీ, రాబందులతోటీ కొట్లాడాలి...' అంటారు. నిజానికి బేబీ రాసిన ఈ పరిస్థితి 1940-60ల నాటిది. ఇప్పుడైతే గెద్దలూ, రాబందుల కంటే ఎక్కువ 'గోరక్షకుల' తోటి కొట్లాడాలి, అని అదనంగా చేర్చుకోవాలి. అయితే అలా చెప్తూనే '...పర్వతాలను సైతం తనలో దాచుకోగలిగే అనంత సముద్రంలాగా అగ్రకుల పాపాల పర్వతాలను కప్పి ఉంచే సముద్రాల వంటి వారం మేము. అందుకే సముద్రానికి దక్కినట్టే ప్రపంచపు మొత్తం ఆరాధన మాకు దక్కాలి', అని ఒక అద్భుతమైన ఆత్మగౌరవ ప్రకటన చేస్తారు!

దళితుల ఇళ్లల్లో చాలా ప్రజాస్వామిక సంబంధాలు ఉంటాయనీ పితృస్వామ్యం అస్సలు కనబడదనీ వాదించే మేధావుల మాటలు వాస్తవాలు కాదని నిరూపిస్తాయి బేబీ రాసిన విషయాలు. అగ్రకుల యజమానులు హీనంగానూ దుర్మార్గంగానూ వ్యవహరించడం వల్ల అక్కడ అణిగిమణిగి పడి ఉండే పరిస్థితుల నుంచి ఇంటికి వచ్చే దళిత పురుషులు తమ స్త్రీల దగ్గరనే తమ 'పౌరుషాన్నంతా' ప్రదర్శించేది. ఆ క్రమంలో వాళ్లు తమ స్త్రీల పట్ల ముఖ్యంగా భార్యల పట్ల ఎంత క్రూరంగా ఉండగలరో చెప్తారు. బేబీకి కూడా అనుమానించే భర్త చేతిలో దెబ్బలు తినడం తప్పలేదు. తన భర్తకి తెలియకుండానే ఆమె తన ఆత్మకథ రాశారు. ఆ విషయం గురించి పంచుకొంటూ ఆ కాలంలో భర్త చేతిలో దెబ్బలు తినని స్త్రీ అంటూ ఉండే వారు కాదని, అది ఒక సాధారణ విషయంగా ఉన్నప్పుడు తన కష్టాల గురించి ప్రత్యేకంగా రాయడంలో అర్థం లేదని భావించారు. అంతే కాదు, భర్తని వదిలేయడం పరిష్కారం అని తాను అనుకోవడంలేదనీ, ఎందుకంటే ఎవర్ని చేసుకున్నా అదే 'మొగుడుతనం' ఉంటుందనీ అంటారు. ఆరకంగా ఆమె దీనిని దళిత్‌గానే కాక స్త్రీగా మహిళలు పితృస్వామ్య కారణంగా ఎదుర్కొనే సమస్యలు గురించి చాలా వివరంగా రాశారు.

దళితులు మొదటినుంచీ హిందువులుగానే జీవించారనీ కానీ హిందూ మతమే తమని దూరం పెట్టిందని చెప్తూ ఆమె అగ్రవర్ణ హిందువులను ప్రశ్నిస్తారు. 'మేము మీకు వ్యతిరేకంగా కొట్లాడామా? లేదే? మీరు పూజలు చేస్తుంటే మేము నమాజ్ చేయలేదే! మీరు గోవుని పవిత్రంగా ఎంచారు. మేము గోవుని ఎన్నడైనా అవమానించామా? లేదే? మేము హిందూ ధర్మం ఆదేశించిన ప్రతి సూత్రాన్ని పాటించాము... ఎందుకు మీరు మమ్మల్ని వెలివేశారు? ...మేము మీకు ఎంతో అపురూపమైన నాగరికత, సంస్కృతిలకి సేవచేసుకోడానికే అంకితమై పోయాం. అంతెందుకు మీరు ఉమ్మివేయాలంటే కూడా ఉమ్మి తొట్టిలా మా చేతులు చాచడానికి సిద్ధమయ్యామే! ఎందుకు మేమంటే మీకంత అసహ్యం?... మేమెప్పుడూ మీకు విధేయంగానే ఉన్నాం. మీరు మాకెప్పుడూ ద్రోహమే చేశారు!' అంటారు.

ఈ పుస్తకంలో బేబీ తన సొంత జీవితం గురించి రాసింది చాలా తక్కువ. అయితే ఇంగ్లిష్‌లోకి ఈ పుస్తకాన్ని అనువాదం చేసిన మాయా పండిత్ ఆ ఖాళీని పూరించడానికి, అప్పటికి జీవించే ఉన్న బేబీని కలిసి ఇంటర్వ్యూ చేసి దానిని కూడా అనుబంధంగా చేర్చారు. అంతే కాదు బేబీ చేత మళ్లీ రాయించి దానిని చివరి అధ్యాయంగా చేర్చారు. బేబీ ఈ పుస్తకాన్ని 1960ల చివరిలో రాశారు. ఇరవై యేళ్ల తరవాత 1986లో మరాఠీలో ప్రచురితమైతే ఇంగ్లిష్‌లోకి మరో ఇరవై యేళ్ల తరవాత 2008లో అనువాదం అయ్యింది. కాబట్టి తాను 40 ఏళ్ల కింద రాసిన విషయాలను గురించి ప్రస్తావిస్తూ ప్రస్తుత పరిస్థితిని గురించి విమర్శనాత్మకంగా మాట్లాడడానికి ఆమెకొక అవకాశం వచ్చింది. తమ బతుకులు బాగుపడి పోతే చాలనుకొని ఉన్నత పదవులలో ఉండి, సమాజం కోసం ఏమీ చేయకుండా ఉండిపోయిన 'క్రీమీ లేయర్' దళిత కుటుంబాలను తీవ్రంగా విమర్శిస్తారు. అంతేకాదు గతాన్ని మర్చిపోయి తమ పిల్లలకి హిందూ సంస్కృతిని, హిందూ ధర్మాన్ని అలవాటు చేయడాన్ని కూడా ఆక్షేపిస్తారు.

ఇంగ్లిష్ అనువాద ప్రచురణకర్తలు మాత్రం మరాఠీ సంస్కృతికి ఏమీ సంబంధంలేని వేషధారణలో ఉన్న ఒక దళిత స్త్రీ ఫోటోని ముఖచిత్రంగా ప్రచురించి బేబీకి అన్యాయం చేసారని చెప్పాలి. ఎందుకంటే నాతో సహా అందరికీ అది బేబీ ఫోటోనే అనే అభిప్రాయం కలిగింది. ఒక ఆత్మకథని ప్రచురిస్తూ దానికి ముఖచిత్రంగా వేరొకరి ఫోటోని ఏ వివరణా ఇవ్వకుండా వేశారు. పైగా బేబీ కాంబ్లే రాసిన ముందుమాటని ప్రచురించనేలేదు. దళితులు, అణగారిన వర్గాలకి చెందిన ప్రజల పట్ల ఉండే చిన్నచూపుకి ఇది ఒక నిదర్శనం. దళితుల అస్తిత్వ చైతన్యం, కులనిర్మూలన పోరాటాలు ఎగిసిపడుతున్న తరుణంలో మరుగున పడిపోతున్న ఇటువంటి ఎన్నో జీవిత గాథలను, రచనలను వెలికితీయవలిసి ఉన్నది. ఈ పుస్తకాన్ని తెలుగులోకి తీసుకురాబోతున్న 'మలుపు' ప్రచురణల ప్రయత్నం అభినందనీయం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# సుప్రీంకోర్టు జడ్జిలకు లేఖ

***అఖ్లాక్ కేసు విషయంలో ప్రభుత్వం, పోలీసులు వ్యవహరిస్తున్న తీరు పట్ల స్పందించవలసిందిగా సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు మార్కండేయ్ కట్జూ రాసిన ఇమెయిల్ లేఖ***

ప్రియమైన సోదరులు చలమేశ్వర్, మదన్ లోకూర్, సిక్రి, లలిత్, నారిమన్‌లకు

నా దగ్గర మీ ఇమెయిల్ చిరునామాలు మాత్రమే ఉన్నందువల్ల మీకిది పంపుతున్నాను గాని ఈ లేఖ సుప్రీంకోర్టులోని న్యాయమూర్తు లందరికీ రాస్తున్నాను. కనుక దయచేసి, ప్రధాన న్యాయమూర్తితో సహా అందరికీ అందించండి.

ప్రియమైన జస్టిస్ ఠాకూర్ గారూ, సుప్రీంకోర్టులోని న్యాయమూర్తులారా,

దాద్రీలో గోరక్షకులు అఖ్లాక్ అనే వ్యక్తిని దారుణంగా తోలు ఒలిచి హత్యచేశారని మీకు తెలిసే ఉంటుంది. అంత దారుణమైన హత్యానేరానికి పాల్పడిన దుర్మార్గులను అత్యంత కఠినంగా శిక్షించే బదులు పోలీసులు, ఒక స్థానిక న్యాయమూర్తి అఖ్లాక్ కుటుంబాన్నే వేధిస్తున్నారు.

క్షమించండి, నాకిది పరమ నీచంగా, దుర్భరంగా కనిపిస్తున్నది. పోలీసులకు, కొందరు న్యాయమూర్తులకు పిచ్చి ఎక్కిందా? వారికి సిగ్గనేది లేదా? ఇక మీకు, సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు కూడ సిగ్గు లేదా? మీకు సత్యం తెలియదనడానికి వీలులేదు. అయినా భీష్మ పితామహుల లాగ ద్రౌపది వస్త్రాపహరణం జరుగుతుంటే కళ్లు మూసుకుని, దాన్ని విస్మరించడానికి మీరు సిద్ధపడ్డారా? నిజమైన నేరస్తులను, వారికి సహకరించిన కుట్రదారులను విచారించి, నేరారోపణ చేసే బదులు, బాధితుడి కుటుంబం మీదనే బూటకపు దర్యాప్తు జరిపిన పోలీసుల మీద, మెజిస్ట్రేటు విజయకుమార్ మీద మీ అంతట మీరే (సువో మోటో) చర్య తీసుకుని ఉండవచ్చు గదా. కాని మీరు చేతులు ముడుచుకుని కూచున్నారు. మీరొక కపట సన్నాసుల ముఠా కాదా?

న్యాయమూర్తులు కూడ విచారణల బోనెక్కవలసి ఉంటుందని మరిచిపోకండి. నాజీ పాలకులతో అంటకాగిన న్యామూర్తులను కూడ రెండో ప్రపంచ యుద్ధం తర్వాత విచారించి, శిక్షలు విధించారని మరిచిపోకండి.

జూలియస్ సీజర్ మృతదేహం పక్కన మార్క్ ఆంటోనీ చేసిన ఉపన్యాసం నాకు గుర్తుకొస్తున్నది. సీజర్ హత్యకు గురయ్యాడు. “ఓ నెత్తురోడుతున్న భూఖండమా, నన్ను క్షమించు. నిన్ను హత్య చేసిన ఈ హంతకుల పట్ల నేను మెత్తగా ఉన్నాను, మర్యాదగా ఉన్నాను” అని మార్క్ ఆంటోనీ ఉపన్యసించాడని షేక్స్పియర్ తన నాటకంలో రాశాడు.

పెద్దమనుషులారా, నేను మార్క్ ఆంటోనీని కాదు. నేను మీ పట్ల మెత్తగా, మర్యాదగా ఉండబోవడం లేదు.

మొట్టమొదట, అతి త్వరలోనే మీ సుప్రీం కోర్టు న్యాయమూర్తులందరూ తొడుక్కోవడానికి నేను గాజులు పంపబోతున్నాను. అవి మీకు సరిగ్గా బ్రహ్మాండగా సరిపోతాయి. న్యాయం జరిగేవరకూ నేను మిమ్మల్ని వదిలిపెట్టబోనని కూడ మీకు హామీ ఇస్తున్నాను. మీరందరూ కట్టగట్టుకుని రాజీనామా చేయాలని నేను కోరబోతున్నాను. ఎందుకంటే, మీలో కొందరు, ప్రత్యేకంగా మీ ప్రధాన న్యాయమూర్తి, పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతుంటారు. కాని వాస్తవమేమంటే, మీరందరూ ఎందుకూ పనికిరాని గుంపు అనిపిస్తున్నది. ప్రస్తుతం వేటాడబడుతున్న, వేధింపులకు గురవుతున్న అఖ్లాక్ కుటుంబం ఒక్కదానికి న్యాయం అందించడానికి కూడ మీకు సామర్థ్యం లేనట్టున్నది.

*(ఢిల్లీ, మద్రాస్, అలహాబాద్ హైకోర్టుల ప్రధాన న్యాయమూర్తిగా, సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా, ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా అధ్యక్షుడిగా పనిచేసి పదవీ విరమణ పొందిన జస్టిస్ మార్కండేయ్ కట్జూ తన తీవ్రమైన అభిప్రాయాలతో, వ్యక్తీకరణలతో సుప్రసిద్ధులు. ఎన్నో పత్రికలు ఆయన రచనలను ప్రచురించడానికి భయపడుతున్నాయని అంటూ ఆయన ఇటీవల సోషల్ మీడియాలో విరివిగా రాస్తున్నారు. సుప్రీంకోర్టు న్యాయమూర్తులను ఉద్దేశించి తీవ్రమైన పదజాలంతో రాసిన ఈ లేఖను ఇమెయిల్‌లో పంపి, తన ఫేస్‌బుక్ పేజి మీద ప్రకటించారు. ఇందులో “గాజులు పంపడం” వంటి తీవ్రంగా అభ్యంతరకరమైన వ్యాఖ్యలు ఉన్నప్పటికీ, వాటిని ఖండిస్తూనే మిగిలిన అభిప్రాయాల ప్రాధాన్యత దృష్ట్యా ప్రచురిస్తున్నాం. – సం.)*

వీ

## రాబోయే సంచికలలో...

- ❖ కలబోత ఏలివేత రాజకీయాలు - డా. నళిని
- ❖ బహుజనులను విడదీస్తున్న హిందూవాదం - డా. కత్తి పద్మారావు
- ❖ సాంకేతిక ఉగ్రవాదంపై కార్మిక ప్రతిఘటన - పి. ప్రసాద్
- ❖ మన దేశం ఎటుపోతోంది? - సి.ఎచ్. మధు
- ❖ కంప్యూటర్లు వ్యవసాయం చేస్తాయా? - వి. వెంకట్రావు

# ప్రజా ఉద్యమాలు - నిషేధాలు, నిర్బంధాలు

***ప్రజలు ప్రజాస్వామిక హక్కుల కోసం ఉద్యమిస్తుంటే ప్రభుత్వాలు వాటిని పట్టించుకోకుండా ప్రజాస్వామిక వాదులపై తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నారని అంటున్నారు నారాయణరావు***

ప్రజాస్వామ్యమని పిలవబడుతున్న మన దేశంలోని ప్రజలకు రాజ్యాంగం ద్వారా ప్రాథమిక హక్కులు ఇవ్వబడినాయి. ఇందులో స్వేచ్ఛహక్కు సమానత్వపు హక్కు, దోపిడీకి వ్యతిరేకంగా పోరాడే హక్కు, మత స్వేచ్ఛ, సాంస్కృతిక హక్కు, విద్యాహక్కు, రాజ్యాంగంలో పొందుపరచ బడిన హక్కులను అనుభవించే హక్కు అందులో ముఖ్యమైనవి. వీటన్నింటిలో స్వేచ్ఛగా జీవించే హక్కు అనేది ప్రధానమైంది. ఇందులోనే ఒక దగ్గర సమావేశమవడం, సంఘాలుగా ఏర్పడడం, దేశంలో తన ఇష్టమయిన ప్రదేశానికి సంచరించే హక్కు, అక్కడ నివసించే హక్కు, తనకు అనువైన జీవనోపాధిని ఏర్పరుచుకొని జీవించడంతో పాటు మాట్లాడే హక్కు అనేవి ముఖ్యమైనవి. రాజ్యాంగంలో పొందుపరచిన ఈ హక్కులను జాతి, కులం, వర్గంతో సంబంధం లేకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కాని, ఇంకెవరు కాని వాటిని ఎవరూ నిరాకరించే అవకాశం లేదని అదే రాజ్యాంగంలో చాలా స్పష్టంగా నిర్దేశించబడినది.

వాస్తవానికి ఈ రాజ్యాంగం మీద ప్రమాణం చేసిన ఏ రాష్ట్ర ప్రభుత్వాలు కాని, కేంద్ర ప్రభుత్వాలు కాని వీటిని పరిరక్షించే బాధ్యతను ఏనాడూ స్వీకరించడం లేదు. పైగా వాటిని ఉల్లంఘించి ప్రజల హక్కులను కాలరాయడంలో రేసుగుర్రాల్లాగా పరిగెత్తుతున్నాయి. ఈ ఉల్లంఘనలు అటు కశ్మీర్ నుండి కన్యాకుమారి దాకా, ఇటు ఈశాన్య భారతం నుండి గుజరాత్ వరకు ఎన్నో వేల సంఘటనల రూపంలో గత ఏడు దశాబ్దాలుగా మనం చూస్తున్నాం.

కశ్మీరీ ప్రజలు వారి స్వయం నిర్ణయాధికార హక్కుకై అనేక దశాబ్దాలుగా, అనేక రూపాల్లో ఉద్యమిస్తుంటే, వారిని సైనిక నియంతృత్వం కింద అదిమిపట్టి ఆ ఉద్యమాలను ప్రభుత్వం అణచివేస్తున్నది. ఈ సైనిక పదఘట్టనల కింద వందల్లో, వేలల్లో ప్రజలు ఎన్‌కౌంటర్ల రూపంలో హత్యకు గురవుతున్నారు. ఎంతోమంది మహిళలు పాశవికంగా లైంగిక దాడికి బలవుతున్నారు. గత రెండు నెలలుగా బుర్హాన్‌ను బూటకపు ఎన్‌కౌంటర్‌లో సైనికులు హత్య చేసినప్పటి నుండి మొదలైన ఉద్యమాన్ని కర్ఫ్యూ పడగనీడలో కశ్మీర్‌ని కల్లోలంగా మార్చింది ప్రభుత్వం. ఈ రెండు నెలల్లో 70 మంది నిరాయుధ ప్రజలు సాయుధ బలగాల చేతిలో హత్యకు గురయ్యారు. అనేక వేల మంది తీవ్రమైన గాయాలపాలయ్యారు.

ఇక గుజరాత్‌లో ముస్లింలు, దళితులు ఎన్నోరకాల అత్యాచారాలకు గురవుతుండగా రాష్ట్ర ప్రభుత్వం చాలా నిస్సిగ్గుగా దాడి చేస్తున్న వారివైపు నిలబడి ఈ దాడులు మరింత పెరగడానికి అనువైన వాతావరణాన్ని కల్పిస్తున్నది. 2016 జూలై 11నాడు 'ఛమర్' కులానికి చెందిన నలుగురిని పోలీస్ స్టేషన్ ఎదురుగానే అగ్రకుల 'గోరక్షక దళ్' గూండాలు కిరాతకంగా కొట్టిన సంఘటన మనందరికీ తెలిసిందే. ఈ నలుగురు దళితులను ఊనా తీసుకెళ్లి అక్కడ వీరి బట్టలు ఊడదీసి, ఇనుపరాడ్లతో బాదుతూ వీధుల వెంట చాలా అవమానకరంగా ఊరేగించారు. ఈ సంఘటన మనకు గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వ, పోలీసుల దళిత వ్యతిరేక వైఖరిని నగ్నంగా చూయిస్తున్నవి. కాబట్టి ఈ సంఘటనను నిరసిస్తూ ప్రజలు, దళితులు తలపెట్టిన నిరసన కార్యక్రమాలపై కూడా దాడి చేసి, దేశ రాజధాని న్యూఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద అగ్రకుల పెత్తందారీ స్వభావం, రాజ్యం దానికిచ్చిన తోడ్పాటు నగ్నంగా తెలియచెప్పింది. అయితే ఈ దళితుల మీద పునఃదాడికి వ్యతిరేకంగా పెరుగుతున్న గొంతుల మీద నిషేధించేందుకు చేస్తున్న ప్రభుత్వ ప్రయత్నాలు రోజురోజుకీ పెరుగుతున్న వైనాన్ని మనం చూడొచ్చు.

జల్, జమీన్, జంగల్ నినాదంతో చత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని బస్తర్ డివిజన్‌లో మావోయిస్టు పార్టీ నేతృత్వంలో గిరిజనులు చేస్తున్న సాయుధ ప్రతిఘటన దానిపై ప్రభుత్వ అణచివేతే ఇప్పుడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఉమ్మడి లక్ష్యంగా మారి ఆదివాసి జీవితాలను చిన్నాభిన్నం చేస్తున్న నిర్బంధ రూపాలను మనం గమనిస్తున్నాం. ఇదే క్రమంలో ఈ ప్రాంతంలో ప్రజల సాయుధ ప్రతిఘటన అణచడానికి 2005లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వెన్నుదన్నుతో స్థానిక గిరిజన మూకలదండు సల్వాజుడుంగా మారి వందలాది గిరిజన గ్రామాలు అగ్నికి ఆహుతి చేయబడడమేకాక, వేలాది మంది ప్రజలపై హత్యాకాండకు, ఆదివాసీ మహిళలపై సామూహిక అత్యాచారాలను చేసింది. లక్షకు పైగా గిరిజనులు ఆ ప్రాంతాన్ని విడిచి మరో చోటుకు పొట్ట చేత పట్టుకొని తరలి వెళ్లవలసిన అనివార్య స్థితికి ప్రభుత్వాలు నెట్టాయన్నది ఒక చారిత్రక వాస్తవం.

తర్వాత ఇదే పరంపరలో కేంద్ర ప్రభుత్వం 'ఆపరేషన్ గ్రీన్‌హంట్'ను ప్రారంభించి, అమలు చేస్తున్న దాడిలో ఈ హత్యాకాండను, అత్యాచారాలను మరింత తీవ్రతరం చేసి ఆదివాసులు జీవించే హక్కు పాశవికంగా అణచివేయ బడుతున్నది. భారత అత్యున్నత న్యాయస్థానం ఈ 'సల్వాజుడుం'ను రాజ్యాంగ వ్యతిరేకమయినది అని ప్రకటించి నిషేధించినట్టుగా పేర్కొన్నప్పటికీ ఇలాంటి మూకలే 'సామాజిక్ ఏక్తామంచ్', 'నక్సల్ పీడిత్ సంఘర్ష్ సమితి', 'దంతేశ్వరి ఆదివాసి స్వాభిమాన్ మంచ్' పేర్లతో – ఆయా ప్రాంతాల్లో ప్రారంభించబడి ఆదివాసులపై పోలీసుల దాడులను మరింత తీవ్రతరం చేస్తున్నాయనేది మనం చూస్తున్న సత్యం. ఈ సాయుధ మూకలు మావోయిస్టులపై దాడులు చేయడం, భయ భ్రాంతులకు గురిచేయడమే కాక, వారి సానుభూతిపరుల పేరుతో స్థానిక ఆదివాసులపై, న్యాయవాదులపై, పత్రికా విలేఖరులపై, సామాజిక ఉద్యమ (శాంతియుత) కారులపై విచ్చలవిడిగా దాడులు చేస్తూ, ప్రజల జీవించే హక్కును హరిస్తూ, ప్రజా జీవితాలను విచ్ఛిన్నం చేస్తున్నారు. గాంధేయవాది హిమాంశుకుమార్‌ను దంతేవాడ నుండి బయటికి చాలా అవమానకరంగా పంపించి వేయడం జరిగింది. ఇతను సల్వాజుడుంకు వ్యతిరేకంగా, ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా ఫిర్యాదు చేయడం జరిగింది. ఇదే పనిని చేసినందుకు గతంలో ఉపాధ్యాయురాలైన, సామాజిక రాజకీయ కార్యకర్త అయిన

సోనిసోరిపై ప్రణాళికబద్ధంగా దాడులు చేయడం, జగదల్‌పూర్ లీగల్ ఎయిడ్ గ్రూపుకు చెందిన న్యాయవాదులపై దాడులు చేయడం, బేలాభాటియా లాంటి సామాజిక ఉద్యమ కారులపై దాడులు, సంతోష్ యాదవ్, సోమారునాగ్, ప్రభాత్‌సింగ్, దీపక్ జైస్వాల్ వంటి విలేకరులపై భౌతికదాడులు చేయడం లాంటివి మచ్చుకు కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం మరొకసారి 'మిషన్ 2016' పేర బస్తర్ నుండి మావోయిస్టులను ఏరివేసే కార్యక్రమాన్ని ప్రారంభించింది. ప్రభుత్వం చాలా దారుణంగా యుఎవిలను, వైమానిక సేనను, సాటిలైట్‌ను వాడుతూ మూకుమ్మడి హత్యలకు, అత్యాచారాలకు, గ్రామ దహనాలకు పాల్పడుతూ ఆదివాసుల ఆస్తుల దోపిడీని మరింత తీవ్రతరం చేస్తున్నది. అందుకు ఈ బూటకపు ఎన్‌కౌంటర్‌లు, బలవంతంగా మూకుమ్మడి లొంగుబాట్లు ప్రభుత్వం కొనసాగిస్తున్నాయనేది వాస్తవం.

వీటన్నింటికీ తోడుగా దేశంలోని ఏ వర్గమయినా, లేక ఏ సమూహమైనా రాజ్యం అనుసరిస్తున్న దోపిడీ, అణచివేతలకు వ్యతిరేకంగా తమ గొంతు విప్పినా ఒక సమూహంగా మారి తమ హక్కుల కోసం ఉద్యమించినా, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ శక్తినంతా ఉపయోగించి, వివిధ నిర్బంధ రూపాలను ప్రయోగిస్తూ ఆ గొంతుకలను అణచివేస్తున్నాయి. దానికై సాయుధ బలగాలతో పాటు, ఐపిసిలోని వివిధ నిర్బంధ సెక్షన్లయిన 121, 121ఎ, 124ఎ,153ఎ, 153బి, 295లతో పాటు ఊపా, ఆఫ్సా వంటి క్రూరమైన చట్టాలను, ఉపయోగిస్తూ ఉంది. ఇంకా దానికి తోడు దేశ సార్వభౌమత్వాన్ని అగ్రరాజ్యాల పాదాక్రాంతం చేసి, అమెరికా, ఇజ్రాయిల్ నిఘా వర్గాలను ఉపయోగిస్తూ ప్రజల న్యాయమైన హక్కుల కోసం ఉద్యమించే గొంతుకులను అణచివేస్తున్నాయి.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చాలా తరచుగా ప్రజాభివృద్ధి, ప్రజాసంక్షేమం, మానవ హక్కుల పరిరక్షణ, శాంతి భద్రతలను కాపాడడం లాంటి మాటలను మాట్లాడుతూ ఉంటున్నది. ఇవన్నీ ప్రజలను తప్పుదోవ పట్టించేందుకే. వాస్తవానికి ఈ ప్రభుత్వాలు చేస్తున్నదంతా ప్రజల జీవించే హక్కును, వాక్, సభా స్వాతంత్ర్యాలను హరించివేసి ప్రజల పౌర ప్రజాస్వామిక హక్కులను అణిచివేయడమే తప్ప మరేమీ కాదు. ఏ ప్రజా సమూహాలు ఐక్యమై, వీరోచిత ఉద్యమాలు చేస్తాయో ఆ ఉద్యమాలు మరింత భయంకర సైనిక దాడులను ఎదుర్కొంటున్నాయి. ఈ విషయాలన్నీ మనం ఒక్కసారి కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాలు, బస్తర్ ప్రాంతాలను చూస్తే అర్థమవుతుంది.

ముఖ్యంగా గత కొన్ని సంవత్సరాల్లో భావప్రకటనా స్వేచ్ఛ మీద, ఉద్యమించే హక్కు మీద, సమూహాలుగా ఏర్పడే హక్కుల మీద విపరీతమైన దాడి జరుగుతూ ఉంది. 'అంధశ్రద్ధ నిర్మూలన సమితి' కార్యకర్త నరేంద్ర దబోల్కర్, వామపక్ష నేత గోవింద్ పన్సారే, కన్నడ రచయిత కార్యకర్త కల్బుర్గీల హత్యలు ఈ విషయాలను మరింత ప్రస్ఫుటంగా తెలుపుతున్నాయి. అంతేకాదు, పన్సారే హత్య వెనుక ఒక సనాతన సంస్థ పేరు బలంగా వినపడింది. హిందూత్వ శక్తులు నరేందర్ దబోల్కర్ సోదరున్ని చంపేస్తామని బెదిరించడంతో పాటు శ్రామిక ముక్తి దళ్ నాయకుడు భారత్‌పటేంకర్, జర్నలిస్టు నిఖిల్ వాఘ్లే, తర్క్‌శీల్ ఆందోళన కార్యకర్త శ్యామ్‌సొనార్, కె.ఎస్. భగవాన్ అనే ఉపాధ్యాయుడు లఘుచిత్ర దర్శకుడు ఆనంద్ పట్వర్ధన్ లాంటి ఎంతో మంది, హిందూత్వశక్తుల బెదిరింపులకు గురి అయినవారే! ఇంకా తన తోటి విద్యార్థులతో కలిసి 'ముజ్‌ఫర్‌నగర్ బాకీ హై'!, లఘుచిత్రాన్ని చూడడం యాకుబ్‌మెమన్ ఉరిశిక్షను వ్యతిరేకించినందుకు తనకు తానుగా ఆత్మహత్య చేసుకునేట్లుగా పరిస్థితులను సృష్టించిన హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం, రోహిత్ వేముల హత్యాఘటన ఇంకా మెదళ్లలో పచ్చిగానే ఉంది. ఇంకా 9 ఫిబ్రవరి నాడు అఫ్జల్‌గురు ఉరిశిక్షను వ్యతిరేకించిన జెఎన్‌యు ఢిల్లీ విద్యార్థి సంఘం అధ్యక్షునితో పాటు ఇతరులను 124ఎ ఐపిసి సెక్షన్ కింద కేసు బనాయించి అరెస్టు చేసి ప్రజాస్వామ్య ఉల్లంఘనకు పాల్పడుతున్నారు. వీరికి జైలు తత్సంబంధిత చిత్రహింసలే కాక, యూనివర్సిటీ యాజమాన్యపు శిక్షలను కూడా ఎదుర్కోవలసి వచ్చింది. ఇదే సమయంలో మనం ప్రముఖ తమిళ రచయిత 'పెరుమాళ్ మురుగన్' తన నవల 'ఒన్ పార్ట్ ఉమెన్'ను వెనక్కి తీసుకొన్నట్టుగా ప్రకటించి, తనకు తానుగా ఫేస్‌బుక్ ద్వారా 'రచయితగా ఆత్మహత్య' చేసుకుంటున్నానని ప్రకటించడం అదీ హిందూత్వ శక్తుల ఒత్తిడితోనే ఇలా చేయవలసి వచ్చిందని ప్రకటించడాన్ని ఖచ్చితంగా గుర్తు తెచ్చుకోవాలి.

నరేంద్రమోడీ ప్రధాన మంత్రిగా బాధ్యతలు తీసుకున్నప్పటి నుండి ఇంకా ముఖ్యంగా హక్కుల సంఘాల సమావేశాల మీద, సంఘాలుగా ఏర్పడడం మీద, యూనియన్‌లుగా ఏర్పడడం మీద దాడి చాలా పెరిగింది. గుర్‌గావ్‌లో మారుతి సుజుకి కార్మికులను అరెస్టులు చేయడం, వారిని కొత్త సంఘం ఏర్పాటు చేసుకోకుండా నియంత్రించడం, రోహిత్ వేముల ఆత్మహత్యకు కారణమైన యుజిసి వైఖరికి నిరసనగా ధర్నా చేస్తున్న ఢిల్లీ విద్యార్థులపై విచక్షణారహితంగా లాఠీచార్జీ చేయడంలాంటివి అనేకం జరుగుతూనే ఉన్నాయి. ఇంకా దేశంలోని అనేక ప్రాంతాల్లో కార్మికులు, రైతులు, విద్యార్థులు, స్త్రీలు, ఇతర కార్మికవర్గ సమూహాలు తమ డిమాండ్లను నెరవేర్చాలని గొంతువిప్పి ఉద్యమించినప్పుడల్లా ప్రభుత్వాలు, వాటర్‌కానన్‌లు, టియర్‌గ్యాస్, లాఠీచార్జ్ చేయడమేకాక 144 సెక్షన్‌ను ప్రయోగించి ఆ వర్గాలపై నిర్బంధం ప్రయోగించి ఆ ఉద్యమాలను అణచివేసే ప్రయత్నం చేస్తున్నాయి. ఇంకా కొన్ని చోట్ల నిస్సంకోచంగా పోలీసు బలగాల ద్వారా విచ్చలవిడి కాల్పులు కూడా జరిపిస్తున్నాయి. ముఖ్యంగా అణచి వేయబడుతున్న జాతులపై, మావోయిస్టుల మీద ఈ పాశవిక అణచివేత ఇంకా ఎక్కువగా ప్రయోగించబడుతున్నది. రాజ్యం మరీ పిరికిగా తనకున్న విచక్షణాధికారాలను ఉపయోగించి వందకుపైగా ప్రజాసంఘాలను, పార్టీలను, విద్యార్థి కార్మిక కర్షక సంఘాలనే కాక నిస్సిగ్గుగా సాంస్కృతిక సంఘాలను కూడా (యుఎపిఎ) ఉపా చట్టం కింద నిషేధించింది.

రాజ్యం ఈ విధంగా రాజకీయ, సామాజిక, సాంస్కృతిక సంఘాలను నిషేధించడమంటే ఇది కచ్చితంగా రాజ్యాంగంలో లిఖించబడ్డ ప్రాథమిక హక్కులను హరించివేయడమే! నరేంద్రమోడీ నాయకత్వంలో ప్రస్తుతం హిందూత్వ శక్తులు కేంద్రంలో రాజ్యమేలుతున్నాయి. మోడీ హయాంలోనే అనేక విదేశీ కార్పొరేట్లు దేశాన్ని దోచుకోవడానికి మరింత తలుపులు బార్లా తెరవడమేకాక, కాస్తో, కూస్తో కార్మిక వర్గ అనుకూల చట్టాలు కూడా 'సవరణల పేరుతో సవరించి పూర్తిగా జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదారుల ప్రయోజనాలకు అనుగుణంగా మార్చబడ్డాయి. దీనికి తోడు ఈ అతి జాతీయవాదం హిందూమతవాదం, కులమనే బలహీనతను రెచ్చగొట్టి, బ్రాహ్మణీయ ఫాసిస్టు ఆలోచనా విధానాన్ని ప్రేరేపించి, ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమించే, పోరాట పటిమను విడదీసి తద్వారా మరో రకమైన అణచివేతను ప్రయోగిస్తున్నాయి. కాబట్టి ఈ విపత్కర పరిస్థితుల్లో ప్రాంతీయ, రాష్ట్రీయ, కేంద్ర స్థాయిలో ప్రజల న్యాయమైన డిమాండ్ల పరిష్కారానికై సహకరించడం, ఉద్యమించడం, తద్వారా ప్రజల ప్రాథమిక హక్కులను, భావప్రకటనా స్వేచ్ఛను, అంతిమంగా జీవించే హక్కుకై పోరాడడం అనేది చాలా అనివార్యమయినవి. సిడిఆర్ఒ, దాని సభ్యసంఘాలు గతకొన్ని దశాబ్దాలుగా ప్రజల ప్రాథమిక హక్కులను

# ప్రత్యేక హోదా ఒక రాజకీయ కుట్ర

*అధికారంలో ఉన్న పార్టీలు ఇచ్చిన హోదా హామీని ప్యాకేజీకే పరిమితం చేస్తే, ప్రతిపక్ష పార్టీలు హోదానే సకల సమస్యలకు పరిష్కారమంటూ, ప్రజల మౌలిక సమస్యలు పట్టించుకోవడంలేదని అంటున్నారు* **షేక్ కరిముల్లా**

ఎన్నికల పార్టీలు తమ అవసరాల కోసం వాగ్దానాలు చేయడం, అధికారానికి వచ్చిన తర్వాత వాటిని తుంగలో తొక్కడం మామూలే. తాము ప్రమాణం చేసి రాజ్యాంగాన్ని, చట్టాన్ని కాపాడుతామని చెప్పి అధికారంలోకి వచ్చీ రాగానే ఉల్లంఘించడం నేడు ప్రత్యేక హోదా విషయంలో జరుగుతున్న నాటకం. ఆంధ్రప్రదేశ్ పునర్ వ్యవస్థీకరణ చట్టం - 2014 పై మాట్లాడుతూ ఐదేళ్లు ప్రత్యేక హోదా ఇస్తామని అప్పటి ప్రధాని రాజ్యసభ సాక్షిగా హామీ ఇచ్చారు. ఐదేళ్లు చాలదని తాము అధికారంలోకి వస్తే పదేళ్లు ప్రత్యేక హోదా ఇస్తామంటూ నాటి రాజ్యసభలో విపక్ష నేత, నేటి కేంద్ర మంత్రి వెంకయ్య నాయుడు స్పష్టంగా చెప్పారు. టిడిపి నాయకుడు చంద్రబాబు పదిహేను సంవత్సరాలు ప్రత్యేక హోదా కావాలని డిమాండ్ చేశారు. ఇక ఎన్నికల సమయంలో రాష్ట్రానికి ప్రత్యేక హోదా సాధిస్తామన్న హామీని చంద్రబాబు పదేపదే గుప్పించాడు. ఇప్పుడు ప్రత్యేక ప్యాకేజీ చాలని... ప్రత్యేక హోదా అపర సంజీవినేమీ కాదని చంద్రబాబు మాట్లాడడం ప్రజలను వంచించడమే.

విభజన చట్టంలో ఇచ్చిన హామీలకు తోడు ఆ చట్టం చేసిన సందర్భంగా ఆనాటి ప్రధాని మన్మోహన్‌సింగ్ పార్లమెంట్ వేదికగా ఇచ్చిన ప్రత్యేక హోదా హామీని అమలు చేయవలసిన బాధ్యత నేటి కేంద్ర ప్రభుత్వంపై ఉంటుంది. హక్కుల కోసం కేంద్రంపై ఒత్తిడి తెచ్చి సాధించుకోవడం నేటి రాష్ట్ర ప్రభుత్వ బాధ్యత. ఈ చారిత్రక, రాజ్యాంగ బద్ధమైన బాధ్యతను గాలికి వదిలి, హోదా అంశాన్ని అటకెక్కించి, ప్యాకేజీ పేరుతో కొత్త నాటకానికి తెరతీశారు. ఎన్నికల ముందు, సార్వత్రిక ఎన్నికల సభల్లో తాము అధికారంలోకి వస్తే ఎపికి పది సంవత్సరాలు ప్రత్యేక హోదా ఇస్తామని మోడీ, వెంకయ్యనాయుడులు అన్ని సభల్లో చెప్పారు. చంద్రబాబు తాము అధికారంలోకి వస్తే 15 సంవత్సరాలు ప్రత్యేక హోదా కొరకు పోరాడుతామని ప్రకటించారు. కులం కార్డును, సిని గ్లామర్‌ను కూడా ఉపయోగించుకోవడానికి చంద్రబాబునాయుడు, మోడీలు పవన్ కల్యాణ్‌ను కలుపుకొన్నారు. తాము గెలిస్తే అది చేస్తాం, ఇది చేస్తాం వంటి భారీ వాగ్దానాలు చేశారు. ఇప్పుడేమో ఏదో ప్యాకేజీ ఇచ్చాం సరిపుచ్చుకోండి అంటూ, పైపెచ్చు హోదాకంటే ప్యాకేజీయే ఎక్కువని ప్రజల చెవుల్లో పూలు పెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఏరు దాటి తెప్ప తగలేసినట్లుంది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వైఖరి. ఇంత చేసిన చివరికి చావు తప్పి కన్ను లొట్టబోయిన చందంగా టిడిపి ఊహించని విధంగా కేవలం రెండు శాతం ఓట్ల ఆధిక్యతతో ఎన్నికలలో గెలిచింది. ఇక కార్పొరేట్ బహుళజాతి సంస్థల ముద్దుబిడ్డ మోడీ వీరి వల్ల అధికారంలోకి వచ్చారు. టిడిపి, బిజెపిలు ఇటు రాష్ట్రంలోను, అటు కేంద్రంలోను సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పర్చుకొని కలిసి పాలిస్తున్నాయి.

అధికారంలోకి వచ్చాక తాము చేసిన వాగ్దానాలు అమలు చేయడం తలకు మించిన భారమని మోడీ, చంద్రబాబులకు బాగా తెలుసు. ఎపికి ప్రత్యేక హోదా ఇస్తే ఇంకా ఇతర రాష్ట్రాలు కూడా ప్రత్యేక హోదాలు కావాలని డిమాండ్ చేస్తాయి అంటూ తప్పుకునేందుకు సర్కస్ ఫీట్లు చేస్తున్నారు. మోడీ, బాబులు కుమ్మక్కయి వ్యూహాత్మకంగా అడ్డంగా ఉన్న ప్రణాళికా సంఘాన్ని తొలగించి దాని స్థానంలో నీతి అయోగ్‌ను ముందుకు తెచ్చారు. అనుకున్న ప్రణాళిక ప్రకారం రెండున్నర సంవత్సరాల ప్రత్యేక హోదా అంశాన్ని నానబెట్టి చివరకు చావు కబురు చల్లగా చెప్పినట్లు తుస్‌మనిపించారు. అంతే కాకుండా 14వ ఆర్థిక సంఘం సిఫార్సు మేరకు ఎపికే కాదు మరే ఇతర రాష్ట్రాలకు ప్రత్యేక హోదా ఇవ్వడం సాధ్యం కాదు అంటూ మున్ముందు ఏ ఇతర రాష్ట్రానికి హోదా అనేది ఇవ్వడం జరగదని కూడా మాట్లాడుతున్నారు.

ఒక చారిత్రక సందర్భంలో కొత్తగా ఏర్పడుతున్న ఒక నూతన రాష్ట్ర ప్రజల భవిష్యత్తు దృష్ట్యా పెద్దల సభ సాక్షిగా అందరికన్నా పెద్ద హోదా కలిగిన ప్రధాన మంత్రి ప్రధాన ప్రతిపక్షం (బిజెపి) అభ్యర్థనతో, ఆమోదంతో ప్రకటించిన ప్రత్యేక హోదాను అటకెక్కించడమంటే ముందున్న ప్రధానిని, రాజ్య సభను అవమానించడం కాదా? ఇది రాజకీయ విశ్వసనీయతకు, రాజ్యాంగ విలువలకు కూడా విఘాతం కాదా? ప్రజలకు పార్లమెంటరీ వ్యవస్థ పట్ల నమ్మకం పోదా? మాటమార్చి ఎపి ప్రజలకు నమ్మకద్రోహం తలపెట్టడం రాజ్యాంగబద్ధ పదవులలో ఉన్నవారు చేయదగిన పనికాదు. పదవులు శాశ్వతం కాదు. పదవులలో ఉన్నవారు అధికార బలంతో ప్రజలకు మేలు చేయాలి. తద్వారా చరిత్రలో నిలిచిపోవాలి తప్ప ద్రోహులుగా మిగిలిపోరాదు. చరిత్ర క్షమించదు కూడా. ఇటువంటి అవకాశవాద రాజకీయ నాయకులు తగిన మూల్యం చెల్లించుకోవాల్సి ఉంటుంది. ఇంత జరుగుతున్న టిడిపి నాయకులు గాని, ఆ పార్టీ ఎంఎల్ఎ, ఎంపిలు, కేంద్ర మంత్రులకు గాని ఆగ్రహం కలగడం లేదు. పైగా బిజెపి నాయకుల వ్యాఖ్యలకు వంతపాడడం వీరి అవకాశవాద రాజకీయాలకు నిదర్శనం.

ఈ నేపథ్యంలో రాజ్యసభ సభ్యుడు కెవిపి. రామచంద్రరావు పునర్ వ్యవస్థీకరణ చట్టం 2014లో సవరణలు కోరుతూ రాజ్యసభలో ప్రైవేట్

---

పరిరక్షించడాన్ని నిరంతరం తమ గొంతును వినిపిస్తూనే ఉన్నాయి. అట్లే ప్రజలపై అమలవుతున్న పాశవిక రాజ్య నిర్బంధానికి వ్యతిరేకంగా కూడా మా నిరసనను తెలియజేస్తూనే ఉన్నాం. ప్రభుత్వం ప్రజాస్వామికంగా వ్యవహరించడం లేదు. ఉద్యమాలే ఒక ప్రజాస్వామిక పరిష్కారాన్ని చూపెడతాయి.

*(రచయిత ప్రధాన కార్యదర్శి, పౌరహక్కుల సంఘం, తెలంగాణ)* వీ

బిల్లును 2016 మార్చ్‌లో ప్రతిపాదించారు. ఇది ఓటింగ్‌కు వస్తే ఈ బిల్లు తప్పకుండా నెగ్గుతుంది. అందుకని ఇది ద్రవ్య బిల్లు కనుక దీనిపై ఓటింగ్‌కు అవకాశం లేదని ఆర్థిక మంత్రి జైట్లీ ప్రకటించారు. జైట్లీ ఎపికి ప్రత్యేక హోదా ఇచ్చేది లేదని తెగేసి చెప్పారు. టిడిపి సభ్యుడు ప్రత్యేక హోదా అనేది ఒక వ్యాధిగా తయారైనదని ఎపి ప్రజల ఆకాంక్షలను కించపరుస్తూ మాట్లాడారు. దీనితో రాష్ట్రంలో రాజకీయ పరిణామాలు వేడెక్కాయి. ప్రతిపక్ష, వామపక్ష పార్టీలు, ప్రజా సంఘాలు బిజెపి నమ్మక ద్రోహం పట్ల తీవ్ర నిరసనను మొదలు పెట్టాయి. ఇంత జరిగినా చంద్రబాబుకు కేంద్ర ప్రభుత్వ వైఖరిపై కోపం, ద్వేషం కలగడం లేదు. ఇంకా మోడీ ముందు మోకరిల్లే వైఖరిని, బుజ్జగించే వైఖరినే కొనసాగిస్తున్నాడు. మరోవైపు వైసిపి, వామపక్ష పార్టీలు కేంద్ర ప్రభుత్వ వైఖరికి నిరసనగా ఆగస్టు, సెప్టెంబర్ నెలలో రాష్ట్ర బంద్‌కు పిలుపునిచ్చాయి. ఆందోళనలను తీవ్రం చేశాయి. తాను ప్రతిపక్షంలో ఉండగా అన్ని రూపాలలో ఆందోళనలు చేసిన చంద్రబాబు బంద్ పిలుపును అప్రజాస్వామ్య చర్యగా, అభివృద్ధికి నష్టం కలిగించే చర్యగా వ్యాఖ్యానాలు చేయడం విడ్డూరం.

ఏమైనా స్పెషల్ ప్యాకేజీలు కాని, ఉదారంగా సహాయాలు చేయడం కాని, ప్రత్యేక హోదాకు సాటిరావు. ప్రత్యేక హోదా చట్టబద్ధ హక్కుగా లభించేది. మిగతావన్నీ బిజెపి దయదలచి ఇచ్చేవి. ఇవన్నీ బిజెపి, టిడిపిలు అధికారంలో ఉన్నంత వరకే ఉంటాయి. బిజెపి, టిడిపిలు ఇంతకాలం ఆడిన కపట నాటకాలు ప్యాకేజీతో బహిర్గతమయ్యాయి. తమ స్వప్రయోజనాలను, తమ ప్రభుత్వాల మనుగడను కాపాడుకోవడానికే మోడీ, చంద్రబాబులు నీతి అయోగ్'ను ముందుకు తెచ్చారని తమ ఆచరణ ద్వారా రుజువు చేసుకున్నారు. ఏమైనా వివిధ పేర్లతో ప్యాకేజీల పేరిట కేంద్రం ఎపికి ఇచ్చే తాయిలాలు ప్రత్యేక హోదాకు సాటిరావు. రాజధాని లేకుండా ఏర్పడుతున్న నవ్యాంధ్రకు ప్రత్యేక హోదా తప్పనిసరి. ఎందుకంటే 16 వేల కోట్ల లోటు బడ్జెట్‌తో ఆంధ్రప్రదేశ్ విడిపోయింది. రాయలసీమ, ఉత్తరాంధ్ర జిల్లాలు, గుంటూరులోని పల్నాడు ప్రాంతం, ప్రకాశం జిల్లాలోని కొన్ని ప్రాంతాలు బాగా వెనకబడి ఉన్నాయి. వరస కరవు కాటకాలతో, రైతుల ఆత్మహత్యలతో, చేనేత మొదలగు చేతివృత్తి కూలీలకు కనీసం పనికూడా దొరకని స్థితిలో ఉన్న ఈ ప్రాంతాలు సర్వతో ముఖాభివృద్ధి చెందాలంటే ప్రత్యేక హోదా కావాలి. ఇది ఐదు కోట్ల మంది ఆంధ్రుల భవిష్యత్తుతో ముడిపడి ఉన్న అతి ముఖ్యమైన అంశం.

కొత్తగా ఏర్పడిన, వెనుకబడిన, కొన్ని ప్రత్యేక పరిస్థితులున్న రాష్ట్రాలకు ప్రత్యేక హోదా ఇవ్వాలనే ప్రతిపాదన 1969 నుండి ప్రారంభమైనది. మొదటిసారిగా ఐదవ ఆర్థిక సంఘం సిఫార్సు చేసింది. వెనుకబడిన రాష్ట్రాలకు కేంద్రం నుంచి ప్రత్యేక సాయం, పన్ను మినహాయింపులు కల్పించే ప్రత్యేక హోదాను 47 సంవత్సరాల తర్వాత మంగళం పాడాలని చూడడం అమానుషం. ఇప్పటి వరకు ప్రత్యేక పరిస్థితులలో ఏర్పడి, ప్రస్తుతం ప్రత్యేక హోదా ఉన్న రాష్ట్రాలు 11 ఉన్నాయి. అవి జమ్ము కశ్మీర్, మణిపూర్, నాగాలాండ్, అస్సాం, సిక్కిం, మేఘాలయ మిజోరాం, త్రిపుర, హిమాచల్‌ప్రదేశ్, ఉత్తరాఖండ్, జార్ఖండ్‌లు. ప్రస్తుతం హోదా కోరుతున్న రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, రాజస్థాన్, బీహార్, తమిళనాడులు. హోదా దక్కడం వలన పారిశ్రామిక రాయితీలు, పన్నుల మినహాయింపులు, రెవెన్యూలోటు భర్తీ, గ్రాంట్లు ఐటీ రంగం బలోపేతం, యువతకు ఉపాధి లాంటివి ఉంటాయి. హోదా లేదని ఇక ప్యాకేజీనేనని కేంద్రం ప్రకటించడంతో హోదా గత చరిత్రగా మిగలనుంది. ఇదంతా బొమ్మకు ఒకవైపు పార్శ్వం మాత్రమే. ఇక రెండో వైపు చూస్తే రాని హోదా గురించి ఆలోచనలెందుకు? ఈ హోదా వల్ల మాకేంటి ప్రయోజనం? అని సామాన్య మధ్యతరగతి వర్గాల ప్రజలు ప్రశ్నించుకుంటున్నారు. హోదావల్ల వచ్చే ప్రత్యేక రాయితీలు పొందేది సంపన్న పారిశ్రామిక వర్గాలేనని చర్చ కూడా ఆంధ్ర రాష్ట్రంలో మొదలైంది. ఈ హోదా గోదాలో మమ్ములను రాజకీయ పార్టీలు అనవసరంగా లాగుతున్నాయని కూడా ప్రజల్లో చర్చ జరుగుతుంది. ఒక్క హోదా మీదే మొత్తం రాష్ట్ర రాజకీయాలు కేంద్రీకృతం కావడం ఏమిటని, ప్రజల మౌలిక సమస్యల మీద రాజకీయ పక్షాలు ఉద్యమించాలని ప్రజలు కోరుతున్నారు. ఇప్పటి వరకు ప్రత్యేక హోదా పొందుతున్న రాష్ట్రాలు ఏమాత్రం అభివృద్ధి సాధించాయి? హోదా లేకపోతే రాష్ట్రం అభివృద్ధి చెందదా? దానికి కావలసిన వనరులు రాష్ట్రంలో లేవా? ఇప్పటికే రెండున్నర సంవత్సర కాలం వృథా అయిపోయింది. నవగ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతున్నట్లు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు రెండున్నర ఏళ్లుగా హోదా చుట్టూ తిరుగుతున్నాయి. ఆందోళనలు, బంద్‌లు, రాజకీయ నాయకుల అవాకులు, చవాకులతో ప్రస్తుతం ప్రత్యేక హోదా ఒక ప్రత్యేక ప్రహసనం లాగా మారిపోయింది.

నవ్యాంధ్రను ప్రజల కోణంలో అభివృద్ధి మార్గంలో నిర్దేశించుకోవాలి. ప్రాంతీయ అసమానతలకు తావులేని విధానం ఉండాలి. ఇప్పటి వరకు ఏ రాజకీయ పార్టీ ఈ రాష్ట్రాన్ని పాలించినా ప్రాంతీయ అసమానతల్ని పెంచి పోషించాయి. భవిష్యత్‌లో కూడా పెంచి పోషిస్తాయి. నవ్యాంధ్ర రాజధాని నిర్మాణమే ఇందుకు ఉదాహరణ. బాగా అభివృద్ధి చెందిన గుంటూరు – విజయవాడ ప్రాంతాలలో రాజధాని నిర్మాణం, ప్రాంతీయ అసమానతలకు దారితీస్తుంది. హైదరాబాద్ అనుభవం మనకుంది. స్థానిక వనరుల ఆధారంగా నిర్మాణం ఉండాలి. ఉత్తరాంధ్ర, రాయలసీమ ప్రాంతాల అభివృద్ధికి ప్రాధాన్యం ఇవ్వాలి. సీమ ప్రాంతంలో అపార ఖనిజ సంపద ఉన్న సీమ నిత్యం కరువుతో సీమ వాసులకు పట్టెడన్నం పెట్టలేకపోతున్నాయి. ఎపి జనాభాలో 30 శాతం భూ భాగంలో 40 శాతం రాయలసీమలో ఉంది. ప్రత్యేక భౌగోళిక స్థితి వలన వర్షాభావ పరిస్థితి ఉంది. ఒక్క ప్రధాన సాగునీటి ప్రాజెక్టు కూడా లేదు. 1953లో కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన చరిత్ర సీమకుంది. సీమ ప్రజలకు అన్యాయం జరిగితే ఇప్పటికే మొదలైన ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఆకాంక్ష పెద్దదై రాష్ట్రం మరల విడిపోగలదు. ఉత్తరాంధ్ర కూడా దాదాపు బాగా వెనుకబడిన ప్రాంతం. ఈ ప్రాంత ప్రజల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ వహించవలసి ఉంటుంది. అపార వనరులు, నదులు, ఖనిజ సంపదలు 972 కిలోమీటర్ల పొడవుగల తీరరేఖ గల ఆంధ్ర ప్రాంతం అభివృద్ధికి కావాల్సింది చిత్తశుద్ధి మాత్రమే కాని, కేంద్ర ప్రభుత్వ దయాదాక్షిణ్యాలు అవసరం లేదు. మౌలికంగా రాష్ట్రం వ్యవసాయ ఆధారిత ప్రాంతం కాబట్టి వ్యవసాయాధారిత పరిశ్రమల నిర్మాణం జరగాలి. స్వయం సంపూర్ణ వ్యవసాయాధారిత గ్రామీణాభివృద్ధి జరగాలి. ఈ దిశగా ప్రజలు ఆలోచించాలి. ఓట్ల కోసం, సీట్ల కోసం, తమ తమ రాజకీయ ప్రయోజనాల కోసం రాజకీయ పార్టీలు ఆడుతున్న ఆటలో భాగమే ప్రస్తుత రాష్ట్ర పరిస్థితులు. ఈ ఆటలో ప్రజలు పావులు కారాదు. చరిత్ర నిర్మాణంలో ప్రజలే చోదక శక్తులు అన్న విషయాన్ని రాజకీయ పార్టీలు కూడా గుర్తించాలి. వీ

*(రచయిత సామాజిక విశ్లేషకులు)*

# ఎపికి ప్రత్యేక హోదానా, ప్యాకేజా?

***రాష్ట్ర విభజన జరిగిన నాటి నుంచి అన్ని రాజకీయ పార్టీలు ప్రత్యేక హోదా, ప్రత్యేక ప్యాకేజీ అని ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ఎన్నో భ్రమలు కల్పిస్తున్నాయనీ, వాటి పట్ల రాయలసీమ ప్రజలకు ఎటువంటి నమ్మకం లేదనీ అంటున్నారు* అరుణ్**

గత నెలరోజులుగా ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక హోదా గురించి తెగ వాదోపవాదాలూ, చర్చలూ, గోష్టులూ జరుగుతున్నాయి. ప్రత్యేక హోదాతో పరిశ్రమలు వెల్లువలా రాష్ట్రాన్ని ముంచెత్తుతాయనీ, దాంతో నిరుద్యోగం. మటుమాయం అవుతుందనీ ప్రతిపక్షపార్టీలన్నీ ముక్తకంఠంతో అరుస్తున్నాయి. మరోవైపు, ప్రత్యేక హోదా కన్నా మెరుగైన ప్యాకేజి అందిస్తున్నామని, హోదాకు కాలం చెల్లిందని, అంతేగాక ప్రత్యేక హోదా వల్ల ఇంతవరకు ఏ రాష్ట్రమూ పెద్దగా అభివృద్ధి చెందలేదని కమల నాథులు ప్రజల్ని నమ్మించే ప్రయత్నాలు చేస్తున్నారు. సుజనా చౌదరిలాంటి వారు వారి గొంతుతో గొంతు కలుపుతున్నారు. ఇక వెంకయ్య, విభజన సమయంలో తాను రాష్ట్రాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని ముందుగానే ప్రత్యేక హోదాను పది సంవత్సరా కాలం కావాలని డిమాండ్ చేసానని, కాని ఇప్పుడు మారిన పరిస్థితుల దృష్ట్యా, రాష్ట్రానికి ప్రత్యేక ప్యాకేజి మరింత ఉపయోగకరంగా ఉంటుందని, తనను విమర్శిస్తున్న వాళ్లు అజ్ఞానులని ఎదురు దాడికి దిగుతున్నాడు. చంద్రబాబు, తన సహజ చాతుర్యంతో తాను హోదానే కోరుతున్నానని, అయితే ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ప్యాకేజీని పొంది, ఆ తర్వాత హోదా కై పోరాడుతానని ప్రజలకు నచ్చచెప్పే ప్రయత్నంలో ఉన్నాడు.

ప్రత్యేక హోదా రాదని చంద్రబాబుకూ తెలుసు, ప్రతిపక్షాలకూ తెలుసు. అయినా, ఈ రోజు అది ఇరువురికీ తమతమ ప్రయోజనాలను నెరవేర్చుకొనే ఒక సాధనమైంది. ప్రజలు నిత్యమూ ఎదుర్కొనే సమస్యల నుండి, తమ అవినీతి బాగోతాల నుండి ప్రజల దృష్టి మరల్చడానికి, తన పాలనా వైఫల్యాన్ని కప్పిపుచ్చుకొనేందుకు చంద్రబాబుకు హోదా సమస్య ఒక సాధనం. ఇక ప్రతిపక్షాలకు ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోస్తూ, తాము కోల్పోయిన పరపతిని పొందేందుకు హోదా ఉపయోగ పడుతున్నది. ఏమైనా ప్రత్యేక హోదా అనే స్లోగన్ ప్రజల్ని, మరీ ముఖ్యంగా రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతవాసుల్ని అభివృద్ధి ఎండమావుల వెంట పరిగెత్తించడంలో చాలా మేరకు విజయవంతమైంది.

పవన్ కళ్యాణ్ రంగప్రవేశంతో పరిస్థితి మరింత ఉద్రిక్తతకు చేరుకుంది. హోదా చాంపియన్లమని, తామూ రుజువు చేసుకొనేందుకు అన్ని పార్టీలు పోటీపడక తప్పడం లేదు. పవన్ కళ్యాణ్ అకస్మాత్తుగా ఇలా రంగప్రవేశం చేస్తాడని ఆయన అభిమానులూ అనుకోలేదు. తన అభిమాని హత్యకు గురై మరణించాక, సంతాపం తెలిపేందుకు తిరుపతి చేరుకున్న ఈ సినీహీరోకు, ప్రత్యేక హోదా జ్ఞప్తికి రావడం యాదృచ్ఛికం మాత్రం కాదు. ముందుగానే రిహార్సల్ చేసుకొని వచ్చినట్టు అతను ఆ సభలో తెల్పిన కార్యక్రమ వివరాలు స్పష్టం చేస్తాయి. సినిమా షూటింగ్‌లు లేనప్పుడూ, వరస సినిమా ఫేల్యూర్ అయినప్పుడూ, తన అభిమానుల్లో క్షీణిస్తున్న ప్రభావం పునరుద్ధరించుకోనేందుకు, తానింకా రాజకీయాల్లో ఉన్నానని చెప్పుకొనేందుకు పవన్ కళ్యాణ్ సమాజ రంగస్థలం పై నటించడం మొదలెడుతాడు. గతంలో అమరావతీ రైతుల ఉద్ధరణకు కంకణం కట్టుకున్నట్టు మాట్లాడి అలా మెరిసి, ఇలా మాయమయ్యాడు, ప్రశ్నించడమే కాని, దానికి జవాబు రాబట్టుకొనే తీరిక, కోరికా లేదతనికి. అందరూ అంటున్నట్టు, ఈయన సినిమాలో హీరోనే, అలా అని అందరు అంటున్నట్టు, సమాజ రంగస్థలంలో జీరో మాత్రం కాదు. ఒక విదూషకుడు అనవచ్చు. 'షేక్స్పిరియన్ ఫూల్' అనడం అతిశయోక్తోగాని, ఆ తెలివితేటలు కొన్ని వున్నాయి. 'హీ నోజ్ విచ్ సైడ్ హిస్ బ్రెడ్ ఈజ్ బట్టర్డ్'. తన కోస్తా ఓట్ బ్యాంకుకు నష్టం రాకుండా, కోస్తా ప్రభుత్వాన్ని నొప్పించక, తిరుపతిలో సభ పెట్టి రాయలసీమ అవసరాలను గురించి ఒక్క మాట మాట్లాడకుండా జాగ్రత్త పడ్డాడు. కాకినాడ సభలో తాను 2019 ఎన్నికల్లో పాల్గొంటానని స్పష్టం చేసాడు. అందుకు తగిన ఎత్తుగడలను మనం ఆయన కాకినాడ ప్రసంగంలో చూడవచ్చు.

పవన్ కళ్యాణ్‌కు అభిమానులే తప్ప, ఎన్నికలకు అవసరమైన సంస్థాగత నిర్మాణం లేదు. అందువల్ల రాబోయే ఎన్నికల్లో తాను గెలవాలంటే పటిష్టమైన నిర్మాణమున్న పార్టీ అండదండలవసరం. ఇప్పుడున్న రాజకీయ పార్టీలలో ఇక్కడ ఇంకా కాలూనలేదు. అంతేగాక ప్రత్యేక హోదా విషయంలో తమను ఆ పార్టీ మోసం చేసిందని ప్రజలలో బలమైన అభిప్రాయముంది. ఇక దాని అధినేత జగన్ అహంభావి, నియంత. తన పార్టీలోని సీనియర్ నాయకుల్నే బానిసలుగా చూసే స్వభావం అతనిది. తనను తాను ఒక మహానేతగా ఊహించుకొని ఇతరులను పాలెగాళ్లుగా చూసే భూస్వామ్య మనస్తత్వం. అతనితో చేరితే తనకు ఏమాత్రం విలువ ఉండదని పవన్ కళ్యాణ్ సరిగ్గానే గ్రహించాడు. కాంగ్రెస్ పార్టీ ఉనికిలోనే లేదు. విభజన పాపం దాన్ని వెంటాడుతూనే ఉంది. ఇక మిగిలింది తెలుగుదేశం, ఉభయ కమ్యూనిస్టు పార్టీలు. అందుకే వాటి అవసరం ఉంటుందని పవన్ కళ్యాణ్ కాకినాడ సభలో చంద్రబాబును ఏమాత్రం నొప్పించలేదు. బాబు ఉన్న సంక్లిష్ట పరిస్థితిని అర్థం చేసుకున్నట్టుగా మాట్లాడాడు, విమర్శనంతా తనకు పెద్దగా ఉపయోగపడదనుకుంటున్న వారిపై, వెంకయ్యనాయుడుపై గుప్పించాడు. పనిలో పనిగా సిపిఐను మెచ్చుకున్నాడు. మన కామ్రేడ్స్‌కూ కావాల్సింది అదే. ఎవరికో ఒకరికి తోకగా కలిసి పోటీ చేస్తే తప్ప ఎన్నికల గోదారి దాటలేని దుర్గతి. కనీసం ఒకటి, రెండు సీట్లు రాని దౌర్భాగ్యపు పరిస్థితి. పవన్ కళ్యాణ్‌కూ తన హీరో ఇమేజ్‌తో పాటు తెలుగుదేశం, కమ్యూనిస్టుల కేడర్ అవసరం. అందుకే కాకినాడ సభలో చంద్రబాబును నొప్పించకుండా, రాష్ట్రబంద్‌కు తన మద్దతు తెలపకుండా అభిమానులకే వదిలేసాడు. చంద్రబాబుకు కావల్సినదదే. కమలనాథులు బలపడితే తన ఆధిపత్యం సాగనివ్వారని తెలుసు. బిజెపి బలహీనపడడం తెలుగుదేశంకు అవసరం. రాష్ట్రంలో బిజెపి బలపడితే తెలుగుదేశంకు గడ్డుపరిస్థితే. హోదా కల్పించని పరిస్థితిలో బలహీనపడ్డ దాన్ని

లేవలేకుండా దెబ్బకొట్టడానికి చంద్రబాబుకు పవన్ కళ్యాణ్ ఉపయోగాపడ్డాడు. అంతేగాక ముద్రగడ వల్ల ఆ సామాజిక వర్గంలో తెలుగుదేశం కోల్పోతున్న ఓట్లను కొంతమేరకైన పవన్ వల్ల నిలబెట్టుకోవచ్చు. కమ్యూనిస్టులకు ఇది ఆకస్మిక వరం. పవన్ కళ్యాణ్‌కు యువతలో ఉన్న క్రేజ్ వల్ల తామూ కొన్ని సీట్లు సంపాదించుకోవచ్చు.

2019 ఎన్నికలకై అన్ని రాజకీయ పార్టీలు ముందస్తు ప్రణాళికలూ, ఎత్తుగడలూ వేసుకుంటున్నాయనేది వాస్తవం. ప్రత్యేక హోదా అనేది రాష్ట్ర ప్రజలకు సంజీవిని కాదు కాని, అన్ని రాజకీయ పార్టీలకు ప్రజల్లో గతించిన తమ పరపతిని జీవం పోసేందుకు మాత్రం సంజీవినే.

'ప్రత్యేక ప్యాకేజి తెలుగుదేశం పార్టీ అధినేతకు, ఆయన అనుయాయులకు మాత్రం నిజంగా వరప్రదాయినే. ఎటువంటి నిబంధనలు లేకుండా నిధులు వచ్చిపడుతుంటే ఎవరికి మాత్రం చేదు. పోలవరం నిర్మాణం రాష్ట్రానికి అప్పగించడంతో ఆయన పంట పండినట్టే. ఇప్పటికే పోలవరం, గాలేరు-నగరి, హంద్రీ-నీవా లాంటి సాగునీటి పథకాల నిర్మాణ ఖర్చులు పెంచి తన అనుయాయుల బ్యాంక్ బాలెన్స్ పెంచడంలో సఫలీకృతుడయ్యాడు కూడా. ప్రత్యక్ష ప్రయోజనాలు కల్పించే ప్రత్యేక ప్యాకేజీ కోరకుండా, పరోక్షంగా లబ్ది కలిగించే ప్రత్యేక హోదా కోరెంత అమాయకుడు కాదు చంద్రబాబు. అందులోనూ ప్రత్యేక హోదా గురించి మాట్లాడుతూ మరిన్ని నిధులనూ పొందవచ్చు కూడా. దీనిపై కమలనాథుల ఎత్తుగడలూ చూడవలసి ఉంది.

వివిధ పార్టీల ఈ ఎత్తుగడలు, వ్యూహ, ప్రతివ్యూహాల మధ్య రాయలసీమ, శ్రీకాకుళాంధ్ర విషయాలను పట్టించుకొనే నాథుడే లేదు. ఎవరి బిడ్డనో ఎక్కేకి ఏడ్చినట్టు, ఆ ప్రాంత ప్రజలు, ముఖ్యంగా రైతాంగపు ఆక్రందలను వినే రాజకీయ నాయకుడే లేడు. తమ నియోజకవర్గాలలో పట్టుకోల్పోతామనే భయంతో అప్పుడప్పుడు, ఆ ప్రాంతపు రాజకీయ నాయకులు మొసలికన్నీరు కారుస్తున్నా, ఆ ఏడుపులు నల్లమల కొండలు దాటి వినిపించకుండా జాగ్రత్త పడుతున్నారు. ఆయా పార్టీల అధినేతలు రాయలసీమ ప్రాంతమొకటున్నదనే విషయమే మరచారు. తెలంగాణ నిర్మిస్తున్న కొత్త ప్రాజక్టులవల్ల కృష్ణా డెల్టా ఎడారి అవుతుందని కర్నూల్‌లో నిరశన దీక్షలు నిర్వహిస్తాడు, కాని ఇప్పటికే ఎడారిగా మారిన రాయలసీమ గురించి మాట్లాడడు మహానేత పుత్రుడు జగన్.

విభజన చట్టంలో లేని ప్రత్యేక హోదాకై పోరాటానికి ప్రజలందరూ సిద్ధం కావాలని పిలుపు నిచ్చే రాజకీయ పార్టీలు, ఆ చట్టంలోని హామీలైన సీమ ప్రాంతపు, గాలేరు-నగరి, హంద్రీ-నీవా, తెలుగంగ సాగునీటి పథకాల సత్వర పూర్తికిగాని, కడపలో ఉక్కు ఫాక్టరీ నిర్మాణం విషయం పైగాని ఉద్యమాలకు పిలుపునివ్వవు. 'విశాఖ ఉక్కు – ఆంద్రుల హక్కు' అని అన్ని ప్రాంతాల వాళ్లను రెచ్చగొట్టిన పార్టీలు కడప ఉక్కు– ఆంద్రుల హక్కు అని ఎందుకనడం లేదు? అని ప్రశ్నించుకుంటే కోస్తా వాళ్లకు రాష్ట్రమంటే తమ నాలుగు, ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే గుంటూర్, కృష్ణా జిల్లాలే అనే విషయం స్పష్టమవుతుంది. ఇంత సంకుచితంగా ఆలోచిస్తున్న వాళ్ల చేతిలో అటు శ్రీకాకుళ ఆంధ్రకు గాని ఇటు రాయలసీమకు గాని న్యాయం జరుగుతుందని అనుకోవడడం, అమాయకత్వం కాదు స్వయం వంచన అవుతుంది. ఆరు దశాబ్దాలుగా కోస్తా ఆధిపత్యం కింద చెందని అభివృద్ధి నేడు తమ ఉద్యమాల వల్ల జరుగుతుందని అభివృద్ధి వాదులు ప్రజలకు ఆశలు కల్పించడం ప్రజలను మరోమారు మోసానికి గురిచేయడమే

ఇక వచ్చే ఎన్నికల దృష్ట్యా ఈ మధ్యకాలంలో, ఇప్పటి ఎంఎలఎలు, మాజీలు, రాయలసీమ అభివృద్ధి అంటూ హడావిడి చేస్తున్నారు. వేలాది కోట్ల ప్యాకేజీని డిమాండ్ చేస్తున్నారు. నాడు వీరికి ప్యాకేజీలు కావాలి. కొందరు 30 వేల కోట్ల కావాలి, మరోకరికి 50వేల కోట్ల రూపాయలు కావాలి. ఇంతవరకు కేంద్రం రాష్ట్రానికి, అదీ వెనుకబడిన జిల్లాలకు వేసిన ముష్టి జిల్లాకు 50 కోట్ల రూపాయలు. ఎక్కడ ఖర్చు చేసారో వీరికి తెలియదనుకోవాలా? లేక తెలిసి ప్రజల్ని పక్కదోవ పట్టిస్తున్నారను కోవాలా?

గత రెండేళ్ల చంద్రబాబు పాలనను పరిశీలిస్తే, ప్రత్యేక ప్యాకేజి అయినా ప్రత్యేక హోదా అయినా రాయలసీమకు ఒరిగేదేమీ లేదని స్పష్టమవుతుంది. రాష్ట్ర విభజన తర్వాత ఏర్పాటు చేయబడ్డ కేంద్ర, రాష్ట్ర విద్యా, వైద్య సంస్థలలో గాని, ప్రభుత్వ కార్యాలయాలల్లో గాని, ప్రాధాన్యత కలిగినవేవి రాయలసీమ ప్రాంతంలో నెలకొల్పలేదు. అప్రధానవైనవి ఏర్పాటు చేసినా వాటికి నిధులు మంజూరు కాలేదు. సిబ్బందీ లేరు. ఇద్దరు నాయుల్ల దృష్టంతా కోస్తా, పోతే నెల్లూర్ జిల్లాలకే పరిమితమైంది. పోగా ఇదివరకే మంజూరు చేయబడి, నిధులూ కేటాయించబడ్డ కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌ను తిరుపతి నుండి విశాఖకు తరలించారు. 2010 లో, మన్నవరంలో, సాక్షాత్తు నాటి ప్రధాన మంత్రి మన్మోహన్ సింగ్ శంఖుస్థాపన చేసిన విద్యుత్ ఉత్పత్తి పరికరాల కర్మాగారాన్ని నేడు నెల్లూర్‌కు తరలించాలనే నిర్ణయం. ఇప్పటికే అక్కడ భూసేకరణ, కొన్ని భవంతుల నిర్మాణం, కొందరు ఉద్యోగుల నియామకం పూర్తయింది కూడా. దాని వల్ల ప్రత్యక్షంగా, పరోక్షంగా దాదాపు 50 వేలమందికి ఉపాధి కలిగేది.

అంతేకాదు, రాజధాని ప్రాంతంలో నియమించబడ్డ పది వేల ఉద్యోగులలో సీమవాసులు ఒక్కరూ లేకపోవడం చేదు వాస్తవం. దీని ఒక్క బైరెడ్డి తప్ప మరో రాజకీయ నాయకుడు ప్రశ్నించ లేదు. దశాబ్దాలుగా పూర్తికాని సాగునీటి ప్రాజక్టులపై, అడపా దడపా సీమకు అల్లుళ్లా వచ్చి, ముఖ్యమంత్రి, నీటిపారుదల శాఖామంత్రి హామీలను గుప్పించడం తప్ప నిధుల విడుదల మాత్రం లేదు. చివరకు తక్షణం పూర్తీ చేయాల్సిన సాగు నీటి పథకాలకై కేంద్రం కేటాయించిన నిధులలో ఒక్క పైసాకు సీమ ప్రాజక్టులు నోచుకోలేదు. విశాఖలో జరిగిన సమ్మిట్ సమావేశంలో 4.78 లక్షల కోట్లు లు జరిగినా సీమ ప్రాంత వాటా కేవలం వేలకోట్లు మాత్రమే.

ఈ నేపథ్యంలో ప్రత్యేక హోదా గాని ప్రత్యేక ప్యాకేజి గాని ఏది వచ్చినా రాయలసీమ పొందేదేమీ ఉండదు. పారిశ్రామిక వేత్తలకు ఎన్ని రాయితీలిచ్చినా, తగిన మౌలిక సౌకర్యాలు, రవాణ, నీరు తగినంతగా లేని రాయలసీమ ప్రాంతంలో పరిశ్రమలు నెలకొల్పరు. ఎవరైనా ప్రతిపాదించినా కోస్తా నాయకులు అంగీకరించరు. మా ప్రాంత నాయకులు పట్టించుకోరు. ఇక్కడ గాలి, నీటిని కలుషితం చేసే అణు విద్యుత్ కేంద్రాలు, రసాయినిక పరిశ్రమలు, పోగా ప్రభుత్వం గొప్పగా చెప్పుకొనే సోలార్ విద్యుత్ కేంద్రాలు. విద్యుత్ ఇక్కడ ఉత్పత్తి చేసి రాష్ట్రమంతటా సరఫరా చేస్తారు. అయితే ఉపాధి కల్పించే సోలార్ పలకల ఉత్పత్తి కర్మాగారాన్ని ఏ గుంటూర్‌లోనో, కృష్ణా జిల్లాలోనో నెలకొల్పుతారు.

ఇలాంటి చేదు వాస్తవాలు కళ్లముందు కనపడుతున్నా, వేల కోట్ల ప్యాకేజీలతో, కోస్తా ప్రభుత్వ పాలనలో, ఆకాశానికి నిచ్చన వేయమని ప్రజలలో భ్రమలు కల్పించే ప్రగతిశీలురమని చెప్పుకుంటున్న మేధావులూ కొందరు ఉంటే, ప్రత్యేక హోదా ఎండ మావిలో దప్పిక తీర్చుకోమంటూ ప్రజల్ని తప్పుదోవ పట్టిస్తున్నవారు మరికొందరు. ఈ విచిత్ర రాజకీయ విన్యాసాలతో నిత్యజీవిత సంకటాలతో బాధపడతున్న ప్రజలు గంధరగోళ పడుతుంటే, రాజకీయ పార్టీలు తమ ప్రాబల్యాన్ని పెంచుకొనేందుకు,

# జిల్లాల విభజనలో ఎవరి ప్రయోజనమెంత?

*టిఆర్ఎస్ ప్రభుత్వం ఏర్పాటు చేసే జిల్లాల విభజనతో ఏర్పడే అధికార వికేంద్రీకరణ వల్ల అభివృద్ధి వికేంద్రీకణ జరుగుతుందా అంటూ అందులో రాజకీయ నాయకుల, ప్రజల ప్రయోజనమెంత అని ప్రశ్నిస్తున్నారు* **వై. రామచంద్రం**

తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) ప్రభుత్వం పాలన సౌలభ్యం కోసం తెలంగాణలోని పది జిల్లాలను విభజించి 27 జిల్లాలకు, 459 నుంచి 490 మండలాలకు, 45 డివిజన్లను 58 డివిజన్లకు పెంచాలనే ఉద్దేశంతో ఆగస్టు 22న ముసాయిదాను ప్రకటించింది. ఇప్పుడున్న జిల్లాల విస్తీర్ణాన్ని చూసినా, జనాభాను చూసినా జిల్లాల మధ్య విపరీతమైన వ్యత్యాసం ఉంది. అట్లాగే సౌకర్యాల రీత్యా చూస్తే హైదరాబాద్‌లో ఎయిర్ పోర్ట్‌లు, ప్లైఓవర్ బ్రిడ్జ్‌లు, స్టార్ హోటళ్లు, పరిశ్రమలు, హైటెక్ సిటీలు, కార్పొరేట్ ఆసుపత్రులు, విద్యాసంస్థలు ఉన్నాయి. అదే ఖమ్మం, వరంగల్, మహబూబ్‌నగర్, కరీంనగర్, నల్గొండ జిల్లాల్లోని మారుమూల ఆదివాసీలకు కనీస వసతులు లేక మలేరియా బారిన పడి అర్ధాంతరంగా మరణిస్తున్నారు. కాబట్టి విభజన అనేది అవసరమైన నిర్ణయమే. కాని విభజనలో దేనికి ప్రాముఖ్యతనిస్తారు, ప్రజల కనీస అవసరాలైనా నెరవేరుతాయా అన్నదే ప్రశ్న.

తెలంగాణ చారిత్రక క్రమాన్ని పరిశీలిస్తే మొదటిసారి సాలార్‌జంగ్ సంస్కరణల్లో భాగంగా 1860ల్లో తెలంగాణలో 5 జిల్లాలు ఏర్పాటు చేశారు. దివాన్ కిషన్ పర్షాద్ ప్రధానిగా ఉండగా 1905లో జిల్లాల పునర్విభజన జరిగి తెలంగాణలో ఎనిమిది జిల్లాలు ఏర్పడ్డాయి. హైదరాబాద్ తొలి ప్రభుత్వంలో మరొక జిల్లా ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పడ్డ తరువాత 1978లో రంగారెడ్డి జిల్లా ఏర్పడి తెలంగాణ 10 జిల్లాలుగా ఉంది. ఆయా జిల్లాలు ఏర్పడ్డ నాటి స్థితికి ఈనాడు పెరుగుతున్న జనాభా, వారి అవసరాలు రీత్యా చూసినా నూతన జిల్లాల ఏర్పాటు అవసరం ఉంది. మిగతా రాష్ట్రాలను పరిశీలించినా ఆరు పార్లమెంట్ స్థానాలున్న కశ్మీర్‌లో 24 జిల్లాలు ఉన్నాయి. 2.5 కోట్ల జనాభా కలిగిన హర్యానాలో 21 జిల్లాలు ఉన్నాయి. తెలంగాణ రాష్ట్రం మొత్తం విస్తీర్ణం 114,840 చదరపు కిలోమీటర్లు. 3.6 కోట్ల జనాభా ఉంది. జిల్లాకు సగటున 36 లక్షల జనాభా కలిగి ఉంది. మహబూబ్ నగర్, ఆదిలాబాద్ లాంటి జిల్లాల ప్రజలు తమ అవసరాల కోసం 150 కిలోమీటర్ల దూరంలో ఉన్న జిల్లా కేంద్రానికి రావాల్సి వస్తోంది. కాబట్టి ఏ రకంగా చూసినా తెలంగాణాలోని జిల్లాల విభజన అవసరమే.

ప్రభుత్వం ముసాయిదాలో ప్రతిపాదించిన జిల్లాలపై ప్రజలు తమ అభ్యంతరాలు తెలియజేయడానికి సెప్టెంబర్ 20ని గడువు తేదీగా ప్రకటించింది. ప్రభుత్వం ప్రతిపాదించిన జిల్లాలపై అభ్యంతరాలు, ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు వేల సంఖ్యలో అధికారులకు అందాయి. జిల్లాల ఏర్పాటులో అనేక అంశాలు ఇమిడి ఉంటాయి. అందులో ముఖ్యంగా రాజకీయ, ఆర్థిక, సామాజిక, చారిత్రక, సాంస్కృతిక కారణాలు ప్రధానంగా ఉంటాయి. వీటన్నిటిని పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ప్రభుత్వం పేరుకు ప్రజా అభిప్రాయాన్ని కోరింది కాని గడువుకు ముందే అధికార కేంద్రాలను ఏర్పాటుచేసే పనిలో ముందుకు సాగుతోంది. ప్రజల అభ్యంతరాలకు గాని, ప్రత్యామ్నాయ సూచనలకు గాని ప్రాధాన్యత ఇస్తున్నట్లుగా కనిపించడం లేదు. విభజన ప్రక్రియలో పాలకుల అభిప్రాయమే చెల్లుబాటు అవుతోందంటే ఇందులో ఇమిడి ఉన్న ప్రజా ప్రయోజనం ఎంత అనేది ప్రశ్నార్థకంగా మారింది. నిజంగానే పాలనా వికేంద్రీకరణ జరిగి, అభివృద్ధి వికేంద్రీకరణగా పరిణామం చెందుతుందా? అటువంటి చిత్తశుద్ధి పాలకులకు ఉందా?

కొత్తగా అధికారంలోకి వచ్చిన ఏ రాజకీయ పార్టీ అయినా విధాన పరంగా తనదైన ముద్రవేసి రాజకీయంగా, ఆర్థికంగా నిలదొక్కుకునే ప్రయత్నం చేస్తుంది. అందులో భాగంగానే టిఆర్ఎస్ ప్రభుత్వం పాలనా సౌలభ్యం కోసం జిల్లాల పునర్వ్యవస్థీకరణకు సిద్ధమైంది. అట్లాగే మిషన్ భగీరథ. ఈ రెండు టిఆర్ఎస్ పార్టీ ఆర్థికంగా నిలదొక్కుకోవడానికి కలిసివచ్చిన అవకాశం. సాధారణంగా ఇటువంటి ప్రజోపయోగకరమైన పనిచేసేటప్పుడు ముందుగా ప్రజల అభిప్రాయాలను తెలుసుకోవడానికి ఒక కమిటీని వేయాలి. దాని ద్వారా ఇప్పుడున్న పరిస్థితుల్లో ప్రజల అభిప్రాయాలు ఏ విధంగా ఉన్నాయో తెలుసుకోవలసి ఉంటుంది. ఇప్పటికీ వేలకొద్ది సూచనలు, సలహాలు సంబంధిత అధికారులకు

---

రాబోయే ఎన్నికలకై వ్యూహ, ప్రతివ్యూహాలను పన్నుతున్నారు. ఇక ఉపాధ్యాయ, ఉద్యోగ వర్గాలు పదోన్నతిలకి అంగలారుస్తూ సీమ ప్రయోజనాలను పట్టించుకొనే స్థితిలో లేరు. కొంతమేరకు కొందరు మధ్యతరగతి మేధావులూ, విద్యార్థి సంఘాలు, అభివృద్ధి మేడిపండు పొట్టను చీల్చి ప్రజల ముందు దాని నిజస్వరూపాన్ని బయట పెడుతూ ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఏర్పాటు అవసరాన్ని ప్రచారం చేస్తున్నారు.

ఇప్పుడిప్పుడే, ఇక్కడి రైతాంగం తమ నీటిహక్కు కోసం గళంవిప్పి, కదం తొక్కడం రాయలసీమ భవిష్యత్తుకు ఆశాకిరణం. వారిలో, కొందరికి కోస్తా ఉక్కు కౌగిలి నుండి బయట పడితే తప్ప తమ నీటి హక్కును సాధించుకోలేమనే స్పృహ కలగడం, ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌కు ఊపునిస్తూంది. ఈ తరుణంలో ప్రత్యేక రాష్ట్రంకై ఉద్యమిస్తున్న శక్తులు మరింత జాగురూకతతో, సంఘటితంగా పనిచేయాల్సిన అవసరముంది. ఆ దిశగా సీమ వుద్యమకారులు ముందుకు సాగుతారని ఆశిద్దాం.

గమనిక: మా దృష్టిలో కోస్తా అంటే దక్షిణ కోస్తా, మరీ ముఖ్యంగా గుంటూర్, కృష్ణా జిల్లాల ఆధిపత్య సామాజికవర్గం.

*(రచయిత రాయలసీమ విద్యావంతుల వేదిక)* వీ

చేరాయి. వాటిని ఒక క్రమ పద్ధతిలో చర్చకు పెట్టాలి. ఆ తరువాతే జిల్లాలు పరిధులు నిర్ణయించాలి.

ఆదివాసులు నివసిస్తున్న భద్రాచలం, ఏటూరు నాగారం, ఉట్నూరు, ఐటిడిఎ కింద ఉన్న 84 మండలాలను ప్రత్యేక ఆదివాసి జిల్లాలుగా ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తున్నారు. రాష్ట్ర జనాభాలో 10 శాతం ఉన్న ఆదివాసీలు, 15 శాతం రాష్ట్ర భూభాగంలో విస్తరించి ఉన్నారు. ఖమ్మం జిల్లాలోని 24 ఏజెన్సీ మండలాలను కొత్తగూడెం జిల్లాలో కొనసాగించాలని ఆదివాసీ ప్రజలు ధర్నాలు, రాస్తా రోకోలు చేస్తున్నారు. అట్లాగే చారిత్రకంగా, సాంస్కృతికంగా ప్రత్యేకమైన ప్రాంతాలైన జనగామ, గద్వాల పట్టణాలను జిల్లాలు చేయాలని ఆ ప్రాంతాల్లో బంద్‌లు పాటిస్తూ రకరకాల పద్ధతుల్లో పోరాడుతున్నారు. అయితే ప్రభుత్వం వీటిని పట్టించుకోవాల్సిన పద్ధతిలో పట్టించుకుంటున్న దాఖలాలు లేవు.

ప్రాంతీయ ఆకాంక్షలు నెరవేరుస్తానని అధికారంలోకి వచ్చిన తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం ఆచరణలో ప్రజల అభిప్రాయంతో నిమిత్తం లేకుండా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాల విభనకు ఏర్పాటు చేసిన 1974 చట్టాన్నే అమలుచేస్తున్నది. ప్రజల ఆకాంక్షలకు ఇక్కడ చోటు లేదని పాలకుల ప్రాధాన్యతలే ప్రజల ఆకాంక్షలుగా భావించాలనే నియంతృత్వ పాలనను కొనసాగిస్తోంది.

మన దేశంలో నగరాలు పాలనా అవసరాల కోసం, ఆధ్యాత్మిక అవసరాల కోసం ప్రధానంగా ఏర్పడ్డాయి. ఆ తరువాత కాలంలో మార్కెట్ అవసరాల కోసం నగరాలు ఏర్పడ్డాయి. ఇప్పుడు ఏర్పాటు చేయబోతున్న జిల్లాలు పాలన విస్తరణతో పాటు మారిన పరిస్థితుల్లో రాజకీయ ప్రయోజనాలు, భూముల రియల్ ఎస్టేట్ వ్యాపారం కూడా తోడయ్యాయి. జిల్లాల విభజన వల్ల వేలాది ఎకరాల భూములు చేతులు మారి రాజకీయ మాఫియా చేతుల్లోకి మారతాయి. దీంతో రియల్ ఎస్టేట్ పేరిట సాగు భూములు బీళ్లుగా మారతాయి. ఆ కారణంగా అప్పటివరకు భూమి మీద ఆధారపడి బతికిన రైతుల కుటుంబాలు, రైతు కూలీల కుటుంబాలు సంక్షోభంలోకి నెట్టబడతాయి. రైతు కూలీలకు ప్రభుత్వం చెపుతున్న అభివృద్ధిలో ఎక్కడా చోటు ఉండదు. క్రమంగా వాళ్లు బిచ్చగాళ్లుగా మారతారు. ఎందుకంటే పాలకులు అభివృద్ధి పేరుతో తెస్తున్న ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ, రియల్ ఎస్టేట్, హోటళ్లు, రహదారులు, ఎయిర్‌పోర్టులు, సెజ్‌ల పేరుతో వేలాది ఎకరాల భూ ఆక్రమణ చేసి సేవారంగాన్ని ప్రధాన కేంద్రంగా చేసుకొని సాగుతున్నవే. ఇందులో ఎక్కడా ఉత్పత్తి ప్రధాన కేంద్రంగా సాగుతున్నది లేదు. ఈ విషయం మనకు జిడిపిలో వచ్చే మార్పులను బట్టి చూస్తే తెలుస్తోంది. 1980ల నుంచి వ్యవసాయరంగ వాటా తగ్గుతూ సేవా రంగాల వాటా పెరుగుతూ వస్తోంది. ఈ పెరుగుదలనే ప్రభుత్వాలు అభివృద్ధి అంటున్నాయి. ప్రభుత్వం చెపుతున్న అభివృద్ధికంటే ఎక్కువగా పెరుగుతున్న నిర్వాసితులను, నిరుద్యోగులను చూస్తే దాన్ని అభివృద్ధి అని ఎలా అనగలం?

ప్రభుత్వం ప్రజా ప్రయోజనం పేరుతో తెస్తున్న జిల్లాల విభజనలో టిఆర్ఎస్ పార్టీ రాజకీయ ప్రయోజనం ఇమిడి ఉంది. గత ఎన్నికల్లో వివిధ పార్టీల నుంచి గెలిచిన ఎంఎల్ఎలను రాజకీయ సిద్ధాంతాలు, విలువలు, ఆచరణతో సంబంధం లేకుండా టిఆర్ఎస్‌లోకి చేర్చుకుంది. టిఆర్ఎస్ ఇప్పటి నుండే రానున్న ఎన్నికల్లో అధికారమే ప్రధాన లక్ష్యంతో ముందుకు సాగుతోంది. ఉద్యమ పార్టీ అని చెప్పుకున్న టిఆర్ఎస్ గత పాలకులకు మేం భిన్నం కాదని చాటుకుంది. ఇతర పార్టీల నుండి వచ్చి చేరిన ఎంఎల్ఏలకు ఇప్పుడున్న సీట్లు సరిపోవు. రాజకీయ అధికారంతో ఆస్తులను కాపాడుకోవడం కోసం వచ్చిన వారు ఇక్కడ అవకాశం కల్పించకుంటే తిరిగి వెళ్లిపోవచ్చు. కాబట్టి వారికి అవకాశం కల్పించి ప్రతిపక్ష పార్టీలు లేకుండా చేయాలనే ఉద్దేశ్యం కూడా జిల్లాల విభజనకు ఒక కారణం. విభజన వల్ల అధికార యంత్రాంగానికి ప్రజలపై పూర్తి నియంత్రణ ఉంటుందనే విషయం కూడా ఇందులో ఇమిడి ఉంది.

కెసిఆర్ ఎన్నికల ముందు ఇల్లు లేని వారికి డబుల్ బెడ్ రూమ్ ఇల్లు నిర్మిస్తానన్నారు. ప్రతి దళిత కుటుంబానికి మూడు ఎకరాల భూమి ఇస్తానన్నారు. భూములు పంచకుండానే సాగునీటి ప్రాజెక్టులు నిర్మించి ఎవరి భూములు పారిస్తారు? అడగని జిల్లాల విభజనకు పూనుకోవడం వల్ల ఎవరికి ప్రయోజనం చేకూరుతుంది? అదే స్వదేశీ, విదేశీ కంపెనీలను పిలిచి మరీ ఫ్రీగా భూములిస్తామని తెలంగాణ ప్రభుత్వం ఆహ్వానిస్తోంది. పాలకులు ఎవరి ప్రయోజనాన్ని ప్రధానం చేసుకొని సాగుతున్నారు? ప్రజలను మాత్రం అయుత చండీయాగాలు, క్రిస్మస్, రంజాన్, యాదాద్రి, బతుకమ్మ, పుష్కరాల్లో ముంచి ఉంచుతున్నారు. అయినా కూడా ఎవరైనా ప్రశ్నిస్తున్నారనుకుంటే లిక్కర్ అందుబాటులో ఉంచి తాగిస్తూ వ్యసనపరులను చేసే సంస్కృతిని పెంచి పోషిస్తున్నారు. ఇంతచేసినా కూడా ఇంకెవరైనా వస్తే పోలీస్ శాఖ ఉండనే ఉంది. జిల్లాల పునర్వ్యవస్థీకరణ వల్ల ఉపాధి కలుగుతుందనుకుంటే పదవీ విరమణ చేసిన ఉద్యోగుల సేవలను కాంట్రాక్టు పద్ధతిన ఉపయోగించుకోవాలని భావిస్తోంది. కొన్ని శాఖలను రద్దుచేసి ఉన్న ఉద్యోగస్తులనే సర్దుబాటు చేయాలనేది ప్రభుత్వ నిర్ణయం.

ప్రజలకు పాలనా యంత్రాంగాన్ని దగ్గర చేయాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం జిల్లాల విభజనకు పూనుకున్నట్లు చెపుతోంది. అదనపు జిల్లాల ఏర్పాటు వలన జిల్లా కేంద్రాలు అందుబాటులోకి రావడం వల్ల ఖర్చు, సమయం తగ్గి ప్రజలకు కొంత ఉపశమనం కలుగవచ్చు గాని సమాజంలో మౌలికమైన మార్పుకు దోహదపడదు. ఒక రకంగా చెప్పాలంటే అవి పాలకులు అధికారంలో కొనసాగడానికి మాత్రమే తోడ్పతాయి. సమాజంలో వ్యవస్థాగత మార్పులు రాకుండా ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పులు రావు. దున్నేవారికి భూమి కావాలని ప్రజలు పెద్దఎత్తున చేసిన ఉద్యమాల ఫలితంగా ప్రభుత్వం ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 1973లో భూసంస్కరణల చట్టం తెచ్చింది. అందులో ప్రభుత్వం పంచింది ఎంత? పేదవారికి దక్కింది ఎంత? ఇక న్యాయస్థానాల తీర్పులను చూస్తే ఎవరు అధికారంలో ఉంటే వారికి అనుకూలంగా తీర్పులు వస్తుంటాయి. సరైన సాక్ష్యాలు లేవని కారంచేడు ఘటనలో దోషులను నిర్దోషులుగా వదిలివేసింది. 2002లో గుజరాత్‌లో సాగించిన మారణకాండపై కూడా సరైన సాక్ష్యాలు లేవనే సాకుతో సూత్రధారులను, పాత్రధారులను కోర్టు నిర్దోషులుగా సమాజం మీదికి వదిలివేసింది. అందుకే పాలకులు ప్రజలకు న్యాయం చేస్తారనేది ఉట్టి భ్రమ. ప్రజలే ఉద్యమించి సాధించుకోవాలనే విషయాన్ని గడిచిన 69 సంవత్సరాల పాలకుల చరిత్ర తేల్చింది.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

# సల్వాజుడుం కొత్త అవతారం 'అగ్ని'

***చత్తీస్‌గడ్‌లో అగ్ని పేరుతో పోలీసుల ప్రోద్బలంతో సల్వాజుడుం వంటి మరొక కొత్త సంస్థ పుట్టుకురావడం గురించి వివరిస్తున్నారు* రాజ్‌కుమార్ సోనీ**

బస్తర్‌లోని జగ్దల్‌పూర్‌లో సెప్టెంబర్ 17 శనివారం రోజున యాక్షన్ గ్రూప్ ఫర్ నేషనల్ ఇంటిగ్రిటీ (ఎజిఎన్ఐ – అగ్ని) అనే మావోయిస్టు వ్యతిరేక బృందం లల్‌కార్ ప్రదర్శన నిర్వహించింది. ఈ ప్రదర్శనలో వేలాది మంది పాల్గొన్నారు గాని జన సమీకరణ ద్వారా మావోయిస్టులకు సవాల్ విసరడానికి అగ్ని చేసిన ప్రయత్నం ఎదురుతిరిగినట్టుంది.

**పెద్ద ఎత్తున పోలీసు భాగస్వామ్యం**

ఈ రాజకీయ కార్యక్రమంలో పాల్గొనడానికి ఈ ప్రాంతానికి చెందిన ఎంతోమంది సీనియర్ పోలీసు అధికారులు పరుగెత్తి రావడం పట్ల చాల రాజకీయ పార్టీల నాయకులు, పౌరహక్కుల సంఘాల నాయకులు తమ అభ్యంతరాన్ని వ్యక్తం చేశారు. బస్తర్ పోలీస్ ఇనస్పెక్టర్ జనరల్ ఎస్ ఆర్ పి కల్లూరు, జిల్లా పోలీసు సూపరింటెండెంట్ ఆర్ ఎన్ దాస్ ఈ ప్రదర్శనను నిర్వహించడంలో చురుగ్గా కనబడ్డారు.

ఈ ప్రదర్శన ఆదివాసులను అణచివేసే వ్యూహంలో ఒకానొక భాగం మాత్రమేనని చత్తీస్ గడ్ బచావో ఆందోళన్ కన్వీనర్ ఆలోక్ శుక్లా అన్నారు. "మావోయిస్టులకు సందేశం పంపడానికి ఉద్దేశించిన ఈ ప్రదర్శన, ఆ పని చేయడానికి బదులు కేవలం స్థానిక పోలీసుల బల ప్రదర్శనగా దిగజారిపోయింది" అన్నారు.

"ఆ ప్రదర్శన సందర్భంగా చేసిన ఉపన్యాసాలు నక్సలైట్ సమస్యకు సామాజిక, రాజకీయ పరిష్కారాలు కనిపెట్టే ఆలోచనను రాష్ట్ర ప్రభుత్వం వదిలిపెట్టిందనే అభిప్రాయం కలిగించాయి. రాష్ట్ర ప్రభుత్వం సమస్త అధికారాన్నీ పోలీసులకు అప్పజెప్పినట్టుంది" అని ఆమ్ ఆద్మీ పార్టీ నాయకుడు సంకేత్ ఠాకూర్ అన్నారు.

ఆమ్ ఆద్మీ పార్టీ నాయకురాలు, ఆదివాసి కార్యకర్త సోనీ సోరి, "మావోయిస్టు వ్యతిరేక ఉద్యమం పేరుతో ఐ జి కల్లూరి తన రాజకీయ రంగ ప్రవేశానికి భూమిక సిద్ధం చేసుకుంటున్నట్టున్నారు" అన్నారు.

ఈ ప్రదర్శనలో పాల్గొన్న పోలీసు అధికారులు ప్రభుత్వోద్యోగులు పాటించవలసిన నమూనా ప్రవర్తనా నియమావళిని ఉల్లంఘించినట్టు కాదా అనే ప్రశ్నలు మిగిలే ఉన్నాయి. ఉద్యోగ నిబంధనల ప్రకారం ప్రభుత్వోద్యోగులు ఎవరైనా రాజకీయ కార్యక్రమాల్లో భాగం పంచుకోవడం నిషిద్ధం.

**భారీ ప్రదర్శన**

అగ్ని నాయకుడు ఆనంద్ మోహన్ మిశ్రా ఈ ప్రదర్శనలో బస్తర్ ప్రాంతంలోని ఏడు జిల్లాల నుంచి 50,000 మంది ప్రజలొ పాల్గొన్నారని అన్నారు. ఆయన చెప్పిన అంకె సరైనదేనా కాదా ధ్రువీకరించుకోవడానికి అవకాశం లేదు గాని, ప్రదర్శనలో పురుషులు, స్త్రీలు, చిన్నపిల్లలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు.

ప్రదర్శనలో పాల్గొన్న పాఠశాలల విద్యార్థులు నక్సలైట్లు బస్తర్ విడిచి వెళ్లిపోవాలని రాసి ఉన్న ప్లకార్డులను పట్టుకుని కనిపించారు. చాల మంది ఆదివాసులు కూడ తమ సాంప్రదాయిక సంగీత వాయిద్యాలతో ప్రదర్శనలో పాల్గొన్నారు. అయితే నిర్వాహకులు మాత్రం యువ కార్యకర్తలను ఆకర్షించడానికి ఆధునిక డిజె ను, ఆర్కెస్ట్రాను ఏర్పాటు చేశారు. అంతేకాక, ప్రదర్శనా స్థలంలో ఎన్నో చోట్ల 'సెల్ఫీ స్థలాలు' ఏర్పాటు చేశారు. మావోవాదియోం కో గావ్ సే భగావో, ముస్కురాతే హుయే ఫొటో ఖీంచ్వావో (మావోయిస్టులను గ్రామం నుంచి తరిమేయండి, చిరునవ్వులతో సెల్ఫీ ఫొటో తీయించుకోండి) అని చాల మంది పోలీసులు గ్రామీణ యువకులతో అనడం వినిపించింది.

**'మావోయిస్టులను తరిమేయండి'**

బస్తర్ ప్రజలు శాంతిని కోరుతున్నారని, కాని మావోయిస్టులు రాజ్యం మీద అన్యాయమైన యుద్ధం చేస్తున్నారని ప్రదర్శనలో చాల మంది ఉపన్యాసకులు నొక్కి చెప్పారు. విప్లవకారులకు ఆహారం ఇవ్వవద్దని, వారి అవసరాలు తీర్చవద్దని వక్తలు ప్రజలకు ఉద్బోధించారు.

ఎవరైనా నక్సలైట్లు తమ గ్రామంలోకి ప్రవేశిస్తే వారిని చితకబాది పోలీసులకు అప్పగించమని కూడ కొందరు అగ్ని నాయకులు ప్రజలకు సలహా ఇచ్చారు.

అయితే, ఈ సలహా చాల మందికి రుచించినట్టు కనబడలేదు. చత్తీస్ గడ్ శాసనసభలో ప్రతిపక్ష నాయకుడు టి ఎస్ సింగ్ దేవ్ ఇది చాల ప్రమాదకరమైన ప్రతిపాదన అని వ్యాఖ్యానించారు. సల్వా జుడుం ఉద్యమ సందర్భంలో కూడ పాలకులు ఇదేవిధంగా ఇవే చర్యలకు పౌరులను రెచ్చగొట్టారని ఆయన గుర్తు చేశారు. విప్లవ కార్యక్రమాలతో వ్యవహరించే సంపూర్ణ బాధ్యత పోలీసులది, భద్రతా సంస్థలది మాత్రమేనని ఆ తర్వాత సుప్రీం కోర్టు నిర్ద్వంద్వంగా ప్రకటించిందని కూడ ఆయన గుర్తు చేశారు. నక్సలైట్లకు వ్యతిరేకంగా సాధారణ పౌరులను రెచ్చగొట్టి ముందుకు తోయడం అనైతికం మాత్రమే కాదనీ, అది చట్టవ్యతిరేకం కూడానని ఆయన అన్నారు.

ఈ ప్రదర్శన అమాయక ఆదివాసులను యుద్ధం మధ్యలోకి తోసివేసే ప్రయత్నం మాత్రమేనని సింగ్ దేవ్ అభివర్ణించారు. "మావోయిస్టులతో పోరాడే బాధ్యత పౌరులదే అయితే, మరి బస్తర్ లో ఇంత పెద్ద ఎత్తున భద్రతా బలగాలను ఎందుకు మోహరించారు" అని ఆయన ప్రశ్నించారు.

**రాజకీయ నాయకుల గైర్హాజరు**

ప్రదర్శనలో పెద్ద సంఖ్యలో అధికారులు, వ్యాపారస్తులు, ఆదివాసులు, గృహిణులు ఉన్నప్పటికీ, రాజకీయ నాయకుల్లో అత్యధికులు మాత్రం ఈ ప్రదర్శనలో పాల్గొనకుండా దూరంగానే ఉండిపోయారు. రాష్ట్ర మంత్రివర్గంలో బస్తర్ కు ప్రాతినిధ్యం వహించే మంత్రులు, మహేశ్ గాగ్డా, కేదార్ కశ్యప్ ఇద్దరూ కూడ ప్రదర్శనకు హాజరు కాలేదు.

# అధ్వాన్న స్థితిలో వైద్య ఆరోగ్య రంగం

***కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అన్నీ ప్రభుత్వ వైద్యరంగాన్ని పూర్తిగా విస్మరించాయనీ, దానికి సామ్రాజ్యవాద, ప్రపంచీకరణ నూతన ఆర్థిక విధానాలనే ప్రధానమైన కారణమనీ అంటున్నారు* వికసిత**

దానా మాఝీ ఒడిశా రాష్ట్రంలోని కలహండి జిల్లా రాంపూర్ బ్లాక్ లోని గిరిజనుడు. అతని భార్య అమంగి క్షయవ్యాధికి గురైతే జిల్లా ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకుపోగా అక్కడ మరణించింది. భార్య శవాన్ని తీసుకుపోయేందుకు వాహనం ఇవ్వమని మాఝీ ఎంత ప్రాధేయపడినా హాస్పిటల్ వర్గాలు నిరాకరించగా, భార్య శవాన్ని భుజాన వేసుకుని మాఝీ, అతని కుమార్తె రాత్రంతా రోడ్డుపై నడుస్తూ వెళ్లారు. తండ్రీ కూతుళ్లు కుమిలి కుమిలి ఏడుస్తూ రాత్రంతా నడుస్తూనే పోయారు. మానవత్వం మంటకలిసిన ఈ సంఘటన దేశమంతటినీ కదిలించింది.

పేదవారి వైద్యం కోసం ప్రభుత్వం ప్రవేశపెట్టిన డజన్‌కు పైగా పథకాలేవీ మాఝీ కుటుంబానికి వర్తించలేదు. వాళ్లకు ఆరోగ్య బీమా లేదు. ఇంటి బీమా లేదు. నెలకు వెయ్యి నుంచి పదిహేను వందలు సంపాదించుకునే పేద రైతు మాఝీ. ఇందిరా ఆవాస్ లేదా ప్రధాన మంత్రి ఆవాస్ యోజనలో ఇతనికి ఇల్లు రాలేదు. రేకుల ఇంట్లో ఉంటారు. ఉపాధి హామీ పథకం డబ్బులు అక్టోబర్ నుంచి అందడం లేదు. వాళ్లకు దగ్గర్లోని పిఎచ్‌సిలో డాక్టర్ లేదు. సాదాసీదా పేదవానిగా బతుకుతున్న అతన్ని ఈ దేశ వైద్యవ్యవస్థ అవమానించింది. అందుకే ఈ వ్యవస్థ చెంప చెల్లుమనిపించేలా భార్య శవాన్ని మోసుకుని వెళ్లాడు. ఈ దేశ పేద ప్రజల సగటు ప్రతిరూపం మాఝీ.

అసలు భారతదేశంలో వైద్య వ్యవస్థ చాలా దయనీయమైన స్థితిలో ఉంది. ప్రభుత్వ రంగంలో వైద్యం పూర్తిగా అడుగంటిపోయి ఉన్నది. ప్రభుత్వ ఆసుపత్రుల సంఖ్య అవసరానికంటే చాలా తక్కువగా ఉన్నాయి. ప్రజలకు పూర్తిగా అవసరమైన బహుళజాతి కంపెనీల, సంస్థల, సాఫ్ట్‌వేర్ సంస్థల ఏర్పాటు కోసమై వేలాది ఎకరాలు ధారాదత్తం చేసే ప్రభుత్వాలు ప్రజలకు అతి ప్రధానమైన వైద్యాన్ని అందించేందుకు ఆసుపత్రులు కట్టడానికి మాత్రం చొరవ చూపవు. దేశం మొత్తంలోనూ ప్రభుత్వ రంగంలో ఉచితంగా వైద్యాన్ని అందించే ప్రభుత్వ ఆసుపత్రులు ప్రజావసరాలను ఏమాత్రం సంతృప్తి పరిచే స్థాయిలో లేవంటే ఇంతకంటే సిగ్గుపడాల్సిన అంశం మరొకటి ఉండదు.

నిజానికి స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి సుదీర్ఘ కాలం పరిపాలించిన క్రమంలో ప్రజారోగ్యాన్ని, వైద్యా రంగాన్ని తీవ్రంగా నిర్లక్ష్య పరిచింది. గ్రామీణ పేదలు ప్రధానంగా ఆధారపడే గ్రామీణ వైద్యం మొఖమైన చూడకుండా కాస్తో కూస్తో పట్టణ,

---

"బస్తర్‌లో మావోయిజం సమసి పోవాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటున్నారు. కాని అది బలప్రయోగం ద్వారా జరగదు. మావోయిస్టుల ముద్రవేసి ఆదివాసులను చంపుతున్న పోలీసులు ఇప్పుడు ప్రజల్లో తమకు మంచి పేరు తెచ్చుకునే కసరత్తు చేస్తున్నారు. అందుకే ఆ నాటకం నుంచి దూరంగా ఉండాలని నేను నిర్ణయించుకున్నాను" అని కాంకేర్ శాసన సభ్యుడు శంకర్ ధుర్వా అన్నారు.

భారతీయ జనతా పార్టీకి చెందిన జగదల్ పూర్ శాసన సభ్యుడు సంతోష్ బాఫ్నా ప్రభుత్వం సాగిస్తున్న నక్సలైట్ వ్యతిరేక ప్రయత్నాలను, చర్యలను ప్రశంసించారు. తనకు ఆరోజు ఇతర కార్యక్రమాలు ఉండడం వల్ల ప్రదర్శనలో పాల్గొనలేకపోయానన్నారు.

"నక్సలైట్ వ్యతిరేక కార్యకలాపాలలో బస్తర్ పోలీసులు ఎటువంటి పద్ధతులు ఉపయోగిస్తున్నారో" తనకు తెలిసినందువల్ల ఈ ప్రదర్శనలో పాల్గొనగూడదని తాననుకున్నానని కొండగావ్ శాసనసభ్యుడు మోహన్ మార్కం అన్నారు.

**ఆదివాసి సమస్యల ఊసే లేదు**

ప్రదర్శనలో ఒకరి తర్వాత ఒకరుగా వక్తలందరూ మావోయిజం మీద విమర్శలు గుప్పించారు. బస్తర్ పోలీసుల మీద భారీ ప్రశంసలు గుప్పించారు. కాని నక్సలైట్ వ్యతిరేక చర్యల పేరుతో ఆదివాసుల మీద సాగుతున్న వేధింపుల గురించి ఏ ఒక్కరూ ప్రస్తావించనైనా లేదు.

"ఈ మధ్యనే సోనీ సోరీ జరిపిన తిరంగా యాత్రకు జవాబుగా ఈ ప్రదర్శన జరిపారు. ఈ ప్రాంతం నుంచి నక్సలైట్లను నిర్మూలించాలని స్థానిక ప్రజలు కోరుతున్నారనే అభిప్రాయం కలిగించడానికి దేశభక్తి గీతాలు వినిపించారు, నినాదాలు చేశారు. కాని, ఈ సమస్య ఎలా పరిష్కారమవుతుందో సూచించడానికి ఏ ఒక్కరూ ప్రయత్నించలేదు. వారందరూ మావోయిస్టుల మీద కఠిన చర్యలు తీసుకోవాలనేవారే. కాని వక్తలలో ఏ ఒక్కరూ ఈ ప్రాంతంలో అభివృద్ధి రాహిత్యం వల్లనే మావోయిస్టులకు నిలువ నీడ దొరుకుతుందని చెప్పలేకపోయారు. తప్పుడు ఆరోపణల మీద వందలాది మంది ఆదివాసులు జైళ్లలో మగ్గుతున్నారనే అంశాన్ని అగ్ని నాయకులలో ఏ ఒక్కరూ లేవనెత్తలేదు" అన్నారు సామాజిక కార్యకర్త హిమాంశు కుమార్.

ఆదివాసులకు, ఆదివాసేతరులకు మధ్య ఘర్షణను తీవ్రతరం చేయడం కూడ ప్రదర్శనలో ఇమిడి ఉన్న మరొక అంశం.

ఈ ప్రదర్శనలో పాల్గొన్న మూకలు సమీప భవిష్యత్తులో ప్రమాదకరంగా పరిణమించగలవని పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్) రాష్ట్ర అధ్యక్షుడు లఖన్ సింగ్ ఆందోళన వ్యక్తం చేశారు. మావోయిస్టులకు వ్యతిరేకంగా పోరాడమని గ్రామస్తులకు పిలుపునిస్తూ ఇంటింటికీ ప్రచారం చేస్తామని అగ్ని ప్రకటించింది. చత్తీస్ గడ్ లో మరొక రూపంలో సల్వా జుడుం తిరిగి వస్తున్నదా?

*http://www.catchnews.com/india-news/salwa-judum-in-a-new-guise-agni-goads-bastar-villagers-to-go-after-maoists-1474295627.html/fullview* వీ

నగర ప్రాంతాలలో అదీ అరకొరగా ప్రభుత్వ వైద్యశాలలు ఏర్పాటు చేసింది. ఈ నిర్లక్ష్యం ఫలితంగా దాదాపు యాభై ఏళ్ల దాకా పల్లెలకు, పల్లె ప్రజలకు వైద్యం అందలేదు. 1991లో నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమైన తర్వాత ప్రపంచ బ్యాంక్ ఆదేశాలకు లోబడి ఆరోగ్యరంగ సంస్కరణలను ప్రవేశపెట్టి ఆ సంస్కరణల అమలుకు వివిధ రాష్ట్రాలకు ప్రపంచ బ్యాంక్ అప్పులు ఇవ్వడం మొదలు పెట్టాక ఆ అప్పులను కూడా ప్రభుత్వ వైద్యరంగాన్ని అభివృద్ధి చేయడం కోసం కాకుండా ప్రైవేట్ వైద్య సంస్థలకు సబ్సిడీలు, రాయితీలు ఇవ్వడానికి ప్రభుత్వాలు వాడడం మొదలు పెట్టాయి. తద్వారా కునారిల్లుతున్న ప్రభుత్వ వైద్య సంస్థలు మరింత దిగజారిపోగా, ప్రైవేట్ వైద్య సంస్థలు ప్రజల నుంచి ముఖ్యంగా పేద ప్రజల నుంచి డబ్బులు దండుకుని కార్పొరేట్ స్థాయికి ఎదిగిపోయాయి. ప్రభుత్వాల సహాయంతో ఎకరాల కొద్దీ భూములు కారుచౌకగా కొనివేసి, వాటిలో ఖరీదైన వైద్యాన్ని అందించే సంస్థాగత ఏర్పాట్లు చేసుకుని ప్రజలను పీల్చి పిప్పి చేయడం ప్రారంభించాయి. ప్రభుత్వంలోని, రాజకీయాలలోని నాయకులే అట్లాంటి కార్పొరేట్ వైద్య సంస్థలను ఏర్పాటు చేసి వైద్యాన్ని వ్యాపారంగా మార్చి వేశారు.

1995 వరకు దేశవ్యాప్తంగా ఈ కార్పొరేట్ వైద్య సంస్థల ట్రెండ్ ప్రారంభమైంది. ఈ ట్రెండ్ ప్రభావంతో ప్రభుత్వాల ఆలోచనల్లోనూ మార్పు వచ్చింది. ఆరోగ్యం అనేది సంక్షేమ రంగం కిందకు వస్తుందనే కోణంలో కాకుండా ఆరోగ్య, వైద్య రంగాలు వేగంగా పెద్దఎత్తున డబ్బులు తెచ్చిపెట్టే వ్యాపార రంగం కిందకు వస్తాయనే విధంగా ప్రభుత్వాలు ఆలోచించసాగాయి. ఈ ఆలోచనలు ఆచరణలో పెడుతూ ప్రభుత్వాలు క్రమంగా వైద్యరంగం నిర్వహణ బాధ్యతల నుండి తప్పుకోవడం ప్రారంభించాయి. ఇందుకు మరొక ప్రధానమైన కారణం ఏమిటంటే అప్పటికే దేశ అంతర్గత వ్యవహారాలలోకి తలదూర్చడం ప్రారంభించిన ప్రపంచ బ్యాంక్ లక్ష్యాల్లో అతి ముఖ్యమైన కార్పొరేట్ లేదా ధనిక వైద్యాన్ని దేశంలో సాధించేందుకు గాను ప్రభుత్వ వైద్యం లేదా ఉచిత వైద్యాన్ని బలహీనపరచడం అనేది మొదటిమెట్టు. కనుక ఆ పనిని ప్రారంభించాల్సిందిగా ప్రభుత్వాలపై పెట్టబడిన ఒత్తిడి ఒక ముఖ్యమైన కారణం. ఈ దరిమిలా 1991 మొదలు నేటి వరకు ప్రభుత్వ రంగంలో వైద్యం పూర్తిగా దెబ్బతిన్నది. కార్పొరేట్ వైద్యం ఎంతో ఎత్తుకు ఎదిగి పోయింది.

వైద్య ఆరోగ్యాలను ప్రజల వ్యక్తిగతమైన విషయంగా ప్రభుత్వాలు వదిలివేయడం అనేది దారుణమైన తప్పిదం. ప్రపంచంలోని చాలా దేశాలు, అందునా అనేక సంపన్న దేశాలలో ప్రజారోగ్యరంగ ఖర్చులో ఎక్కువ భాగం ప్రభుత్వానిదే. అమెరికా, జపాన్, స్విట్జర్లాండ్, జర్మనీ, బ్రిటన్ వంటి అనేక దేశాలు ప్రభుత్వ వాటాగా 60 నుంచి 80 శాతం ఖర్చు ప్రజారోగ్యం విషయంలో చేస్తున్నాయి. కానీ భారతదేశంలో మాత్రం అది 30 శాతం దాటలేదు. అంటే మొత్తం ఆరోగ్యరంగ ఖర్చులో ఈ దేశ ప్రజలు తమకు తాముగా తమ ఆరోగ్యం కోసం 70 శాతం ఖర్చును స్వంతంగా భరించుకుంటున్నారు. ప్రభుత్వం తరపున అందే సాయం ముష్టి 30 శాతం. భారతదేశం కంటే చిన్న దేశాలైన మలేషియా, థాయ్‌లాండ్, ఇరాక్, లిబియా వంటి దేశాలు, రష్యా, చైనా, క్యూబా వంటి మన దేశంతో సన్నిహిత సంబంధాలున్న దేశాలు కూడా 50కి తక్కువ కాకుండా ప్రభుత్వ వాటా శాతాన్ని దేశ ప్రజలకు అందిస్తున్నాయి. కానీ మన దేశంలో ప్రభుత్వాలు ఈ శాతాన్ని క్రమక్రమంగా తగ్గించి, ప్రైవేట్ పబ్లిక్ పార్ట్‌నర్‌షిప్ పేరిట కార్పొరేట్ సంస్థలకు, వ్యక్తులకు వైద్య రంగాన్ని అందించాలనే ప్రపంచబ్యాంక్ ఆదేశాలను అమలు చేస్తూ వస్తున్నాయి.

ప్రపంచ బ్యాంక్ ఈ ఆదేశాల అంతరార్థాన్ని మరింత విపులంగా చెప్పుకుంటే ప్రకృతిని, పర్యావరణాన్ని ధ్వంసం చేసే విధంగా దేశంలో బడా పరిశ్రమలు, కంపెనీలను నెలకొల్పి తద్వారా ప్రజల జీవితాలను, ఆరోగ్యాలను నాశనం చేసే విధంగా కుట్ర చేయడం, అట్లాగే ప్రయోగశాలల్లో తయారయ్యే బిటి, హైబ్రిడ్ విత్తనాల ద్వారా పురుగు మందుల సహాయంతో పండే పంటలను దేశీయ సహజ పంటల స్థానాలలో ప్రవేశపెట్టడం వంటి ప్రజా వ్యతిరేక పనులను ప్రభుత్వాలు ప్రోత్సహించేలాగా ప్రపంచ బ్యాంక్ పాలకులపై ఒత్తిడి పెట్టింది. తద్వారా ప్రజల ఆరోగ్యాలు నాశనమై, వాళ్లు ఆసుపత్రులకు వెళ్లడం ప్రారంభిస్తారు. ఇక అప్పటికే ప్రభుత్వ రంగంలో వైద్యాన్ని నిర్వీర్యం చేయాలనే షరతును ప్రపంచ బ్యాంక్ పెట్టడం, ప్రభుత్వాలు తలొగ్గడం జరిగిపోతాయి కనుక ప్రజలంతా పొలోమని ప్రైవేట్, కార్పొరేట్ ఆసుపత్రులకు పోతారు. అవి కళకళలాడుతూ ప్రజల నుంచి కోట్లకు కోట్లు దండుకుంటాయి. అట్లా దోచుకునే అవకాశం కల్పించినందుకు ప్రభుత్వ పెద్దలకు కమీషన్లు, లంచాలు సమర్పించుకుంటాయి. ప్రపంచ బ్యాంక్‌కు కృతజ్ఞతగా అది చెప్పిన కంపెనీల షేర్లలో వాటాలు తీసుకుంటాయి.

1991 నుంచి ఇదంతా చక్రీయంగా వైద్య ఆరోగ్య రంగంలో నడుస్తున్న ప్రక్రియ. ఉదాహరణగా ఫార్మా రంగాన్ని తీసుకుందాం. కేవలం ఫార్మా రంగం నుంచి ప్రభుత్వానికి ఏడాదికి వచ్చే ఆదాయం 12 శాతం కాగా కమీషన్లు, లంచాల రూపంలో కిందిస్థాయి నుంచి పై స్థాయి దాకా అవి సమర్పించే మొత్తం 46 శాతం. ఇక మిగిలిన 42 శాతం ప్రపంచ వ్యాప్తంగా నెలకొన్న బహుళజాతి సంస్థల షేర్ల కొనుగోలు మీద అవి జరిపే ఖర్చు. అంటే ఒక మందును మార్కెట్‌లో అమ్మాలంటే ఈ లెక్కలన్నీ కలుపుకుంటే ఆ మందు అసలైన తయారీ ఖర్చుకు అనేక రెట్లు పెంచి అమ్మాల్సి వస్తుంది. ఉదాహరణకు పారాసిటమల్ కాంబినేషన్‌లో ఉండే చిన్న పిల్లల జ్వరం తగ్గే మందు అసలు తయారీ ఖర్చు 11 నుంచి 16 రూపాయల మధ్య. కానీ మార్కెట్‌లో అట్లాంటి మందు ధరను గమనిస్తే 35 నుంచి మొదలై కంపెనీ పేరు ఆధారంగా ధర పెరుగుతూ పోతుంది. ఒకే కాంబినేషన్ మందు వేర్వేరు కంపెనీలలో వేర్వేరు తీవ్ర వ్యత్యాసమున్న ధరల్లో ఎందుకుంటాయని గానీ, అసలు ధరకంటే అమ్మకం ధర ఇంత ఎక్కువ ఎందుకు ఉంటున్నదని గానీ ప్రశ్నించుకుంటే సమాధానం పై దోపిడి శాతాల లెక్కలలో దొరుకుతుంది. ఆయా కంపెనీలు ఇచ్చే కమీషన్లు, లంచాలు, కొనే షేర్లు, మార్కెటింగ్ ఖర్చుల కోసమే అడ్డగోలు ధరలు పెట్టి, ప్రజల నుంచి డబ్బులు లాగుతున్నాయనే విషయం తెలుస్తుంది.

ఫార్మా సంస్థల దోపిడిలో ఇదొక చిన్న విషయం మాత్రమే. మందు తయారీ మొదలు మందు శరీరం మీద పనిచేసే వరకు, శరీరాన్ని మందు నియంత్రించే దశ ఏర్పడే వరకు ఫార్మా సంస్థల లీలలు వర్ణనాతీతం. పైగా ఈ మధ్య లైఫ్‌స్టయిల్ మెడిసిన్స్‌ను తయారు చేయడంపై ఈ కంపెనీలు ఎక్కువ దృష్టి పెడుతున్నాయి. జ్వరం, మలేరియా, కలరా వంటి గ్రామీణ ప్రాంతాల ప్రధాన వ్యాధుల మందులపై కంటే కూడా ఈ నగర ప్రాంత ప్రజల లైఫ్‌స్టయిల్ మందులలో లాభాలు ఎక్కువగా ఉంటాయి కనుక ఫార్మా కంపెనీలు ఇప్పుడు వాటి తయారీపైనే ఎక్కువ ఆసక్తి చూపుతున్నాయి.

ఆరోగ్య రంగాన్ని ప్రైవేటీకరించడం వల్ల ప్రజలు ఆరోగ్యంపై తీవ్రంగా ఖర్చు చేయాల్సి వస్తున్నది. దేశవ్యాప్తంగా రైతులు ఆత్మహత్యలు చేసుకోవడానికి వ్యవసాయం దెబ్బతినడం ప్రధాన కారణమే అయిననూ, రైతులు తమ కుటుంబాల కోసం ప్రైవేట్ ఆసుపత్రుల్లో ఏడాది పొడుగునా చేస్తున్న ఖర్చు అప్పు రూపేణా బాధించడం కూడా ఒక కారణం. సాధారణ ప్రజలు కూడా ఆరోగ్యంపై చేసే వ్యయం ఏటికేడు విపరీతంగా పెరిగిపోతూ వస్తున్నది. ఆరోగ్య రంగంలో ప్రైవేట్ పెట్టుబడులు

గణనీయంగా పెరుగుతుండడంతో చిన్న జబ్బుకైనా పెద్ద ఎత్తున డబ్బులు వెచ్చించాల్సి వస్తున్నది. సాధారణ జ్వరంతో కార్పొరేట్ ఆసుపత్రికి వెళ్తే జ్వరం గోళీ ఇవ్వడాన్ని ఆలస్యం చేసి, రకరకాల వైద్య పరీక్షలు చేసి, శరీరంలోని ఏదో ఒక భాగానికి ఏదో ఒక రోగాన్ని అంటగట్టి రోజుల తరబడి మనిషిని ఆసుపత్రి పాలు చేసే దుర్మార్గమైన దోపిడి ఈ రోజు ప్రైవేట్ ఆసుపత్రుల్లో కొనసాగుతున్నది. కాన్పు సులువుగా జరిగే అవకాశమున్ననూ సిజేరియన్స్ పైనే అవి ఆసక్తి చూపుతాయి. ఎందుకంటే సాధారణ కాన్పులతో డబ్బులు రాలవు కనుక. అట్లాగే ఫార్మా కంపెనీలతో నేరుగా కమీషన్ ఆధారిత సంబంధాలు ఆసుపత్రి వాళ్లకుంటాయి. ఇంతకు ముందు చెప్పుకున్నట్లుగా ఒక మందు తయారీకి ఎంఆర్‌పి ధరలో సగానికంటే కూడా చాలా తక్కువ ఖర్చు అవుతుంది. కానీ మందుల దుకాణంలో ఎంఆర్‌పి ధరకే అమ్ముతారు. అట్లా అమ్మగా వచ్చిన లాభంలో దాదాపు 20 నుంచి 40 శాతం వరకు ఆసుపత్రి వాళ్లు కమీషన్ తీసుకుంటారు. ఒక డాక్టర్ రాసిన మందులు అతని ఫార్మసిలోనే దొరికేటట్లు జాగ్రత్త తీసుకుంటారు. దాంతో రోగి నుంచి డబ్బులు గుంజడానికి మార్గం సులువైపోతుంది.

ఇకపోతే క్యాన్సర్, గుండెజబ్బు మొదలైన పెద్ద ఎత్తున డబ్బుగుంజే అవకాశమున్న రోగాలపై పెట్టినంత దృష్టిని ప్రైవేట్ వైద్య సంస్థలు ఏజెన్సీ ఏరియాల్లో ప్రబలే విష జ్వరాలపై పెట్టడంలేదు. ఏజెన్సీ సందర్భం వచ్చింది కాబట్టి ఇక్కడ మరొక ముఖ్య విషయాన్ని చెప్పుకోవాలి. ఏజెన్సీ అటవీ ప్రాంతాలలో గిరిజనులు, ఆదివాసులు ప్రతి సంవత్సరం విష జ్వరాల బారిన పడుతున్నారు. వర్షాకాలం అయితే అవి చాలా బాధాకరంగా ఉంటాయి. ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని బతుకు తుంటారు. జ్వరం, వాంతులు, విరేచనాలు, దోమకాట్లు, ఈగల ముసుర్లు, కలుషితమైన నీరు వంటివి పట్టణ, నగర ప్రాంతాల ప్రజలకు చిన్న విషయాలే గానీ, అవి ఆదివాసి గిరిజనులకు ప్రాణాంతకంగా తయారవుతాయి. మలేరియా, టైఫాయిడ్, బోదకాలు, క్షయ, డయేరియా వంటి చిన్నచిన్న రోగాలు అక్కడి వాళ్ల ప్రాణాలను ప్రతి సంవత్సరం బలికొంటాయి.

గిరిజన ప్రాంతాలలో మహిళలు ఎందరో ఇంత ఆధునాతన యుగంలో కూడా ప్రసూతి సమయంలో మరణిస్తున్నారు. గర్భస్రావాలు, సాంప్రదాయ పద్ధతిలో కష్టతరమైన ప్రసవాలు అనేక సంఖ్యలో ఆ ప్రాంతాలలో కనిపిస్తాయి. ఈ మహిళలకు గర్భిణి సమయంలో గానీ, రుతుక్రమం సమయంలో గానీ ఏ వైద్య సిబ్బందీ, ఏ ప్రభుత్వమూ అవగాహన కల్పించవు. అసలు ఈ ప్రాంతాలకు వైద్య సిబ్బంది రావడమే జరగదు. ఈశాన్య రాష్ట్రాలు, మధ్యప్రదేశ్, చత్తీస్‌గఢ్, తెలంగాణ, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలోనైతే ఈ పరిస్థితులు, గిరిజన ఆరోగ్య స్థితిగతులు మరింత అధ్వాన్నంగా ఉన్నాయి. అందుకే ఈ ప్రాంతాలలో ప్రజలు మూఢనమ్మకాలు, నాటు వైద్యాల వంటి వాటిని ఆశ్రయిస్తుంటారు. ఈ దేశానికి తిండి పెడుతున్న, ఈ దేశ వనరులను రక్షిస్తున్న, తాము దోపిడికి గురైనా, తాము హింసలకు గురైనా ఈ దేశ సంపదను పరిరక్షిస్తున్న అసలు సిసలైన దేశ భక్తులైన గిరిజనులు, ఆదివాసుల ఆరోగ్య స్థితి ఇంత దుర్భరంగా ఉన్నది.

ఇదంతా సరే, అసలు వైద్య ఆరోగ్య రంగాలు ఎట్లా ఉండాలో ఇప్పుడు చివరన చాలా క్లుప్తంగానైనా చెప్పుకోవాల్సిన అవసరముంది. ప్రజల వైద్యం, ఆరోగ్యం అనేవి ప్రభుత్వాలు నిర్వహించాల్సిన అత్యవసరమైన పనులు. అవి నెరవేర్చాల్సిన ముఖ్య బాధ్యతలు. వాటి నుంచి ప్రభుత్వాలు తప్పుకుని ప్రైవేట్, కార్పొరేట్ వైద్యాన్ని ముందుకు తేవడం అతి దుర్మార్గమైన విషయం. ఈ ప్రపంచీకరణ కాలంలో వైద్య రంగాన్ని మొత్తంగా ప్రభుత్వం నిర్వహించడం సాధ్యమేనా? అనే అనుమానాన్ని నివృత్తి చేసే ఒక చిన్న సాక్ష్యాన్ని చూద్దాం.

బస్తర్‌లో ఇవ్వాళ నడుస్తున్న ప్రజా ప్రభుత్వాలలో వైద్య రంగం అత్యద్భుతంగా, ఆదర్శ ప్రాయంగా పనిచేస్తున్నది. ఒకప్పుడు వ్యాధుల బారిన పడితే భూత వైద్యులను ఆశ్రయించే అక్కడి ప్రజలు ఇప్పుడు నట్టింట్లోకి శాస్త్రీయ వైద్యాన్ని తెచ్చుకోగలిగారు. చిన్న జ్వరానికైనా కావడమంచంపై పట్నానికి పోతూ దార్లోనే చనిపోయే దుస్థితి నుంచి ఊర్లోనే వైద్యాన్ని పొందగలిగారు. ఇదంతా బస్తర్ ప్రాంతానికి విప్లవోద్యమం ప్రవేశించాక విప్లవోద్యమం చొరవతో తమ పాలన తామే చేసుకునే ఆదివాసి జనతన సర్కార్‌లు ఏర్పడ్డాక ప్రస్తుతం అమలవుతున్న వ్యవస్థ. ఇక్కడ వైద్యం మొత్తం సర్కార్‌ల ఆధ్వర్యంలోనే నడుస్తుంది. గ్రామ సభలో వైద్య కార్యకర్తలను ఎన్నుకుని వారికి సర్కార్‌లోని అనుభవజ్ఞులైన వాళ్లు వ్యాధుల గురించి, మందుల గురించి శిక్షణనిస్తారు. అనుభవం వచ్చే వరకూ వారికి మెడికల్ టీం వాళ్లు సహాయం చేస్తారు. ఊర్లో ఎవరికి అనారోగ్యం ఎదురైనా ఆ గ్రామ డాక్టర్‌కు లేదా వైద్య కార్యకర్తలకు కబురు పెడతారు. ఆ డాక్టరే వాళ్లింటికి వెళ్లి వైద్యం చేస్తాడు. వారానికోసారి ఈ డాక్టర్లంతా కలిసి జట్టుగా ఏర్పడి సర్కార్ పరిధిలోని గ్రామాలన్నీ తిరిగి ఆయా గ్రామాల్లో పెద్ద జబ్బులున్న రోగులుంటే టీం వర్క్ అనుభవంతో వైద్యం చేస్తారు. వాళ్లకు అర్థం కాని జబ్బులకు ఏరియా మెడికల్ టీం వాళ్లు వచ్చి వైద్యం చేస్తారు. డివిజన్ మెడికల్ టీం, బ్యూరో (మూడు డివిజన్ల) మెడికల్ టీం, డి.కె (దండకారణ్య) మెడికల్ టీంలు కూడా ఏడాదిలో కొన్నిసార్లు ప్రతి ప్రాంతాన్ని తిరిగి వైద్య సేవలు నిర్వహిస్తుంటాయి. అన్ని టీంలలోని వైద్య కార్యకర్తలందరికీ వాళ్ల స్థాయిలను బట్టి ఎప్పటికప్పుడు ట్రైనింగ్స్ నిర్వహిస్తుంటారు.

జనతన సర్కార్‌లకు ముందు భారత ప్రజాస్వామ్య ప్రభుత్వం తరఫున ఒక్కనాడూ, ఒక్క డాక్టరూ ఈ ప్రాంతాల మొఖం చూడలేదు. అట్లాంటప్పుడు ఈ ప్రజలు ఆ ప్రభుత్వాన్ని లూఠీ సర్కార్ అనో, పాయక సర్కార్ అనో నిందిస్తే తప్పేమిటి? ఈ రోజు అక్కడి ప్రతి మారుమూల గూడేనికీ వైద్యం అందుబాటులో ఉన్నది. పూర్తి ఉచితంగా సర్కార్లు ప్రజలకు వైద్యాన్ని అందిస్తున్నాయి. ఊరికొక మెడికల్ కార్యకర్త ఉన్నాడు. వివిధ రకాల మెడికల్ టీంలు ప్రజల వద్దకు తరచూ వెళ్లి వైద్యాన్ని నిర్వహిస్తున్నాయి. స్థానిక చెట్ల మందులు, మూలికలు, అల్లోపతి మందులను గురించి, అవి ఏ వ్యాధికి ఉపయోగపడతాయనే సమాచారంతో కూడిన 'నాటెన్ డాక్టర్' అనే మెడికల్ గైడ్‌ను కూడా సర్కార్ ప్రచురించింది. నెలకొకసారి లేదా రెండు నెలలకొకసారి ప్రతి గ్రామానికి సర్కార్ మందులు పంపిణీ చేస్తుంది. నయంకాని వ్యాధులకు సర్కారే డబ్బు సాయం చేసి, బయటి హాస్పిటల్‌లలో వైద్యం చేయిస్తుంది.

ఇదంతా సువిశాల భారతదేశంలోని ఒకానొక చిన్న ప్రాంతంలో వైద్య రంగానికి సంబంధించిన అమోఘమైన అభివృద్ధి. చిన్నపాటి ప్రాంతీయ ప్రభుత్వాలు ఒక గట్టి లక్ష్యంతో, పట్టుదలతో సాధించిన ప్రగతి. కానీ లక్షలాది కోట్ల బడ్జెట్‌లుండి, దేశం మొత్తం మీద నిర్ణయాధికారం కలిగిన ప్రభుత్వం మాత్రం నిర్లక్ష్యంగా వైద్యాన్ని వదిలేసింది. ఈ నిర్లక్ష్యం ఫలితంగానే దానామాఝీ లక్షలు పోసి ప్రైవేటుకు పోలేక, ప్రభుత్వ ఆసుపత్రులకు పోతే అక్కడి బాధ్యతారాహిత్యం వల్లనే భార్య శవాన్ని మోసుకుని రోడ్డుమీదికి వచ్చాడు. ఈ స్వార్థ ప్రభుత్వాల మీద, వ్యవస్థల మీద ఛుపుక్కున ఉమ్మేసి, వాటికి దూరంగా నిస్వార్థంగా తన చిన్నపాటి లోకంలోకి మళ్లీ చేరిపోవడానికి కాలినడకన ప్రయాణమైనాడు. మాఝీ వేసిన ఉమ్మిని నిస్సిగ్గుగా తుడుచుకుని ప్రభుత్వం మళ్లీ లాభాలు, కమీషన్ల లెక్కల్లోకి వెళ్లిపోయింది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# కార్పొరేట్‌ల ప్రయోజనం కోసమే జిఎస్‌టి

*దేశంలో ప్రవేశపెట్టబోతున్న వస్తు సేవల పన్ను వల్ల దేశ ప్రజల మధ్య పెరిగిపోయిన అసమానతలు మరింత పెరిగి, అంతిమంగా గుత్తపెట్టుబడి సంస్థలకే ప్రయోజనం చేకూరుతుందని అంటున్నారు* **ఎ. నర్సింహా రెడ్డి**

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు 1991లో మొదలైన నాటినుంచే విలువ ఆధారిత పన్ను (వ్యాట్) ప్రవేశపెట్టాలని ప్రపంచబ్యాంకు షరతులు విధించింది. 1994లో సంస్థాగత సర్దుబాటు (స్ట్రక్చరల్ అడ్జెస్ట్‌మెంట్) కార్యక్రమానికి రుణమిచ్చిన సమయంలో మరోమారు ప్రపంచబ్యాంకు దేశవ్యాప్తంగా ఏకీకృత పన్ను వ్యవస్థను అమలు చేయాలని షరతు విధించింది. అప్పటి నుంచి ఏకీకృత మార్కెట్ ఏర్పాటుకు, పన్ను విధానాన్ని సరళీకరించి లాభాలను దండుకునేందుకు భారత దళారీ బడా పెట్టుబడిదారీ వర్గం, విదేశీ ద్రవ్య పెట్టుబడి సంస్థలు జిఎస్‌టి వ్యవస్థను అమలు చేయాలని పాలక వర్గాలపై ఒత్తిడి తెస్తూనే ఉన్నాయి. 2000లో వాజ్‌పేయి ప్రధానిగా ఉన్నప్పుడు వస్తుసేవల పన్ను (జిఎస్‌టి) బిల్లు తీసుకరావడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి. అయితే భారత రాజ్యాంగం ప్రకారం దేశమంతటా ఒకే పన్ను వ్యవస్థను అమలుచేసే అధికారం కేంద్ర ప్రభుత్వానికి లేనందున రాజ్యాంగ సవరణ అవసరం ఏర్పడింది. ఈ ప్రక్రియను యుపిఎ ప్రభుత్వం దశాబ్దం క్రితమే ఆరంభించింది. ఆనాడు గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్న నరేంద్ర మోడీ తీవ్రంగా వ్యతిరేకించడంతో ఆనాటి ప్రభుత్వం వస్తుసేవల పన్ను బదులు విలువ ఆధారిత పన్ను (వ్యాట్), కనీస ప్రత్యామ్నాయ పన్ను (మ్యాట్)ను ప్రవేశపెట్టింది.

ఈ జిఎస్‌టి ఆలోచనకు ఐఎంఎఫ్ డైరెక్టర్ల బోర్డులో భారత్ ప్రతినిధిగా పనిచేసి వచ్చి 2003లో అప్పటి ఎన్‌డిఎ సర్కారులో ఆర్థికమంత్రి జశ్వంత్‌సింగ్ సలహాదారుగా చేరిన విజయ్ కేల్కర్ పురుడు పోశారని చెప్పాలి. ఆయన నేతృత్వంలో ఏర్పడిన టాస్క్‌ఫోర్స్ వివిధ దేశాలు అమలుపరుస్తున్న పన్ను విధానాలనూ... సరుకులు, సేవలు రెండింటినీ కలుపుకుని అవి వేస్తున్న పన్నుల తీరునూ అధ్యయనం చేసి నివేదిక సమర్పించింది. సరుకులు,సేవలు రెండింటిని కలిపి ఒకే రకమైన పన్ను వసూలు చేసి ఆ ఆదాయంలో కేంద్రం, రాష్ట్రాలూ భాగం పంచుకోవచ్చునని తేల్చింది. పన్నులు విధించే స్వయం ప్రతిపత్తి కోల్పోతామని, తమ రెవెన్యూ పడిపోతుందని రాష్ట్రాలు భావించకుండా వాటి లోటు పూడ్చాలని కేంద్రానికి సూచించింది. 2009లో మన్మోహన్ ప్రభుత్వంలోని ఆర్థికమంత్రి పి. చిదంబరం కేంద్ర బడ్జెట్‌లో ఈ కొత్త పన్ను విధానం ప్రతిపాదనను ప్రకటించారు. ఆ మరుసటి సంవత్సరం బడ్జెట్‌లో కూడా జిఎస్‌టి అమలుకు 2010 ఏప్రిల్‌ను తుది గడువుగా పెట్టుకున్నట్టు తెలిపారు.

2014 మేలో నరేంద్ర మోడీ ప్రధాని కాగానే గత అభిప్రాయానికి భిన్నంగా వస్తుసేవల పన్ను బిల్లును చట్టం చేయడానికి కావల్సిన రాజ్యాంగ సవరణ చేయాలని, దీనివల్ల దేశ స్థూల జాతీయోత్పత్తి వార్షికంగా 2 శాతం పెరుగుతుందని, సామాన్య జనానికి ప్రయోజనం కలుగుతుందని, రాష్ట్రాల ఆదాయం పెరుగుతుందని, నల్లధనాన్ని అరికట్టవచ్చని, చెల్లించే పన్ను తగ్గిపోతుందని, పన్ను చెల్లింపు దారులు పెరుగుతారని, దీంతో ప్రభుత్వానికి పన్నుల ద్వారా వచ్చే ఆదాయం పెరుగుతుందని, వస్తువుల రవాణా వేగంగా తేలికగా చౌకగా జరుగుతుందని, దీనివల్ల ఆర్థిక వ్యవస్థకు జవసత్వాలు పెరుగుతాయని పచ్చి అబద్ధాలను మోడీ ప్రభుత్వం ప్రచారం చేయడం చాలా హాస్యాస్పదం.

పదేళ్లపాటు నానుతూ వచ్చిన వస్తు సేవల పన్ను (జిఎస్‌టి) చట్టం తీసుకొచ్చేందుకు అనుమతించే రాజ్యాంగ సవరణ ప్రక్రియ ముందుగా లోక్‌సభలో 2015 మేలో ప్రారంభమైంది. అక్కడ ఆమోదం పొందాక రాజ్యసభ ఆమోదం కోసం వచ్చింది. అయితే దిగువసభ (లోక్‌సభ) ఆమోదించిన సవరణ అసమగ్రంగా ఉందని, భారతదేశ ఫెడరల్ వ్యవస్థను, రాజ్యాంగం ద్వారా రాష్ట్రాలకు సంక్రమించిన హక్కులను ఉల్లంఘించే లాగున్నదని పెద్దల సభ (రాజ్యసభ) అభ్యంతరాలు తెలిపింది. బిల్లును సవరణలతో మెరుగు పర్చాల్సిన అవసరముందని రాజ్యసభ భావించింది. అందువల్ల రాజ్యసభ సభ్యులతో ఏర్పడిన 'సాధికారిక కమిటీ' లోక్‌సభ ఆమోదించిన రాజ్యాంగ సవరణ బిల్లుకు పలు సిఫార్సులతో కూడిన నివేదికను సమర్పించింది. సాధికారిక కమిటీ సిఫార్సులన్నింటిని మోడీ ప్రభుత్వం అంగీకరించాల్సి వచ్చింది. రాజ్యాంగ సవరణ బిల్లు లోక్‌సభలో పాసైన 14 నెలల తరువాత ఎట్టకేలకు ఆగస్టు 3న 122వ రాజ్యాంగ సవరణకు రాజ్యసభ ఆమోదం తెలిపింది. గతంలో లోక్‌సభ ఆమోదించిన జిఎస్‌టి బిల్లుకు రాజ్యసభలో మార్పులు జరిగినందున ఆగస్టు 8న లోక్‌సభ తిరిగి చర్చించి ఆమోదం తెలిపింది. ఈ రాజ్యాంగ సవరణ బిల్లుకు 17 రాష్ట్రాలు ఆమోదం తెలుపడంతో రాష్ట్రపతి సవరణ బిల్లును సెప్టెంబర్ 8న ఆమోదించారు. ఇక కేంద్ర జిఎస్‌టి, ఐజిఎస్‌టి బిల్లులను పార్లమెంటు, రాష్ట్ర జిఎస్‌టి బిల్లును శాసనసభలు ఆమోదించాలి. అప్పటికి గాని జిఎస్‌టి శాసన ప్రక్రియ పూర్తికాదు. వచ్చే ఏడాది ఏప్రిల్ 1 నుంచి అమలు చేయడానికి అన్ని ప్రయత్నాలు చేస్తామని ఆర్థికమంత్రి జైట్లీ ప్రకటించారు.

వస్తువులు, సేవలపై విధించే ఒకే ఏకీకృత పరోక్ష పన్ను విధానమే జిఎస్‌టి. దేశమంతటా ఒకే విధమైన పరోక్ష పన్ను విధానాన్ని అమలు చేసి, ఒకే మార్కెట్‌గా మార్చడమే వస్తు సేవల పన్ను (జిఎస్‌టి) లక్ష్యం. ఇది అమలులోకి వస్తే ఇంత వరకు ఉన్న ఎక్సైజ్, అమ్మకం, సర్వీసు

పన్నుల లాంటివన్నీ జీఎస్‌టిలో మిళితం అవుతాయి. జీఎస్‌టి నుంచి కొన్ని వస్తువులకు, సేవలకు మినహాయింపులు ఇచ్చారు. అందులో మద్యం, డీజిల్, పెట్రోల్, రియల్‌ఎస్టేట్ తదితరాలు ఉంటాయి. వివిధ పద్దుల కింద విధించబడిన ప్రత్యక్ష, పరోక్ష పన్నులు రద్దు చేసి ఒకే పన్నుగా సంఘటిత పరుస్తారు. వినియోగదారులు కొనుగోలు చేసే వస్తువులు, సేవలపై విధించే పన్ను ఇది. తమిళనాడు ప్రభుత్వం తప్ప మిగిలిన అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు జీఎస్‌టికి మద్దతు ఇస్తున్నాయని లోక్‌సభలో జైట్లీ చెప్పారు. అయితే జీఎస్‌టి కౌన్సిల్ ఏర్పాటుకు తమిళనాడుతో సహా చాలా రాష్ట్రాలు వ్యతిరేకిస్తున్నాయని ఆర్థిక మంత్రుల సమావేశానికి సంబంధించిన నివేదిక తెలియజేస్తున్నది.

పన్నులు రెండు రకాలు, ఒకటి ప్రత్యక్ష పన్నులు, రెండు పరోక్ష పన్నులు. ప్రత్యక్ష పన్నులంటే ఆదాయంపై విధించేవి. ఆదాయం పొందిన వెంటనే ఆదాయంలో కొంత భాగాన్ని పన్నుగా చెల్లించాలి. ఇది వ్యక్తులుగానూ, అవిభాజ్య హిందూ కుటుంబంగానూ, కంపెనీలుగానూ ఆదాయపు పన్ను చెల్లించాలి. పరోక్ష పన్నులు ఆదాయంపై ప్రత్యక్షంగా కాకుండా, ఆదాయంతో జరిగే కార్యకలాపాలపై పరోక్షంగా విధించేవి. ఉదా: వచ్చిన ఆదాయంతో దేనినైనా కొనుగోలు చేస్తే, దానిపై అమ్మకం పన్ను చెల్లించటం ఆదాయం నుండే జరుగుతుంది. ఈ పరోక్ష పన్నులు అనేక రూపాలలో ఉంటాయి : ఉత్పత్తి (ఎక్సైజ్), అమ్మకాలు (అమ్మకపు పన్ను), రవాణా (ఆక్ట్రాయ్ లేదా ప్రవేశ పన్ను), దిగుమతుల (కస్టమ్స్) పై విధించబడతాయి. ఇవికాక వినోదపు పన్ను, సెస్సులు, సర్‌ఛార్జీ వంటి ఇతర రూపాల పన్నులు కూడా ఉంటాయి. ఏదైనా చివరకు వినియోగదారుల రూపంలో ప్రజలు తమ ఆదాయం నుండి చెల్లించవలసి వస్తుంది. జీఎస్‌టి విధింపు వల్ల స్థూల దేశీయ ఉత్పత్తిలో పరోక్ష పన్నుల శాతం పెరుగుతుంది అని ప్రభుత్వం చెప్పటమంటే సరుకుల ధరలు పెరుగుతాయి. ఎందుకంటే ఉత్పత్తి అయిన ప్రతి సరుకు మీదా పన్ను పెరిగితేనే స్థూల దేశీయ ఉత్పత్తిలో పన్ను నిష్పత్తి పెరుగుతుంది. అప్పుడు జీఎస్‌టి వల్ల ధరలు తగ్గుతాయని చెప్పటం పచ్చి అబద్ధం.

పరోక్ష పన్నులు మూడు రకాలు. నిర్దిష్టం, అడ్‌వాలోరెమ్ (అమ్మకం ధరలో శాతం), విలువ ఆధారిత రూపాలలో ఉంటాయి. మొదటిది, నిర్దిష్ట రూపంలో పన్ను సులభం. ఫలానా సరుకుపై ఫలానా శాతం పన్ను అని విధించటం, వసూలు చేయటం సులభం. పరోక్ష పన్నులలో ఎక్కువ భాగం ఈ రూపంలోనే ఉంటాయి. దీనివల్ల పన్ను ఆదాయం స్థిరంగా ఉంటుంది. ప్రతి ఏడూ వీటిపై పన్ను రేట్లు పెంచుకుంటూపోతే తప్ప పన్ను ఆదాయం పెరగదు. రెండోవది అడ్‌వాలోరెమ్ వల్ల పన్ను ఆదాయం పెరుగుతూ పోతుంది. వివిధ కారణాల వల్ల సరుకు ధర పెరిగినప్పుడల్లా, ఈ పన్నురేటు పెంచకుండానే పన్నుల నుండి ఆదాయం పెరుగుతుంది. చమురు ధర పెరిగినప్పుడల్లా, దాని నుండి పన్ను ఆదాయం పెరగటం దీనికొక ఉదాహరణ. కనుక నిర్దిష్టరూప పన్ను నుండి అడ్‌వాలోరెమ్ రూపంలోకి మార్చడానికి పాలకులు ప్రయత్నాలు చేస్తారు. దీనివల్ల ఆ సరుకు అంతిమ ధరలు (వినియోగదారులు చెల్లించే ధరలు) పెరుగుతూ పోతాయి. ఇంతేకాక లాభం పెంచుకునేందుకు ఉత్పత్తిదారులు సరుకు ధర పెంచినప్పుడల్లా పన్ను పెరుగుతుంది. ఆ విధంగా లాభాలూ, పన్ను కూడా పెరిగి వినియోగదారులపై భారం పెరుగుతుంది. మూడవది వ్యాట్, కేవలం వస్తువులపైనే పన్ను విధిస్తారు. ఇది ఉత్పత్తి జరిగిన ప్రతిస్థానం నుంచి చిల్లర వర్తకుని చేరేవరకు ప్రతి దశలో పన్ను విధిస్తారు. ఇది అన్ని రాష్ట్రాలలో ఒకే విధంగా లేదు.

జీఎస్‌టి రేటు ఏవిధంగా ఉండాలన్న దానిపై ఆర్థిక నిపుణులు, ఆర్థిక సంస్థలు పలు సూచనలు, సిఫారసులు చేశాయి. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఫైనాన్స్ అండ్ పాలసీ (ఎన్ఐపిఎఫ్‌పి).. మూడంచెల పన్నురేట్లను అమలు చేస్తే సరాసరి పన్నురేటు 23 నుంచి 25 శాతం ఉండొచ్చని పేర్కొంది. ఒకేవిధమైన పన్నురేటును విధించాల్సి వస్తే 18 నుంచి 19 శాతంగా ఉండాలని సూచించింది. 13వ ఆర్థిక సంఘానికి నేతృత్వం వహించిన మాజీ ఆర్థిక కార్యదర్శి విజయ్ కేల్కర్ 18 శాతం పన్ను రేటును సూచించారు. ప్రభుత్వం గత రెండు దశాబ్దాల కాలంలో కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు విధించిన పన్నులపై చర్చించి జీఎస్‌టీని స్థిరీకరించేందుకు రాష్ట్రాల ఆర్థిక మంత్రులతో 'సాధికారిక కమిటీని' ఏర్పరిచింది. కమిటీ సూచనలు ఇంకా రావల్సి ఉంది. మరోవైపు ప్రధాన ఆర్థిక సలహాదారు అరవింద సుబ్రమణ్యన్ అధ్యక్షతన ఏర్పడిన జీఎస్‌టి బృందం కూడా మూడంచెల పన్ను వ్యవస్థనే సిఫారసు చేసింది. పేద వర్గాలు వినియోగించుకొనే వస్తువులపైన 12 శాతం, అత్యధిక వస్తువులపైన ప్రామాణికమైన 17-18 శాతం, విలాస వస్తువులపై 40 శాతం పన్ను విధించాలని సిఫారసు చేసింది. ఎక్కువ మంది ఆర్థిక వేత్తలు 20 శాతానికి మించకుండా 16 శాతానికి తగ్గకుండా జీఎస్‌టి విధించాలని సూచిస్తున్నారు.

కేవలం పరోక్ష పన్నుల వ్యవస్థపైనే దృష్టంతా కేంద్రీకరించి, దాన్నుంచి మరింత పిండుకోవడం ఎలా అన్న ఆలోచనే జీఎస్‌టికి మూలం. నేరుగా సంపన్నులను ప్రభావితం చేసే ప్రత్యక్ష పన్నుల జోలికి మాత్రం ఎవరూ వెళ్లరన్నది సత్యం. అలాగే పన్నులకు సంబంధించి రాజ్యాంగం రాష్ట్రాలకు కల్పించిన హక్కులను తనకు దఖలు పరుచుకోవడం ద్వారా కేంద్రం ఫెడరల్ స్ఫూర్తికి విఘాతం కల్గిస్తోంది. జీఎస్‌టి పర్యవసానంగా కేంద్రం విధిస్తున్న ఏడెనిమిది రకాల పన్నులు రద్దు కావడంతోపాటు రాష్ట్రాలకు ప్రధాన ఆదాయ వనరుగా ఉండే రకరకాల పన్నులు రద్దవుతాయి. దీనికి బదులు రాష్ట్ర ప్రభుత్వాలకు జీఎస్‌టిలో కేంద్రం ఇచ్చే వాటా మాత్రమే వస్తుంది. తయారీ రంగంలో ముందంజలో ఉన్న తమిళనాడు వంటి రాష్ట్రాలకు సమస్యలు ఎదురవుతాయి. అందువల్లే ఆ రాష్ట్రం ప్రభుత్వం జీఎస్‌టి బిల్లును గట్టిగా వ్యతిరేకించింది. ఇది అమలైతే తమకు ఏటా రు. 9,270 కోట్ల నష్టం వాటిల్లుతుందని ఆ రాష్ట్రం చెబుతోంది. తొలి అయిదేళ్లూ ఆ లోటును పూడుస్తామని కేంద్రం ఇస్తున్న హామీని తోసిపుచ్చుతోంది. ఆ తర్వాత సంగతేమిటని అడుగుతోంది. అలాగే తెలంగాణ ప్రభుత్వానికి రు. 5000 కోట్లు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి రు. 4700 కోట్లు నష్టం వాటిల్లుతుందని అంచనా.

అభివృద్ధి చెందిన దేశాలైన ఆస్ట్రేలియా, కెనడాలతో పాటు పలు దేశాల్లో జీఎస్‌టి అమలువల్ల అక్కడి ఆర్థిక వ్యవస్థకు పలు సవాళ్లను కూడా విసురుతోంది. అక్కడ రాష్ట్రాల ప్రజలకు అందించే సేవల పరిధి తక్కువ. ప్రధాన సేవలు కేంద్ర సర్కారు అందిస్తుంది. అయితే మన దేశంలో ప్రజా విధి నిర్వహణ విధానం వేరు. ఇక్కడ ప్రధాన ప్రజావసరా లన్నింటినీ రాష్ట్రాలే సమకూర్చుతున్నాయి. స్థానిక సేవల్లో కేంద్రం పాత్ర

అంతంతే. ఈ నేపథ్యంలో సేవలు సరిగ్గా లేకుంటే ప్రజలు స్థానిక ప్రభుత్వాలనే నిందించి, ప్రశ్నించే అవకాశం ఉంది. ఇది రాష్ట్ర ప్రభుత్వాలకు కొత్త తలనొప్పిగా మారే అవకాశం ఉంది. పలు కీలక సమస్యలతో కూడిన జిఎస్‌టి పన్ను విధానం విభిన్న ఆర్థిక నేపథ్యాలతో కూడిన రాష్ట్ర ప్రభుత్వాలకు మేలు చేస్తుందా? అంటే... సందేహమే. జిఎస్‌టి అమలు కారణంగా రాష్ట్రాలకు ఎదురయ్యే నష్టాన్ని మొదటి అయిదేండ్లు పూరిస్తామంటూ సర్కారు చెబుతున్నప్పటికీ రెవెన్యూ లోటులో సతమతమవుతున్న కేంద్ర సర్కారుకు ఇది అంత సులువైన విషయం కాదు.

ప్రస్తుతం రాష్ట్రాలకు పన్నుల ద్వారా వస్తున్న ఆదాయాన్ని ఎంతో కొంత కోల్పోవటం అనేది సమస్య కాదు. కానీ, రాష్ట్ర ప్రభుత్వాలు భవిష్యత్తులో తమకు తోచిన రీతిలో ఆదాయాన్ని పెంచుకునే స్వేచ్ఛను కోల్పోవడమనేదే ప్రధాన సమస్య. మన దేశ ఫెడరల్ వ్యవస్థలో పరస్పరం సంబంధంలేని అనేక రాజకీయ పార్టీలు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలను ఏర్పాటు చేయటం జరుగుతోంది. ఆర్థిక విధానాలను తమ దృక్పథాల కనుగుణంగా రూపొందించుకునే స్వేచ్ఛ వాటికుండటం వలన కొన్ని ప్రభుత్వాలు 'ఆర్థికాభివృద్ధి' కోసం పెట్టుబడులను ఆకర్షించటానికి పన్ను రాయితీలను ఇస్తున్నాయి. మరికొన్ని ప్రభుత్వాలు పన్నులను పెంచి సంక్షేమ కార్యకలాపాలపై లేక విద్య, ఆరోగ్యం వంటి సామాజిక రంగాలపై వ్యయాన్ని పెంచాలని భావిస్తున్నాయి. వేరేమాటల్లో చెప్పాలంటే రాష్ట్ర ప్రభుత్వాలు తమకు నచ్చిన విత్త విధానాలను రూపొందించుకునే అవకాశం ఇప్పటివరకు ఉంది. ప్రస్తుత ప్రతిపాదిత జిఎస్‌టి ఈ స్వేచ్ఛను హరిస్తుంది.

జిఎస్‌టి విధానం పర్యవేక్షణకు కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ నేతృత్వంలో రాష్ట్రాల ప్రతినిధులు సభ్యులుగా ఉండే జిఎస్‌టి కౌన్సిల్ ఏర్పాటు చేస్తారు, కేంద్ర ఆర్థిక మంత్రి ఈ కౌన్సిల్‌కు చైర్మన్‌గా వ్యవహరిస్తారు. రెవిన్యూ, ఆర్థిక శాఖల బాధ్యత నిర్వహిస్తున్న కేంద్ర సహాయమంత్రి, రాష్ట్రాల ఆర్థిక, రెవిన్యూ మంత్రుల్లో ఒకరు లేదా రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకంగా నియమించిన వారు సభ్యులుగా ఉంటారు. ప్రతి రాష్ట్రానికి కౌన్సిల్‌లో ఆ రాష్ట్ర విస్తీర్ణంతో సంబంధం లేకుండా ఒక్కో ఓటు మాత్రమే ఉంటుంది. నాలుగింట మూడు వంతుల ఓట్లు ఆధారంగా జిఎస్‌టి కౌన్సిల్ నిర్ణయాలు తీసుకుంటుంది. మొత్తం ఓట్లలో కేంద్రానికి మూడింట ఒక వంతు ఓట్లు, రాష్ట్రాలకు మూడింట రెండు వంతుల ఓట్లు ఉంటాయి. కేంద్రం వీటో హక్కును సైతం రిజర్వ్ చేసుకున్నది. ఈ విధానంలో ఒక్కో రాష్ట్రానికి ఒక ఓటు మాత్రమే ఉన్నందువల్ల జిఎస్‌టి రూపంలో అధిక మొత్తంలో ఆదాయం అందించే రాష్ట్రాలకు మాట చెల్లుబాటు ఉండదు. అలాగే చిన్న రాష్ట్రాల ప్రత్యేక అవసరాలకు కూడా గండి పడుతుందన్న భయం ఉంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సభ్యులుగా ఉన్న జిఎస్‌టి కౌన్సిల్ రాజ్యాంగేతర సంస్థ. రాష్ట్ర ప్రభుత్వాలకు రాజ్యాంగం ఇచ్చిన హక్కులను ఈ సంస్థ హరిస్తుంది. ఇది అధికారాలను కేంద్రీకృతం చేసే చర్య. ఈ చర్యను అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఒప్పుకున్నప్పటికీ దీనితో రాజ్యాంగ 'మౌలిక నిర్మాణం' దెబ్బతింటుంది.

జిఎస్‌టి పరోక్ష పన్ను, సాధారణంగా పరోక్ష పన్నులు సంపన్నుల కన్నా పేదల మీద అధికంగా భారం వేస్తాయి. భారత్‌లో పరోక్ష, ప్రత్యక్ష పన్నుల నిష్పత్తి 65:35 ఉంది. ఇది సరిగ్గా పలు సంపన్న దేశాల్లో అమలులో ఉన్న విధానానికి పూర్తిగా విరుద్ధం. జిడిపిలో పన్నుల శాతం విషయానికి వస్తే ప్రత్యక్ష పన్నుల విషయంలో ప్రపంచంలోనే అతి తక్కువ నిష్పత్తి మన దేశంలోనే ఉంది. మన దేశంలో జిడిపిలో ప్రత్యక్ష పన్నుల వాటా నాలుగు శాతం మాత్రమే. ఈ మధ్య కాలంలో ప్రత్యక్ష పన్నులు నానాటికీ తగ్గుతుంటే పరోక్ష పన్నుల భారం పెరిగిపోతూ వస్తోంది. 1990 దశకంలో ఐదు శాతం ఉన్న సర్వీసు టాక్స్ ప్రస్తుతం 15 శాతానికి పెరగడమే ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణ. ఈ మధ్య కాలంలోనే స్వచ్ఛ భారత్ సెస్, ఎడ్యుకేషన్ సెస్సు వంటి అదనపు పరోక్ష పన్నులు విధించారు. పెట్రోల్, డీజిల్‌పై ఎక్సైజు సుంకాలు నిలకడగా పెరుగుతున్నాయి. పన్నురేట్లపై ఒక పరిమితి విధిస్తే తప్ప ప్రభుత్వాల ఈ దాహానికి అడ్డుకట్ట పడదు. ఇలాంటి పరిమితి విధించకపోతే జిఎస్‌టి రేటు కూడా పెరిగిపోతూ ఆదాయ అసమానతలు పెరిగిపోయేందుకు దోహద పడుతుంది.

వ్యాట్ ప్రవేశ పెట్టినప్పుడు దానిలో నాలుగు రకాల పన్ను రేట్లు ఉండేవి. అదే జిఎస్‌టిలో ఒకే ఒక పన్ను రేటు ఉండటం చాలా తీవ్రమైన విషయం. ఒకవేళ ఒకే ఒక రాష్ట్ర వస్తుసేవల పన్ను (ఎస్‌జిఎస్‌టి)ని ప్రతిపాదించి ఆ పైన రాష్ట్ర ప్రభుత్వాలు తమకు ఇష్టమైన రేట్లను పెట్టుకునే అవకాశం కల్పించి ఉంటే రాష్ట్ర ప్రభుత్వ అధికారాలు అంతగా దురాక్రమణకు గురై ఉండేవికావు. అయితే దీనిని ఎన్‌డిఏ ప్రభుత్వం ప్రతిపాదించటం లేదు. ఇంతకుముందున్న మన్మోహన్ ప్రభుత్వం కూడా ఈ ప్రతిపాదన చేయలేదు. వాళ్ళుకూడా సెంట్రల్ గూడ్స్ అండ్ సర్వీసెస్ టాక్స్ (సిజిఎస్‌టి) సరసన ఏకరూప స్టేట్ గూడ్స్ అండ్ సర్వీసెస్ (ఎస్‌జిఎస్‌టి) రేటును ప్రతిపాదించారు. అంతర్ రాష్ట్ర లావాదేవీలు ఇంటర్ స్టేట్ గూడ్స్ అండ్ సర్వీసెస్ ట్యాక్స్ (ఐజిఎస్‌టి). ఏకరూప ఎస్‌జిఎస్‌టి రేటును జిఎస్‌టి కౌన్సిల్ నిర్ణయిస్తుంది. ఇది ఫెడరల్ నిర్మాణంపై దారుణమైన దురాక్రమణ. రాష్ట్ర ప్రభుత్వాల అధికారాలను జిఎస్‌టి హస్తగతం చేసుకునే ప్రయత్నానికి వ్యతిరేకంగా కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తమ గళాన్ని విప్పటం, తద్వారా ఏకరూప పన్ను రేటును వ్యతిరేకించటం ఆహ్వానించదగిన విషయం.

జిఎస్‌టి బిల్లుకు సంబంధించిన వివిధ అంశాలపై అనేక సందేహాలు తలెత్తుతున్నాయి. తదుపరి బడ్జెట్ ద్వారా గాని లేక ఆ తదుపరి గాని జిఎస్‌టి అమలు జరిపినట్లయితే ద్రవ్యోల్బణంపై అననుకూల ప్రభావం పడుతుందని దాదాపు ఆర్థికవేత్తలందరూ అంగీకరిస్తున్నారు. ద్రవ్యోల్బణం కచ్చితంగా పెరుగుతుంది. ఇప్పటికే చుక్కలనంటిన నిత్యావసరాల ధరలు గణనీయంగా పెరిగి సామాన్య ప్రజల జీవితాలను దుర్భరం చేస్తాయి. బిల్లుపై చర్చ సందర్భంగా ప్రతి ఒక్కరూ అధిక ధరల పట్ల ఆందోళన వ్యక్తం చేశారు. ప్రజలు ఇబ్బందులను ఎదుర్కొంటున్నారని అంగీకరించారు. అయినప్పటికీ ధరలను అదుపు చేసేందుకు చర్యలు చేపడతామని ప్రభుత్వం నుండి ఎట్టి సూచనలు రాలేదు. ధరలు తగ్గుతాయని జనాంతికంగా చెప్పేశారు తప్ప దీనివల్ల ధరలెలా ప్రభావితమవుతాయి? వినియోగదారులు దీన్ని భరించగలరా? వంటి అంశాలు చర్చకు నోచుకోలేదు.

అంగీకృత 18 శాతానికి మించి జిఎస్‌టి రేటు పెంపుదల చేయబోమని సభకు హామీ ఇవ్వడంలో ఆర్థిక మంత్రి విఫలమయ్యారు. ఈ దేశ ప్రజలను దోచుకునేందుకు జాతీయ, అంతర్జాతీయ కార్పొరేట్‌లను అనుమతించటం ద్వారా సామాన్య ప్రజలపై ఆర్థిక

# సుప్రీం తీర్పులపై ప్రజా పోరాట ప్రభావం

***ప్రైవేట్ సంస్థలకు అప్పగించిన పంట భూములను సాధించుకోవడానికి ప్రజలు చేసిన పోరాట ఫలితమే సుప్రీంకోర్టు తీర్పనీ, ఇది పాలకులకు చెంపపెట్టు, ప్రజలకు ఊరట అనీ అంటున్నారు*** **డా. ఎ. పున్నయ్య**

మనిషికి భూమికి మధ్య ఆదిమకాలం నుండి అపారమైన సంబంధం ఉంది. భూమిని మనిషి తన నుండి ఎప్పుడు వేరుగా చూడలేదు, చూడడు కూడా. ఎందుకంటే తన ప్రాథమిక అవసరాలకు తరగని సంపదగా ఆహారోత్పత్తికి ఉత్పత్తి కేంద్రంగా ఉత్పాదకశక్తిగా ఆరాధిస్తాడు కాబట్టి, మనిషికి భూమితో విడదీయలేని సంబంధం ఏర్పడింది. అందుకే మాకేవెల్లి తన ప్రిన్స్ గ్రంథంలో పేర్కొన్నట్లు మనిషి తనకు జన్మనిచ్చిన తండ్రి మరణాన్నైనా మరిచిపోతాడు కాని, తన భూమిలో అంగుళం జారిపోయినా భరించడనేది యధార్థం.

సమూహాలుగా జీవిస్తూ పొదుపు సంస్కృతి తెలియని ఆదిమ సమాజంలో ఇది నాది అనిగాని ఇంతవరకు నాదే అనిగాని మనిషికి భూపరిమితిలేదు. కాలక్రమంలో అంగబలం ఆధారంగా తమ అవసరాలమేరకు ఆహార లభ్యతను బట్టి ప్రాంతానికి అవధులు ఏర్పాటు చేసుకోవడం క్రమంగా భూస్వామ్య వ్యవస్థకు అడుగులు పడ్డాయి. అనంతరం బలహీన సమాజాల ఆధ్వర్యంలో ఉన్న భూములను ఈ భూస్వామ్య భావజాలం ఆక్రమించింది. ఈ భూస్వామ్య వ్యవస్థ ఆ సమాజాలను బానిస సమాజాలుగా సృష్టించింది. క్రమంగా భూమికోసం పోరాటాలు విస్తృతమైనవి. ఈ భూస్వామ్య వ్యవస్థే పెట్టుబడిదారీ వ్యవస్థగా పరిణామం చెందిన తర్వాత ప్రజాస్వామ్య ప్రభుత్వాలు కూడా పెట్టుబడిదారుల కొమ్ముగాయడం వారికి అవసరమైన భూవనరులను సమకూర్చడమే పనిగా పెట్టుకున్నాయి. దానికి ప్రభుత్వాలు పారిశ్రామికీకరణ, అభివృద్ధి అనే పేరుతో పైన చెప్పిన సామాన్య బలహీన వర్గాల చేతిలో ఉన్న జీవనాధారమైన భూములను వారికి కట్టబెట్టడానికి సిద్ధపడ్డాయి. ఈ క్రమంలో మొదలైన తిరుగుబాటులో "దున్నేవాడికే భూమి" ఉండాలన్న ఒక నినాదం ప్రబలంగా ముందుకొచ్చింది. దానితో అనేక పోరాటాలు భూపోరాటాలుగా రూపాంతరం చెందినాయి.

**ఆధునిక ప్రభుత్వాల తీరు**

ప్రభుత్వాలు అభివృద్ధి అంటే పట్టణీకరణ, పారిశ్రామికీకరణేనని భావించాయి. వ్యవసాయాభివృద్ధిని త్రోసిరాజని బడా పారిశ్రామిక వేత్తలకు, బహుళజాతి కంపెనీలకు భూములను సేకరించి ఇవ్వడం భూనిర్వాసితుల ప్రయోజనాలతో సంబంధం లేకుండా భూములు కట్టబెట్టడం కోసం ప్రత్యేక ఆర్థిక మండలాల (ఎస్ఇజెడ్) పేర నిర్బంధ భూసేకరణకు పూనుకున్నాయి. ఆ క్రమంలో వచ్చినవే ఆంధ్రప్రదేశ్‌లో పోలెపల్లి, కాకినాడ, ఒరిస్సాలో పోస్కో నుండి పశ్చిమబెంగాల్‌లోని నందిగ్రామ్ సింగూర్ దాకా సెజ్‌ల కోసం సాగిన భూసేకరణలు.

సామాజిక అభివృద్ధి కోసం ప్రభుత్వాలు సేకరించిన భూముల పట్ల, భూసేకరణ పట్ల ప్రజలెందుకు తిరుగుబాటు చేస్తున్నారు. ఆర్థిక మండలాలకు వ్యతిరేకంగా ప్రజలెందుకు తమ బలాన్ని కూడగట్టుకుంటున్నారు? నిజానికి ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టం 2005లో పార్లమెంట్‌లో ఆమోదం పొందినకాలంలో ఏ రాజకీయపార్టీ కూడా ఊహించని విధంగా ప్రజా ఉద్యమాలు చెలరేగాయి. ప్రజలకవసరమైన అభివృద్ధిని అందించే బాధ్యత ప్రభుత్వానిదే ఐనప్పటికీ ఆ బాధ్యతను ప్రభుత్వం స్వయంగా మోయకుండా అభివృద్ధి కారకులనబడే డెవలపర్స్‌కు భూములను అప్పజెప్పుతూ ఆ భూమిని కోల్పోతున్న ప్రజలకు తగిన ప్రత్యామ్నాయం చూపకుండా ఉన్న నిర్లక్ష్యానికి ప్రతిఫలమే ఈ ప్రజా ఉద్యమాలు.

ఆధునిక సమాజం అభివృద్ధి చెందాలంటే పారిశ్రామిక అభివృద్ధి తప్పనిసరి కాదనలేము. మానవ నాగరికతా ప్రగతికి ప్రధాన ఉత్పత్తి సాధనం భూమి. భూమిని ఆధారం చేసుకొని ప్రాకృతిక వనరులను సాధనాలుగా వ్యవసాయ ఉత్పత్తితో మొదలు సాంకేతిక అభివృద్ధి దాకా సాగిన మానవ మనుగడలో ఉత్పాదక శక్తిని అభివృద్ధి చేసుకునే క్రమంలో

---

భారాన్ని పెంచటమే మోడీ సర్కారు లక్ష్యం సుస్పష్టం. పరోక్ష పన్నులతో తన ఆదాయాన్ని పెంచుకోవడంలో మాత్రమే ప్రభుత్వానికి ఆసక్తి ఉన్నట్లు కనిపిస్తున్నది. చిత్రమేమంటే పార్లమెంటు లోపలా, వెలుపలా రాష్ట్రాలు తమ ఆదాయం కోల్పోతామన్న భయాన్ని వ్యక్తం చేయడం, దాని ప్రాతిపదికన వ్యతిరేకించడం మినహా సాధారణ పౌరులకు వచ్చే లాభనష్టాల గురించీ, ప్రత్యక్ష పన్ను పోటు సామాన్యుడి నడ్డి విరుస్తుందనే స్పృహతో చర్చ జరగడం లేదు.

ఫెడరల్ వ్యవస్థలో అధికారం కేంద్రీకరించబడటానికి బదులు వికేంద్రీకరణ జరగాలి. చట్టసభలు చేసే ప్రతి నిర్ణయం పెట్టుబడిదారులకు, వారి ప్రతినిధులకు, నియంత్రిత మీడియాకు సానుకూలంగా ఉన్నాయా లేదా అనే ప్రాతిపదికన కాక అవి ప్రజాస్వామ్యాన్ని బలోపేతం చేస్తాయా లేదా అనే ప్రాతిపదికన ఉండాలి. కాని పన్నులు వేసే రాష్ట్ర ప్రభుత్వాల అధికారాన్ని బలహీనం చేసి పెట్టుబడిదారులకు నచ్చే ఏకీకృత జాతీయ మార్కెట్‌ను సృష్టించటాన్ని అంగీకరించరాదు. పరోక్ష పన్ను అంటేనే ప్రజలపై భారం మోపేది గనుక ఇది తిరోగమన చర్య. దీన్ని తప్పకుండా ప్రతిఘటించాలి. ప్రత్యక్ష పన్నుల ద్వారా ఆదాయాన్ని సమకూర్చుకునే విధంగా ప్రభుత్వంపై ఒత్తిడి తేవాల్సిన అవసరం ఉంది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

కొద్దిమంది భూమి, పరిశ్రమలు స్వాధీనం చేసుకోబడ్డాయి. ఉత్పత్తి సాధనమైన భూమిపై ఆధారపడ్డ ప్రజలు వ్యవసాయాన్ని పరిశ్రమగా గుర్తించిన దేశాల్లో కార్మికులుగా, ఉద్యోగులుగా, ఉత్పత్తిదారులుగా, యజమానులుగా భాగస్వాములయినారు. భారతదేశంలాంటి పారిశ్రామికీకరణ వైపు అడుగులేస్తున్న దేశాల్లో అదే ప్రజలు కూలీలుగా, నిరాశ్రయులుగా దుర్భరమైన స్థితిలో కొనసాగుతున్నారు. వ్యవసాయాన్ని పరిశ్రమగా గుర్తించిన దేశాల్లో అభివృద్ధి ఫలాలు భూమిని కోల్పోయిన ప్రజలందుకోవడం వల్ల తిరుగుబాటుకు అవకాశం లేదు. అభివృద్ధి చెందుతున్న భారతదేశంలాంటి దేశాల్లో భూనిర్వాసితులకు ఫలితాలు అందక తిరుగుబాటు బావుటానెగరేస్తున్నారు. నగరీకరణ, పారిశ్రామికీకరణ వెల్లువలో ఆహారోత్పత్తి కేంద్రమైన భూమిని ధ్వంసం చేయకూడదు. పారిశ్రామిక ఉత్పత్తులకన్నా ఆహారోత్పత్తి అత్యంత ఆవశ్యకమైంది. అది కేవలం భూమి నుండి మాత్రమే ఉత్పత్తి అవుతుంది. కాబట్టి అట్లా ఆహారానికి ఉత్పత్తి కేంద్రమైన భూమిని కాపాడుకోవడం మిక్కిలి అవసరం. ఈ నేపథ్యంలో ప్రభుత్వాలు పారిశ్రామికీకరణకు అవసరమైన భూసేకరణకు కావలిసిన భూముల విషయంలో తగినంత శ్రద్ధగా దూరాలోచన చేయాల్సిన అవసరముంటుంది. కాని మెరుగైన క్షేత్రాలనే ఎంచుకోవడం దురదృష్టకరం. నిజానికి భూసారం అంతటా ఒకే రీతిగా ఉండదు. నిస్సారమైన బంజరు భూములు, క్షారభూములు, కొండకోనలు మొత్తం భూమిలో 75 శాతం కాగా కేవలం 25 శాతం మాత్రమే సారవంతమైన, ఆహారోత్పత్తులకు అనుకూలమైన భూములుండడాన్ని గమనిస్తే.. పారిశ్రామికీకరణ, పట్టణీకరణకు నిరుప యోగమైన భూముల అభివృద్ధికి అత్యంత పెద్ద మొత్తాలను కేటాయించి డెవలప్ చేసుకోవాల్సి వస్తుందన్న సాకుతో డెవలపర్స్ వ్యతిరేకించడంతో ప్రభుత్వాలు వారి కోరిక మేరకు ఆహారోత్పత్తికి అనుకూలమైన ఆ 25 శాతం భూములనుండే సేకరించి కట్టబెడుతున్నాయి.

సరిగ్గా ఇదే బాటలో నడిచింది మూడున్నర దశాబ్దాలు పశ్చిమ బెంగాల్‌ను పరిపాలించిన సిపిఎం ప్రభుత్వం, బెంగాల్‌లో తాను అధికారం లోకి వచ్చిన తొలినాళ్లలో సరికొత్త సామ్యవాద సమాజ నిర్మాణానికి ఎంచుకున్న అభివృద్ధి పథకానికి ఒక విశిష్ట ఆమోదముంది. ప్రారంభ కాలంలో దేశ అభివృద్ధి నమూనాకంటే భిన్నంగా వ్యవసాయ రంగం మీద తన దృష్టిని కేంద్రీకరించింది. దేశంలో మరెక్కడాలేని విధంగా భూసంస్కరణలు ఉన్నతస్థాయిలో అమలుపరిచింది. పారిశ్రామిక అభివృద్ధికన్నా వ్యవసాయాభివృద్ధి మీద ప్రత్యేక శ్రద్ధ వహించిన ప్రభుత్వం భూసంస్కరణల్లో ప్రధానంగా కౌలుదారిచట్టం, కౌలుపరిమితి, కౌలుదారుకు రక్షణలాంటి సంస్కరణలు తీసుకొచ్చి అభివృద్ధిసాధించి తన ప్రత్యేకతను చాటుకొని నిరాటంకంగా 32 సంవత్సరాలు బెంగాల్‌ను ఏలిన సిపిఎం ప్రభుత్వం ప్రజల్లో భద్రతాభావాన్ని కల్గించాననుకుంది. సిపిఎం ప్రభుత్వ వ్యవసాయాభివృద్ధి నమూనా అభినందించ దగిందేకాని ప్రభుత్వం ఈ సంస్కరణలు అంతిమదశకు చేరుకున్నాయని భావించడమే పొరపాటు. స్థానిక అర్థశాస్త్ర నిపుణుల సూచనలు తమ ప్రభుత్వపాలన పట్ల ఏర్పరుచుకున్న మితిమీరిన విశ్వాసం ప్రపంచవ్యాప్తంగా ముఖ్యంగా చైనా, రష్యాలాంటి దేశాల్లో ప్రత్యేక ఆర్థిక మండళ్ల ప్రభావం ఆర్థిక పురోగతికి దోహదం చేసిన విషయాన్ని ఆలంబనగా చేసుకొని మార్క్సిస్టులు దేశీయంగా కూడా ఈ ప్రయోగం ఫలితాలనిస్తుందని భావించి బెంగాల్‌లో ఈ ప్రయోగానికి తెరతీశారు. స్థానిక ప్రజల భౌగోళిక ఆర్థిక రాజకీయ, సామాజిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకొని తన పూర్వ అభివృద్ధి నమూనాను అంచనా వేసుకోకుండా అభివృద్ధిని పారిశ్రామిక అభివృద్ధి కోణంలో చూసింది. కాబట్టి అప్పటికే దేశంలోని నగరీకరణ చెందిన ప్రతిష్ఠాత్మకమైన అత్యంత పెద్ద నగరంగా ఉన్న కలకత్తాకు 40 కిలోమీటర్ల దూరంలో ఉన్న సింగూర్‌లో టాటా నానో ప్లాంట్ ఏర్పాటుకు ఒడంబడిక చేసుకుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు సామ్యవాద పునాదులున్న సిపిఎంలాంటి కమ్యూనిస్టు ప్రభుత్వాలు కూడా అతీతంకాదని దీనితో నిరూపితమైంది.

**సింగూరులో ఏం జరిగింది?**

బెంగాల్ ఆర్థికాభివృద్ధిని పారిశ్రామికాభివృద్ధితో మరింత పురోగమింప జేయాలని భావించి అందులో భాగంగా మే 2006లో టాటా నానో కార్ల ప్లాంట్ ఏర్పాటుకు ప్రభుత్వం ఒప్పందం కుదుర్చుకుంది. దానికోసం సింగూరు ప్రాంతంలో 997.11 ఎకరాలను సేకరించడానికి పూనుకుంది. ఇందుకు బ్రిటిష్ కాలం నాటి 1894 భూసేకరణ చట్టాన్ని అడ్డం పెట్టుకొని బలవంతపు భూసేకరణకు దిగింది. భూసంస్కరణలు పూర్తి స్థాయిలో అమలు చేశామనుకున్న సిపిఎం ప్రభుత్వానికి భూసేకరణ పట్ల రైతుల నుంచి వెల్లువెత్తిన భారీ నిరసనలు ఉక్కిరిబిక్కిరి చేశాయి. తెలంగాణలో సాయుధ రైతాంగ పోరాటం వలే బెంగాల్‌లో తెభాగా ఉద్యమం ఊపిరి పోసుకున్న అనంతరం దాని తీవ్రతలోని సారాన్ని అర్థం చేసుకున్న సిపిఎం ప్రభుత్వం కౌలుదారి చట్టాన్ని మరింత బలోపేతం చేసినా సింగూరు, నందిగ్రామ్ ప్రాంతాల్లోని భూములు పెద్దఎత్తున ఈ సంస్కరణలకు నోచుకోకపోవడం వల్ల ప్రభుత్వం నిర్బంధ భూసేకరణతో దిక్కుతోచని సన్న, చిన్నకారు రైతాంగం తమ పంట భూములను వదులుకోలేక ప్రత్యామ్నాయం కన్పించక పోరాటమే శరణ్యమని భావించి నానో ప్లాంటుకు వ్యతిరేకంగా, ప్రభుత్వం పారిశ్రామిక విధానానికి వ్యతిరేకంగా పోరాటానికి దిగారు.

సమాజం పునాదులను కదల్చకుండా అలాగే ఉంచి నూతన పారిశ్రామిక విధానమంటూ ఆధిపత్య వర్గాల ప్రయోజనాలకు అనుకూలంగా చట్టాలు చేస్తూ సమాజాన్ని మార్చగలమని మార్క్సిస్టు పార్టీ భావించడంలోనే కీలకమైన తప్పటడుగుపడింది. దాని ఫలితంగా భూసేకరణను వ్యతిరేకిస్తూ రైతులు, స్వచ్ఛంధ సంస్థలు భూనిర్వాసితుల కోసం ఉద్యమించడం జరిగింది. ఈ పోరాటంలోని వాస్తవాన్ని గ్రహించిన అప్పటి ప్రతిపక్ష నాయకురాలు మమత బెనర్జీ జూలై 2006 సారవంతపు భూముల బలవంతపు సేకరణకు వ్యతిరేకంగా ఉద్యమానికి సన్నిహితంగా కదిలి ప్రత్యక్ష పోరాటానికి దిగింది. ఈ పోరాటంలో ఒకవైపు నక్సలైట్ పార్టీలతో పాటు చైతన్యవంతమైన ఎన్‌జిఒలు రైతులకు సంఘీభావంగా నిలిచారు. అయినప్పటికీ ప్రభుత్వ అండతో టాటా మోటార్స్ కంపెనీ 2007 జనవరి 21 నుండి ప్లాంట్ నిర్మాణానికి పూనుకుంది. ప్రజల తీవ్ర నిరసనలను ప్రభుత్వం ఉక్కుపాదంతో అణిచివేయాలని చూసింది. ప్రజలు, ప్రజాసంఘాలు న్యాయస్థానాన్ని ఆశ్రయించారు. ప్రజల ఆకాంక్షకు భిన్నంగా 2008 జనవరి 18న ప్లాంట్ నిర్మాణాన్ని కొనసాగించుకోవచ్చునని, ప్రభుత్వ భూసేకరణ సమంజసమని కలకత్తా కోర్టు తీర్పునిచ్చింది. ఈ తీర్పును సవాలు చేస్తూ రైతులు, ఎన్‌జిఒలు

కోర్టును ఆశ్రయించినారు. కోర్టు ఆదేశాల ప్రకారం సెప్టెంబర్ 2, 2008న ప్లాంట్ నిర్మాణాన్ని నిలిపివేసి అక్టోబర్ 3, 2008 నాటికి టాటా మోటార్స్ కంపెనీని సింగూరు బయటకు తరలిస్తున్నట్లు పేర్కొని, అక్టోబర్ 7, 2008 గుజరాత్‌లోని సనంద్‌కు ప్లాంట్‌ను తరలించినట్లు ప్రకటించింది. ఈ ప్రకటనతో ప్రజా ప్రయోజనాలను ప్రక్కకు పెట్టి పారిశ్రామిక ప్రయోజనాలనే ప్రధానంగా భావించిన ప్రభుత్వ ఆలోచనలకు గండి పడింది. అంతేగాక, జాతీయ అంతర్జాతీయ పెట్టుబడులతో ఆటోమొబైల్ హబ్‌గా మారుతుందనుకున్న బెంగాల్ కలకు పురిటిలోనే గండి కొట్టింది. ఈ వివాదం కోర్టులో ఉండగానే సింగూర్, నందిగ్రామ్ ప్రజల పోరాట ఫలితం బెంగాల్‌లోని స్థానిక సంస్థల ఎన్నికల్లో ప్రతిబింభించింది. సుదీర్ఘ కమ్యూనిస్టు పాలనా సౌధానికి బీటలు వారాయి. ప్రజలకు దూరంగా జరిగి పారిశ్రామిక వర్గాలకు అనుకూలంగా నడుచుకునే ప్రభుత్వ విధానాలకు సింగూరు ప్రజల పోరాటం చెంపపెట్టుగా నిలిచింది.

ఈ నానో ప్లాంట్ వివాదం కోర్టులో కొనసాగుతుండగానే 2011లో జరిగిన బెంగాల్ శాసనసభ ఎన్నికల్లో ప్రజాపోరాటానికి మద్దతుగా నిలిచిన తృణముల్ కాంగ్రెస్‌ను ప్రజలు ప్రత్యామ్నాయంగా ఎంచు కున్నారు. ప్రజాభిష్టానికి తలొగ్గిన మమత బెనర్జీ ప్రభుత్వం కాకులను కొట్టి గద్దలకు వేయడం వంటి గత ప్రభుత్వ విధానాలను ఆమోదించ కుండా అధికారంలోకి రావడంతోనే తన తొలి క్యాబినెట్ మీటింగ్‌లోనే 400 ఎకరాల భూమిని రైతులకు తిరిగిచ్చే సింగూరు పునరావాస అభివృద్ధి బిల్లును ఆమోదించింది. అప్పటికే సింగూరును వదిలి గుజరాత్‌కు చేరుకున్న టాటా నానో కంపెనీ ఫ్యాక్టరీ పెట్టాలన్న ఉద్దేశం లేకపోయినా మరో ప్రయోజనాలకు భూమి కొల్లగొట్టాలనే ఉద్దేశంతో తనకు గత ప్రభుత్వం కేటాయించిన ఆ భూమిపై కలకత్తా హైకోర్టు కెల్లింది. కోర్టులో ఏకసభ్య ధర్మాసనం తృణముల్ కాంగ్రెస్ ప్రభుత్వం తెచ్చిన బిల్లును సమర్థించింది. కాగా టాటా మళ్లీ డివిజన్ బెంచికి అప్పీలు చేసుకోగా ఆ డివిజన్ బెంచ్ బిల్లును తోసిపుచ్చింది. దీనితో 2012లో బెంగాల్ ప్రభుత్వం సుప్రీంకోర్టుకు వెళ్లింది.

దాదాపు నాలుగు సంవత్సరాల సుదీర్ఘ విచారణ తర్వాత సుప్రీంకోర్టు 2016 ఆగస్టు 31న సింగూరు భూసేకరణ ఒప్పందాన్ని రద్దు చేస్తూ చారిత్రాత్మక తీర్పును వెలువరించింది. దీంతో దశాబ్దకాలంగా ఎదురు చూస్తున్న సింగూరు, నందిగ్రామ్ ప్రజల ఆకాంక్ష నెరవేరింది. ఈ ఆకాంక్ష ఫలించడంలో పోరాట పటిమగల వివిధ ప్రజాసంఘాల కృషితోపాటు స్థానిక నక్సలైట్ పార్టీలు అందించిన ప్రజాచైతన్యంతో పాటు ప్రభుత్వ చిత్తశుద్ధి కూడా ప్రధాన భాగస్వాములైనాయి.

**సుప్రీం కోర్టు తీర్పు ప్రతిఫలం**

భారత వ్యవసాయరంగాన్ని చంపేసి సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలకు మార్కెట్‌గా నిలబెట్టే ఈ ప్రభుత్వాలకు చెంపచెల్లుమనిపించేలా ఉన్న ఈ తీర్పు సామాన్య రైతులు భూమి కోల్పోయిన నిర్వాసిత ప్రజలకు అత్యంత ఊరటనిచ్చింది. సింగూరు ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా చేసిన పోరాటానికి తన కలంతో చైతన్యపరిచిన మహాశ్వేతాదేవి వంటి ఎంతో మంది రచయితలకు సంతృప్తినిచ్చింది. తీర్పులో ప్రధానంగా రైతుల నుండి సారవంతమైన భూములను సేకరించడం సరికాదని చెప్పింది. రైతులు, రైతుకూలీలు ఆదాయ వనరులు కోల్పోయే ఈ భూసేకరణ చెల్లదని, ఆ భూమిని ప్రభుత్వమే స్వాధీనం చేసుకొని 12 వారాల్లోగా రైతులకు అప్పగించాలంది. 10 సంవత్సరాల క్రితం నాటి టాటా సంస్థతో చేసుకున్న బలవంతపు భూసేకరణ చట్ట విరుద్ధమని పేర్కొంది. చట్టవిరుద్ధంగా సేకరించి ఆ భూములపై రైతులకు హక్కులను పునరుద్ధరించాలని ఆదేశించింది. రైతులకు గతంలో చెల్లించిన పరిహారం ప్రభుత్వం వెనుకకు తీసుకోరాదని కూడ నొక్కి చెప్పింది. కారణం 10 ఏండ్ల పాటు భూమి దూరంగా ఉన్నందువల్ల జరిగిన నష్టానికి గత ప్రభుత్వం చెల్లించిన పరిహారం ఆ ప్రభుత్వ పాపపరిహారంగా భావించాలని తీర్పు చెప్పింది. మొత్తం మీద ప్రజాప్రయోజనం లేని భూమి నుండి ప్రజలను దూరం చేసే ఏ పని అయినా ఆమోదయోగ్యం కాదని తీర్పు సారంగా కన్పిస్తుంది. ఈ తీర్పు అనంతరం బెంగాల్ ప్రభుత్వం 9,117 మంది రైతులకు పట్టాలను, 806 మంది రైతులకు పరిహారం చెక్కులను పంపిణీ చేసింది. ఈ తీర్పు 2013 భూసేకరణ చట్టంలోని పలు అంశాలను ప్రతిబింభిస్తుంది. ఈ నేపథ్యంలో అత్యంత సారవంతమైన మూడు పంటలకు వీలైన నీటి వనరులు పుష్కలంగా ఉన్న పంట భూములను నాశనం చేసి నిర్మించతలపెట్టిన అమరావతి కోసం భూములు కోల్పోయిన రైతులకు, కనీసం ప్రభుత్వం ప్రతిపాదిత నీటి వనరులు లేకపోయినా జలసంపద పుష్కలంగా ఉన్న నేలల్లో కనీసం రెండు పంటలైనా పండించుకునే మల్లన్నసాగర్ ప్రాంత రైతులకు ఈ తీర్పు కొత్త ఆశల్ని రేకెత్తిస్తుంది. బహుశ చిత్తశుద్ధి, చైతన్యం కలబోసుకొని అటు ప్రజాసంఘాలు, ఇటు ప్రతిపక్షాలు ఏకమైతే అసమంజసమైన ప్రభుత్వ భూసేకరణ దాహానికి కోర్టు ద్వారా అడ్డుకట్టవేసే అవకాశం లేకపోలేదు.

సింగూరు తీర్పును, సింగూరు ప్రజల పోరాటాన్ని నిశితంగా పరిశీలిస్తే ప్రభుత్వాల భానిసత్వాన్ని సామ్రాజ్యవాద, ప్రపంచబ్యాంకు విధానాలకు మోకరిల్లడాన్ని జాగ్రత్తగా గమనిస్తే పారిశ్రామికీకరణ లక్ష్యమే ప్రజలకు ఉపయోగపడడం అన్ని కాలాల్లో నిజంకాదని తెలుస్తుంది. పారిశ్రామిక వేత్తలు, రైతు దృక్పథంతో వారికి తగిన ప్రత్యామ్నాయాలు కల్పించినపుడే ఆ పారిశ్రామికీకరణ సమాజానికి ఉపయోగపడుతుంది. అప్పుడే నిరుపయోగమైన భూముల సేకరణకు కూడా అంగీకరించే అవకాశం ఉంటుంది. దీనికి విరుద్ధంగా మొత్తం భారతీయ సమాజంపైన సామ్రాజ్య వాదుల పెత్తనం కొనసాగుతుండడం వలన ఈ పారిశ్రామికీకరణ ఫలితాలు రైతులకు, కార్మికులకు, కూలీలకు, ఉద్యోగులకు ఆశించిన మేరకు దక్కడం లేదు. వ్యవసాయ సమాజాన్ని పారిశ్రామిక సమాజంగా మార్చగల పెట్టుబడిదారుడు ఈ దేశంలో విదేశీ పెట్టుబడికి సేవకుడిగా ఉంటున్నాడు. పాలకులుగా, నాయకులుగా స్థానిక రాజకీయ పార్టీలు ఏవైనా అవి విదేశీ పెట్టుబడుల సేవకుల అడుగులకు మడుగులొత్తడం సామ్రాజ్యవాద విధానాలను అమలు పరుచుటలో ముందుంటున్నాయి. కాబట్టి కామ్రేడ్ మావో చెప్పినట్లు నాయకత్వ భారాన్ని కార్మిక వర్గమే తలకెత్తుకోవాలి. ప్రజాస్వామిక ఆకాంక్షలేని దళారి పెట్టుబడిదారులను తరిమికొట్టి రైతాంగాన్ని రైతుకూలి సమాజాన్ని నూతన ప్రజాస్వామిక మార్గం వైపు నడిపించాలి. అప్పుడే భారత సమాజం ఒక ఆరోగ్యకర అభివృద్ధి నమూనా వైపు పయనించగలుగుతుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

# పరిహసించబడుతున్న న్యాయం

***అహ్మదాబాద్‌లోని గుల్బర్గ్ సొసైటీలో కాంగ్రెస్ ఎంపి ఎహ్సాన్ జాఫ్రీ ఇంటిపై హిందూ మతోన్మాదులు చేసిన దాడిని, హత్యాకాండను గుర్తు చేసుకుంటూ, కోర్టు తీర్పును ఖండిస్తున్నారు* కుల్దీప్ నయ్యర్**

గౌరవ గుజరాత్ హైకోర్టు ఇటీవల ఇచ్చిన తీర్పును విభేదిస్తున్నందుకు క్షమార్హుడను. ఎహ్సాన్ జాఫ్రి కాల్పులు జరపడంవల్ల అల్లరిమూక రెచ్చిపోయి అతణ్ని చంపేసిందనేదాన్ని నేను విభేదిస్తున్నాను. అతడు నాకు బాగా తెలుసు. అతడు కాంగ్రెస్‌వాది. గుజరాత్‌లోని స్థానిక నాయకులు ప్రజల్ని సంకుచితపరిచే చర్యే గుల్బర్గ్ సొసైటీ మారణకాండ.

హిందూ అల్లరిమూకలు తన ఇంటిని చుట్టుముట్టిన మరుక్షణమే జాఫ్రి నాకు ఫోన్‌చేసి అల్లరిమూకల నుండి తనను రక్షించమని కోరాడు. నేను ఢిల్లీలోని గృహ మంత్రి కార్యాలయానికి ఫోన్ చేసి ఆ విషయాన్ని చెప్పాను. వాళ్లు నాకు రాష్ట్ర ప్రభుత్వంతో అందుబాటులో ఉన్నామని, జరుగుతున్న సంఘటనను చూస్తున్నామని చెప్పారు. ఫోన్ పెట్టిన మరుక్షణమే మళ్లీ మోగింది. ఫోన్ చేతుల్లోకి తీసుకోగానే జాఫ్రి మళ్లీ మాట్లాడుతూ తనను ఆ మూక ఉరితీస్తుందని, ఏదైనా చేసి తనను కాపాడాలని కోరాడు. సహాయం కోసం అతడు చేసిన అరుపు నా చెవుల్లో ఇప్పటికీ మారుమోగుతూనే ఉన్నది.

మరోసారి సంబంధిత మంత్రిత్వ శాఖకు ఫోన్ చేసి చెప్పడం తప్ప నేనేమీ చేయలేక పోయాను. అందువల్ల జాఫ్రి అల్లరిమూకను రెచ్చగొట్టాడనే కోర్టుతీర్పు తప్పు. ఇది అవహేళన చేయబడుతున్న న్యాయం'. కోర్టు ముందుకు తెచ్చిన సాక్ష్యాధారాన్ని బట్టే తీర్పు చెప్పే కోర్టును తప్పుపట్టలేం. పక్షపాత బుద్ధితో వ్యవహరించిన పోలీసులు తమ కర్తవ్యాన్ని సరిగ్గా నిర్వహించలేదు. దానికి సంబంధించిన పూర్వాపరాలు చూడలేదు. అందుకే కోర్టు జాఫ్రియే రెచ్చగొట్టాడనే దానికి కట్టుబడి తీర్పు చెప్పింది. ఈ విషయం సుప్రీం కోర్టు ముందుకు వస్తుందని భావిస్తున్నాను. అప్పుడే ఈ తతంగమంతా విశాల ప్రజానీకానికి తెలుస్తుంది. సాధారణంగా జాఫ్రీకి నిందవచ్చే అవకాశముంది. అందుకే ఈ అంశం చాలా ప్రధానమైనది. విచారకర విషయమేమంటే న్యాయాధీశులు కూడా పోలీసుల వలె అనైతికంగా ప్రవర్తించారు. మనది హిందూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు మొదలగు మతస్థులందరిచేత నిర్మించబడ్డ రాజ్యాంగం ప్రకారం పాలింపబడే భిన్నత్వం గల దేశం.

దేశంలో 80 శాతం వరకు హిందూ జనాభా ఉన్నా ఇక్కడ సెక్యులర్ రాజ్యాంగాన్ని అమలు పరిచేట్లు చూసిన నాయకుల దూరపు చూపును కొనియాడాలి. హిందూ మహాసభ ద్వారా పురుడుపోసుకున్న జనసంఘ్ కనీసం పది మందిని పార్లమెంటుకు పంపలేకపోయింది. ఆ పార్టీయే మెల్ల మెల్లగా పుంజుకొని ప్రస్తుతం సొంత మెజారిటీతో పాలించే స్థితికి చేరుకున్నది. లోక్‌సభలో 282 మందితో సంపూర్ణ మెజారిటీ కలిగి ఉన్నది. శివసేన లాంటి అనుంగు పార్టీల మద్దతు దీనికి అదనమయింది.

ప్రభుత్వ యంత్రాంగమంతా పార్టీ ఆలోచనను ప్రతిబింబించడం మన దేశాన్ని పీడిస్తున్న జాడ్యం. ఇది ప్రస్తుత బిజెపికీ, కాంగ్రెస్‌కూ వర్తిస్తుంది. కమ్యూనిస్టులు కూడా అంత అమాయకులు కాదు. ఈ లోటుపాట్లను దూరం చేసుకొని ముందుకు పోవడమే మన ముందున్న పెద్ద సవాల్. రమారమి అన్ని రాజకీయ పార్టీలూ దీంట్లో భాగస్వామ్యం ఉన్నందున కనుచూపు మేరలో అసలు దారి కనిపించడం లేదు.

దురదృష్టవశాత్తు ఈ రోజు జరుగుతున్న దాడులన్నీ మైనార్టీలపైన, అట్టడుగు బహుజనులపైనే. ఒకవేళ ఇది ఇలాగే కొనసాగుతూ చట్టం కాపాడబడకుండా పోతుంటే – సమాజంలో ఒకరి తర్వాత మరొకరు బలికావడం తప్పనిసరి. శతృ భావన నిలకడగానే ఉంటుంది. ఇవ్వాళ ముస్లింలు నిందించబడితే రేపు మరొక వర్గం వారు. ఇక దీనికి అంతమేదీ? చట్టానికి ఎలాంటి ఐచ్ఛికమూ లేదు.

అదృష్టవశాత్తు కొందరు ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించి పట్టాలపై ఎక్కించే ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నప్పటికీ కలుషితమైన సామాజిక వ్యవస్థలో వీరి ప్రయాత్నాలన్నీ అసంభవంగానే ఉండిపోతున్నాయి. ఆకరుకు పార్లమెంటే మనకు గత్యంతరం. అందుకే ప్రజలు కూడా మనకు ఎన్నో ఆశలు, ఆశయాలు చూపుతూ 1950లో మనం ఏర్పర్చుకున్న రాజ్యాంగాన్ని, చట్టాల్ని గౌరవించే వ్యక్తులనే ఎన్నుకోవాలి.

వాస్తవంగా – రాజ్యాంగం ముందు చాలా ఎంపికలుండేవి. ఆనాటి సలహాదారుడు బి.ఎన్. రావు చాలా దేశాల్లో ఉన్న చట్టాలను, రాజ్యాంగాలను క్షుణ్ణంగా పరిశీలించి అమెరికా, ఫ్రాన్స్‌లు పాటిస్తున్న అధ్యక్ష తరహా పాలనకే మొగ్గు చూపాడు. ఆ రోజుల్లో ప్రధాన రాజనీతిజ్ఞుడుగా ఉన్న జవహర్‌లాల్ నెహ్రూ మాత్రం పార్లమెంటరీ తరహా వ్యవస్థను సమర్థించాడు. అతడు హారో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల్లో చదువుకున్నందున ఆ తరహా వ్యవస్థను ఇష్టపడ్డాడనే ఒక వాదన ఉంది. అది నిజమే అయినా ప్రతి వయోజనుడు పాల్గొనే వ్యవస్థనే నెహ్రూ కాంక్షించాడు.

రాజ్యాంగ సభకు అధ్యక్షత వహించిన రాజేంద్రప్రసాద్ ఓటర్లకు ఎంతో కొంత విద్య ఉండాలన్నాడు. దానికి నెహ్రూ స్వాతంత్ర్య పోరాటంలో చాలా మంది నిరక్షరాస్యులు, అమాయకులే పాల్గొన్నారని జవాబిచ్చాడు. దేశం స్వాతంత్ర్యం పొందాక వారికి ఓటు హక్కు లేదని చెప్పగలరా?

ఆ ఉద్యమానికి ఊతమిచ్చిన మరో అంశం సెక్యులరిజం. రాజ్యాంగంలో ఇదే విషయమై ఒక వర్గం వారు ఎందరున్నాసరే – ఒక వ్యక్తికి ఒక ఓటు అని మాత్రం పొందుపరచబడింది. కొన్నింటిలో ఈ విషయం ఊహించనలవిగాదు. కాని ఆ రోజు మెజారిటీ ప్రజలు ఈ సిద్ధాంతానికి ఒప్పుకున్నారు.

# తెలుగు రాష్ట్రాల్లో పారిశ్రామికీకరణ

*రెండు తెలుగు రాష్ట్రాల్లో విదేశీ పెట్టుబడులతో పరిశ్రమల స్థాపన అనేది ప్రచారంలోనే చూస్తున్నాం కాని అది ఇంకా వాస్తవ రూపం దాల్చలేదని అంటున్నారు* **వి. హనుమంతరావు**

అటు కేంద్రంలో, ఇటు ఉభయ తెలుగు రాష్ట్రాల పారిశ్రామిక రంగాల్లో శబ్దకాలుష్యమే తప్ప కొత్త పరిశ్రమలు స్థాపించిన జాడల్లేవు. కేంద్రంలో మేక్ ఇన్ ఇండియా నినాదం నినాద స్థాయిలోనే, అలాగే ఉభయ తెలుగు రాష్ట్రాల్లో కొత్త పారిశ్రామిక విధాన పత్రాల విడుదల దగ్గరనే స్థబ్దత ఏర్పడింది. అక్కడ చంద్రబాబు అమరావతి రాజధాని నిర్మాణంలో మునిగి తేలుతున్నారు. ఇక్కడ కెసిఆర్ తెలంగాణలో ఇతర పార్టీల శాసన సభ్యుల కొనుగోళ్లలో బిజిబిజీ అయిపోయారు. ఈ సందట్లో విదేశీ పారిశ్రామిక వేత్తల బృందాలు ఉభయ రాష్ట్రాల మీద 'దాడులు' చేసి, కొంత మంది ఎంఒయుల మీద సంతకాలు చేసి చాయ్ తాగి వెళ్లిపోయారు. అంతా గప్‌చుప్. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే. అక్కడ కేంద్రంలో స్వయంగా ప్రధాని విదేశాల్లో, ముఖ్యంగా అమెరికాలో బహుళజాతి సంస్థల అధిపతుల కాళ్లావేళ్లాపడి మా దేశంలో పెట్టుబడులు పెట్టండి బాబూ, మీకు భూమి ఇస్తాం, మౌలిక సౌకర్యాలు కల్పిస్తున్నాం, మా చట్టాలను మీకు అనుకూలంగా మార్చే పనిలో ఉన్నాం అంటూ దేశ దేశాలు చక్కర్లు కొట్టి వస్తున్నారు. కాని ఇసుకరేణువంత పురోగమనం లేదు. ఇదొక విహంగ వీక్షణం మాత్రమే.

విభజనకు పూర్వ ఆంధ్రప్రదేశ్‌లో, ముఖ్యంగా హైదరాబాద్ నగరంలో 1960 దశకం చివర్లో ప్రభుత్వ రంగంలో కేంద్ర ప్రభుత్వం పుణ్యమా అంటూ హైదరాబాద్, విజయవాడ, విశాఖ నగరాల్లో పరిశ్రమలు స్థాపించబడ్డాయి. పారిశ్రామికంగా రాష్ట్రం గుర్తించదగిన స్థానాన్ని పొందగలిగిందంటే అందుకు ప్రభుత్వ రంగ సంస్థలే పునాది. అలాగే ప్రభుత్వం ఏర్పాటు చేసిన అనేక పారిశ్రామిక సహాయ సంస్థలు అందిస్తూ వచ్చిన సహాయ సహకారాలు పారిశ్రామికీకరణకు తోడ్పాటును అందించాయి. ఉదాహరణకు చోటా బిర్లాలు టాటాలు, అంటే 70వ దశకంలో నాగార్జున, రాసి గ్రూపుల పరిశ్రమలు ఏర్పాటు కావడంతో ప్రారంభించి గడ్డితో కాగితం తయారీ వరకు పరిశ్రమలు ఏర్పడి రాష్ట్రంలో పారిశ్రామిక వాతావరణం నెలకొనడం జరిగింది. కాని అప్పటి పాలకులు రాష్ట్రాభివృద్ధిలో పారిశ్రామికీకరణ పాత్రకున్న ప్రాముఖ్యతకన్నా ఏవో భారీ పరిశ్రమలు పెట్టాలి, బొంబాయి లాంటి పారిశ్రామిక నగరంగా అభివృద్ధి చెందాలన్న ఆశ వారిని వెంటాడుతూనే వచ్చింది. రాష్ట్రం ప్రధానంగా వ్యవసాయక రాష్ట్రం కాబట్టి వ్యవసాయోత్పత్తుల ఆధారిత పరిశ్రమలు పెద్దగ పెట్టుబడి అవసరం లేని గ్రామీణులకు ఉపాధి కల్పించే పరిశ్రమలు స్థాపిస్తే, ఇటు నగరాలు, అటు గ్రామీణ ప్రాంతాల్లో పరిశ్రమలు నెలకొల్పితే, అభివృద్ధి రాష్ట్ర వ్యాప్తంగా జరుగుతుందనే ఆలోచన పాలకులకు రాలేదు.

ఈ నేపథ్యంలో గత శతాబ్ది చివరి దశకంలో చంద్రబాబు అధికారంలోకి వచ్చిన తర్వాత ఆయన పరిపాలన ప్రపంచ బ్యాంకు ఆదేశాల నీడలో కొనసాగడంతో ప్రభుత్వ రంగ పరిశ్రమల పీకలు తెగిపడ్డాయి. పారిశ్రామిక సహాయ సంస్థలను మూసేశారు. విదేశీ పెట్టుబడులు ప్రతిపాదనల స్థాయిలోనే ఆగిపోయాయి. నిన్న మొన్నటిలాగే, అప్పుడు కూడా విదేశీ పారిశ్రామిక సంస్థల అధిపతులు వచ్చారు, చూశారు, వెళ్లిపోయారు. చంద్రబాబు ఎన్నోసార్లు విదేశాలు దర్శించి వచ్చారు కాని, ఆయన వెంట పరిశ్రమలు రాలేవు. పారిశ్రామిక భాగస్వామ్య సదస్సును సిఐఐతో కలిసి నిర్వహించి రు. 36,500 కోట్ల పెట్టుబడులు పెట్టడానికి ఎంఒయులపై సంతకాలు చేశారు గాని, మూడు వేల కోట్లు కూడా రాలేదు. చంద్రబాబు పాలనలో, అంతకు ముందు కాంగ్రెస్ పాలనలో చాలా పారిశ్రామిక విధానాల ప్రకటనలన్నీ పూసల్లో దారంలా కనబడేవి. మినహాయింపులు, ప్రోత్సాహకాలు, తగ్గింపులు, చెల్లింపుల వాయిదాలు, భూమి కేటాయింపుల పునఃశ్చరణ మాత్రమే.

పారిశ్రామిక రంగం ఇలా దిగజారిపోవడం రాష్ట్రంలో ప్రపంచ బ్యాంక్ ప్రవేశంతో, జోక్యంతో ప్రారంభమైంది. ప్రైవేటీకరణకు పునాదులు పడ్డాయి. ప్రభుత్వ రంగ పరిశ్రమల మూసివేత, అమ్మకాలు ప్రారంభమయ్యాయి. ప్రభుత్వ రంగ పరిశ్రమలు ప్రైవేటీకరణతో ప్రభుత్వం రాష్ట్ర పారిశ్రామికీకరణకు గొడ్డలి పెట్టు అయింది. ఇదీ పారిశ్రామికీకరణ

---

అదే విధంగా రాజ్యాంగ పరిషత్‌లోని ముస్లిం నాయకులు బ్రిటిష్ కాలంలో అనుభవించిన కోటా గాని రిజర్వేషన్లు గాని ఏవీ చట్ట సభల్లో ఉండకూడదని అన్నారు. ఇది ఇప్పటికీ అమల్లో ఉన్న విషయమే. ఇప్పటికీ ప్రైవేట్ సెక్టార్లో మాత్రం ఉద్యోగాల్లో పక్షపాత వైఖరే అవలంభిస్తున్నారు. చాలా హిందూ సంస్థల్లో కొద్దిమంది ముస్లింలకు మాత్రమే ఉద్యోగాలున్నాయి. వాస్తవానికి అప్పటి భారత ప్రధాని మన్మోహన్‌సింగ్ దళితులకంటే ముస్లింలు చాలా హీనంగా ఉన్నారన్నాడు.

నేను అమితమైన ఆశావాదినే. ఇప్పటికీ ఈ దేశంలో భిన్నమైన కుల, మతాల ప్రజా సమూహాలు, విభిన్న మనస్తత్వాలతో ఉండి కూడా ప్రజాస్వామ్య, భిన్న జాతుల వాతావరణంలో కలిసి మెలసి ఉంటారని ఆశిస్తున్నాను. ప్రజలే రాజ్యాంగ విలువలకు, ఆచరణకు మధ్య ఉన్న అసంబద్ధాన్ని పరిశీలించగలరు. భిన్నత్వం అనేది మాటలకే పరిమితం కాకుండా ఈ సమగ్రతకవసరమైన ఒక అంశం.

*(తెలుగు అనువాదం: ఎనిశెట్టి శంకర్, రిటైర్డ్ టీచర్)* వీ

విషయంలో చంద్రబాబు ఆచరణ. ఆయన పాలన గురించి ఇంత సుదీర్ఘంగా గత చరిత్రను తడమాల్సి వచ్చిందంటే, ఇప్పుడు ఆయనే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయి, వాగ్దానాలు వెదజల్లుతున్నారు కాబట్టి. ఆ వాగ్దానాలకు ఎంత విలువ ఇవ్వాలో ఆ రాష్ట్ర ప్రజలు గ్రహించాలి. రైతుల రుణమాఫీ వాగ్దానం, ఆచరణ రాష్ట్ర ప్రజలకు చిరపరిచితమే. ఆయన ఇదివరకే చేసిన సూచనను పునరుల్లేఖిస్తున్నా. ఏ రాష్ట్రమైనా, దేశమైనా పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలనుకుంటే ముందు స్థానికంగా ఉన్న వనరుల ఆధారిత పరిశ్రమల గురించి ఆలోచిస్తుంది. ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయక రాష్ట్రం కాగా వ్యవసాయాధారిత పరిశ్రమలు, అగ్రో – ప్రాసెసింగ్ పరిశ్రమల ఏర్పాటు మీద శ్రద్ధవహించాలి. అలా ప్రయత్నిస్తే (1) రైతులకు అదనపు ఆదాయం లభిస్తుంది. (2) కూలీలకు పని దొరుకుతుంది. (3) చదువుకున్న యువకులకు తమ ప్రాంతంలోనే ఉపాధి లభిస్తుంది. (4) వలసలు ఆగుతాయి. (5) పారిశ్రామిక వాతావరణంతో గ్రామీణ ప్రాంతాలు కళకళలాడుతాయి. (6) ఆధునిక భావాలు, ఆలోచనలు, మూఢ నమ్మకాలు దూరమవుతాయి. (7) దేశీయ పారిశ్రామిక వేత్తలు పెట్టుబడులు పెట్టడానికి గ్రామాలకు తరలి వస్తారు. (8) రాష్ట్రంలో అపార ఖనిజ సంపద ఆధారిత పరిశ్రమలు నెలకొల్పవచ్చు. అయితే ఆ పారిశ్రామికీకరణ ఫలితాలు రైతులకు, స్థానికులకు దక్కేలా జాగ్రత్త వహించాలి.

తెలంగాణలో, ముఖ్యంగా హైదరాబాద్ నగరంలో నైజాం నవాబు పాలనలోనే పారిశ్రామిక వాతావరణం నెలకొని ఉన్నదంటే, అది హైదరాబాద్ రాష్ట్రాన్ని స్వతంత్ర రాష్ట్రంగా తీర్చిదిద్దాలనే నైజాం నవాబు లక్ష్యంతో పరిశ్రమల మీద కన్ను వేశాడు. ఒక రకమైన పారిశ్రామిక వాతావరణం నెలకొని ఉన్నది. పూర్వ ఆంధ్రప్రదేశ్‌కు హైదరాబాద్ రాజధాని కావడం, 1960 దశకంలో అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం కేంద్రం మీద ఒత్తిడి తీసుకొనివచ్చి పలు పారిశ్రామిక సంస్థలను ప్రభుత్వ రంగంలో నెలకొల్పడం, ఆంధ్ర ప్రాంతం నుంచి ధనాఢ్యులు వచ్చి పరిశ్రమలు స్థాపించడంతో, నగరం పారిశ్రామిక కేంద్రంగా రూపాంతరం చెందింది. ఉద్యోగాలు లభించాయి. అంతర్జాతీయ పారిశ్రామిక వేత్తలు ఈ ప్రాముఖ్యతను గమనించారు. హైదరాబాద్ నగరమే కాదు, పక్కనే ఉన్న మెదక్, రంగారెడ్డి, మహబూబ్‌నగర్ జిల్లాలకు పారిశ్రామికీకరణ విస్తరించిందంటే, అది అప్పటి కాంగ్రెస్ పాలకుల చలవేనని ప్రస్తుత తెలంగాణ ముఖ్యమంత్రి గమనంలో ఉంచుకోవాలి. హైదరాబాద్ నగరం పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన, చెందుతున్న నగరంగా దేశంలో, విదేశాల్లో గుర్తింపు సాధించింది. దేశంలో పారిశ్రామిక వేత్తలు, బహుళజాతి సంస్థలు హైదరాబాద్ నగరాన్ని భావి పారిశ్రామిక కేంద్రం కానున్నదని గుర్తించారు. నగరం పారిశ్రామిక నగరంగా పుంజుకొంటుంది. 2010లోనే టాటా గ్రూపు అధినేత వచ్చి రాష్ట్రంలో ఎయిరోస్పేస్, రక్షణ రంగాల్లో పారిశ్రామికీకరణను చేపట్టనున్నామని ప్రకటించారు. చైనా ప్రతినిధులు వచ్చి 'నగరం ఫార్మాస్యూటికల్, ఐటి, బయోటెక్నాలజీ, పరిశోధనాభివృద్ధి సంస్థలకు కేంద్ర బిందువుగా మారుతుందని మేము గుర్తిస్తున్నాం' అని ప్రకటించారు. శంషాబాద్ విమానాశ్రయం, హైటెక్ సిటీ (ఇది చంద్రబాబు పుణ్యమే), విదేశీ ఐటి కంపెనీలు తమ కార్యాలయాలను స్థాపించుకున్నాయి. రంగారెడ్డి జిల్లా ఆదిభట్లలో ఎయిరోస్పేస్‌కు సంబంధించిన సంస్థలో వెయ్యి కోట్ల పెట్టుబడితో నెలకొల్పుతామన్నారు. ఇవి కార్యరూపం దాల్చాయో లేదో తెలియదు. ఈ అనుమానం ఎందుకు వచ్చిందంటే 1992 – 2010 మధ్య కాలంలో 2117 పరిశ్రమల ఏర్పాటుకు (ఇండస్ట్రియల్ ఎంటర్‌ప్రెన్యూర్స్ మెమోరాండ) కేంద్రం అంగీకరించింది. అయితే వీటిలో ఎన్ని కార్యరూపం దాల్చాయో తెలియదు. అయినా, అంత మంది పరిశ్రమలు స్థాపించడానికి ముందుకు రావడమే విశేషం. డిఫెన్స్ రిసెర్చ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్ (ఇది నగరంలోనే ఉంది) వచ్చే ఐదు సంవత్సరాల్లో మిస్సైల్ తయారీ కార్యక్రమానికి, శబ్దం కన్నా వేగంగా పయనించే హైపర్ స్యూబర్ సానిక్ టన్నెల్స్ తయారు చేయాలని నిశ్చయించింది. అలాగే తక్కువ దూరం ప్రయాణిస్తూ 70 నుంచి 100 మంది ప్రయాణికులను చేరవేసే విమానాల తయారీ ఆ సంస్థ ఎజెండాలో ఉంది. అలాగే మోటారు సైకిళ్ల తయారీ సంస్థ హోండా తన మూడవ తయారీ కర్మాగారాన్ని వెయ్యి కోట్ల పెట్టుబడితో వంద ఎకరాల స్థలంలో ఏర్పాటు చేస్తామని ఎపిఐఐసి సంస్థకు తెలియజేసింది. హై ఓల్టేజ్ ట్రాన్స్‌ఫార్మర్లను తయారు చేయడానికి కొరియా సంస్థ రు. 450 కోట్ల పెట్టుబడి పెడతామని ముందుకు వచ్చింది. మిధాని సంస్థ రు. 600 కోట్లతో ఏర్పాటు చేయనున్న కార్యక్రమానికి కేంద్ర రక్షణ మంత్రి శంఖుస్థాపన చేశారు. పైన పేర్కొన్న పరిశ్రమలన్నీ ఏర్పాటయ్యాయా, నేల మీద కాలూనాయా, లేక వట్టి వాగ్దానాలా ముఖ్యమంత్రి చెప్పాలి.

ఏ ప్రభుత్వరంగం అయితే ఉభయ తెలుగు రాష్ట్రాల్లో పారిశ్రామికీకరణకు పునాదులు వేసిందో, ఆ ప్రభుత్వ రంగానికి కేంద్రంలో రాజీవ్‌గాంధీ ఎసరు పెట్టారు. ప్రైవేట్ రంగానికి, విదేశీ పెట్టుబడులకు ఎర్రతివాచి పరిచారు. ఈ విధానం అమలుకు అప్పటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చంద్రబాబు పునాది వేశారు. ప్రపంచ బ్యాంక్ ప్రైవేటీకరణ విధానాల అమలుకు శ్రీకారం చుట్టారు. మామూలుగా పునాది పడిందంటే ఒక భవనం లేస్తుంది. కాని చంద్రబాబు వేసిన పునాదిలో పారిశ్రామికీకరణ నేలచూపు చూసింది. ఏ విధానమైతే నాగార్జున గ్రూపు, విష్ణు పరిశ్రమల గ్రూపు, హరిశ్చంద్ర ప్రసాద్ గ్రూపు పరిశ్రమల స్థాపనకు దారితీసిందో, ఆ విధానాన్ని హుస్సేన్‌సాగర్‌లో కలిపేశారు. మినీ సిమెంట్, మినీ పేపర్ మిల్లులు చాలా మూతపడ్డాయి. ప్రభుత్వ రంగ పరిశ్రమలు అమ్మేయడమో, మూతపడడమో జరిగింది. కొత్త పరిశ్రమలు రాకపోవడంతో ఉభయ భ్రష్టుత్వంగా తయారైంది. విదేశాల నుంచి వచ్చిన పారిశ్రామిక డెలిగేషన్లు లక్షల కోట్ల పెట్టుబడులతో రాబోతున్నా యనే ప్రకటన కాగితాలకే పరిమితమైంది. వచ్చినవి ప్రతిపాదనలే, పరిశ్రమలు కావు. రాజీవ్‌గాంధీ ప్రకటనతో రాష్ట్రంలో అప్పుడప్పుడే పారిశ్రామికరంగం పుంజుకొంటూ, ఆంధ్ర పారిశ్రామిక వేత్తలు కాలూను కొంటున్న తరుణంలో ఈ మార్పుతో పారిశ్రామికాభివృద్ధి ప్రతిష్టంభనకు లోనైంది. ఇదంతా ప్రపంచ బ్యాంకు రాష్ట్రంలో ప్రవేశపెట్టిన రాష్ట్ర పాలకుల ఫలితమే. ఒకసారి ఏ దేశంలోనైనా కాలుపెడితే వెనకడుగు వేయడమనేది లేదు. బ్రిక్స్ రాజ్యాల కూటమి ఇటీవలనే ఏర్పాటయింది. ఈ శతాబ్దం ఆసియా దేశాల శతాబ్దమని ఆర్థిక శాస్త్రవేత్తలన్నారు. తథాస్తు అందాం.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# బండికుంభం ఉత్సవాలు - దళితులు

*అగ్రకుల భూస్వామ్య ఆధిపత్యాన్ని నిలబెట్టడానికి దళితులను బండికుంభం ఉత్సవాలకు రాకుండా అడ్డుకుంటున్నారనీ, దీనికి పోలీసులు కూడా సహకరిస్తున్నారనీ అంటున్నారు* **ఎం.కె. కుమార్**

ప్రార్థించే హక్కు కల్పించాలని పోరాడుతున్న దళితులకు స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలైనా న్యాయం జరగడం లేదు. దళితులకు ప్రభుత్వం, న్యాయస్థానాలు వెన్నుదన్నుగా నిలవలేకపోతున్నాయి. అగ్రకుల ఆధిపత్య శక్తులతో సాక్షాత్తు ప్రభుత్వమే చెలిమి చేస్తుండడంతో దళితులపై వివక్ష నూతన రూపాలను తీసుకుంటోంది. మొత్తం విశ్వాన్ని నియంత్రించే శక్తి అనేది ఒకటుందా అనే ప్రశ్నకు రెండు విరుద్ధమైన సమాధానాలను ఈ సమాజం సిద్ధం చేసుకుంది. ఈ రెండిటి మధ్య భావఘర్షణలకు కొదవేం లేదు. 15 సంవత్సరాల క్రితం హేతువాది దబోల్కర్ సైతం దళితులకు ఆలయ ప్రవేశాలు కల్పించాలని, దేవుళ్లను అగ్రకులస్థులకు మాత్రమే పరిమితం చేయడం సరికాదని న్యాయస్థానాన్ని ఆశ్రయించాడు. 2011లో ఆయన ముంబై హైకోర్టులో శనిసింగానా పూర్‌లో మహిళలకు ప్రవేశం కల్పించాలని కూడా పిల్‌ను దాఖలు చేశారు. రాజ్యాంగంలోని 14, 15, 25వ అధికరణల ప్రకారం పౌరులందరూ సమానమేనని, వారి మధ్య వివక్ష ఉండరాదని, ఏ ఆచారాన్నైనా, సంప్రదాయాన్నైనా స్వేచ్ఛగా అనుసరించవచ్చని స్పష్టంగా పేర్కొన్నప్పటికీ దళితులపై వివక్ష కొనసాగుతూనే ఉంది.

### నేపథ్యం

చిత్తూరు జిల్లా వెదురుకుప్పం మండలంలో ముఖ్యంగా పచ్చని పంట పొలాలతో, ఆహ్లాద వాతావరణంలో ఉండే పచ్చికాపలం అనే గ్రామం చుట్టూ సుమారు 47 గ్రామాలు కలసికట్టుగా మహాభారత ఉత్సవాలు ప్రతి ఏటా నిర్వహిస్తున్నాయి. పది రోజులు నిర్వహించే ఈ ఉత్సవాలను స్వాతంత్ర్యం ముందర నుండి నిర్వహిస్తున్నట్టు అక్కడి గ్రామస్థులు చెప్తారు. ఇందులో భాగంగా మహాభారతంలోని ప్రముఖమైన ఘట్టాలను నాటక రూపంలో ప్రదర్శిస్తారు. అలాగే అగ్నిగుండం తొక్కడం, బండికుంభం అనే ప్రసాద సంప్రదాయంలో 47 గ్రామాల నుండి తెచ్చిన ఆహార పదార్థాలను కుప్పగాపోసి, ధర్మరాజుకు నైవేద్యం ఇస్తారు. సామూహికంగా ప్రజలు వండిన బండికుంభం ప్రసాదానికి విపరీతమైన డిమాండ్ ఉంటుంది. ఈ ప్రసాదాన్ని స్వీకరిస్తే, అనుకున్న కోరికలు నెరవేరతాయని ప్రజలు విశ్వసిస్తారు.

ఈ వేడుకను చూడడానికే దళితులకు అవకాశం లేదు. దళితులు అంబేద్కర్, పూలే కృషివల్ల చైతన్యవంతులై దేశవ్యాప్తంగా గ్రామాల్లో ఉన్న ఆలయాల్లో ప్రవేశానికి పోరాటాలకు సిద్ధమైనారు. అదే విధంగా చిత్తూరు జిల్లాలోను పోరాటాలు జరగడంతో ఈ వేడుకను చూడడానికి మాత్రమే దళితులకు అవకాశం దొరికింది. పచ్చికాపలం చుట్టుపక్కల వ్యవసాయ భూముల్లో వరిని పండిస్తారు. సంవత్సరానికి రెండు పంటలు పండిస్తూ, వ్యవసాయంలో మిగులును సైతం రైతులు సాధించి, తిరిగి భూములను కొని భూస్వాముల అవతారం ఎత్తారు. సీమలోని కరువు కాటకాలు ఈ ప్రాంతంలో కనిపించవు. దళితులు తమ కష్టంతో ఈ భూముల్లో బంగారాన్ని పండిస్తున్నారు. భూస్వాములు ధనికరైతులుగా రూపాంతరం చెందినా, రియల్ ఎస్టేట్‌లో పెట్టుబడులు పెట్టి వ్యాపారవేత్తలు అయ్యారు. అంబేద్కర్ కృషి వల్ల వచ్చిన రిజర్వేషన్ల వల్ల దళితుల్లో కొంతమంది ప్రభుత్వ ఉద్యోగాలు సాధించినా, గ్రామాల్లోని అగ్రకులస్థుల వివక్షకు భయపడి, తిరుపతి లాంటి పట్టణాల్లో కాపురాలు పెట్టడంతో గ్రామాల్లో వివక్ష స్థిరీకరించబడింది.

దళితులు చైతన్యవంతులైన క్రమంలో గ్రామాల్లో చావుకు, పెండ్లికి, వ్యవసాయానికి వివిధ రకాల పనులకు పనికి వచ్చిన దళితులు తమ ఇండ్లల్లో వండుకొచ్చిన ఆహార పదార్థాలను నైవేద్యం పెట్టడానికి పనికి రాదనడంతో వారి ఆత్మగౌరవం దెబ్బతింటోంది. తాము వండిన ఆహారాన్ని బండికుంభంలో కలిపి అందరికి ప్రసాదంగా పెట్టాలని, తద్వారా ధర్మరాజు చెంతకు తమ ప్రార్థనలు చేరాలని డిమాండ్ చేశారు. అంతేగాకుండా అగ్నిగుండ ప్రవేశానికి తమని అనుమతించాలని డిమాండ్ చేశారు. దళితులను దేవాలయంలోకి అనుమతించకపోవడంలో ఒసి కులస్థుల కన్నా ఒబిసి, బిసి కులస్థులు అత్యుత్సాహాన్ని ప్రదర్శించి, తాము దశాబ్దాలుగా అనుభవించిన కులవివక్షను మర్చిపోయి, దళితులపై దాష్టికం ప్రదర్శించారు.

### ప్రార్థనా హక్కును నిరాకరించిన ప్రభుత్వాధికారులు

ఈ నేపథ్యంలో అగ్రకులస్థులకు, దళితులకు మధ్య ఘర్షణపూరిత వాతావరణం ఏర్పడడంతో 2016 ఆగస్ట్ 1న చిత్తూరు రెవెన్యూ డివిజన్ అధికారి పీస్ కమిటీ సమావేశం నిర్వహించి, దళితుల డిమాండ్స్‌ను అంగీకరించారు. అలాగే ఎస్‌సి జాతీయ కమిషన్ సభ్యురాలు కమలమ్మ గారికి సమస్యను వివరించినప్పటికీ ఫలితం లేకపోయింది. ఆమె ప్రభుత్వాధికారులను ఆదేశించి, చర్చల ప్రాతిపదికన సమస్యను పరిష్కరించాలని చెప్పింది. ప్రభుత్వ, పోలీసు అధికారులు దళిత, ప్రజాసంఘాల నాయకులతో చర్చలు జరిపి, అగ్రకులస్థులు ఒప్పుకోవడం లేదు అనే సాకుతో ఈ సారికి దళితులనే సర్దుకుపొమ్మన్నారు. వచ్చే ఏడాదికి దళితుల డిమాండ్లను పరిష్కరించే దిశగా గ్రామస్థులతో అవగాహనా సదస్సులను ఏర్పాటు చేస్తామని చెప్పారు. దళితులు ఒప్పుకోకపోవడంతో, జూలై 31న బండికుంభం కార్యక్రమంలో పాల్గొనడానికి వచ్చిన దళితులను అరెస్టు చేశారు. 144 సెక్షన్‌ను అమలు చేసి, దాన్ని కేవలం దళితవాడల్లోనే అమలుజరిపారు. సమస్య దళితులవల్లే వచ్చినట్టు, వారి దుందుడుకు వైఖరి వల్లే ప్రశాంతంగా ఉన్న గ్రామాలలో ఘర్షణలు రేకెత్తినట్టు ప్రధాన స్రవంతి మీడియాలోను వార్తా కథనాలు వెలువడ్డాయి. పోలీసులు ఏకపక్షంగా పదకొండు మంది దళితులపైనే కేసులు పెట్టి, వారిని భయపెట్టాలని చూశారు. దళితులు తిరగబడ్డంతో,

అగ్రకులాలకు చెందిన 26 మందిపై కేవలం బైండోవర్ కేసు పెట్టి పోలీసులు చేతులు దులుపుకున్నారు. ఎస్‌సి, ఎస్‌టి అట్రాసిటీ యాక్ట్ పెట్టాలనే దళితుల డిమాండ్ అరణ్యరోదనే అయింది.

**సాంఘిక బహిష్కరణ**

ప్రభుత్వం చేతులెత్తేయడం, పోలీసులు అగ్రకులస్థులకే వంత పాడడంతో దళితుల ఆత్మగౌరవం మరింత ప్రమాదంలో పడ్డట్లైంది. దళితులపై వివక్షను ప్రదర్శించాలంటే ముందు తనమీద అంటరానితనాన్ని రుద్దాలని ప్రకటించిన ప్రధాని మోడీ ప్రకటనలు పేపరుకు మాత్రమే పరిమితమయ్యాయి. ఆయన ఆక్రందన కనీసం బిజెపి నాయకుల చెవికి కూడా చేరినట్టు లేదు. బండికుంభం తర్వాత ఆగస్ట్ 7న జరిగిన అగ్నిగుండ ప్రవేశంలోను దళితులకు అనుమతిని నిరాకరించారు. గతంలో కనీసం దళితులు వచ్చి ఆ తంతును చూసేవారు. ఈ సారి దాన్ని సైతం అమలుచేయకుండా అగ్రకులస్థులు దళితులకు సాంఘిక బహిష్కరణ శిక్షను విధించారు. దళితులకు మద్దతు పలికిన దళిత, ప్రజా సంఘాల నాయకులను ఎక్కడికక్కడ అరెస్టులు చేశారు. అగ్నిగుండం కార్యక్రమానికి దళితులను రానీయకుండా సాక్షాత్తు జిల్లా జాయింట్ కలెక్టర్, అడిషనల్ ఎస్‌పి అడ్డుకున్నారు. మొదట చర్చల్లో భాగంగా దళితులకు ధర్మరాజు ఆలయ ఆచార వ్యవహారాల్లోకి ప్రవేశం కల్పిస్తామని ఒప్పంద పత్రాల్లో సంతకం చేసిన ప్రభుత్వ అధికారులు చేతులెత్తేశారు.

**పోలీసుల అత్యుత్సాహం**

ఘర్షణ తీవ్రరూపం దాల్చడంతో ఇద్దరు దళితులకు అగ్నిగుండం తొక్కడానికి అనుమతిస్తామని చెప్పి ఆధార్‌కార్డులు తెమ్మన్నారు. బొమ్మల దొడ్డికి చెందిన రోశయ్య, వెంకటేశ్‌లు ఆధార్‌కార్డ్‌లు తెచ్చినప్పటికీ, అగ్రకులస్థుల బెదిరింపులతో ఆర్‌డిఒ కోదండరామిరెడ్డి దళితులనే బుజ్జగించే ప్రయత్నం చేశారు. రామచంద్రాపురం, గోవిందరెడ్డి పురం, పచ్చికాపలం, చవటగుంట, కార్వేటినగరం ప్రాంతాల్లో కర్ఫ్యూ వాతావరణాన్ని తలదన్నేలా పోలీసులు ప్రజలను భయాందోళనలకు గురిచేశారు. నాకాబంది పేరుతో రోడ్ల మీదకి వాహనాలను సైతం రానీయకుండా  అడ్డుకున్నారు. దళితవాడల నుండి ప్రజలు బయటకు రాకుండా, దళితవాడల చుట్టూ పోలీసు పహారాలను పెట్టి, దళితులను వారి ఇండ్లలోనే హౌస్ అరెస్టులు చేశారు. ఆశ్చర్యంగా 144 సెక్షన్ కేవలం దళితవాడల్లోనే పెట్టారు. దళితులు మహాభారత అగ్నిగుండ పూజను అడ్డుకోవడానికి మారణాయుధాలతో ప్రయత్నాలు చేస్తున్నారనే వదంతులను పోలీసులే రేపారు. భయానక వాతావరణాన్ని కావాలనే సృష్టించి, సమాజం దృష్టిలో దళితులను హింసావాదులుగా చూపించే ప్రయత్నం చేశారు. దీంతో గ్రామాల్లోని అగ్రకులస్థులు ఒక్కటై, ఆలయం లోకి దళితులు ప్రవేశిస్తే, తలలు నరుకుతామని పోలీసుల ముందరే దళిత నాయకులపై హెచ్చరికలు జారీచేశారు.

**మహాభారత అగ్నిగుండం - బండికుంభం**

ద్రౌపదమ్మకు పొంగళ్లు పెట్టడానికి, బండికుంభాల్లో పాలుపంచు కోవడానికి, అగ్నిగుండం ప్రవేశానికి దళితులకు ఆచార సంప్రదాయాల ప్రకారం అనుమతి లేదని, అందుకే వారిని మేం అనుమతించ బోమని దేవాలయ నిర్వాహకులైన అగ్రకులస్థులు తేల్చిచెపుతున్నారు. అంతగా కావాలంటే దళితవాడల్లో వారే ఈ తంతుని నిర్వహించుకోవచ్చని ఉచిత సలహా పడేస్తున్నారు. మహాభారత వీధి నాటకాలు చిత్తూరు జిల్లాలో స్వాతంత్ర్యం రాకపూర్వం నుండి ప్రదర్శించ బడుతున్నాయి. ఆషాడ, శ్రావణ మాసాల్లో మహాభారత ఉత్సవాలను ఒక పండుగలా నిర్వహిస్తారు. ద్రౌపది అమ్మవారికి ఆలయం కట్టి ఆమెను పూజిస్తారు.

**ద్రౌపది గుడి చరిత్ర**

పచ్చికాపలంలో వెలసిన ద్రౌపదమ్మ గుడిముందర ఈ తంతు అంతా జరుగుతుంది. ప్రస్తుతం శూద్రులే పూజారులుగా ఉంటూ గుడిలో పూజలు నిర్వహిస్తున్నారు. అర్జునుడు విష్ణువు అంశగా, అగ్నిదేవుడి శక్తులతోను పుట్టినట్టు పురాణాల్లో చెపుతారు. శక్తివంతుడైన అర్జునుడిని పూజించ డానికి అగ్నిగుండాన్ని తొక్కడం జరుగుతుంది. నగ్నపాదాలతో అగ్ని గుండాలను తొక్కడం ఒక మూఢాచారంగా రాయలసీమ ప్రాంతంలో వస్తుంది. సీమలో ఉన్న ధీరసంస్కృతికి అద్దం పట్టేవిధంగా, అగ్నిలో వట్టిపాదాలతో నడవడాన్ని వీరత్వంగా గుర్తిస్తారు. ద్రౌపదిని పూజించడం అంటే సమస్త దేవతాశక్తులను పూజించినట్టు ప్రజలు భావిస్తారు. పంచ భూతాలను తన వశంలో పెట్టుకోవడానికి ఐదుమంది దేవతా మూర్తులు ఒక్క శరీరమైన ద్రౌపదిలో జన్మించినట్టు ఇతిహాసాలు పేర్కొంటున్నాయి.

అయితే ద్రౌపది, ధర్మరాజు గుళ్లలో బ్రాహ్మణులు పూజలు చేయకపోవడం గమనార్హం. క్షత్రియుల ఆధిపత్యాన్ని కొనసాగించడం ఇష్టంలేని బ్రాహ్మణులు శివ, విష్ణు, శక్తిదేవాలయాలకే పరిమిత మయ్యారు. బ్రాహ్మణిజానికి వ్యతిరేకంగా క్షత్రియ ఆధిపత్యాన్ని నెలకొల్పడానికి ధర్మరాజు, ద్రౌపది కథలను, గుళ్లను నెలకొల్పినట్టు అర్థమౌతోంది. బ్రాహ్మణులే వదిలేసిన ఈ గుళ్లను మహాభారత నాటకాల ద్వారా బ్రతికించడానికి కృషిచేసినది ఎక్కువగా అతిశూద్రులు, దళితవర్గానికి చెందినవారే. వీరు మహాభారత ఘట్టాలను వీధి నాటకాలుగా వేయగలుగుతున్నారు. అయితే దళితులకు మాత్రం ఈ గుళ్లలో స్థానం లేకుండా చేయడానికి శూద్రులే తీవ్రంగా కృషిచేస్తున్నారు.

**ఫ్యూడల్ శక్తుల ఆధిపత్యం**

1230వ సంవత్సరంలో చోళుల రెండవరాజు రాజ రాజ చోళుని అధీనంలో ఈ ప్రాంతం ఉంచబడింది. 1314వ సంవత్సరంలో పచ్చికాపలం రెడ్డి అనే భూస్వామి, తన కూతురుని ప్రళయరెడ్డితో వివాహం చేసి, మొత్తం ప్రాంతాన్ని రెడ్డిరాజుల అధీనంలోకి తీసుకొచ్చారు. తర్వాత వీరే సాలువ, అరవీడు, కొండవీడు రెడ్ల వంశాలతోను సన్నిహిత సంబంధాలను నెరిపి ఈ ప్రాంతంపై హక్కుదారునిగా ఉన్నారు. 16వ శతాబ్దంలో ఈ ఫ్యూడల్ వంశస్థులు తమ ఇంటిపేర్లను బొమ్మరాజు సాలువగా మార్చుకున్నారు. ఇప్పటికీ ఈ ప్రాంతంపై రెడ్ల సామాజిక వర్గానికే ఆధిపత్యం ఉంది. క్షత్రియులు, నాయిడ్ల ఆధిపత్యం కూడా బలంగానే ఉంది. అగ్రకులస్థులు పటిష్టమైన రాజకీయ సంబంధాలను కలిగి ఉండడంతో, ఏ సామాజికవర్గ రాజకీయ పార్టీ అధికారంలో ఉంటే, ఆ సామాజిక వర్గం ఇక్కడ చక్రం తిప్పుతూ ఉంటుంది.

రియల్ ఎస్టేట్ వ్యాపారంలో ఇక్కడి భూస్వామ్యవర్గం వ్యవసాయంలో మిగులు సంపదను పెట్టుబడులుగా పెట్టి కోట్లు సంపాయించింది. ఈ ప్రాంతంలో ఎన్‌ఆర్‌ఐలు విపరీతంగా పెట్టుబడులు పెట్టి ఎకరాను రెండు కోట్లకు పైగా రేటు పలికేటట్టు చేశారు. కాని 90 శాతం దళిత కుటుంబాలకు ఇక్కడ సెంటు భూమిలేదు. ఇప్పటికీ వారు అగ్రకులస్థుల పొలాల్లో వ్యవసాయ కూలీలుగా పనిచేస్తున్నారు. కొంతమంది తిరుపతిలో అసంఘటిత రంగంలో ముఖ్యంగా నిర్మాణ రంగంలోను, ఆటోడ్రైవర్లు గాను పనిచేస్తున్నారు. గ్రామాలలో రెండవతరం యువత చదువుకున్న తర్వాత, పట్టణాలకు ఉపాధిరీత్యా వలసెళ్లారు. వీరు గ్రామాలలో చైతన్యాన్ని నింపడానికి కృషిచేస్తున్నారు.

**దళితుల ఆత్మగౌరవం**

నేటితరం దళిత యువకులు 2016 జూలై 31న పచ్చికాపలంలోని ధర్మరాజుల, ద్రౌపదిదేవి గుళ్లలోకి వెళ్లడానికి ప్రయత్నించారు. అదేవిధంగా తమ దళితవాడల్లో వండుకుని తెచ్చిన అన్నాన్ని బండికుంభంలో పోయడానికి ప్రయత్నించడంతో, అగ్రకులస్థులు వారిపై భౌతికదాడికి దిగారు. మేము చేసే పనులతో బతికే అగ్రకులస్థులు మేం వండిన ఆహారాన్ని దేవునికి ప్రసాదంగా ఎందుకు పెట్టరని వారు ప్రశ్నిస్తున్నారు. పార్టీల పరంగా చీలి ఉన్న అగ్రకులస్థులు, ఈ సంఘటనతో ఒక్కతాటిపైకి వచ్చారు. దళితులు వండిన అన్నం దేవునికి ప్రసాదంగా పెడితే అరిష్టం కలుగుతుందని, బాలింతలు, వృద్దులు చనిపోతారని, పిల్లలు రక్తం కక్కుకొని చనిపోతారని విషప్రచారం చేశారు.

హిందూమతం కులాన్ని, మతహింసను, అట్టడుగు వర్గాలపై వివక్షను దేవాలయాల కేంద్రంగానే కొనసాగిస్తుంది. అటువంటప్పుడు దేవాలయాల సంస్కృతిని ధ్వంసం చేసి, హేతుబద్ధతను, శాస్త్రీయతను పెంపొందించు కోవాల్సిన దళితులు తిరోగమనదిశలో  దేవాలయాల్లోకి ప్రవేశాన్ని కోరడాన్ని కొంతమంది వ్యతిరేకిస్తున్నారు.

పుట్టుక ఆధారంగా దళితులను గ్రామాలకు దూరంగా వెలివాడల్లోకి ఇదే అగ్రకుల ఆధిపత్యం నెట్టివేసింది. ఇప్పుడు రాజ్యాధికారాన్ని సాధించిన అగ్రకుల దురహంకారులు దళితులను చిన్నచూపు చూస్తూ, వారిని గుళ్లలోనికి రానీయడంలేదు. వారి చాదస్తాన్ని వ్యతిరేకిస్తే మెజారిటీ హిందువుల మనోభావాలు దెబ్బతింటాయని దుష్ప్రచారం చేస్తున్నారు. సమాజాభివృద్ధికి మూలకారకులైన దళితులను అంటరానివారంటూ హిందూమత ప్రమాణాల ఆధారంగా నిలువరించడం అనాగరికం. ఫ్యూడల్ సంప్రదాయాలు, భావజాలాలు దళితులను వాడలకే పరిమితం చేయడమే గాక, వారిపై వివక్షను ప్రదర్శిస్తాయి.

**విశ్లేషణ**

ప్రపంచంలోని ఏ పదార్థమైనా ఎప్పుడో ఒకప్పుడు మార్పుకు గురవ్వాల్సిందే. మతం, సంప్రదాయాలు, మూఢనమ్మకాలు మార్పుకు సైతం లొంగని బ్రహ్మ పదార్థాలుగా సనాతనులు ప్రచారం చేస్తుంటారు. హిందూ మతం పేరుతో కొనసాగుతున్న మూఢనమ్మకాల వల్లే ఆలయాలకు విపరీతమైన రాబడి వస్తోంది. ప్రాచీన సంప్రదాయాల పేరుతో అమలవుతున్న వాటికి ఆగమశాస్త్రాల అండ ఉండనే ఉంది. ఇవి మార్పునకు గురైతే ప్రజల్లో దేవుడి మీద ఉన్న నమ్మకం క్రమంగా బలహీనపడే అవకాశముంది. ఇది అంతిమంగా గుళ్లు మూసేయడానికి, హిందూమత ఉనికికి ప్రమాదంగా మారుతుంది.  గుళ్లో ప్రవేశం పేరుతో హిందూమతంలోని మూఢ విశ్వాసాలను, ఫ్యూడల్ రాజ్యాధికారాన్ని బద్దలుకొట్టాలని చూస్తున్నారని, హిందూ అతివాదులు ఆదుర్దా పడుతున్నారు. మతాన్ని ఓట్ల కోసం వాడుకునే నీచమైన సాంప్రదాయానికి రాజకీయ పార్టీలు తెరలేపాయి. పౌరుల ప్రాథమిక హక్కులకన్నా, మతాన్ని, దాని మూఢత్వాన్ని కాపాడడమే ప్రాథమిక విషయంగా రాజ్యానికి కనిపిస్తూ ఉంటుంది. ప్రజల మిలటెన్సీని చంపేయడానికి, న్యాయస్థానాలు ఎటూ ఉండనే ఉన్నాయి. కారంచేడులో కోర్టు తీర్పును గమనించిన వారికి న్యాయస్థానాలు అగ్రకుల భూస్వాములకు అనుకూలంగా వ్యవహరిస్తాయని తెలిసిపోయింది.

కులం వర్గం రూపంగానే పరిగణించడం జరుగుతోంది. దేశంలోని చారిత్రక దశలలో, నిర్దిష్టమైన పరిస్థితుల్లో వర్గ సంబంధాలు రూపుదిద్దు కున్నాయి. ఇవే కులసంబంధాలు. ఉత్పత్తి సంబంధాలలో వ్యక్తి స్థానాన్ని వర్గం నిర్ణయించినట్టే, కులం నిర్ణయిస్తుంది. పుట్టుకే కులాన్ని నిర్ణయించడం వల్ల భూస్వామ్య వ్యవస్థలో అతను ఏ వర్గానికి చెందిన వ్యక్తో నిర్ణయింపబడేది. వివిధ వ్యవస్థల్లో వర్గం, కులం మధ్య సంబంధాలు మారుతూ వచ్చాయి.

భూస్వామ్య వ్యవస్థలో వర్గం, కులం దాదాపు ఒకటిగానే ఉన్నాయి. ఇక్కడ కులానికి, వర్గానికి మధ్య సన్నిహిత సంబంధం ఉండడంతో కులాన్ని పునాదిలో భాగంగా పరిగణించడం జరిగింది. సామాజిక ఉత్పత్తి విధానంలో కులం ప్రధాన భూమిక వహించడంతో దానికున్న బలమైన ప్రభావాన్ని విస్మరించలేం. వలస పాలన మొదలైన తర్వాత వర్గం–కులం మధ్య సంబంధాలలో మార్పులు వచ్చాయి. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు కుల అంతరాలను ధిక్కరించాయి. అన్ని కులాల్లోని ప్రజలు ఒక్కటై భూస్వాములను వ్యతిరేకించారు. కొన్ని చోట్ల జమీందారి వ్యతిరేక పోరాటాలు జరిగాయి. ఇది భూస్వామ్య వ్యవస్థలో ఏక ఛత్రాతిపత్యాన్ని నెరుపుతున్న  కొన్ని కులాల ఆధిపత్యాన్ని కూలదోసాయి. భూస్వామ్య వ్యవస్థను పెంచి పోషిస్తున్న బ్రాహ్మణీయ భావజాలానికి వ్యతిరేకంగా ప్రజలు చైతన్యవంతు లవ్వడంతో శూద్ర కులాలలోని కొన్ని కులాలు పైకి ఎగబాకడం జరిగింది. శూద్ర కులాల్లో వర్గవిభజన జరిగిన దరిమిలా, కుల అణచివేత నుండి ఈ కులాలకు అధిపత్య అగ్రకులాలు మినహాయింపు ఇవ్వాల్సిన పరిస్థితి ఏర్పడింది. అప్పటివరకు కుల అణచివేతను కొనసాగిస్తున్న అగ్రకులాల నుండి ఆ కులదురహంకారాన్ని వీరు లాక్కొని కొనసాగించడం మొదలు పెట్టారు. ఇది కుల సంబంధాల్లో మార్పులను తీసుకువచ్చింది.

వలసవాద పరిపాలన నేపథ్యం వల్ల, పెట్టుబడి భూస్వామ్య శక్తులతో, హిందూత్వ శక్తులతో సర్దుబాటు చేసుకోవడం వల్ల కులసమస్య కొనసాగడమే గాకుండా, నూతన రూపాలలో వేళ్లూనుకుంటోంది. సామ్రాజ్యవాదానికి తన మార్కెట్ ప్రయోజనాలతో పాటు, రాజకీయ అధికారాన్ని ప్రభావితం చేయాల్సిన అవసరం ఉంది. అందుకే కులాన్ని వాడుకోవడం వారికి అవసరమైంది. మరోవైపు సామాజిక ఉద్యమాల అదుపుకు, సమాజాన్ని కుల ప్రాతిపదికన విభజించి వర్గ ఐక్యతను దెబ్బకొట్టడానికి ఉపయోగ పడుతుంది. అందువల్ల దళితులపైనే కుల అణచివేత కొనసాగిస్తూ, శూద్రకులాలకు తాము అధికులమనే భావన కలిగిస్తుంది. వారిలోని అర్థిక అసమానతను పక్కనపెట్టి వారిని ఆత్మ నూన్యత చెందకుండా కుల అగ్రవర్ణ స్వభావం కాపాడుతూ ఉంటుంది.

రాజ్యంలోని అన్ని అంగాలు దళితులపై సాధ్యమైనంత వరకు వివక్షను కొనసాగించడానికి తమ అన్ని శక్తులు కేంద్రీకరిస్తాయి. వర్గదోపిడీని కొనసాగించడానికి, భూస్వామ్య శక్తులను సంతృప్తి పర్చడానికి కులాల స్థిరీకరణ అత్యంత అవసరం. అందుకే లౌకిక వ్యవస్థలో మతం, కులం తన ప్రాభవాన్ని కోల్పోకుండా ముఖ్యంగా ఎన్నికల్లో తమ అస్థిత్వాల్ని కాపాడుకుంటూ ఉంటాయి. రిజర్వేషన్లు దళితుల పురోగతికి ఉపయోగ పడుతున్నప్పటికీ, అది చాలా కొద్దిమందికి మాత్రమే ఉద్యోగ కల్పన కల్పిస్తోంది. అదేక్రమంలో కుల స్థిరీకరణకి ఉపయోగపడడమే గాకుండా, కింది కులాల్లో వైషమ్యాలు పెంచడానికి దోహదపడుతోంది. అందరికీ భూమి, ఉపాధి, ఆహారం అనే మౌలిక అంశాలకై పోరాడుతూనే కుల వివక్షను ఎదుర్కోవాల్సి ఉంది. కులనిర్మూలన కోసం అభ్యుదయకర శక్తులన్నిటితో  కలిసి పోరాటం చేయాల్సిన అవసరం  ఉంది.  దోపిడీకి గురౌతున్న అన్ని సెక్షన్ల ప్రజలను పోరాట స్రవంతిలోకి ఆహ్వానించడమే గాకుండా ఐక్యంగా ఉద్యమం చేయాల్సిన ఆవశ్యకత ఉంది.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# రంగనాయకమ్మ 'తత్వశాస్త్రం' గురించి

- తోలేటి జగన్మోహన్‌రావు

దేవతలు కూడా అడుగు పెట్టడానికి సాహసించని ప్రదేశాల్లోకి రంగనాయకమ్మ రెండో ఆలోచన లేకుండా దూకుతారు. 'కాపిటల్ పరిచయం' ఆ విషయాన్ని రుజువు చేసింది. ఇప్పుడు 'తత్వశాస్త్రం – చిన్న పరిచయం' మరోసారి రుజువు చేస్తోంది.

ఈ పుస్తక రచనా కాలం 2013 సెప్టెంబరు నుంచి 2014 మార్చి వరకూ – అంతవరకూ రంగనాయకమ్మకి తత్వశాస్త్రం చదవడం 'దండుగ, టైమ్ వేస్ట్' అనే అభిప్రాయం ఉండేదట. ఈ పరిచయంలో కూడా 'కేపిటల్ చదవాలి! తత్వశాస్త్రాల మీద టైము ఎందుకు?' (త.ప. పే. 220) అని చెప్పారు. తత్వశాస్త్రం అంటే రంగనాయకమ్మకి ఉన్న చులకన భావం అది.

'హెగెల్ 'లాజిక్'ను మొత్తం సంపూర్ణంగా అధ్యయనం చెయ్యకుండా, అర్థం చేసుకోకుండా, మార్క్స్ కేపిటల్‌ను, ముఖ్యంగా మొదటి అధ్యాయాన్ని, పూర్తిగా అర్థం చేసుకోవడం అసాధ్యం. పర్యవసానమేమిటంటే, అర్ధ శతాబ్దం తర్వాత మార్క్సిస్టు లెవ్వరూ మార్క్స్‌ను అర్థం చేసుకోలేదు...' అన్నాడు లెనిన్ (Lenin, Conspectus of Hegel's Logic).

హెగెల్ 'లాజిక్' సంగతి దేవుడెరుగు, కేపిటల్ పరిచయం చేసేనాటికి మార్క్సిస్టు తత్వశాస్త్రంలో ఓనమాలు కూడా తెలియని రంగనాయకమ్మకి కేపిటల్ పూర్తిగా అర్థమైందా?

మార్క్స్ తన అర్థశాస్త్ర విమర్శకు గతితార్కిక పద్ధతిని పునాదిగా మలుచుకున్నాడు అని ఏంగెల్స్ అన్నదాని మీద రంగనాయకమ్మ వ్యాఖ్య: '... కొన్ని మాటలు హెగెల్‌వి వాడితే సిద్ధాంతానికి అదే పునాది అవదు. మాటల్ని సరిగా ఎంచుకోకుండా ఏంగెల్స్ అలా రాసి ఉంటాడని అనుకుంటాను నేను' (త.ప. పే. 138)

'మార్క్స్ కేపిటల్‌లో అదనపు విలువ గురించిన నాలుగవ భాగం? సహకారంలో, శ్రమ విభజనలో, చేతి తయారీలో, యంత్రాలలో, ఆధునిక పరిశ్రమలో? పరిమాణాత్మక మార్పులు గుణాన్ని మార్చే, గుణాత్మక మార్పులు పరిమాణాన్ని మార్చే అసంఖ్యాకమైన విషయాల గురించి మాట్లాడుతుంది.... ఉదాహరణకు అనేకమంది సహకరించడం, అనేక శక్తులను ఒకే ఒక్క శక్తిగా ఐక్యం చెయ్యడం, మార్క్స్ మాటల్లో చెప్పాలంటే, ఒక 'నూతన శక్తి'ని సృష్టిస్తుంది. ఈ నూతన శక్తి ప్రత్యేక శక్తుల మొత్తం కంటే అనివార్యంగా భిన్నంగా ఉంటుంది....' Engels, Anti-Duhring, On Dialectical Materialism, P. 82).

కేపిటల్ వెనుకనున్న గతితార్కిక ఆలోచనా పద్ధతి పునాది అంటే అది. ఏంగెల్స్ చెప్పినదాన్ని గురించి జాగ్రత్తగా ఆలోచించడం కాక ఏంగెల్స్ మాటల్ని సరిగా ఎంచుకోక తప్పుగా చెప్పాడంటారు రంగనాయకమ్మ.

ఇనెస్సా ఆర్మండ్ అనే ఫ్రెంచ్ కమ్యూనిస్టు ఒక సందర్భంలో ఏంగెల్స్‌ను నిర్హేతుకంగా విమర్శించినప్పుడు, లెనిన్ ఆమెను మందలిస్తూ, మార్క్స్, ఏంగెల్స్‌లు మహా మేధావులనీ (రియల్ మెన్), వారిని విమర్శించేటప్పుడు జాగ్రత్తగా ఉండాలనీ, సలహా ఇచ్చాడు. ఈ సలహా రంగనాయకమ్మకి కూడా వర్తిస్తుంది.

'శ్రమ దోపిడీ రహస్యాన్ని బైటికి లాగిన కేపిటల్ పుస్తకం ద్వారానే మార్క్సిజం అంటే ఏమిటో తెలుస్తుంది...' అంటారు రంగనాయకమ్మ (త.ప. పే. 192).

మార్క్సిజం లోతుపాతులు అర్థం చేసుకోవాలంటే, కేపిటల్‌తో పాటు గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం వివరించే రచనలు కూడా చదవాలి. అవి చదివిన తర్వాత మాత్రమే కేపిటల్ వెనుకనున్న తాత్విక పునాది అర్థమవుతుంది.

మార్క్సిజం అంటే కేవలం అదనపు విలువ, శ్రమ దోపిడీ అనుకుని మూడు దశాబ్దాలకు పైగా అదనపు విలువా, శ్రమ దోపిడీ, కౌళ్లూ, వడ్డీలూ, లాభాలూ, శ్రమ సంబంధాలూ, మానసిక, శారీరక శ్రమలూ అంటూ పాట పాడుతున్నారు రంగనాయకమ్మ. ఇలా పాడడానికి కేపిటల్ చదవనక్కర్లేదు. మార్క్సిజంలో ఓనమాలు తెలియని వీధి మొగ కమ్యూనిస్టు నాయకులు అంతకంటే బాగా శ్రమ దోపిడి గురించి, వర్గ పోరాటాల గురించి, విప్లవాల గురించి మాట్లాడుతారు.

వెనకటికి ఎవరికో రామాయణమంతా విన్న తర్వాత రాముడికి సీత ఏమవుతుంది అని సందేహం వచ్చిందట. అలాగే మూడు దశాబ్దాలుగా శ్రమ దోపిడీ గురించి పాడుతున్న రంగనాయకమ్మకి ఇటీవల హఠాత్తుగా ఒక సందేహం వచ్చింది? 'శ్రమ శక్తి'ని ఒక సరకుగా చెప్పి మార్క్స్ ఒక తీవ్రమైన తప్పు చెయ్యలేదా? శ్రమ శక్తి ఒక సరకు అయితే, సరకుని కొన్న వాడే దాన్ని ఉపయోగించుకోవడం న్యాయమైన హక్కు అయితే, అది శ్రమ దోపిడీ ఎలా అవుతుంది?'

మార్క్స్ శ్రమ శక్తిని సరకుగా చెప్పి, కార్మికుడిని యజమాని ముందు తలవంచుకునేలా చేశాడనిపించింది ఆవిడకి. రంగనాయకమ్మకి చిట్కా వైద్యాలు చాలా తెలుసు. మార్క్స్ శ్రమ శక్తిని సరకు అనడం వలన ఈ చిక్కు వచ్చి పడింది కాబట్టి, శ్రమ శక్తి 'సరకు' కాదంటే పోలే? తలనొప్పి పోవాలంటే తల తీసేస్తే పోలే? రంగనాయకమ్మ మార్క్స్ తప్పును 'సరిదిద్ది', మార్క్స్ చేసిన తప్పువలన యజమాని ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేక తలవంచుకున్న కార్మికుడు మళ్లీ సగర్వంగా తలెత్తుకు నిలబడేటట్లు చేశారు. ఎంతో అద్భుతంగా, ఎంతో చాకచక్యంగా ఇంత గడ్డు సమస్యని పరిష్కరించారు కాని శ్రమ శక్తి ఒక సరకుగా మారి, ఆ సరకుని అమ్మడానికి కార్మికుడు, కొనడానికి పెట్టుబడిదారుడు, మార్కెట్లో కలసినప్పుడు, పెట్టుబడిదారీ విధానం ఉనికిలోకి వస్తుందన్న మార్క్స్ సూత్రీకరణ పునాది కూలిపోయింది. పునాది కూలిపోతేనేం? ఈ చిన్న మరమ్మత్తు తర్వాత గ్రామఫోను మళ్లీ శ్రమ దోపిడీ, కౌళ్లూ, వడ్డీలూ, అదనపు విలువా, లాభాలూ, శారీరక, మానసిక శ్రమలూ అంటూ పాడగలుగుతోంది కదా!

కేపిటల్ పరిచయం చేసిన మూడు దశాబ్దాల తర్వాత ఎందుకో రంగనాయకమ్మ దృష్టి తత్వశాస్త్రం మీద పడింది. కాపిటల్ పనైపోయింది, దీన్ని కూడా ఓ పట్టుపడదామనుకున్నారు కాబోలు, ఓ పాతిక గ్రంథాలు ఆరు నెలల పాటు తిరగేసి, అరటి పండు ఒలిచి, పండు పడేసి, తొక్క నోట్లో పెట్టినంత సరళంగా ఇప్పుడు ఈ పుస్తకాన్ని పాఠక లోకానికి సమర్పించారు.

తత్వశాస్త్రాన్ని కేవలం పరిచయం చెయ్యడమే కాదు, శ్రమ శక్తి విషయంలో మార్క్స్ చేసిన తప్పును 'సరిదిద్ది'నట్లు తత్వశాస్త్రంలో హెరాక్లిటస్, హెగెల్, మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ లాంటి తత్వవేత్తలు చేసిన, ఈ నాటి మార్క్సిస్టులు చేస్తున్న తప్పులు 'సరిదిద్దారు' రంగనాయకమ్మ . ఈ 'దిద్దుబాటు'తో మార్క్సిజంలో తత్వశాస్త్ర పునాది కూడా ఎగిరిపోయింది.

మార్క్సిజంలో ఆర్థిక పునాది, తత్వశాస్త్ర పునాది ఎగిరిపోయాకా; మార్క్స్, ఏంగెల్స్, లెనిన్‌ల తలలు ఎగిరిపోయాకా; మనకు ఫ్రేంలో కనిపించేది రంగనాయకమ్మే. మార్క్సిజంలో తప్పొప్పులు నిర్ణయించాలంటే ఇది వరకు మార్క్స్, ఏంగెల్స్, లెనిన్‌లను ప్రమాణాలుగా చూపించేవారు. ఆ పెద్ద తలలు ఎగిరిపోయాకా ఇప్పుడు రంగనాయకమ్మ సూత్రీకరణలకు రంగనాయకమ్మే ప్రమాణం అయ్యారు. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్ – ఎవరూ విమర్శకు అతీతులు కారు కాని సహేతుకమైన విమర్శ చెయ్యకుండా, 'నేను నమ్మను', 'నేను వినాలా?' అని రంగనాయకమ్మంటే మనం ఏం చెయ్యగలం?

ఇక 'తత్వశాస్త్రం – చిన్న పరిచయం' గురించి. మొదటి పేజీ నుండి చివరి పేజీ దాకా, పుస్తకమంతా రంగనాయకమ్మకి మార్క్సిస్టు తత్వశాస్త్రం అసలు ఏ మాత్రం అర్థం కాలేదనే విషయాన్ని స్పష్టం చేస్తుంది. వ్యాసం నిడివిని దృష్టిలో ఉంచుకుని అన్నింటి గురించి వివరంగా చర్చించలేక పోయినా ఇక్కడ ఒకటి రెండు విషయాలు మాత్రమే ప్రస్తావిస్తాను. ఒక్క మెతుకు పట్టుకుంటే అన్నం ఉడికిందో లేదో తెలుస్తుందనే సామెత ఉంది కదా! తత్వశాస్త్రాన్ని పరిచయం చెయ్యాలంటే కలం, కలంలో సిరా మాత్రమే సరిపోదు. తత్వశాస్త్రమే కాదు, అసలు ఏ శాస్త్రాన్ని పరిచయం చేసేటప్పుడైనా ఆ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అర్థమయ్యేదాకా అధ్యయనం చెయ్యాలి. ఆ శాస్త్రం చెప్పేది జీర్ణించుకోవాలి. ఆ తర్వాత తప్పులు లేకుండా స్వంత భాషలో చెప్పాలి. ఆ సమర్థత ఉన్నప్పుడే పరిచయం చెయ్యాలి. విషయాన్ని సమగ్రంగా అర్థం చేసుకోకుండా అక్కడో వాక్యం, ఇక్కడో వాక్యం తీసుకుని, తత్వశాస్త్రం చెప్పే సీరియస్ విషయాల్ని తన సహజ శైలిలో, వెటకారాలతో, వెక్కిరింతలతో పీకి పోగులు పెట్టారు రంగనాయకమ్మ.

తత్వశాస్త్రానికీ, జ్ఞాన సిద్ధాంతానికీ – రెంటికీ తేడా లేదు అనీ, తత్వశాస్త్రాన్ని 'జ్ఞానశాస్త్రం' లేక 'జ్ఞాన సిద్ధాంతం' అనవచ్చుననీ అంటారు రంగనాయకమ్మ. (త.ప. పే.187) తత్వశాస్త్రం అంటే ప్రపంచం గురించీ, ఈ ప్రపంచంలో భాగంగా మానవుడి స్థానం గురించీ ఒక దృక్పథం అని చెబుతారు తత్వవేత్తలు. జ్ఞాన సిద్ధాంతం అన్నది మార్క్సిస్టు తత్వశాస్త్రంలో ఒక భాగం మాత్రమే కాని అదే తత్వశాస్త్రం కాదు. అజ్ఞానాన్నుంచి జ్ఞానం ఎలా పుడుతుందో; అసంపూర్ణ, అసమగ్ర జ్ఞానం మరింత సంపూర్ణంగా, మరింత సమగ్రంగా ఎలా మారుతుందో – మార్క్సిస్టు జ్ఞాన సిద్ధాంతం జ్ఞానార్జనకు సంబంధించిన తాత్విక సమస్యలన్నీ చాలా లోతుగా చర్చిస్తుంది. లెనిన్ Empirio-criticismలో మనిషి జ్ఞానం ఎలా సంపాదిస్తాడు అన్న విషయం గురించి Theory of Knowledge అని పూర్తిగా ఒక అధ్యాయం ఉంది.

**రంగనాయకమ్మ 'జ్ఞాన సిద్ధాంతం' ఏం చెబుతోంది?**

'అప్పుడే పుట్టిన శిశు మానవులు తల్లిని పోల్చడం జ్ఞానానికి ప్రారంభ దశ.. పెరుగుతూ చెట్లనీ, పిట్లల్నీ గ్రహించే దశ జ్ఞానంలో రెండో దశ? శిశువుని పెంచే వాళ్ల తత్వమే శిశువుకి అందే ప్రారంభ తత్వం లేదా ప్రారంభ జ్ఞానం..' (త.ప. పే. 189)

'జ్ఞానం ఎలా వస్తుంది?'

'అది పిల్లల తల్లిదండ్రులకు ఉంటే, పిల్లలకు కూడా వస్తుంది'

'అది పిల్లల తల్లిదండ్రులకు ఎలా ఉంటుంది?'

'అదీ చెప్పాలా? అది, ఆ తల్లిదండ్రుల తల్లిదండ్రులకు ఉంటే. పిల్లలు, బైట కురిసే వానని చూసి తెల్లబోతోంటే, 'భూమి మీద నీళ్లే ఆవిరై పైకి పోయి మళ్లీ కింద పడతాయి' అని చెప్తే, అదే జ్ఞానం?' (త.ప. పే. 122).

ఒక సినిమాలో బ్రహ్మానందం 'నాలెడ్జ్ ఈజ్ డివైన్" అన్న దానికి అర్థం చెబుతూ, 'జ్ఞానం వైన్ లాంటిది. ఎంత తాగితే అంత బలం అన్న మాట' అంటాడు.

రంగనాయకమ్మ జ్ఞాన సిద్ధాంతం కూడా బ్రహ్మానందం 'జ్ఞాన' సిద్ధాంతం లాంటిదే...

గతితర్కం గురించి మార్క్సిస్టు తత్వవేత్తలు చాలా సరళంగా, సూటిగా చెప్పారు: 'ప్రకృతి, మానవ సమాజం, ఆలోచనలలో సంభవించే చలన, వికాసాల (మోషన్ అండ్ డెవలప్‌మెంట్) శాస్త్రం తప్ప గతితర్కం మరేమీ కాదు' (On Dialectical Materialism, Marx-Engels-Lenin, P. 91).

భౌతికవాదం గురించి అంతే స్పష్టంగా చెప్పారు. భౌతికవాదం, ఈ విశ్వాన్ని దేవుడు కాని, భావం కాని, సృష్టించి నడిపించడం లేదనీ, ఈ విశ్వం ఆద్యంతాలు లేక ఎప్పుడూ ఇలా ఉంటూ, తనంతట తానే చలిస్తోందనీ చెబుతుంది. భౌతికవాదం ప్రకారం పదార్థం ప్రాథమికమైనది. చైతన్యం పదార్థం నుంచి పుడుతుంది.

ప్రకృతిలోనీ, మానవ సమాజంలోనీ దృగ్విషయాలను మార్క్సిస్టు తత్వశాస్త్రం గతితార్కిక పద్ధతిలో (అంటే వాటి చలన, వికాసాలలో – పుట్టి, పెరిగి, నశించే క్రమంలో) అధ్యయనం చేస్తుంది కనుక గతితర్కం అన్న పదం, ఈ దృగ్విషయాలను భౌతికవాద పరంగా అర్థం చేసుకుంటుంది కనుక భౌతికవాదం అన్న పదం మార్క్సిస్టు తత్వశాస్త్రం గురించి చెప్పడానికి ప్రయోగించడం జరిగింది. ఈ రెండు పదాలను జోడిస్తే గతితార్కిక భౌతికవాదం అవుతుంది.

మార్క్సిస్టు తత్వశాస్త్రం ఇంత స్పష్టంగా గతితర్కం గురించీ, భౌతిక వాదం గురించీ చెబుతుంటే, విషయం అర్థం కాక ఈ పుస్తకంలో అనేక చోట్ల అనేక రకాలుగా చెప్పి ఒక గందరగోళాన్ని సృష్టించారు రంగనాయకమ్మ. 'హేతుబద్ధమైన తర్కం? లోపాలు లేనిదిగా ఏర్పడితే? 'గతితర్కం' అవుతుంది. (త.ప. పే. 24)

'ప్రకృతినీ, సమాజాన్నీ, సరైన జ్ఞానంతో అర్థం చేసుకునే మార్గం భౌతిక వాదమే. ఆ భౌతిక వాదాన్ని సరైన పద్ధతిలో అర్థం చేసుకునే మార్గం గతితర్కం' (త.ప. పే. 63)

'లోపాలు గల మొరటు భౌతికవాదం, గతి తర్క జ్ఞానాన్ని కూడా నేర్చుకున్నప్పుడు, అది 'సృజనాత్మక భౌతిక వాదం' అవుతుంది. దాని పేరు 'గతి తార్కిక భౌతిక వాదం' (త.ప., పే. 24)

'భౌతిక వాదం, గతి తర్క నియమాల్ని చేర్చుకుంటే అది గతితార్కిక భౌతిక వాదం అవుతుంది. అంత పెద్ద పేరు మరీ అట్టహాసంగా ఉంది గానీ, దాని అర్థం, 'సరైన తర్కం'. గతితర్కం అంటే 'సరైన తర్కం' అన్న మాట (త.ప. పే. 54).

మార్క్సిస్టు పదజాలాన్ని తన ఇష్టం వచ్చినట్లు మార్చెయ్యడం రంగనాయకమ్మకి ఒక అలవాటుగా మారింది. ఉత్పత్తి శక్తులను 'శ్రమ శక్తులు' అంటారు. ఉత్పత్తి సంబంధాలను 'శ్రమ సంబంధాలు' అంటారు. ఉత్పత్తి సాధనాలను 'శ్రమ సాధనాలు' అంటారు. తత్వశాస్త్రాన్ని 'జ్ఞాన శాస్త్రం' అంటారు. గతి తర్కాన్ని 'సరైన తర్కం' అంటారు. గతి తార్కిక భౌతిక వాదాన్ని 'సృజనాత్మక భౌతిక వాదం' అంటారు. ఒక శాస్త్ర పదజాలాన్ని కాని, భాషను కాని, ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు మార్చెయ్యకూడదు. అలా మారుస్తుంటే ఆ శాస్త్రం, భాష, అర్థం కాకుండా పోతాయి.

'నేను రైలెక్కి విజయవాడ వెడుతున్నాను' అంటే అందరికీ అర్థమవుతుంది. 'రైలును నేను 'కొబ్బరికాయ' అంటాను, నా ఇష్టం', అంటూ ఎవరైనా 'నేను కొబ్బరికాయ ఎక్కి విజయవాడ వెడుతున్నాను' అంటే జనానికి అర్థం కాక మరో 'కొబ్బరికాయ' ఎక్కించి విశాఖపట్టణం పంపించే ప్రమాదం ఉంది?...

ప్రకృతిలోగాని, సమాజంలోగాని, ఏ వస్తువైనా, దృగ్విషయమైనా, స్థిరంగా ఉండదనీ, పుట్టి, పెరిగి, అంతమయ్యే క్రమంలో, నిరంతర చలనంలో, ఉంటుందనీ చెబుతుంది గతితర్కం. ఆ కారణంగా ఏ దృగ్విషయాన్నయినా, వస్తువునైనా, సిద్ధంగా ఉన్న (రెడీమేడ్) దృగ్విషయంగా, వస్తువుగా చూడకూడదనీ, 'చలనం'లో ఉన్న విషయంగా పరిశీలించాలనీ అంటుంది గతితర్కం.

హెరాక్లిటస్ (క్రీ.పూ. 540–480) అనే ప్రాచీన గ్రీకు తత్వవేత్త, విశ్వంలో ఉన్న ఈ చలన స్వభావాన్ని వివరిస్తూ, 'ఒకే నదిలో రెండు సార్లు స్నానం చెయ్యలేం' అని ఒక ఉదాహరణ ఇచ్చాడు. ఈ నాటికీ రంగనాయకమ్మ లాంటి వారికి అర్థంకాని చలనాన్ని రెండువేల ఐదువందల సంవత్సరాల క్రితం వెల్లడించిన ఈ తత్వవేత్త గురించి రంగనాయకమ్మ వ్యాఖ్యలు:

'నదిలో నీళ్లని చూసి, ప్రకృతిలో అన్నీ మారుతూ ఉంటాయని చెప్పాడు. కానీ నూతిలో నీళ్లని చూస్తే ఏం చెపుతాడు? ప్రకృతిలో ఏదీ కదలదు అని చెపుతాడా?' (పే. 41) ఈ ఉదాహరణను వీధి అరుగుల మీద చుట్టలు కాల్చుకుంటూ కూర్చుని ఎడాపెడా మాట్లాడుకునే పుల్లయ్యల, ఎల్లయ్యల మాటలుగా (పే 12) ఎప్పుడో వేల సంవత్సరాల క్రితం 'ఒక తెలివిమాలిన పుల్లయ్య చెప్పిన తెలివి మాలిన ముచ్చట' (త.ప. పే. 19)

హెరాక్లిటస్ లాంటి గ్రీకు తత్వవేత్తల సూత్రీకరణలను, ప్రాథమికమైన, కాని ప్రపంచం గురించి సరియైన భావనగా, వర్ణించాడు ఏంగెల్స్. ఆయన ఇంకో పుల్లయ్య కదా?

లేళ్లు పరిగెడుతుంటే చూసి ముగ్ధుడైన కాళిదాసు కవిత్వం రాస్తే, 'గాడిదలు పరిగెత్తవా? కుక్కలు పరిగెత్తవా? లేళ్లు పరిగెడితే ఈయన కవిత్వం రాసెయ్యాలా?' అంటాడు మన గీరడు (గిరీశం). గీరడు, గీరమ్మల ఆలోచనా ధోరణి అలా ఉంటుంది, ఏం చెయ్యగలం?

'డెవలప్‌మెంట్' అనే ఆంగ్ల పదానికి మనం తెలుగులో 'అభివృద్ధి'. 'వికాసం', అని అర్థం చెప్పుకుంటున్నాం. గతితర్కంలో 'అభివృద్ధి', 'వికాసం', అంటే ఒక దశ తర్వాత మరొక దశలో ఏదో ఒక కొత్త విషయం సంభవిస్తూనే ఉంటుంది అని అర్థం. ప్రకృతి కాని, మానవ సమాజం కాని, ఉన్న స్థితిలో ఎక్కడా నిలిచిపోవు. సృష్టి, అలాగే మానవ సమాజం, అంతమయ్యే వరకూ అభివృద్ధి చెందుతూనే ఉంటాయి – అంటే ఒక దశ తర్వాత మరొక దశలో ఏదో ఒక కొత్త విషయం సంభవిస్తూనే ఉంటుంది.

గతితర్కం చెప్పే ఈ 'చలనం', 'అభివృద్ధి', అన్న పదాలు చెవిన పడితే రంగనాయకమ్మకి ఎందుకు అంత అశాంతి? ఎందుకు అంత ఆగ్రహావేశాలకు గురవుతోంది?

ఎందుకంటే, రంగనాయకమ్మకు తెలిసిన అరకొర మార్క్సిజం ప్రకారం పెట్టుబడిదారీ సమాజంలో శ్రమ దోపిడీ కారణంగా ఒక శత్రు వైరుధ్యం ఉంటుంది. ఈ శత్రు వైరుధ్యం ప్రజలు ఒక సమ సమాజం కోసం పోరాడేలా చేస్తుంది. ఈ పోరాట లక్ష్యం కమ్యూనిస్టు సమాజం. కమ్యూనిస్టు సమాజాన్ని చేరడంతో శత్రు వైరుధ్యం అంతమవుతుంది. సమ సమాజం ఏర్పడుతుంది. గమ్యం చేరేదాకా ప్రయాణం ఉంటుంది కాని గమ్యం చేరాక ఇంక ప్రయాణం ఉండకూడదు. సమానత్వం ఏర్పడడంతో సమాజ చలనం నిలిచిపోవాలి, నిలిచిపోతుంది. ఎందుకంటే సమానత్వం కన్నా ఉన్నతమైన, చేరవలసిన ఆదర్శం ఏమీ లేదు. కమ్యూనిజం తర్వాత మరో దశ ఉండదు. ఆ కారణంగా నిరంతర చలనాన్ని తిరస్కరించాలి? ఇదీ రంగనాయకమ్మ అవగాహన.

గతితర్కం చెప్పే నిరంతర చలనం రంగనాయకమ్మ ప్రపంచాన్ని తలకిందులు చేస్తోంది.

'అభివృద్ధి నిరంతరం జరిగిపోతూ ఉంటుంది' అని ఒక తత్వవేత్త చెప్పిన దానికి సంతోషించవచ్చుగానీ, ఆ అభివృద్ధి సూత్రం 'రేపు కమ్యూనిజం కొంప ముంచుతుంది' అని గ్రహించకపోతేనే, ఆ అభివృద్ధి సూత్రాన్ని పట్టుకుని సంతోషిస్తూ ఉండగలం' (త.ప. పే. 99)

'గతి తర్క శిష్యులకు ఎక్కడా హేతుబద్ధమైన వివేకం ఉన్నట్టు కనబడడం లేదు.' (త.ప. పే 153), అంటారు రంగనాయకమ్మ.

ఈ అవగాహనకు మూల కారణం 'మానవ సమస్యల పరిష్కారానికి గతితర్కం అక్కర లేదు...అసలు జరగవలసింది, 'అదనపు విలువ' సంగతి తెలుసుకోవడం, 'శత్రువర్గాల' సంగతి తెలుసుకోవడం. మానవ సమాజానికి కావలసింది అంతకన్నా ఏమీ ఉండదు' (త.ప. పే. 153) అన్న భావమే. మార్క్సిస్టు చారిత్రక భౌతిక వాదం గురించి ఏ మాత్రం తెలియకపోవడమే.

రంగనాయకమ్మ (త.ప.) 164 పేజీలో, మార్క్స్ రచన, 'A contribution to the critique of political economy', నుంచి ఒక కొటేషన్ (చాలా క్లుప్తంగా) ఇచ్చారు. మార్క్స్ అక్కడ చెప్పినదేమిటో చదివి జీర్ణించుకుంటే చారిత్రక భౌతిక వాదం అంటే అదనపు విలువ, శ్రమ దోపిడీ మాత్రమే కాదని అర్థమవుతుంది. గతంలో చరిత్ర వర్గ వైరుధ్యాల (రంగనాయకమ్మ భాషలో చెప్పాలంటే 'శత్రు వైరుధ్యాలు'), వర్గ పోరాటాల కారణంగా చలించడానికి కారణం: '..గతంలో, మానవ సమాజ పురోగమనంలో అన్ని దశలలోనూ ఉత్పత్తి చాలా తక్కువగా అభివృద్ధి చెందింది. ఆ కారణంగా చారిత్రక పురోగమనం ఇలా వైరుధ్య రూపంలో సాగింది. మొత్తం చారిత్రక పురోగమనమంతా ఒక చిన్న విశేషాధికారాలు గల అల్పసంఖ్యాకులకే అప్పగించబడింది...' – Engels, from Karl Marx, on Historical Materialism, P. 174) అని కూడా అర్థమవుతుంది.

వర్గాలు అంతమై కమ్యూనిస్టు సమాజం ఏర్పడడంతో మానవ సమాజ పూర్వ చరిత్ర (prehistory of human society) మాత్రమే ముగుస్తుంది కాని చరిత్ర ముగిసి పోదు. అంతవరకూ తనను కీలుబొమ్మలా ఆడించిన ప్రాకృతిక, సామాజిక శక్తులను మనిషి తన స్వాధీనంలోకి తెచ్చుకుని, చైతన్యవంతంగా తన చరిత్రను తాను లిఖించే దశ ప్రారంభమవుతుంది.

మార్క్స్, ఏంగెల్స్‌లు, కమ్యూనిజాన్ని మానవ సమాజం నిర్మించవలసిన ఒక ఉన్నతమైన ఆదర్శ వ్యవస్థగా చూడలేదు. ప్రస్తుత సమాజంలో జరుగుతున్న ఉత్పత్తి సామాజికీకరణా, వర్గ సంఘర్షణా ఆ దిశగా వాస్తవంగా చలిస్తున్నందున వారు కమ్యూనిజం గురించి చెప్పారు – అంతే.

'మా దృష్టిలో కమ్యూనిజం అన్నది మనం ఏర్పాటు చెయ్యవలసిన ఒక స్థితి కాదు, ఒక ఆదర్శానికి అనుగుణంగా వాస్తవం మారడం కాదు. కమ్యూనిజాన్ని, మేం ప్రస్తుత పరిస్థితిని రద్దు చేసే వాస్తవ చలనం (రియల్ మూవ్‌మెంట్) అంటున్నాం?..' – జర్మన్ ఐడియాలజీ, పే.35.

ప్రకృతిలోనూ, మానవ సమాజంలోనూ ఉండే చలన శీలతను దృష్టిలో ఉంచుకునే సోషలిస్టు సమాజం గురించి మాట్లాడినప్పుడు ఏంగెల్స్, '...సోషలిస్టు సమాజం అని మనం అంటున్నది మార్పుకు అతీతం కాదు అని నాకనిపిస్తోంది. ఇతర సామాజిక వ్యవస్థలలాగానే ఈ వ్యవస్థని కూడా నిరంతర అస్థిరతలోనూ (కాన్‌స్టెంట్ ఫ్లక్స్), మార్పులోనూ ఉండే వ్యవస్థగా భావించాలి.. ప్రస్తుతం ఉన్న వ్యవస్థకూ, ఈ వ్యవస్థకూ మధ్య కీలకమైన భేదం ఏమిటంటే? ఈ వ్యవస్థలో ఉత్పత్తి సాధనాలన్నీ జాతి ఉమ్మడి యాజమాన్యంలో ఉంటాయి. ఆ పునాది మీద ఉత్పత్తి ఏర్పాటవుతుంది...' ( Engels to Otto Von Boenigk in Breslau (Aug 21, 1890).

కమ్యూనిజం కూడా 'మారిపోతూ ఉండాలంటే, వర్గాలు లేని దశలో కూడా శతృత్వాలు ఉన్నాయని అర్థం వస్తుంది?' (త.ప. పే. 214) అంటారు రంగనాయకమ్మ .

'వర్గాలు లేని దశలో కూడా శతృత్వాలు' అంటే ఏమిటి? ఆవిడ చెప్పే 'శత్రు వైరుధ్యాలు' అనా? లేక వైరుధ్యం అనా? స్పష్టత లేదు. అందుకే మార్క్సిజం గురించి చెప్పేటప్పుడు ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు తోచిన పద్ధతిలో తోచిన పదాలు వాడకూడదని చెబుతున్నది. వైరుధ్యం అయితే అభిప్రాయ భేదం కూడా ఒక వైరుధ్యమే. కమ్యూనిస్టు సమాజంలో ప్రజలందరూ మూసపోసినట్లు ఒకేరకంగా ఆలోచించరు. ఒకే రకంగా ప్రవర్తించరు. అక్కడా అభిప్రాయ భేదాలు, వైరుధ్యాలు ఉంటూనే ఉంటాయి. ఆ కారణంగా కమ్యూనిస్టు సమాజం కూడా చలిస్తూనే ఉంటుంది.

'నిరంతర చలనం...మార్పు తర్వాత మార్పు...హెగెల్ చెప్పాడు కదా, ఏంగెల్స్ కూడా చెప్పాడు కదా అంటారా? (మార్క్స్ కూడా చెప్పాడు – తోలేటి) అవును, చెప్పారు. చెప్తే? ఒకరు చెప్పిన దాన్ని చెప్పినట్టు వినెయ్యడమేనా?...' (త.ప. పే. 147), అంటారు రంగనాయకమ్మ. చెప్పిందల్లా వినక్కర్లేదు. కాని విమర్శించే ముందు అసలు వాళ్లు ఏం చెప్పారో చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోవాల్సిన బాధ్యత ఉంటుంది కదా?.....

మార్క్సిస్టు చారిత్రక భౌతిక వాదం మానవ సమాజ వికాసంలో ఉత్పత్తి నిర్వహించే నిర్ణయాత్మక పాత్రను గుర్తించడంతో ప్రారంభమవుతుంది. మానవ సమాజం ఉండాలంటే ముందు మనిషి జీవించాలి. అతను జీవించాలంటే అతని జీవితావసరాలు? కూడూ, గుడ్డా, నీడాతో ప్రారంభించి నేటి ఆధునిక సమాజంలో వేల అవసరాల దాకా? అనేక అవసరాలు తీరాలి. ఈ అవసరాలు తీరాలంటే ఉత్పత్తి జరగాలి. ఈ ఉత్పత్తి నిలిచిపోతే మానవ సమాజం నిలిచిపోతుంది. మరో విషయం ఏమిటంటే ఒక అవసరం మరొక అవసరాన్ని సృష్టిస్తుంది. వ్యవసాయానికి నాగలి కావాలి, నాగలికి ఇనుప కర్రు కావాలి, ఇనుప కర్రు కావాలంటే ఇనుం తయారు కావాలి, గనులు తవ్వాలి...ఇలా

అనంతంగా ఒక అవసరం మరొక అవసరాన్ని సృష్టిస్తూ ఉంటుంది. మానవ సమాజం ఉన్నంత వరకూ ఉత్పత్తి శక్తులలో నిరంతర అభివృద్ధి ఉంటుంది, ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య అన్యోన్య క్రియ ఉంటుంది. ఉత్పత్తి సంబంధాలతో పాటు ఈ పునాది మీద ఏర్పడిన సామాజిక, రాజకీయ, మేధో జీవితం కూడా మారుతూనే ఉంటుంది.

వ్యక్తిగత ఆస్తి పునాదిగా గల సమాజాలలో ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య సంఘర్షణ వర్గ పోరాట రూపం తీసుకుంటుందని మనం పైన తెలుసుకున్నాం. మనిషి, ప్రకృతి సూత్రాలను అతిక్రమించ కుండానే, అర్థం చేసుకుని తన ప్రయోజనాలకోసం వినియోగించు కుంటున్నాడు. అలాగే కమ్యూనిస్టు సమాజంలో మనిషి సామాజిక చలన సూత్రాలను అతిక్రమించకుండానే, అర్థం చేసుకుని, అవి విపరీత పరిణామాలకు దారి తియ్యకుండా, తన ప్రయోజనాలకు అనుగుణంగా నియంత్రించి, వినియోగించుకోగలడు. మార్క్సిజం చెప్పేది ఇది.

ఇక ఉత్పత్తి శక్తుల గురించి రంగనాయకమ్మ  అవగాహన:

'....మార్క్స్ ఉత్పత్తి శక్తుల పెరుగుదల గురించి చెప్పిన విషయాల్ని ఆయా సందర్భాల్ని బట్టి చెప్పిన విషయాలుగా కాక, ఆ శక్తులు నిరంతరం పెరిగిపోతూ ఉండాలని మార్క్స్ చెప్పినట్లు, చాలామంది కార్మిక వర్గ మేధావులు అర్థం చేసుకుంటూ ఉంటారు.... అప్పటికే పెరిగిన ఉత్పత్తి శక్తులు సిద్ధంగా ఉండగా, అవి ఇంకా ఇంకా పెరగవలసిన అవసరం ఏమిటి? ...అసలు ఏదైనా పెరగడం అనే దానికి ఒక సహజ పరిమితి ఉంటుంది. ఫలానా ప్రాంతంలో ఉండే వేపచెట్టు ఎంత ఎత్తు పెరగాలో ఒక సహజ పరిమితి ఉంటుంది. ఉత్పత్తి శక్తులు పెరగడానికి సహజ పరిమితి ఏమిటి? జనాభా సంఖ్యని బట్టే ఆ పరిమితి. ఆ శక్తుల పెరుగుదలకి ఎక్కడా చివర ఉండనక్కర్లేదా?.(త.ప. పే. 182)

ఆదిమ సమాజంలో మనిషి రాతి పనిముట్లు చెయ్యడం ప్రారంభించినప్పటి నుంచీ వేప చెట్టు తన సహజ పరిమితిని దాటి పెరగలేదు, అలాగే జంతువులు కూడా తమ సహజ పరిమితిని దాటి పెరగలేదు. మరి మనిషి ఉత్పత్తి పరికరాలు? రాతి పనిముట్లు నేడు అత్యంత ఆధునిక ఫాక్టరీలుగా పరిణామం చెందలేదా? ఉత్పత్తి ఎంతో వైవిధ్య భరితంగా ఎన్నో లక్షల రెట్లు పెరగలేదా? ఉత్పత్తిని వేపచెట్టు ఎదుగుదలతో పోల్చడంలో ఏమైనా ఔచిత్యం ఉందా? 'ఉత్పత్తి శక్తులు పెరగడానికి సహజ పరిమితి ఏమిటి? జనాభా సంఖ్యని బట్టే ఆ పరిమితి'– ఈ మాటలకు ఏమైనా అర్థం ఉందా? జనాభా సంఖ్యలో పెరుగుదలకి అనుగుణంగానే ఉత్పత్తి పెరిగిందా?....

రంగనాయకమ్మ  నెగేషన్ ఆఫ్ నెగేషన్ గురించి కూడా ఈ పుస్తకంలో ప్రస్తావించారు. ఈ విషయం గురించి నేను ఇదివరలో ఒక వివరంగా ఒక వ్యాసం రాశాను (వీక్షణం, మార్చ్, 2014). పాఠకులు దానిని చూడవచ్చు?...

చివరగా మార్క్సిస్టు గతి తార్కిక పద్ధతి గురించి ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి. మార్క్సిస్టు గతి తార్కిక పద్ధతి ప్రపంచంలో ఏదీ స్థిరంగా ఉండదనీ, ప్రతీదీ ఉనికిలోకి వస్తూ, మారుతూ, నశిస్తూ ఉంటుందనీ, అర్థం చేసుకుంటుంది. ఆ కారణంగా గతితర్కం ఒక వస్తువు లేక దృగ్విషయం ఎలా, ఏ సూత్రాల ప్రకారం ఉనికిలోకి వచ్చి, అభివృద్ధి చెంది, మారుతోంది అన్నది అధ్యయనం చేస్తుంది. మన ఇచ్ఛకు వెలుపల వాస్తవంగా ప్రకృతిలో గాని, సమాజంలో గాని పని చేస్తున్న సూత్రాలను అధ్యయన సారంగా మాత్రమే గ్రహిస్తుంది. మార్క్సిస్టు గతి తర్కానికి సూత్రాలు, నియమాలు, ప్రారంభ బిందువు కాదు, అధ్యయనం తర్వాత ఏర్పడేవే. గతి తార్కిక సూత్రాలంటూ శాశ్వతంగా పని చేసే సూత్రాలున్నాయనీ, ప్రకృతి, సమాజం, ఎప్పుడూ ఆ సూత్రాల ప్రకారం నడుస్తూనే ఉంటాయనీ, మార్క్సిస్టు గతితర్కం చెప్పదు. అలా చెప్పడం భావవాదం అవుతుంది. ఒక వస్తువును, దృగ్విషయాన్ని పరిశీలించినప్పుడు, ఆ వస్తువు లేక దృగ్విషయంలో సంభవిస్తున్న మార్పు గతి తార్కిక సూత్రాలని చెప్పబడుతున్న వాటికి వాస్తవంగా అనుగుణంగా ఉందని తేలితే, ఆ విషయాన్ని స్పష్టం చేస్తుంది – అంతే. ఎందుకంటే, ఏంగెల్స్ చెప్పినట్లు ప్రకృతిలోనూ, సమాజంలోనూ, గతి తర్క సూత్రాలు పని చెయ్యడం అరుదేమీ కాదు. కాని మార్క్సిస్టు గతి తార్కిక పద్ధతికి భౌతిక వాస్తవం, ఆ భౌతిక వాస్తవంలో కలుగుతున్న చలనం, అభివృద్ధి మాత్రమే ప్రాథమికమైనవి కాని ఏ సూత్రాలూ కావు.

ముగించే ముందు బ్రహ్మానందం మార్క్ డైలాగులు మరికొన్ని?

వైరుధ్యం గురించి – '..అయితే ప్రకృతిలో, 'పులీ – మేకా' వ్యతిరేకత ఏమిటి? శతృత్వం కాదా? – కాదు. అయితే, శతృత్వం కానిది మిత్రత్వమే కదా? అది మిత్రత్వమా? – అదీ కాదు. ఆ రెండూ కానీ లక్షణం కూడా ఉంటుంది. అది ఎక్కడ ఉన్నా అది సహజత్వం?. మానవులతో సంబంధం లేకుండా అడవుల్లో ఏ జంతువుల మధ్య ఏది జరిగినా అది ప్రకృతి సహజత్వమే. కానీ మానవులు, తమ డబ్బు సంపాదనల కోసం, పులుల్ని తెచ్చి బోనుల్లో పెట్టి, వాటితో సర్కసులు చేయిస్తూ, వాటికి ఆహారాల్ని, మేకల్ని చంపి అందిస్తూ ఉంటే, లేదా మేకల్ని పులుల బోనుల్లోకి తోస్తే, అలాంటి సందర్భాల్లో పులీ – మేకా వ్యతిరేకత, అడవుల్లో జరిగే సహజత్వం కాదు, అది మానవుల నీచత్వం?.' (త.ప. పే 77).

(స్పేస్ అండ్ టైమ్ గురించి): 'స్థలం ఉంటుందో లేదో భూస్వాములు చెప్పగలరు. కాలం ఉంటుందో లేదో శ్రామికులు చెప్పగలరు' (పే. 132).

అది భౌతికవాదాన్ని విమర్శిస్తూ ఏంగెల్స్ ప్రతీ జీవి ప్రతీ క్షణంలోనూ 'తనుగానే ఉంటుంది, తన లాగే ఉండదు'; అని చెప్పాడు. ప్రతీ క్షణం జీవిలోని కణాలు నశిస్తుంటాయి. కొత్త కణాలు తయారవుతుంటాయి. కొంచెం ముందో వెనుకో ఆ జీవి శరీరంలోని పదార్థమంతా పూర్తిగా కొత్త పదార్థంతో నిండిపోతుంది. ఆ విధంగా ప్రతీ జీవీ ఎప్పుడూ 'తనుగానూ ఉంటుంది, తను కాకుండా మరోలాగానూ ఉంటుంది'. ( Anti-Duhring, On Dialectical Materialism, P. 65). ఏంగెల్స్ ను వెక్కిరిస్తూ? 'ఒక సెకన్ లో సుబ్బారావుగా ఉన్నవాడు, రెండో సెకన్ లో కొంత మారి సుబ్బారావుగా ఉంటూనే అప్పారావుగా కూడా అవుతాడు. మూడో సెకన్‌లో అప్పారావు నుంచి జోగారావు లోకి మారి, అప్పుడు సుబ్బారావు గానూ, జోగారావు గానూ అవుతాడు... (పే. 133)

పరిమాణం గుణంగానూ, గుణం పరిమాణంగానూ పరివర్తన చెందే సూత్రం గురించి? 'ఈ నియమం తెలియడం వల్ల...ఆనపకాయలకీ, పుచ్చ కాయలకీ, ఇంజక్షన్లు ఇచ్చి వాటి సైజుల్ని త్వర త్వరగా పెంచుతారు. వాటిని ఎక్కువ బరువులతో అమ్ముతారు......' (పే. 72).

పరమ సత్యం, సాపేక్ష సత్యం లాంటి సీరియస్ విషయాల గురించి? 'సర్వ కాలాల్లోనూ ఉండేది పరమ సత్యం.. పోల్చి చూసినప్పుడు మాత్రమే సత్యంగా ఉండేది, సాపేక్ష సత్యం...ఈ చెట్టు చాలా ఎత్తు..అక్కడ ఇతర చెట్లన్నీ దాని కన్నా చిన్నవి' (త.ప. పే. 123).

జ్ఞానం దిగువనుంచి ఎగువకు అభివృద్ధి చెందుతూనే ఉంటుంది, ఒక పరిమితికి చేరి నిలిచిపోవడం అంటూ ఉండదు అన్న ఏంగెల్స్ సూత్రీకరణ గురించి? 'భూమి బల్లపరుపుగా కాదు, గుండ్రంగా ఉంటుంది అని గ్రహిస్తే అది ఆ విజ్ఞానానికి అంతిమ దశ కాదా? ఆక్సిజనూ, హైడ్రోజనూ ఫలానారకంగా కలిస్తే నీరు? అని గ్రహిస్తే, అది ఆ విషయానికి అంతిమ దశ కాదా?' (త.ప. పే. 124).......

'పెద్ద మేధావులకు కూడా మార్క్సిజంలో ఇక్కడో ముక్కా, అక్కడో ముక్కా తప్ప, అంతకన్నా ఎక్కువేమీ తెలియదు...' (త.ప. పే 199). 'కొందరు మార్క్సిస్టులు 'కాపిటల్'ని ముట్టుకోకుండానే, మార్క్సిజంలో 'అ...ఆ..' లు కూడా తెలియకుండానే, 'మార్క్సిజం' అనే మాటనే వల్లె వేస్తూ, తమని మార్క్సిస్టులమని నమ్ముకుంటూ ఉంటారు....' (త.ప. పే. 192) అంటారు రంగనాయకమ్మ .

రంగనాయకమ్మ  కాపిటల్‌ని 'ముట్టుకున్నారు' గాని, ఈ తత్వశాస్త్రం పరిచయం ఆవిడని ఆ 'కొందరి మార్క్సిస్టులలో' ప్రథమ స్థానంలో ఉంచుతుంది. వీ

# మార్క్స్ చెప్పిందే, రంగనాయకమ్మ రాసింది!

- మంజరి లక్ష్మి

ఆగస్టు వీక్షణం పత్రికలో బ్రహ్మచారి రాసిన వ్యాసంలో రంగనాయకమ్మ రాసిన 'పెట్టుబడి పరిచయానికీ' కార్ల్ మార్క్స్ రాసిన 'పెట్టుబడి' పుస్తకానికి మధ్య శ్రమశక్తి విషయంలో తేడా ఉందనీ, రంగనాయకమ్మ కార్ల్ మార్క్స్ చెప్పినది తప్పుగా అన్వయించి రాశారని రాసుకొచ్చారు.

దానికి సమాధానంగా నేను విశాలాంధ్రవారి 'పెట్టుబడి' తెలుగు అనువాదం మొదటి భాగం చదివి ఇక్కడ రాస్తున్నాను.

శ్రమ చేసే మనుషులు తమ శ్రమతో తయారైన వస్తువులను లేదా తమ శ్రమలను (పని రూపంలో ఉన్నదైనా) ఒకరికొకరు మార్చుకోవటాన్నే మారకం అంటారు. వస్తువుల విలువ డబ్బురూపంలోనైనా, వస్తురూపంలోనైనా సమానంగా ఉంటుంది. మారకం జరిగేటప్పుడు కొనుగోలుదారుడు, అమ్మకందారుడు సరిసమానులే.

ఈ జనరల్ విలువ సూత్రాన్ని కారల్ మార్క్స్ పెట్టుబడి మొదటి భాగమైన 'సరుకులు డబ్బు' లో చాలా వివరంగా చెప్పాడు. ఈ సూత్రమే ఈ పుస్తకానికంతటికీ మూలాధారంగా నిలుస్తుంది. అంతే కాక సాధారణ మారకం విలువను శ్రమశక్తి విలువతో పోలుస్తూ కార్ల్ మార్క్స్ తరువాత అధ్యాయాలలో కూడా చెప్పాడు:

అధ్యాయం 5 'పెట్టుబడి సాధారణ సూత్రంలో వైరుధ్యాలు' నుంచి – మార్పిడి విలువల విషయంలో 'సమానత్వం ఉన్నచోట లాభం ఉండదు' (పెట్టుబడి మొదటి భాగం పేజీ 145)

'సమాన మార్పిడి విలువలున్న సరుకులూ లేదా సరుకులూ, డబ్బూ మార్పిడి చేయబడితే, చలామణిలోకి విసిరిన దానికంటే యే ఒక్కరూ ఎక్కువ విలువని గ్రహించలేరు. అందులో అదనపు విలువ సృష్టించబడదు.' (పెట్టుబడి మొదటి భాగం పేజీ 146)

కార్ల్ మార్క్స్ శ్రమ శక్తి గురించి మొదలు పెట్టటమే మారకం విలువ పెట్టుబడిదారీ వ్యవస్థలో వైరుధ్యంలో పడింది అనే దాంతోనే మొదలు పెట్టాడు. అంటే సరుకులూ డబ్బూ చాప్టర్లో డబ్బు గురించి కారల్ మార్క్స్ ప్రతిపాదించిన మారకం విలువ (జనరల్) సూత్రం పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యతిరేకంగా పనిచేస్తుందని స్పష్టంగా చెప్పాడు.

రెండో భాగం 'డబ్బు పెట్టుబడిగా మారటం' – 'పెట్టుబడి సాధారణ సూత్రం' (4వ అధ్యాయం) లో డబ్బూ, సరుకుల చలామణీ సాధారణ సూత్రానికి భిన్నంగా డబ్బు పెట్టుబడి చలామణి సూత్రం ఉంటుందని మార్క్స్ చెప్పుకొచ్చాడు. సరుకుల చలామణి సూత్రం సరుకు– డబ్బు– సరుకు అయితే పెట్టుబడి చలామణి సూత్రం డబ్బు– సరుకు–డబ్బు అని చెప్పాడు (పెట్టుబడి మొదటి భాగం 134 నుంచి 142వ పేజీ వరకు).

అధ్యాయం 5లో 'పెట్టుబడి సాధారణ సూత్రాలలో వైరుధ్యాలు' నుంచి: 'డబ్బు, పెట్టుబడి అయినప్పుడు, చలామణి తీసుకునే రూపం మనం ఇంతవరకు పరిశీలించిన సరుకుల స్వభావం, విలువ, డబ్బు, చలామణి వగైరాలకు వర్తించే నియమాలన్నిటికీ వ్యతిరేకంగా ఉంటుంది' (పెట్టుబడి మొదటి భాగం –పేజీ 143)

అధ్యాయం 6 'శ్రమ శక్తి క్రయ విక్రయాలు' లో 'డబ్బు గలవాడు మార్కెట్లో శ్రమ చెయ్యగల సామర్థ్యం, శ్రమశక్తి అనే ప్రత్యేక సరుకుని కనుగొంటాడు' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 153)

'కార్మికుడు తన శ్రమకు సాకార రూపాలైన సరుకుల్ని అమ్మే స్థితిలో ఉండటానికి బదులు, తనలోనే ఉండే తన సొంత శ్రమశక్తినే అమ్ముకోవలసిన పరిస్థితిలో ఉండాలి' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 154)

'ఈ స్వతంత్ర కార్మికుడు తనకి మార్కెట్లో ఎందుకు తారసపడతాడు అన్న విషయం పై డబ్బు యజమానికి ఆసక్తి లేదు...... ప్రస్తుతానికి ఆ విషయంపై మనకీ ఆసక్తి లేదు' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 155) అంటూనే మళ్లీ 'ఒక వైపున డబ్బు లేదా సరుకుల యజమానుల్నీ, మరోవైపున తమ సొంత శ్రమశక్తి తప్ప మరేమీ లేని మనుషుల్నీ ప్రకృతి సృష్టించదు. ఈ సంబంధానికీ ప్రాకృతిక పునాది లేదు. దీనికున్న సామాజిక పునాది సైతం అన్ని చారిత్రక దశలకు వర్తించే అంశం కాదు.' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 155)

పై కొటేషన్స్‌ను సరిగా చదివి అర్థం చేసుకోగలిగితే, 'శ్రమ శక్తి', అదనపు విలువను సృష్టిస్తుంది కాబట్టి, అది సరుకుకన్న భిన్నమైనది /ప్రత్యేకమైనది అనే అర్థాన్ని కూడా మార్క్స్ పక్క పక్కనే సమాంతరంగా సూచిస్తూ వచ్చాడనేది స్పష్టంగానే అర్థం అవుతుంది. అక్కడినించి, అసలు, శ్రమశక్తి విలువేమిటో మార్క్స్ ఇలా చెప్పుకొచ్చాడు:

'కార్మికుని పోషణార్థం అవసరమైన జీవనాధారాల విలువే శ్రమశక్తి విలువ' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 156)

'కార్మికుని పోషణార్థం అవసరమైన జీవనాధారాల విలువ, శ్రమశక్తి విలువ. అంటే జీవితావసర వస్తువులను అతను బయట ఉపయోగించటం వల్లనే, అతనికి శ్రమశక్తి కలిగి శ్రమ చెయ్యగల స్థితిలో ఉంటాడు'. (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 159)

శ్రమ శక్తిని కొనటమంటే అక్కడ జరిగేదేమిటో మార్క్స్ ఇలా చెప్పాడు:

పెట్టుబడిదారుడు ముందెళుతుంటే అతన్ని అనుసరిస్తూ కార్మికుడు వెళుతున్నాడు అనే సందర్భాన్ని వర్ణిస్తూ 'ఒకరు హుందాగా, ధీమాగా, వ్యవహర్తలా. మరొకరు పిరికిగా, సంకోచంగా, సొంతతోలు అమ్ముకోటానికి మార్కెట్‌కు వచ్చిన వాడిలా, తోలు ఒలిపించుకోడానికి సిద్ధంగా' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 161)

కొనుగోలుదారుడూ, అమ్మకందారుడూ సరిసమానులే అయినట్లయితే, ఎవరి వస్తువులు (పనులు) వారు అమ్ముకొని ఇళ్లకు వెళతారు కానీ ఎక్కడైనా అమ్మకందారుడు తోలు ఒలిపించుకోవటానికి కొనుగోలుదారుడి వెంట వెళతాడా? అమ్మకాలూ కొనుగోళ్ల లావాదేవీలలో, కొనుగోలుదారుని చేత అమ్మకందారుడు తోలు ఒలిపించుకోవాలి అనే నియమం ఎక్కడైనా ఉంటుందా? మార్క్స్ ఇంత పెద్ద చెణుకు, శ్రమశక్తి అమ్ముకున్నవాని మీద విసిరిన తరువాత కూడా శ్రమశక్తి సరుకు అవుతుందా?

అధ్యాయం 9 'అదనపు విలువ రేటు' లో (కార్మికుడు పెట్టుబడిదారుడి తో అనవలసిన మాటగా) 'నేను నీ కమ్మిన సరుకు మిగిలిన సరుకుల గుంపు కంటే భిన్నం. దాని వినియోగం విలువని సృష్టిస్తుంది, తన సొంత విలువకి మించిన విలువని సృష్టిస్తుంది' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 211) కార్మికుడి కోణం నుంచి మార్క్స్ ఈ మాటలు చెపుతున్నాడు అంటే ఇక్కడ అసమాన మారకం ఉన్నట్లే చెపుతున్నట్లయిందిగా!

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆస్తి హక్కులు పనిచేస్తాయని చెపుతూ, కార్మికుడు తన ఆస్తి అయిన శ్రమశక్తిని ఎక్కువ గంటలు పనిచేయించటం ద్వారా తన జీవిత కాలాన్నే పోగొట్టుకుంటున్నాడు కాబట్టి, తను తన జీవ నాధారాల విలువ వరకే (విలువంటే ఇన్ని గంటల శ్రమ అనే) పని చేస్తానని చెప్పాలనీ, దాని కోసం అతను పోరాడాలనీ చెపుతూ, అది పెట్టుబడిదారుని ఆస్తి హక్కులకు విరుద్ధంగా పని చేస్తుందని కూడా చెపుతాడు ఇలా:

'కార్మికుని పని దినాన్ని మామూలు కాల పరిమితికి కుదించటానికి

ప్రయత్నిస్తున్నప్పుడు ఒక విక్రేతగా తన హక్కును కాపాడుకుంటున్నాడు. కనుక ఇక్కడ ఒక వైరుధ్యం, హక్కుకు వ్యతిరేకంగా హక్కు తలెత్తిందన్నమాట' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 212)

'సమాజంలో ఒక విభాగానికి ఉత్పత్తి సాధనాలపైన గుత్తాధిపత్యం ఉన్న ప్రతిచోటా కార్మికుడు, స్వతంత్రుడైనా కాకున్నా, తన సొంత పోషణకి అవసరమైన కాలానికి తోడు, ఉత్పత్తి సాధనాల ఆసామి జీవితావసర సాధనాలను ఉత్పత్తి చేయటానికి, అదనపు పని కాలాన్ని జోడించాలి.' (పెట్టుబడి మొదటి భాగం – పేజీ 213)

'శ్రమించే వాళ్లు , వాస్తవంలో (ధనవంతులనబడే) పింఛనుదారుల్నీ, తమనీ పోషించుకుంటారు' (పెట్టుబడి మొదటి భాగం పేజీ 213 పాద సూచికలో) మార్క్స్ చెప్పిన పై కొటేషన్లను చూస్తే కార్మికుడు తన జీవితావసారాల వస్తువులే కాక, పెట్టుబడిదారుని జీవితావసర వస్తువులు కూడా తనే తయారుచేస్తాడు అన్నప్పుడు, అసలు పెట్టుబడిదారుడు కార్మికునికి ఇచ్చినది ఏముంది?

శ్రమశక్తి కొన్న పెట్టుబడిదారుని గురించి మార్క్స్ ఎంత ఎగతాళిగా మాట్లాడాడో, పెట్టుబడి మొదటి భాగం లో 174 నుంచి 176 వరకు ఉన్న పేజీలలో పరిశీలించవచ్చు.

కార్మికుడు శ్రమశక్తి విలువ తీసుకోక పోవటమే కాక, తనే పెట్టుబడిదారుడికి ఎడ్వాన్సు చేస్తాడు, అదనపు విలువను కూడా ఉత్పత్తి చేసి ఇస్తాడు అని చెపుతూ ఇలా రాశాడు:

అధ్యాయం 23 'సామాన్య పునరుత్పత్తి' లో: 'ఆవిరి యంత్రానికి బొగ్గూ, నీరూ, చక్రానికి చమురూ, యే విధంగా సరఫరా చేయబడతాయో, అదే విధంగా తన శ్రమశక్తిని పోషించుకోవటానికి అవసరమైన వస్తువులను, కార్మికుడే స్వయంగా సమకూర్చుకుంటాడు.' (పెట్టుబడి పరిచయం మొదటి భాగం–525 పేజీ)

'తన శ్రమశక్తిని వెచ్చించి, దాని విలువను మాత్రమే కాక, ఇంకొంత అదనపు విలువను కూడా సరుకుల్లో ఇమిడ్చేటంత వరకూ , కార్మికునికి వేతనం చెల్లించబడదు. కాబట్టి వేతనాల రూపంలో తిరిగి తనకు చెల్లింపు కాక పూర్వమే, కార్మికుడు అదనపు విలువను మాత్రమే కాక, అస్థిర పెట్టుబడిని కూడా ఉత్పత్తి చేస్తాడు'. (పెట్టుబడి పరిచయం మొదటి భాగం–521 పేజీ)

'కార్మికునిచే నిరంతరం పునరుత్పత్తి చేయబడుతున్న వుత్పాదితంలోని ఒక భాగమే, వేతనాల రూపంలో తిరిగి అతనికి చెల్లించబడుతుంది.' (పెట్టుబడి పరిచయం మొదటి భాగం–521 పేజీ)

'ఒక పెట్టుబడిదారుడికీ, ఒక కార్మికుడికి బదులుగా కార్మికవర్గాన్నీ, పెట్టుబడిదారీ వర్గాన్నీ, మొత్తంగా తీసుకొని ఆలోచిస్తే డబ్బు జోక్యం వల్ల ఏర్పడ్డ భ్రమలు పటాపంచలవుతాయి. కార్మిక వర్గంచే వుత్పత్తి చేయబడి, పెట్టుబడిదారీ వర్గంచే కైవసం చేసుకోబడిన సరుకులలో, ఒక భాగాన్ని పెట్టుబడిదారీ వర్గం కార్మిక వర్గానికి యెల్లప్పుడూ డబ్బు రూపంలో ఆజ్ఞా పత్రాలను (ఆర్డర్–నోట్స్) జారీ చేస్తుంది. కార్మికులు తాము పొందే ఈ ఆజ్ఞాపత్రాలను, అదే విధంగా పెట్టుబడిదారీ వర్గానికి తిరిగి యెల్లప్పుడూ యిచ్చివేస్తూ, తద్వారా తమ స్వీయోత్పత్తిలో కొంత భాగాన్ని తమ వాటాగా పొందుతారు' (పెట్టుబడి పరిచయం మొదటి భాగం–522 పేజీ)

'కార్మికుని శ్రమ ఫలితంగా సృష్టించబడిన వుత్పాదితాన్నే, పెట్టుబడిదారుడు కార్మికునికి అడ్వాన్స్ చేస్తున్నాడనే విషయాన్ని ఈ (డబ్బు) లావాదేవీలేవీ తలక్రిందులు చేయలేవు' (పెట్టుబడి పరిచయం మొదటి భాగం–522 పేజీ)

మార్క్స్ ఈ విధంగా మొదట శ్రమశక్తి గురించి, 'అవును సరుకే' అని ప్రారంభించి 'అదెంత భ్రమో' చివరికి తేల్చి చెప్పాడు. శ్రమ శక్తి సరుకు కాదు అనే సత్యాన్ని ఈ విధంగా చివరికి నిరూపించాడు.

ఇంతే కాకుండా, ఒకవేళ కార్మికుడికి జీతంగా పెట్టుబడిదారుడు నిజంగా తను అంతకుముందు శ్రమచేసిన దానినుంచే చెల్లించినప్పటికీ, అదనపు విలువ ప్రతి సంవత్సరం 20 శాతం అనుకుంటే, అతని పెట్టుబడి 5సంవత్సరములలో వెనక్కి వచ్చేస్తుందనీ, అక్కడినుంచి పెట్టుబడిదారుడు చెల్లించేది శ్రామికుడి అదనపు విలువలోనుంచేనని కూడా పేజీ 523 నుంచి పేజీ 524 వరకు రాసిన దానిలో స్పష్టంగా చెప్పాడు.

'పెట్టుబడి యజమాని, తన వ్యక్తిగత శ్రమ ద్వారా మొదట్లో పెట్టుబడిని కూడబెట్టినప్పటికీ, అది ఉత్పత్తి క్రమంలోకి ప్రవేశించగానే, కాస్త ముందు వెనుకగా, వేతనం లేని శ్రమగా డబ్బు రూపంలోనో లేక వస్తు రూపంలోనో యిమడ్చబడి, యే విధం అయిన సమాన ప్రతిఫలం లేని స్వాహా చేయబడిన విలువగా మారుతుంది.' (పేజీ –524 )

శ్రామికులకూ, బానిసలకూ భేదమేమీ లేదని చూపించటానికి మార్క్స్, ఈ పుస్తకంలో పేజీలకు పేజీలే రాసుకుంటూ పోయాడు. మార్క్స్ పెట్టుబడిదారునికీ, శ్రామికునికీ మధ్య ఉన్నది కేవలం అమ్మే, కొనే సంబంధమే అనేదే అని నిరూపించాలనుకుంటే/ చెప్పాలనుకుంటే, ఇంత ఇదిగా ఇన్ని పేజీలు రాయవలసిన పనేముంది? ఆ ఒక్క ముక్కే రాసేస్తే పోయేదిగా? అసలు ఆ ఒక్క ముక్క మాత్రం రాయాల్సిన పని కూడా ఆయనకేముంది? ఎందుకంటే అప్పటికే బూర్జువా ఆర్థిక వేత్తలు ఆ విషయాన్ని కోడై కూస్తునే ఉన్నారు కదా!

మొదట శ్రమశక్తి సరుకు అనీ, తరువాత శ్రామికుడు ఎక్కువ గంటలు పని చేయటం ద్వారా అదనపు విలువని ఇస్తున్నాడనీ, అందువలన పెట్టుబడిదారుడికీ, శ్రామికుడికీ మధ్య అసమాన మారకం ఉందనీ చెపుతూ, చిట్టచివరికి అసలు పెట్టుబడిదారుడు ఇచ్చేదేమి లేదు, శ్రామికుడే పెట్టుబడిదారుడికి కూడా జీవనాధార వస్తువులను తయారుచేసి ఇస్తున్నాడనీ, చివరికి పెట్టుబడిదారుని శ్రమ నుంచి కార్మికుడికి ముట్టేదేమీ లేదనీ చెప్పటం ద్వారా, వారి మధ్య మారకమే లేదని పై కొటేషన్ల ద్వారా మార్క్స్ స్పష్టంగానే చెప్పాడు.

రంగనాయకమ్మ 'పెట్టుబడి పరిచయంలో' రాసిన విషయాలు 100 శాతం శాతం కరెక్టేననీ, ఆమె రాసినది మార్క్స్ చెప్పినదేనని పైన చూపించిన ఉదాహరణలు రుజువు చేస్తున్నాయి. బ్రహ్మచారికి మార్క్స్ చెప్పదల్చుకున్నది ఏమిటీ, దాన్ని ఆయన తన శైలి, తన పద్ధతుల్లో ఎలా చెప్పుకొచ్చాడు– అనేది సరిగా చదివి అర్థంచేసుకొని అన్వయించుకోవటం చేతకాలేదు. మార్క్స్, శ్రమశక్తి సరుకు అన్నాడు రంగనాయకమ్మ కాదు అంది – అన్న ఉత్త పిడివాదంతో వాదిస్తున్నారు. ఆమె మార్క్స్ చెప్పిన విధంగానే పెట్టుబడి దారుడి కోణంలో శ్రమశక్తి సరుకు అని చెపుతూనే, మార్క్స్ నిరూపించిన సిద్ధాంతం ప్రకారమే, శ్రమశక్తి ఎలా సరుకు కాదో, అనేది కూడా తన 'పెట్టుబడి పరిచయం' పుస్తకంలో స్పష్టంగానే చెప్పారు. కాబట్టి ఆమె రాసిందీ, మార్క్స్ చెప్పిందీ ఒక్కటే. కాబట్టి 'పెట్టుబడి పరిచయం' మార్చి రాయవలసిన పని ఆమెకేమీ లేదు. మనమే మన బుర్రల్లో ఉన్న బూజును (రంగనాయకమ్మ మీద వ్యతిరేకత అనే బూజును కూడా) దులుపుకొని చదువుకుంటే అంతా సరిపోతుంది.

ఆగస్టు వీక్షణం పత్రికలో బ్రహ్మచారి రాసిన వ్యాసంలో బ్రహ్మచారి రంగనాయకమ్మ రాసిన అనుత్పాదక శ్రమ విషయంలో కూడా తేడా ఉందనీ, రంగనాయకమ్మ మార్క్స్ చెప్పినది తప్పుగా అన్వయించి రాశారని రాసుకొచ్చారు. దానికి ఈ క్రింది వివరణ రాస్తున్నాను:

'ఇంటికొచ్చి కోటు కుట్టిన జాబింగ్ టైలర్ అనుత్పాదక శ్రామికుడు' అని మార్క్స్ చెప్పాడని బ్రహ్మచారి అంటున్నారు. కానీ ఈ క్రింద ఇచ్చిన మార్క్స్ కొటేషన్ దానికి భిన్నంగా ఉంది:

When I have a coat made for me at home by a jobbing tailor, for me to wear, .. the purchaser of tailoring labour and the jobbing tailor confront each other as mere buyers and sellers. One pays money and the other supplies the commodity into whose use-value my money

is transformed. In this transaction there is no difference at all from my buying the coat in a shop. Buyer and seller confront each other simply as such. – Karl Marx (అదనపు విలువ సిద్ధాంతాలు –1)

దీనికి తెలుగు: 'నేను తొడుక్కోవటానికి, ఒక టైలర్‌తో, ఇంటి దగ్గరే ఒక కోటుని తయారు చేయించుకున్నప్పుడు … కుట్టు శ్రమని కొన్నావాడూ, కోటుని కుట్టిన టైలరూ, కేవలం కొనుగోలుదారుడుగానూ, అమ్మకందారుడు గానూ మాత్రమే ఒకరికొకరు ఎదురవుతారు. ఒకరు డబ్బు చెల్లిస్తే, ఆ డబ్బు ఏ ఉపయోగపు విలువ రూపంలోకైతే మారిందో, ఆ ఉపయోగపు విలువని ఇంకొకరు సరుకుగా చెల్లిస్తారు. ఈ లావాదేవికీ, నేను ఒక షాపు నుంచి కోటుని కొనటానికీ తేడా ఏమీ ఉండదు. ఇక్కడ కొనుగోలుదారుడూ, అమ్మకందారుడూ ఒకరికొకరు ఎదురవుతారు' అని స్పష్టంగా చెప్పాడు.

ఈ కొటేషన్నే పియానో శ్రామికుడికి కూడా అన్వయిస్తే, అక్కడ చెప్పే విషయంలో మార్క్స్ పొరపాటుగా చెప్పాడనే అర్థానికే రావలసి వస్తుంది. కాబట్టి బట్టలు కుట్టే టైలరూ, పియోనాలు తయారు చేసే వ్యక్తీ, ఇద్దరూ కూడా స్వతంత్ర శ్రామికుల క్రిందకే వస్తారు.

డాక్టర్ల శ్రమ, టీచర్ల శ్రమ లాంటి మేధా శ్రమలు ఎలాగైతే స్వతంత్రంగా ఉండచ్చో, అలాగే కుట్టు శ్రమ, పియోనాలు చేసే శ్రమ, పరుపులు కుట్టే శ్రమలు (వస్తు రూపంలో కాకుండా పని రూపంలో ఉన్న శ్రమలన్నీ) కూడా స్వతంత్రంగానే ఉండచ్చు. కానీ బ్రహ్మాచారి 'స్వతంత్ర ఉత్పత్తిదారుడు సొంతశ్రమతో చేసిన సరుకులు అమ్ముతాడు. శ్రమని అమ్మడు' అనీ 'శ్రమని అమ్మేవాడు వేతనశ్రామికుడు, స్వతంత్ర ఉత్పత్తిదారుడు కాడు' అనీ అంటున్నారు. బ్రహ్మాచారి చెప్పేదాన్ని చూస్తే, పని రూపంలో ఉన్న ఏ శ్రమైనా 'అనుత్పాదక శ్రమే' అనాల్సి ఉంటుంది. అయితే ఇది ఒక్క స్వతంత్ర ఉత్పత్తి దారుడికే ఎందుకు అన్వయించాలి. ఉత్పాదక శ్రమలు చేసేవాళ్లకు కూడా దీన్ని అన్వయించాలి కదా. అలా అన్వయిస్తే 'పని'(సేవల) రూపంలో ఉన్న అనేక శ్రమలను అమ్మి పెట్టుబడిదారులు అదనపు విలువను సంపాదిస్తున్నా రన్నది మనం రోజూ కళ్ల ముందర చూస్తున్న విషయమే. మార్క్స్ ప్రకారం 'అదనపు విలువని ఇచ్చే శ్రమ ఉత్పాదక శ్రమ'. అయితే అదనపు విలువను సంపాదించటానికి ఉపయోగపడే శ్రమ ఇక్కడ 'పని' రూపంలో ఉంది కాబట్టి, దాన్ని ఉత్పాదక శ్రమ అనటం బ్రహ్మాచారి చెప్పిన ప్రకారం కరెక్ట్ కాదన్న మాట. అలా కాకుండా ఒక యజమాని క్రింద 'పని' రూపంలో శ్రమ చేసేవాడు కూడా ఉత్పాదక శ్రామికుడే అవుతాడు అనేట్లయితే, తనకు యజమాని లేకుండా, తను ఒకరికి యజమాని కాకుండా 'పని' చేసుకునే వాడు స్వతంత్ర శ్రామికుడు ఎందుకు కాకూడదు?

మీ దగ్గరే ఇంత గందరగోళం పెట్టుకొని రంగనాయకమ్మది తప్పనటమేమిటీ?

వస్తు రూపంలో ఉన్నదే ఉత్పత్తి కాదు ఒక పని రూపంలో ఉన్నది కూడా ఉత్పత్తే. ఎవరి క్రిందా జీతానికీ, కూలీకీ పని చేయకుండా, శ్రమని 'పని' రూపంలో అమ్ముకునే వాళ్లు కూడా స్వతంత్ర శ్రామికులే అవుతారు. డాక్టర్లు, టీచర్లు చేసేది 'పని' రూపంలో ఉండే శ్రమే. ఉదాహరణకు ఒక డాక్టరు స్వతంత్రంగా ప్రాక్టీసు పెట్టుకొని వైద్య సేవను అందిస్తూ ఉన్నట్లైతే, పేషంటు ఆ డాక్టరు సలహా తీసుకొని వెళ్లి, తన రోగం నయమవ్వటానికి కావలసిన, మందులూ, ఇంజక్షనులూ, తన డబ్బుతోనే కొనుక్కుంటాడు కదా!ఇప్పుడైతే బ్రహ్మాచారి ప్రకారం ఆ డాక్టరు తన శ్రమతో ఏ వస్తువును ఉత్పత్తి చేసీ అమ్మడు కాబట్టి, డాక్టరు అనుత్పాదక కార్మికుడూ, పేషంటు యజమానా? అలాగే స్వతంత్రంగా పాఠాలు చెప్పుకునే టీచరు, పాఠాలు చెప్పే పని మాత్రమే చేస్తుంది కానీ, తన శ్రమతో ఏ వస్తువునూ తయారుచేసి అమ్మదు. పిల్లలు చదువుకొనే పుస్తకాలూ, రాసుకొనే పుస్తకాలూ వాళ్లే కొని తెచ్చుకుంటారు. కాబట్టి ఇక్కడ పిల్లలు యజమానులూ, టీచరు అనుత్పాదక కార్మికురాలు అయిపోతుందా?

బ్రహ్మాచారి ప్రకారం అసలు ఏదీ రెండో వైపు చూడకూడదు కదా. ఈ స్వతంత్ర శ్రామికుడి నిర్వచనం మాత్రం అసలెందుకు చూడాలి ఇక్కడ. మార్క్స్ చెప్పాడంటున్న ఒక్క సూత్రాన్నే ఉపయోగించుకుంటే పోలా!

'ఆదాయంతో మారే శ్రమ అనుత్పాదక శ్రమ. దాన్నిబట్టి చూస్తే వాళ్లు అనుత్పాదక శ్రామికులే.' (బ్రహ్మాచారి)

'సంపాదనలోంచి ఖర్చు చెయ్యటమనే సూత్రమే అన్నిటికీ బండగా ఉపయోగించాలంటే, వస్తువుల్నీ, సేవలనూ కొనే ప్రతి ఒక్కరూ కూడా యజమానులూ, వారి ఎదురుగా ఉన్న వారు పెద్ద పెట్టుబడిదారుడా, చిన్న పెట్టుబడిదారుడా, వర్తక పెట్టుబడి దారుడా, స్వతంత్ర వర్తకుడా, స్వతంత్ర ఉత్పత్తిదారుడా అనే యే భేదాలూ లేకుండా అందరూ అనుత్పాదక కార్మికులై పోతారన్నమాట. ఎందుకంటే ఎవరైనా వస్తువులనూ, సేవలనూ కొనేది వాళ్ల ఆదాయాలతోనే కదా! ఇంకసలు, బ్రహ్మాచారికి, కొనుగోలుదారుడికి అవతలివైపున్న వ్యక్తుల గురించిన నిర్వచనాలు చూడాల్సిన పని కూడా ఉండదు. ఈయన వరస చూస్తే, మార్క్స్ విడగొట్టి చెప్పిన అన్నిరకాల విభాగాలు పోయి కొనుగోలుదారులూ, అమ్మకందార్లూ కూడా లేకుండా పోయి, ఉట్టి యజమానులూ అనుత్పాదక కార్మికులే మిగిలేటట్టున్నారు. ఈ లెక్కన ఈయన చెప్పేది మార్క్సిజం కాదేమోననిపిస్తుంది.

నాకర్థమైన ప్రకారం ఉత్పాదక, అనుత్పాదక సూత్రం పెట్టుబడిదారులకే ఎక్కువగా వర్తింపచేయాలి. వాళ్లు పనిస్థలాల్లో జీతం ఇచ్చి పని చేయించుకునే కార్మికుల నుంచి అదనపు విలువను సంపాదిస్తారు. కాబట్టి అక్కడ పనిచేసే కార్మికులు ఉత్పాదక కార్మికులు. పెట్టుబడిదారుడు తన ఇంటిలో పనివాళ్లను పెట్టుకొని పని చేయించుకొనే దానిలోంచి అదనపు శ్రమనే,

అదనపు విలువని (అదనపు డబ్బుని) సంపాదించే వీలు లేదు. పైగా తను సంపాదించిన అదనపువిలువ నుంచే, వాళ్ల జీతాలకు ఖర్చు పెట్టాలి. కాబట్టి వాళ్లు అనుత్పాదక కార్మికులు. అయితే వాళ్లనుంచి పెట్టుబడిదారుడు అదనపు శ్రమను మాత్రం లాగగలుగుతాడు.

అలాగే పన్నులూ, కమీషన్లూ, వడ్డీలూ మొదలైన ఆదాయాలను ఖర్చుపెడుతూ ఉండే ప్రభుత్వ సంస్థలలోనూ, వర్తక, వడ్డీ పెట్టుబడిదారుల దగ్గర పనిచేసే వాళ్లూ అనుత్పాదక కార్మికులవుతారు.

కొద్దిమందే అయినా మేధాశ్రమలు చేసేవాళ్లు కూడా, తమ ఇళ్లల్లో జీతానికి పనివాళ్లను పెట్టుకొని చేయించుకుంటారు కాబట్టి, గృహ పరిధి వరకూ, మేధా శ్రామికులను యజమానులుగాను, వాళ్ల దగ్గర శారీరక శ్రమలు చేసేవాళ్లను అనుత్పాదక కార్మికులుగాను చెప్పుకోవలసి ఉంటుంది.

బ్రహ్మాచారి రెండు చూపులతో కాకపోయినా, ఒక చూపుతోనన్నా చూసి ఉంటే బాగుండేది. మరీ ఆయన అరచూపునే ఉపయోగించి నట్లున్నారు. ఆయన ఇచ్చిన మార్క్స్ కొటేషన్‌కు కంటిన్యూయేషన్ గానే నేను పైనిచ్చిన కొటేషన్ కూడా ఉంది. అయినా సగమే చూశారు ఎందుకో మరి!

గుడ్డెద్దు చేలో పడ్డట్టు చదువుకుంటూ పోతే ఎవరూ ఏ సత్యాన్ని కనుక్కోలేరు. చదివే పుస్తకంలో తేడాలుంటే వాటిని మన తర్కబుద్ధిని ఉపయోగించి పరిష్కరించి సత్యాన్ని తెలుసుకోవాలి. రంగనాయకమ్మ ఆ పనే పెట్టుబడి పరిచయంలో చేశారు. ఆమె రాసిందేమీ పెట్టుబడికి అనువాదం కాదు. ఆమె స్వతంత్రంగా, తేలికగా అందరికీ అర్ధమయ్యే విధంగా 'పెట్టుబడిని' పరిచయ రూపంలో మాత్రమే రాశారు.

గురువుని మించిన శిష్యులుంటారు మరి. ఎందుకంటే గురువు చెప్పిన సిద్ధాంతాన్ని చదువుకొని, ఇంక అక్కడే అందరూ ఆగిపోరు కదా. ఇంకా దాని మీద ఎక్కువ పరిశీలనలు/పరిశోధనలు చేసి ఇంకా ఎక్కువ విషయాలు తెలుసుకుంటూ ఉంటారు కదా కొంతమంది శిష్యులు. అయినా అంత మాత్రానే సిద్ధాంతం నేర్పిన 'గురువు' గురువు కాకుండా పోడు కదా! వీ

### జిఎస్‌టికి తెలంగాణ శాసనసభ ఆమోదం

జీఎస్‌టి బిల్లుకు తెలంగాణ శాసనసభ ఆగస్ట్ 29న ఏకగ్రీవంగా ఆమోదం తెలిపింది. స్పీకర్ అనుమతితో ముఖ్యమంత్రి కేసీఆర్ జీఎస్‌టీ బిల్లును సభలో ప్రవేశపెట్టారు. జిఎస్‌టిపై సభ్యులు చర్చించిన అనంతరం ఏకగ్రీవంగా ఆమోదించారు. జిఎస్‌టి బిల్లు తీర్మానాన్ని సభ్యులంతా ఆమోదించడం సంతోషమని ముఖ్యమంత్రి కెసిఆర్ అన్నారు. దేశంలో జిఎస్‌టి వల్ల ఆర్థిక సంస్కరణలు రానున్నాయని, దేశం దీర్ఘకాలిక ప్రయోజనాల కోసమే జిఎస్‌టి అని వివరించారు.

### ఆదివాసి ప్రాంతాలను జిల్లాలుగా చేయాలి

ఖమ్మం జిల్లాలోని 24 ఏజెన్సీ మండలాలను కొత్తగూడెం (భద్రాద్రి) జిల్లాలో కొనసాగించాలని సెప్టెంబర్ 10న ఇందిరాపార్క్ వద్ద తెలంగాణ ఆదివాసి టీచర్స్ ఫెడరేషన్ ధర్నాను నిర్వహించింది. ధర్నాలో కోదండరామ్ ఆదివాసి ప్రాంతాలను జిల్లాలుగా ఏర్పాటుచేయాలని, ఆదివాసీ, ఏజెన్సీ ప్రాంతాలకు రాజ్యాంగమే ప్రత్యేక ప్రతిపత్తి కల్పించిందన్నారు. ఖమ్మం జిల్లాలోని ఆరు మండలాలను ఖమ్మం, మహబూబాబాద్‌లలో కలిపినట్లయితే విద్య, వైద్యం, ఉపాధి రంగాలలో తీరని అన్యాయం జరుగుతుందని అన్నారు.

### రాజకీయ ఖైదీల హక్కుల సభ

రాజకీయ ఖైదీల హక్కుల దినం సందర్భంగా కమిటీ ఫర్ రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజనర్స్ ఆధ్వర్యంలో సెప్టెంబర్ 14న హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో బహిరంగ సభ నిర్వహించారు. ఈ సభలో వక్తలు బ్రిటిష్ వారు తమ ప్రయోజనాలకోసం తెచ్చిన చట్టాలను ఈనాడు పాలకులు దేశ ప్రజలపైనే ప్రయోగించడం అన్యాయమన్నారు. రాజకీయ ఖైదీల హక్కుల కోసం జైళ్లలోనూ, బయట జరుగుతున్న ఉద్యమాలను పాలకులు ఎంతోకాలం అణచలేరన్నారు. ఉరిశిక్షలు వద్దన్నందుకు, భావ ప్రకటనా స్వేచ్ఛ కావాలన్నందుకు, మతోన్మాదాన్ని ప్రశ్నించినందుకు దేశద్రోహ నేరం మోపుతున్నారన్నారు. ఈ సమావేశం సిఆర్‌పిపి కార్యదర్శి బల్ల రవీంద్రనాథ్ అధ్యక్షతన జరిగింది.

### బొజ్జా తారకం మృతి

అట్టడుగు వర్గాల హక్కుల సాధన కోసం జీవితకాలం న్యాయవాది కృషిచేసిన బొజ్జా తారకం (78) హైదరాబాద్‌లోని ప్రైవేట్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ సెప్టెంబర్ 16న కన్నుమూశారు. తారకం తూర్పుగోదావరి జిల్లాలోని కందికుప్ప గ్రామంలో 1939, జూన్ 27న జన్మించారు. ఆయన 1966లో కాకినాడలో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. ప్రముఖ కవి బోయి భీమన్న కుమార్తె విజయభారతిని 1988లో వివాహం చేసుకున్నారు. ఆమె వృత్తిరీత్యా నిజామాబాద్‌లో పనిచేస్తుండడంతో అక్కడే ఉండి న్యాయవాద వృత్తిని కొనసాగించారు. ఆ సమయంలోనే అంబేడ్కర్ యువజన సంఘాన్ని స్థాపించారు. 1975లో అత్యవసర పరిస్థితి విధించినప్పుడు నిజామాబాద్‌లో ఆయనను పోలీసులు అరెస్ట్‌చేశారు. 1979 నుంచి హైదరాబాద్‌లో ఉంటూ హైకోర్టు న్యాయవాదిగా ప్రాక్టీస్ కొనసాగించారు. 'అన్యాయాన్ని ఎవరూ ధిక్కరించకపోతే అదేపనిగా అన్యాయం చేసేవారికి అది న్యాయంగానే అనిపిస్తుంది. ఎవరో ఒకరు అది అన్యాయమని రుజువు చేయగలిగిననాడు అన్యాయస్థులు తమ శక్తి సామర్థ్యాలను కోల్పోతారు అనే మాటలను తన ఆచరణ ద్వారా అమలుపరిచారు. కారంచేడు మరణహోమం తర్వాత బాధ్యుల్ని శిక్షించాలని కొనసాగిన దీక్ష శిబిరంలో ముఖ్యపాత్ర పోశించారు. అట్లాగే పోలీసులు చేసిన ఎన్‌కౌంటర్లపై కేసులు నమోదు చేసి విచారణ జరుపాలంటూ సుప్రీంకోర్టులో పోరాడి విజయం సాధించారు. నలుపు పత్రికను పేదల గొంతుకగా నడిపారు. సమాజంలో జరుగుతున్న పరిణామాలను ఎప్పటికప్పుడు కవిత్వం, వ్యాసం, నవలల రూపంలో పుస్తకాలు వెలువరించారు.

### ప్రత్యేక హోదా కోరుతూ బహిరంగ సభ

ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా కల్పించాలని కోరుతూ సెప్టెంబర్ 9న తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో జనసేన పార్టీ 'సీమాంధ్రులు ఆత్మగౌరవ' సభ నిర్వహించింది. ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా ఇస్తామని చెప్పిన అధికార, ప్రతిపక్ష పార్టీలు బిజెపిపై పోరాటం చేసి ప్రత్యేక హోదా సాధించుకోవాలని జనసేన పార్టీ నాయకుడు పవన్ కళ్యాణ్ పిలుపునిచ్చారు. అసెంబ్లీ, పార్లమెంట్‌లో పదవులు అనుభవిస్తున్న వారు హోదా కోసం పోరాడాలన్నారు. రాష్ట్రాన్ని విడగొట్టాలని తీర్మాణించిన బిజెపి 12 సంవత్సరాలు ఎందుకు ఆగిందన్నారు. అంబేద్కర్‌ను స్మరిస్తున్న బిజెపి ఆయన రాసిన రాజ్యాంగానికి విలువ ఇచ్చి ప్రత్యేక హోదాను అమలు చేయాలన్నారు.

### నయీం బాధితుల ధర్నా

తెలంగాణ ప్రజా ఫ్రంట్ ఆధ్వర్యంలో నయీం బాధితులు ఇందిరాపార్క్ వద్ద సెప్టెంబర్ 20న ధర్నా చేశారు. ఈ ధర్నాలో పలువురు వక్తలు నయీం అకృత్యాలు 1996 నుంచి కొనసాగాతున్నాయన్నారు. ప్రజల హక్కుల కోసం ఉద్యమిస్తున్న పౌరహక్కుల నాయకులను, ఉద్యమకారులను చంపేందుకే నయీంను ప్రభుత్వం పెంచి పోషించిందన్నారు. ఇప్పుడు నయీం కెసిఆర్ సన్నిహితులను బెదిరించడంతో ఎన్‌కౌంటర్ పేరుతో హత్యచేశారు తప్ప బాధితులకు న్యాయం చేసేందుకు కాదన్నారు. ప్రభుత్వమే నయీంతో చేయించిన హత్యలకు అప్పటి ముఖ్యమంత్రులపై, మంత్రులపై, పోలీసు అధికారులపై హత్యానేరం కింద కేసు నమోదు చేసి విచారణ చేయాలన్నారు. నయీం ఆక్రమించిన భూములను బాధితులకు పంచాలని, నయీం అకృత్యాలపై సిట్టింగ్, హైకోర్టు జడ్జిచేత ప్రజల సమక్షంలో విచారణ జరిపించాలని డిమాండ్ చేశారు.

### మన్యం బంద్

మన్యంలో తక్షణమే హెల్త్ ఎమర్జెన్సీ ప్రకటించాలని, జబ్బులతో మృతి చెందిన కుటుంబాలకు పది లక్షల రూపాయలు చెల్లించాలని గిరిజన విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తూ ఎపి గిరిజన సంఘం సెప్టెంబర్ 9న చేపట్టిన మన్యం బంద్ సంపూర్ణంగా జరిగింది. రాష్ట్ర వ్యాప్తంగా మన్యం ప్రాంతంలోని 42 మండలాల్లో బంద్ విజయవంతమైంది.

### తెలుగు రాష్ట్రాల్లో భారీ వర్షాలు

తెలంగాణలో సెప్టెంబర్ 21 నుంచి 24 వరకు భారీ వర్షాలు కురిశాయి. దీంతో లోతట్టు ప్రాంతాలు జలమయం అయ్యాయి. ముఖ్యంగా హైదరాబాద్‌లోని లోతట్టు ప్రాంతాలు, నాలాలను ఆక్రమించి కట్టిన బస్తీలు, చెరువుల్లో నిర్మించిన అపార్ట్‌మెంట్‌లు, కాలనీలలో నీరు ప్రవేశించి ప్రజలు తీవ్ర అవస్థలు పడ్డారు. మెదక్, నిజామాబాద్, వరంగల్ జిల్లాల్లో ఏడుగురు చనిపోయారు. తీవ్ర పంట నష్టం జరిగింది. కొన్ని ప్రాంతాల్లో చెరువులకు గండ్లు పడ్డాయి. తెలంగాణలోని దాదాపు అన్ని ప్రాజెక్టులు పూర్తిగా నిండిపోయాయి. ఆంధ్రప్రదేశ్‌లోను భారీ వర్షాలు కురిసాయి. గుంటూరులో అత్యధిక వర్షపాతం కురిసింది. భారీగా పంట నష్టం జరిగింది. వీ

### సింగూర్ భూసేకరణను రద్దు చేసిన సుప్రీంకోర్టు

పశ్చిమ బెంగాల్‌లోని సింగూర్‌లో టాటా నానో కార్ల ప్లాంట్ కోసం చేపట్టిన 997.11 ఎకరాల భూసేకరణను సుప్రీంకోర్టు రద్దు చేసింది. మొత్తం భూసేకరణ ప్రక్రియే చట్టవిరుద్ధమని జస్టిస్ వి.గోపాల గౌడ, జస్టిస్ అరుణ్ మిశ్రాతో కూడిన ధర్మాసనం ఆగస్టు 31న తీర్పు వెలువరించింది. న్యాయమూర్తులు వేర్వేరుగా తీర్పులను వెలువరించినా భూసేకరణ రద్దు విషయంలో ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. భూసేకరణను రద్దు చేయడంతోపాటు పదేళ్లుగా భూమిని సాగు చేసుకోకుండా రైతులు, సాగుదారులను అడ్డుకొని, వారికి ఆదాయం లేకుండా చేసినందుకుగాను వారికి చెల్లించిన పరిహారాన్ని వెనక్కి తీసుకోవద్దని రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఇప్పటి వరకు పరిహారం చెల్లించని వారికి పరిహారాన్ని చెల్లించాలని స్పష్టం చేసింది.

### దేశవ్యాప్త కార్మిక సమ్మె

కేంద్ర ప్రభుత్వ ఏకీకృత కార్మిక సంస్కరణలకు, కార్మిక వ్యతిరేక విధానాలకు నిరసనగా పది కేంద్ర కార్మిక సంఘాలు(సిటియు) సెప్టెంబర్ 2న దేశ వ్యాప్తంగా పాల్గొన్నాయి. సమ్మె కారణంగా ప్రజా రవాణా, బ్యాంకింగ్, బీమా, గనుల రంగాల కార్యకలాపాలపై తీవ్రప్రభావం చూపింది. పలు ప్రభుత్వ రంగ బ్యాంకులు, బీమా సంస్థల కార్యకలాపాలు నిలిచిపోయాయి. కేంద్ర ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలకు నిరసనగా చేపట్టిన సమ్మెకు మద్దతుగా 18 కోట్ల మంది కార్మికులు వీధుల్లోకి వచ్చారని కార్మిక సంఘాలు తెలిపాయి.

### ఆర్‌బిఐ గవర్నర్‌గా ఉర్జిత్ పటేల్

రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్‌బిఐ) 24వ గవర్నర్‌గా ఉర్జిత్ పటేల్ బాధ్యతలు చేపట్టారు. ముంబైలోని ఆర్‌బిఐ ప్రధాన కార్యాలయంలో సెప్టెంబర్ 6న రఘురామ్ రాజన్ నుంచి ఆయన బాధ్యతలు స్వీకరించారు. ఈ నెల 4 నుంచే ఆయన నియామకం అమలులోకి వచ్చింది. ఇప్పటి వరకు అర్జిత్ పటేల్ ఆర్‌బిఐ డిప్యూటీ గవర్నర్‌గా పనిచేశారు. ధరల నియంత్రణే లక్ష్యంగా ద్రవ్య విధానంతో పాటు వడ్డీ రేట్లపై నిర్ణయం తీసుకునేందుకు మానిటరీ పాలకీ కమిటీ ఏర్పాటులో పటేలీ కీలకపాత్ర పోషించారు.

### దళిత వ్యతిరేక విధానాలపై బహిరంగ సభ

దేశంలో పలుచోట్ల దళితులపై జరుగుతున్న దాడుల ఘటనలు కేంద్ర ప్రభుత్వానికి ఒకపక్క ఇబ్బందులు కలిగిస్తుండగా మరోపక్క రాజ్యాంగ నిర్మాత బి.ఆర్.అంబేద్కర్ మనుమడు ప్రకాశ్ అంబేద్కర్ కూడా ప్రభుత్వంపై విమర్శలు చేస్తున్నారు. ప్రభుత్వ దళిత వ్యతిరేక వైఖరిని ఎండగట్టడానికంటూ సెప్టెంబరు 16న ఢిల్లీలో ఒక భారీ బహిరంగ సభను ఆయన ఏర్పాటు చేశారు. 'భారి బహుజన్ మహాసంఘ్' తరఫున జంతర్‌మంతర్ వద్ద నిర్వహించారు. కేంద్రంలో నరేంద్రమోదీ సర్కారు అధికారంలోకి వచ్చాక దళితులపై దాడులు ఎక్కువయ్యాయని అన్నారు.

### అరుణాచల్‌లో రాజకీయ సంక్షోభం

అరుణాచల్ ప్రదేశ్‌లో అధికార కాంగ్రెస్ ప్రభుత్వంలోని సభ్యులంతా ముఖ్యమంత్రితో సహా 42 మంది ఎంఎల్‌ఎలు కాంగ్రెస్ పార్టీకి రాజీనామా చేసి, ప్రాంతీయ పీపుల్స్ పార్టీ ఆఫ్ అరుణాచల్ (పిపిఏ)లో చేరారు. తనకు తనకు మద్దతు తెలుపుతున్న 42 మంది ఎంఎల్‌ఎలను పేమా ఖండూ సెప్టెంబర్ 16న అసెంబ్లీ స్పీకర్ టెన్జింగ్ నోర్బు థాంగ్డాక్ వద్దకు తీసుకెళ్లారు. ఇదిలా ఉండగా గవర్నర్ జ్యోతిప్రసాద్ రాజ్‌ఖోవాను కేంద్రం సెప్టెంబర్ 12న తొలగించింది. ఈ మేరకు రాష్ట్రపతి భవన్ నుంచి ఆదేశాలు జారీ చేసింది. కొత్త గవర్నర్ నియమించేంత వరకు మేఘాలయ గవర్నర్ షణ్ముగనాథన్‌కు బాధ్యతలు అప్పజెప్పింది.

### కశ్మీర్‌లో కొనసాగుతున్న కర్ఫ్యూ

కశ్మీర్‌లోని పలు ప్రాంతాల్లో ఇంకా కర్ఫ్యూ కొనసాగుతోంది. కశ్మీర్ ఏర్పాటును కోరుకుంటున్నవారు మూడు జిల్లాల్లో ర్యాలీలకు పిలునిచ్చారు. వరుసగా 72వ రోజు కర్ఫ్యూను కొనసాగించారు. షోపియాన్ జిల్లాలో ఐదు పోలీస్‌స్టేషన్ల పరిధిలో, శ్రీనగర్‌లోని బాతామలూ ప్రాంతంలో కర్ఫ్యూ విధించినట్లు, బాందీపోరా, గాందర్బల్ పట్టణాల్లో కర్ఫ్యూతో సమానమైన ఆంక్షలు విధించినట్లు పోలీసు అధికారి తెలిపారు. కర్ఫ్యూ కారణంగా ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఇప్పటి వరకు 88 మంది చనిపోగా, వేలాది మంది గాయపడ్డారు.

### ఉడీలో సైనిక శిబిరంపై దాడి

జమ్మూ కశ్మీర్‌లోని నియంత్రణ రేఖకు సమీపంలోని ఉడీ సెక్టార్‌లోని సైనిక శిబిరంపై సెప్టెంబర్ 18న మిలిటెంట్లు దాడి చేశారు. ఈ ఘటనలో 18 మంది సైనికులు మృతి చెందగా 30 మంది గాయపడ్డారు. సైన్యం జరిపిన కాల్పుల్లో నలుగురు మిలిటెంట్లు మృతిచెందారని సైనిక అధికారులు తెలిపారు. తెల్లవారు జామున సైనిక శిబిరం వెనుకవైపు నుంచి గ్రెనేడ్‌లు, తుపాకులతో దాడి చేశారని, గుడారాలకు మంటలు అంటుకోవడంతో ప్రాణ నష్టం ఎక్కువగా జరిగినట్లు సైనిక అధికారులు తెలిపారు.

### కావేరీ జలాల వివాదం

తమిళనాడు - కర్ణాటక మధ్య కావేరీ జలాల పంపిణీ వివాదం తీవ్ర ఘర్షణలకు దారితీసింది. తమిళనాడుకు విడుదలను నిలిపివేయాలని కర్ణాటక చేసిన విజ్ఞప్తిని సుప్రీంకోర్టు సెప్టెంబర్ 12న తిరస్కరించింది. తమిళనాడుకు రోజుకు 12 వేల క్యూసెక్కుల నీటిని పదిరోజుల పాటు విడుదల చేయాలని ఆదేశించింది. దీంతో కర్ణాటకలో ఒక్కసారిగా హింస చెలరేగింది. ముఖ్యంగా రాజధాని బెంగలూరులో తమిళనాడు రిజిస్ట్రేషన్ నంబర్ ప్లేట్లు ఉన్న బస్సులు, ట్రక్కులను, ఇతర వాహనాలను దహనం చేశారు. వందకు పైగా వాహనాలు తగలబడిపోయాయి. పలు వ్యాపార, వాణిజ్య సంస్థలపై దాడి చేసి ధ్వంసం చేశారు. దీంతో బెంగళూరు వ్యాప్తంగా 144 సెక్షన్ విధించారు. ఇటు తమిళనాడులో కూడా కొన్ని ప్రాంతాల్లో కర్ణాటకకు చెందిన వాహనాలపై దాడులు జరిగాయి. చెన్నైలోని పలు హోటళ్లు, లారీలను ధ్వంసం చేశారు.

### బీహార్‌లో ఘోర ప్రమాదం

బీహార్‌లోని మధుబని జిల్లాలో ప్రమాదవశాత్తు ఒక ప్రైవేట్ బస్సు చెరువులోకి దూసుకుపోవడంతో యాభై మంది మృతి చెందారు. మధుబని నుంచి సీతామండికి బస్సు వెళ్తుండగాసెప్టెంబర్ 19న మధుబనిలోని బెన్నిపట్టి పోలీస్ స్టేషన్ పరిధిలోని బసైతా చౌక్ వద్ద ఈ ప్రమాదం జరిగింది. ఆ సమయంలో బస్సులో అరవై మంది ప్రయాణిస్తున్నారు. పరిమితికి మించి బస్సులో ప్రయాణిస్తుండడం వల్లే ఈ ప్రమాదం జరిగిందని వెల్లడైంది.

### సొహ్రాబుద్దీన్ కేసులో మరో అధికారి ఉపసంహరణ

సొహ్రాబుద్దీన్ షేక్ ఎన్‌కౌంటర్ కేసులో గుజరాత్ ఐపిఎస్ అధికారి రాజ్‌కుమార్ పాండియన్ పేరును నిందితుల జాబితా నుంచి తొలగిస్తూ సిబిఐ ప్రత్యేక కోర్టు సెప్టెంబర్ 22న నిర్ణయం తీసుకుంది. ఆయనపై విచారణకు ప్రభుత్వం నుంచి అనుమతి లభించనందువల్ల ఆయన్ను విచారించడం కుదరదని స్పష్టం చేసింది. హైదరాబాద్ నుంచి ముంబయి వెళుతున్న సొహ్రాబుద్దీన్, ఆయన భార్య కౌసర్‌బీలను 2005లో అదుపులో తీసుకున్న గుజరాత్ పోలీసు బృందంలో రాజ్‌కుమార్ పాండియన్ ఉన్నారని సిబిఐ తన అభియోగ పత్రంలో పేర్కొంది. కుట్ర ఆరంభం నుంచి అమలు చివరి క్షణం వరకు అన్ని దశల్లో రాజ్‌కుమార్ భాగస్వామి అని సిబిఐ తెలిపింది. 2007లో సొహ్రాబుద్దీన్ కేసులో సస్పెండయిన రాజ్‌కుమార్‌ను 2014లో తిరిగి ఉద్యోగంలోకి తీసుకొంది. వీ

**బ్రెజిల్ అధ్యక్షురాలు దిల్మా రౌసెఫ్‌పై వేటు**

బ్రెజిల్ తొలి మహిళా అధ్యక్షురాలు దిల్మా రౌసెఫ్‌కు వ్యతిరేకంగా ప్రవేశపెట్టిన అభిశంసన తీర్మానం మూడింట రెండొంతుల ఆధిక్యంతో నెగ్గింది. ఆగస్ట్ 31న జరిగిన ఓటింగ్‌లో 81 మంది సెనేటర్లలో ఆమెకు వ్యతిరేకంగా 61 మంది ఓటేశారు. దీంతో అతిపెద్ద లాటిన్ అమెరికా దేశంలో 13 ఏళ్ల వామపక్ష వర్కర్స్ పార్టీ పాలనకు తెరపడింది. 2014 కేంద్ర బడ్జెట్‌లో లోటు పూడ్చేందుకు అక్రమంగా విదేశాల నుంచి పెద్దఎత్తున రుణాలు తీసుకొచ్చారని, ఫలితంగా దేశం పీకల్లోతు సంక్షోభంలో కూరుకుపోయిందని దిల్మా ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. ఈ విషయంపై విచారణలో భాగంగా మేలోనే ఆమెపై తాత్కాలిక వేటు పడింది. మరోవైపు దేశ ఉపాధ్యక్షుడు, డెమోక్రాటిక్ మూవ్‌మెంట్ పార్టీ నేత మైఖెల్ టేమర్ తాత్కాలిక అధ్యక్షుడిగా ఉన్నారు.

**జర్మనీలో సంకీర్ణ ప్రభుత్వం**

జర్మనీలో ప్రాంతీయ ఎన్నికల్లో ఏ పార్టీ కూడా పూర్తి మెజారిటీ సాధించలేదు. సెప్టెంబర్ 4న జరిగిన ఎన్నికల్లో సోషల్ డెమోక్రాటిక్ పార్టీ (ఎస్‌పిడి) 21.5 శాతంతో మొదటి స్థానంలో నిలిచింది. జర్మనీ ఛాన్సలర్ మెర్కెల్ మద్దతిచ్చిన క్రిస్టియన్ డెమోక్రాటిక్ యూనియన్ (సిడియు) పార్టీ ఈ ఎన్నికల్లో 17.5 శాతంతో రెండో స్థానంలో నిలిచింది. లింక్ వామపక్ష పార్టీ 15.7 శాతం ఓట్లతో మూడో స్థానంలో ఉంది. ఈ సందర్భంగా ఎస్‌పిడి అభ్యర్థి బెర్లిన్ మేయర్ మైఖెల్ వామపక్షంతో పాటు గ్రీన్‌పార్టీని కలుపుకుని నూతన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు.

**జి-20 దేశాల సదస్సు**

జి–20 దేశాల సదస్సు సెప్టెంబర్ 4–5 తేదీల్లో చైనాలోని హాంగ్‌ఝౌ నగరంలో జరిగాయి. ఈ సందర్భంగా చైనా అధ్యక్షుడు జిన్‌పింగ్ మాట్లాడుతూ ఆర్థికాభివృద్ధి కోసం శ్రమిద్దామని పిలుపునిచ్చారు. ఈ సదస్సులో ఆర్థిక, వాణిజ్య రంగాలు అనే సవాళ్లు ఎదుర్కొంటున్న సమస్యలపై చర్చించారు. కాగా ప్రపంచ దేశాల స్థూల జాతీయోత్పత్తి ఈ ఏడాది 3.1 శాతం, వచ్చే ఏడాది 3.4 శాతం ఉండవచ్చని అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ ప్రకటించింది. జి–20 సదస్సులో పాల్గొనడం అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామాకు ఇదే చివరిసారి కాగా, బ్రిటన్ ప్రధాని థెరిసా మేకు ఇది తొలిసారి.

**ఫ్రాన్స్‌లో కార్మికుల నిరసనలు**

కార్మిక చట్టంలో పలు సంస్కరణలు తీసుకొచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తున్న తీరుపై కార్మికులు ఆందోళనలు చేపట్టారు. సెప్టెంబర్ 15న ప్యారిస్ వీధులలో భారీ ర్యాలీ నిర్వహించారు. ప్రభుత్వం ప్రతిపాదించిన సంస్కరణలు తమ హక్కులకు విఘాతం కలిగించేలా ఉన్నాయని, కార్మిక వ్యతిరేక విధానాలను తక్షణమే ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేశారు. నిరసనకారులపై పోలీసులు బలప్రయోగం చేయడంతో తీవ్ర ఉద్రిక్తతకు దారితీసింది. నిరసనకారులపై పోలీసులు బాష్పవాయుగోళాలు ప్రయోగించారు. ఈ దాడిలో ఎంతో మంది కార్మికులు గాయపడ్డారు.

**కార్పొరేట్ కంపెనీల పెత్తనం**

ప్రపంచంలో వందల దేశాల మొత్తం ఆదాయం కంటే కూడా కార్పొరేట్ కంపెనీల ఆదాయం ఎక్కువగా ఉంది. 180 పేద దేశాల మొత్తం ఆదాయం కన్నా ప్రపంచంలోని టాప్ టెన్ కార్పొరేట్ కంపెనీల ఆదాయం ఎక్కువగా ఉందని లండన్ కేంద్రంగా 'గ్లోబల్ జస్టిస్ నౌ' అనే సంస్థ వెల్లడించింది. ఈ టాప్ టెన్ కంపెనీల్లో అత్యధికంగా అమెరికా, యూరప్ కంపెనీలే ఉన్నాయి. 2015 ఏడాదిలో కార్పొరేట్ కంపెనీల ప్రభుత్వ ఆదాయాలను పోల్చితే అమెరికా, చైనా, జర్మనీ, జపాన్, ఫ్రాన్స్, బ్రిటన్, ఇటలీ, బ్రెజిల్, కెనడా దేశాలు మొదటి తొమ్మిది స్థానాల్లో ఉన్నాయి. పదవ స్థానంలో వాల్‌మార్ట్ ఉంది.

**పాకిస్తాన్‌లో దాడి**

పాకిస్తాన్, అఫ్ఘనిస్తాన్ సరిహద్దున ఉన్న ఖైబర్ పఖ్తూన్ ఖివ్వా ప్రావిన్స్‌లో సెప్టెంబర్ 16న ఒక మసీదులో ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో ఇరవై రెండు మంది మరణించగా, ముప్పై మంది గాయపడ్డారు. ఖివ్వా ప్రావిన్స్‌లోని పేయీ ఖాన్ గ్రామం మసీదులో శుక్రవారం ప్రార్థనలు జరుగుతున్న సమయంలో ఈ దాడికి జరిగింది.

**యెమెన్‌లో సామాన్యుల గోడు**

యెమెన్‌లో సౌదీ అరేబియా సంకీర్ణ దళాలు చేస్తున్న దాడులతో ప్రజా జీవనం అస్తవ్యస్తంగా మారింది. మాజీ అధ్యక్షుడు అలీ అబ్దుల్లా సాలెహ్ మద్దతుదారులను లక్ష్యంగా చేసుకుని జరుగుతున్నాయి. యెమెన్‌లోని హౌతీ తిరుగుబాటుదారుల శిబిరాలు, క్షిపణి స్థావరాలను లక్ష్యంగా చేసుకుని సౌదీ సంకీర్ణ దళాలు చేస్తున్న దాడుల్లో మూడింట ఒక వంతు ఆస్పత్రులు, పాఠశాలలు, మసీదులపై జరిగాయి. గత ఏడాది మార్చ్ నుంచి ఈ ఏడాది ఆగస్టు వరకు 8,600 వైమానిక దాడులు జరిగాయని గార్డియన్ నిర్వహించిన సర్వేలో వెల్లడైంది. ఈ దాడుల్లో 147 పాఠశాలలు, 26 విశ్వవిద్యాలయాలు, 34 మసీదులు, రద్దీగా ఉండే 114 మార్కెట్లు ధ్వంసమయ్యాయి.

**రష్యాలో ఎన్నికలు**

రష్యా పార్లమెంట్‌కు సెప్టెంబర్ 18న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో అధ్యక్షుడు పుతిన్ మళ్లీ విజయం సాధించారు. ఆయన పార్టీ యునైటెడ్ రష్యాకు 54.2 శాతం ఓట్లతో 338 స్థానాలు కైవసం చేసుకుంది. రష్యన్ కమ్యూనిస్టు పార్టీ 13.5 ఓట్లను పొంది రెండో స్థానంలో ఉంది. జాతీయవాద పార్టీగా పేరుపడ్డ ఎల్‌డిపిఆర్ పార్టీకి 13.3 శాతం ఓట్లు వచ్చాయి. ఫెయిర్ రష్యా పార్టీకి 6.2 శాతం ఓట్లు పడ్డాయి. దేశవ్యాప్తంగా కేవలం 47.81 శాతం పోలింగ్ నమోదైంది. రాజధాని మాస్కోలో అయితే కేవలం 35.18 శాతం మాత్రమే ఓటింగ్ జరిగింది.

**సిరియాలో సంకీర్ణ సేనల దాడులు**

సిరియా సైనిక శిబిరంపై సెప్టెంబర్ 18న అమెరికా సంకీర్ణ సేనలు జరిపిన వైమానికి దాడుల్లో అరవై రెండు మంది సైనికులు హతమయ్యారు. వంద మందికి పైగా గాయపడ్డారు. అమెరికా ఐఎస్‌కు మద్దతు ఇస్తోందని సిరియా ప్రభుత్వ వర్గాలు ఆగ్రహం వ్యక్తం చేశాయి. మరోవైపు సిరియా తిరుగుబాటుదారులను అదుపు చేయడానికి సిరియా అధ్యక్షుడు అసద్‌కు రష్యా సహకారం అందిస్తోంది. దీంతో ఇది అగ్రరాజ్యాల బలనిరూపణకు వేదికగా మారింది. సెప్టెంబర్ 19న అలెప్పో ప్రావిన్స్‌లో ఐక్యరాజ్య సమితికి చెందిన సహాయ బృందాలపై వైమానిక దాడి జరిగింది. ఈ దాడిలో ఇరవై మంది దాకా మరణించారు. సెప్టెంబర్ 24న అలెప్పో నగరంలోనే మరోసారి వైమానిక దళాలు దాడులు చేశాయి. ఈ దాడిలో 25 మంది మరణించారు.

**అమెరికాలో మరో నల్లజాతీయుడి కాల్చివేత**

ఉత్తర అమెరికాలోని నార్త్ కరోలినాలో సెప్టెంబర్ 20న మరో నల్ల జాతీయుడిపై కాల్పులు జరిగిన సంఘటన తీవ్ర ఆందోళనకు దారితీసింది. నార్త్ కరోలినాలోని చార్లొట్టె నగరంలో కీత్ లామంట్ స్కాట్ అనే నల్లజాతీయుడిని పోలీసు అధికారి కాల్చి చంపాడు. తన దగ్గర ఏ ఆయుధాలు లేవని ఎంత చెపుతున్నా వినకుండా కాల్చాడని అతని భార్య ఆరోపించింది. దీనికి సంబంధించిన వీడియో ఒకటి బయట పడింది. దీంతో ఆ నగరంలో ఆందోళనలు, నిరసనలు తీవ్రమయ్యాయి. వారం రోజుల్లోనే ముగ్గురు నల్లజాతీయులను అమెరికన్ పోలీసులు చంపేశారని ప్రజలు పెద్ద ఎత్తున నిరసనలు తెలిపారు. ఆందోళనకారులు ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చేశారు. అదుపు చేయడానికి వచ్చిన పోలీసులపై తిరగబడ్డారు. దీంతో నార్త్ కరోలినా గవర్నర్ పాట్ మెక్‌క్రోరీ ఎమర్జెన్సీ ప్రకటించారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుదుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఆగస్ట్ 1 నుండి ఆగస్ట్ 31, 2016 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1303), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (1099) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2402)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | - | 16 | 16 | 7 | 4 | 2 | 2 | 2 | 1 | 2 | 1 | 2 | 24 | 26 | - | - | - | - | 2 |
| హైదరాబాద్ | - | - | - | 11 | 12 | 2 | 3 | 2 | - | 3 | 2 | 8 | 6 | 2 | 25 | 12 | - | - | - | - | - |
| కరీంనగర్ | - | 8 | - | 12 | 17 | 4 | 6 | 1 | - | 2 | 3 | 3 | 1 | 5 | 24 | 13 | - | - | - | - | - |
| ఖమ్మం | - | - | - | 14 | 15 | 7 | 11 | 4 | - | 1 | - | 1 | - | 7 | 36 | 33 | - | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | 1 | 6 | - | 10 | 5 | 3 | 7 | 1 | 1 | 5 | 4 | 6 | 8 | 13 | 32 | 7 | - | 1 | - | - | - |
| మెదక్ | 3 | 9 | 5 | 19 | 14 | 42 | 14 | 2 | 22 | 14 | 22 | 15 | 35 | 46 | 112 | 39 | - | - | - | 9 | 3 |
| నల్గొండ | - | 11 | - | 2 | 6 | 2 | 4 | 2 | - | 2 | 1 | 1 | 2 | 10 | 25 | 8 | - | - | - | - | 4 |
| నిజామాబాద్ | - | 6 | - | 9 | 11 | 1 | 4 | 1 | 2 | 1 | 2 | 2 | - | 2 | 21 | 17 | - | - | - | - | - |
| వరంగల్ | - | 10 | - | 11 | 17 | 3 | 6 | 3 | - | - | 1 | 4 | - | 9 | 28 | 16 | - | - | - | - | - |
| రంగారెడ్డి | - | 2 | - | 7 | 8 | - | 3 | - | 1 | 1 | 1 | 4 | - | 3 | 34 | 11 | - | - | - | - | - |
| **తెలంగాణ** | **5** | **54** | **5** | **111** | **121** | **71** | **62** | **18** | **28** | **31** | **37** | **46** | **53** | **99** | **361** | **182** | **-** | **1** | **-** | **9** | **9** |
| అనంతపురం | - | 5 | - | 17 | 16 | 6 | 2 | 3 | - | - | 3 | 3 | 3 | 6 | 29 | - | - | - | - | - | - |
| చిత్తూరు | - | 1 | - | 9 | 8 | 4 | 14 | - | - | 3 | 3 | 9 | 10 | - | 34 | - | - | - | - | - | - |
| కడప | - | 2 | - | 10 | 7 | - | - | - | - | 1 | 2 | 2 | - | - | 19 | 6 | - | - | - | - | - |
| గుంటూరు | - | - | - | 4 | 3 | 6 | 3 | 1 | - | 3 | 1 | 5 | 1 | 2 | 47 | 31 | - | - | - | - | - |
| కృష్ణా | - | - | - | 2 | 5 | 6 | 4 | - | - | 3 | 2 | - | 1 | 4 | 37 | 21 | - | - | - | - | - |
| కర్నూలు | - | 4 | - | 7 | 4 | 6 | 6 | 8 | 5 | 3 | 4 | 5 | 7 | 4 | 23 | 17 | - | - | - | - | 4 |
| తూర్పు గోదావరి | - | - | - | 5 | 7 | 4 | 21 | 1 | - | 9 | 1 | 1 | - | 2 | 26 | 21 | - | - | - | 1 | - |
| ప్రకాశం | - | - | - | 5 | 6 | - | 5 | - | 2 | 3 | - | 4 | 2 | 4 | 21 | 14 | - | - | - | - | - |
| శ్రీకాకుళం | - | 1 | - | 5 | 4 | 10 | 8 | 5 | - | 1 | 1 | 3 | 5 | 3 | 40 | 3 | - | - | - | - | 3 |
| పశ్చిమ గోదావరి | - | - | - | - | 1 | 4 | 7 | 1 | 1 | 2 | - | 2 | - | 4 | 25 | 12 | - | - | - | - | 1 |
| నెల్లూరు | - | - | - | 4 | 10 | 1 | 4 | 2 | - | 7 | 3 | 2 | 3 | 1 | 31 | 11 | - | - | - | - | - |
| విజయనగరం | - | - | - | 5 | 7 | 7 | 5 | 2 | - | - | 1 | 3 | 1 | 1 | 26 | 11 | - | - | - | - | 1 |
| విశాఖపట్నం | - | - | - | 11 | 5 | 3 | - | - | - | 7 | 2 | 2 | 10 | 3 | 32 | 14 | - | - | - | 7 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **13** | **-** | **84** | **83** | **57** | **79** | **23** | **8** | **42** | **23** | **41** | **43** | **34** | **390** | **161** | **-** | **-** | **-** | **8** | **10** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం-<br>ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |
| తెలంగాణ విద్యుత్ రంగంలో ఏం జరుగుతున్నది? | కె. రఘు | 60 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | రు. 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ ఫూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి ప్రభాకర్ | 150 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 60 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| వామపక్ష కమ్యూనిజం - ఒక బాలరిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| ‘ఓయు’ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

**వీక్షణంను గ్రంథాలయాలకు చేర్చండి!**
**వీక్షణం పాఠకులను పెంచడానికి తోడ్పడండి!**
**వీక్షణం ఆర్థిక పరిపుష్టికి చేయి అందించండి!**

నానాటికీ మారుతున్న సామాజిక, రాజకీయార్థిక పరిస్థితులలో వీక్షణం, రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వంటి సమాచార వాహికల, చర్చావేదికల అవసరం పెరుగుతున్నది. సమాజంలోని ఆలోచనాపరులందరికీ వీక్షణం అందవలసిన అవసరం రోజురోజుకూ పెరుగుతున్నది. ఈ స్థితిలో వీక్షణం పాఠక లోకంలోకి అంతకంతకూ ఎక్కువమందిని చేర్చే బాధ్యత తీసుకోవలసినది ప్రస్తుత వీక్షణం పాఠకులు, అభిమానులే.

- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరూ మరొకరికి వీక్షణం పరిచయం చేయండి.
- ప్రతి ఒక్కరూ కనీసం ఒక్కరినైనా కొత్త చందాదారుగా చేర్చండి.
- ఒక ప్రతి చాల ఎక్కువమంది చదివే అవకాశం ఉన్న కళాశాలలకు, గ్రంథాలయాలకు వీక్షణం చేరేలా చూడండి.
- తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలో ప్రతి జిల్లా లోనూ 50 నుంచి 80 వరకూ జిల్లా గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలున్నాయి. ఒక జిల్లాలోని గ్రంథాలయాలన్నిటికీ కలిపినా సంవత్సర చందా రు. 10,000 – రు. 16,000 ఉంటుంది. ఎవరికి వారు వారి జిల్లాలోని దాతలను సంప్రదించి ఈ మొత్తాన్ని విరాళంగా సేకరించవచ్చు. లేదా నలుగురైదుగురు శ్రేయోభిలాషులు కలిసి ఈ చందా చెల్లించవచ్చు. అలా విరాళం ఇచ్చినవారి కానుకగా ప్రతి నెలా గ్రంథాలయాలకు పత్రిక పంపిస్తాం. గ్రంథాలయాల్లో ఒక మాసపత్రిక ప్రతికి కనీసం 100 మంది పాఠకులు ఉంటారని అంచనా. అంటే మీరు విరాళం ఇచ్చే ఒక్కొక్క చందా వంద మంది వీక్షణం పాఠకులను తయారు చేస్తుంది. ఆ పాఠకులందరూ పత్రిక మీద దాతలుగా మీ పేరు చూసి మీకు కృతజ్ఞతలు చెపుతారు.

**వీక్షణం మీ పత్రిక. వీక్షణం ప్రజల పత్రిక.**
**వీక్షణం మరింతగా ప్రజలకు చేరువ చేసే అవకాశం తీసుకోండి.**
**తద్వారా వీక్షణం ఆర్థిక వనరులు పెరిగేందుకు తోడ్పడండి.**